ఓం

శ్రీ సద్గురుభ్యో నమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత

# పరమతత్త్వ కందపద్యములు

అనెడు

# పరిపూర్ణ సుధా ప్రబోధము

శ్రీ మదృహదావశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులును
శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయకులైన
శ్రీ మద్రాజాధిరాజ మహారాజ యోగీంద్రచంద్రులు
శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువర్యులచే విరచితంబైన

కందార్థ దరువులు, కందపద్యములకు
భావార్థ విశేషార్థములు

అచల ఋషి

## శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములు

నెల్లూరు వారిచే వ్రాయబడి

భక్తమండలివారి ద్రవ్య సహాయముచే ముద్రించబడినది.

1998

మొదటి కూర్పు 1000 ప్రతులు. వెల రు. 50-00

ఓం

శ్రీ సద్గురుభ్యో నమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత

# పరమతత్వ కందపద్యములు

అనెడు

# పరిపూర్ణ సుధా ప్రబోధము

శ్రీ మద్బ్రహ్మాద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులును

శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయకులైన

శ్రీ మద్రాజాధిరాజ మహారాజ యోగీంద్రచంద్రులు

శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువర్యులచే విరచితంబైన

కందార్థ దరువులు, కందపద్యములకు

భావార్థ విశేషార్థములు

అచల ఋషి

**శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములు**

నెల్లూరు వారిచే వ్రాయబడి

భక్తమండలివారి ద్రవ్య సహాయముచే ముద్రింపబడినది.

1998

మొదటి కూర్పు 1000 ప్రతులు. వెల రు. 50-00

౦ఓ౦

శ్రీ సద్గురుభ్యో నమః

శక్తిద్వయ నిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్త్వ కందార్థ దరువులు

క్షరాక్షరోపాదిద్వయ దోషరహిత

# పరమతత్త్వ కందపద్యములు

అనెడు

# పరిపూర్ణ సుధా ప్రబోధము

శ్రీ మద్బృహద్వాశిష్ట సిద్ధాంత నిర్ధారణోద్ధారకులును

శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయకులైన

శ్రీ మద్రాజాధిరాజ మహారాజ యోగీంద్రచంద్రులు

శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువర్యులచే విరచితంబైన

కందార్థ **దరువులు**, కందపద్యములకు

భావార్థ విశేషార్థములు

అచల ఋషి

## శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములు

నెల్లూరువారిచే వ్రాయబడి

భక్తమండలివారి ద్రవ్య సహాయముచే ముద్రించ బడినది.

**1998**

మొదటి కూర్పు 1000 ప్రతులు. వెల రు. 50-00

శ్రీ సద్గురుభ్యోనమః

# విజ్ఞాపన.

శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక సార్వభౌములవారు రచించిన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములకు, కందపద్యములకు భావార్థములు నేను వ్రాయుట యెట్లుండుననిన గ్రంథకర్త దెలిపినట్లు "చంద్రుని చీమ ముద్దాడిన" చందముగ నుండునని తలంచుచున్నాను. ఆ మహనీయుడు యెంతో శ్రమపడి సర్వశాస్త్రములెల్లయు మదించి శేషించిన సత్యమును లోకోపకారము కొరకు ఈ కందార్థములను వ్రాసియున్నారు. ఈ రచనలో భావగర్భితమైన యెన్నో అంశములు చోటు చేసుకొనియున్నవి. ఆ అభిప్రాయములను వెలికిదీసి దెల్పుటకు అంతటి అనుభవంతులకు తప్ప భాషా పరిజ్ఞానము, శాస్త్ర పరిచయము లేని నావంటి వారికి సాధ్యపడు విషయము కాకయున్నది. ఇంతకుముందు ఈ కందార్థములకు భావార్థములు పోకల శేషాచలంస్వాములు, నేదనూరి గంగాధరం అగమదాసు, పొన్నాల రాజయోగి, దువ్వాడ సూర్యనారాయణమూర్తి మొదలగువారు వ్రాసియేయున్నారు. భాగవతుల కృష్ణదేశికస్వాములవారు వ్రాసిన 19వ కందార్థమందు "ప్రాగర్థ చరమార్థ యోగాములకు సంయోగాముగావించి నే గుర్తెరిగినదంత" అనగా దేహాత్మలు రెండు ఒక యెరుకతో గూడియుండుట వలన ఈ రెండు అనిత్య వస్తువులే ననియు యిందులో అల్పమొకటి, అధికమొకటి లేదనియు దెల్పడము జరిగినది. 47 వ కందార్థమందు "యెరుకే జీవుండీశుడెరుకే తదేకత" అని తెలిపియున్నది. జీవుడనినా, యెరుకనినా, ఈశుడనినా యెరుకేననియు నిర్వికల్ప సమాధిలోయున్న అనుభవము యెరుకదే ననియు గ్రంథ చివర వరకు ఏ శాస్త్రముల అభిప్రాయములు తీసుకొనక, యెరుకను లేదనియు, పరిపూర్ణము యున్నదనియు తెలుపబడియున్నది.

ఇట్టి గ్రంథమునకు నేను భావార్థములు వ్రాయుటయందు అభిప్రాయము సరిగా తెలుపలేక యుండిన యెడల పెద్దలు ఆ విషయములు తెలియ జేసిన ఆ తప్పులను సవరించు కొనగలనని మనవి జేయుచున్నాను. ఇందులో జరిగిన పదదోషములు, ప్రింటు దోషములను మన్నించుదురని ప్రార్థిస్తూయున్నాను. అంతా సద్గురు దయగ భావించుచున్నాను.

అచలఋషి

దువ్వూరు రమణయ్యస్వాములు,

నెల్లూరు.

వ్యాపించి యున్నందువలన గ్రంథములకొరత యేర్పడుచున్నది. అందువలన ఇంతకుముందు అయిదు ఆరు మంది పెద్దలు వ్రాసిన భావార్థములు చక్కగా చదివి ఇప్పటి పాఠకులకు సులభోపాయముగ అర్థమయ్యే పద్ధతిలో ఈ కందార్థములు వ్రాసిన గ్రంథకర్తగారి ప్రియశిష్యులు సకల విద్యానిపుణులగు శ్రీ పిల్కాన శంకరప్రభు శిష్య ప్రశిష్యుల సంతతిలో చేరిన శ్రీ ఉడుతా వెంకట దాసార్య సద్గురుస్వాములవారి సచ్ఛిష్యులు నెల్లూరు పురనివాసులగు శ్రీ అచల ఋషి దువ్వూరు రమణయ్యస్వాములవారు కందార్థ కందపద్యములకు చక్కని భావార్థములువ్రాసి పాఠకుల మనోభీష్టములు తీర్చినందుకు పాఠకలోకం ఆయనను అభినందించక తప్పదు. గ్రంథకర్త అభీష్టానికి వ్యతిరేకం కాకుండా పాఠకులకు జటిల పదాలబాధ లేకుండా యెంతో ఆలోచన ధోరణి ననుసరించి భావార్థములు వ్రాసినారు. శ్రీ రమణయ్యస్వాములు నిర్మించిన ప్రొద్దుటూరు దగ్గర కొత్తఖాదరబాదులో శ్రీ అచల గురు ఆశ్రమములో కలుసుకొని వారి భావార్థములు పరిశీలించడము కొన్ని కంధార్థములకు కంధ పద్యాలకు జటిలముగా యున్నవాటికి నేను అడిగినప్పుడు ఆయన వ్రాసిన భావాలు ఆయనే చదివి వినిపించారు. నేను వాటిని విన్నప్పుడు నాకు చాలా ఆనందమైనది. వారికృషి ఫలించడమేకాక పాఠకుల అభీష్టముకూడా తీరినట్లు భావించాను.

కం॥ నామాట లెస్సవినుమా సామాన్యంబనుచు చూడ జనదీ బోధన్ ప్రేమాతిశయము నంగని, వేమారిది గురుని నోట వినవాలె సుమ్మా· నిత్యము చదువు కొనవాలెనమ్మా॥ అను నార్యోక్తి ననుసరించి అనుభవపరులైన పెద్దలచే గురువులచె విని ఆ భావము మరుపురాకుండ ఈ భావార్థములు చదువుచున్న అనుభవ మేర్పడి ఆరూఢత పొందగలుగుదురు. గురుశిష్యుల లక్షణములు, గురుశిష్యుల బోధరీతి-గురుగీతార్థం బెరిగిన నరులకె మెప్పగు నెరుగని యా మూఢజనుల కిష్టతియౌనె- అను పెద్దల వాక్యం ననుసరించి తాను గురు ధర్మాన్ని చక్కగా ఆచరిస్తూ శిష్యులచేత ఆచరింపచేయిస్తూ, ఆచార్య పదాన్ని సార్థకము చేస్తున్న శ్రీ రమణయ్యస్వాములవారితో నాకు చాలా కాలమునుండి పరిచయమున్నది· వీరు మితభాషులు, అమితమైన ఆలోచనా పరులు, యెప్పుడు వారు పెద్దల వాక్యాల గురించి ఆలోచించుచు భక్తుల సంశయ నివృత్తి చేయడమే ఆశయముగాగలవారు. సాంప్రదాయ పద్ధతిలో సూచిన, వారిభావార్థములు చక్కని అర్థమునిచ్చుచుండును.

కందము॥ పాటసుమీ భక్తులకిది, బాటసుమీ బోధజెంద భ్రమరాకుం డున్. కోటసుమీ కందములను తోటసుమీ దీన్ని తొలగద్రోయక వినుడీ ఈ కంధములో జెప్పిన ఫలితములు మనకు లభించును.

కందార్థము॥ జతనముగదావి చదువుము, రతనమ్ముల హారమిదియు రసికుల గళమా! యతనము దీనికి నే బహుయతనముగావించి తెచ్చి యి స్తిర నేడు బోధకు బందోబస్తౌరమూడు – రతనాలెట్లా రాళ్ళు రతనాలంచనియంటె రతనాలీ పద్యాలె రసికులెరిగెదరివి నీకి స్తిరనేడు బోధకు బందోబస్తౌరమూడు॥

ఈ కందార్థాలు, కందపద్యములు, అభిప్రాయములు రత్నాలహారములకు రసికుల గళమే ఆధారముగ యుండును. ఈ నిజబోధయందు ఆసక్తిగల రసికులకు అచల ఋషి దువ్వూరు రమణయ్యస్వాములు వ్రాసిన భావార్థములతో సానపట్టిన రతనాలహారమైనది. పాఠకమహాశయులు ఈ హారమును హృదయ కంఠమునందు ధరించి తరించుదురని తలంచుచున్నాను. శ్రీ అచల ఋషి రమణయ్యస్వాములు భక్తులగు పాఠకులకు యుపయోగపడు ఇటువంటి రచనలు ఎన్నో చేయవలయునని ఆయనకు ఇటువంటి శక్తిసామర్థ్యములు సద్గురుదేవుడు ప్రసాదించాలని గురుదేవులను సదా ప్రార్థిస్తూయున్నాను.

ఇట్లు, నిర్మలానంద పదసేవకుడు,

వివేకానంద బండారు సుబ్బరాయులు స్వాములు,

ధర్మవరం, 20-2-98.



# గ్రంథముపై అభిప్రాయము

శ్రీ మద్బృహద్వాశిష్ట అచల సిద్ధాంతము జననమరణ భ్రాంతి రహితమును ప్రతిపాదించు తురీయాదీత మార్గముపై శ్రీమద్భాగవత శ్రీ కృష్ణ దేశికేంద్రులవారిచే శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థ ధరువులు మరియు క్షరాక్షరోపాది ద్వయదోష రహిత పరమతత్వ కంద పద్యములు రచింపబడినవి. పై కందార్థ కంద పద్యములపై సాంప్రదాయక పెద్దలు అనేకులు భావార్థములు లోగడ రచించి ప్రకటించినారు. మరి నేడు శ్రీమత్పెల్లాకాన శంకరదేశిక ప్రభువులవారి పరంపరలో నొకరైన శ్రీ ఉడుతా వెంకటదాసుస్వాములవారి ప్రియశిష్యులైన నెల్లూరు వాస్తవ్యులు శ్రీ అచల ఋషి దువ్వూరు రమణయ్యస్వాములువారు పై కందార్థ కంద పద్యములకు భావార్థము వ్రాసినారు. అట్టి గ్రంథమును నాకు చూపి దానిపై నా అభిప్రాయ మును వ్రాయగోరినారు. నేను అట్టి గ్రంథమును సాంగోపాంగముగా పరిశీలించి చూచితిని అక్కడక్కడ కొన్ని అచ్చుదోషములు కనబడుచున్నవి. విజ్ఞులైనవారు అవి సరిచూచుకొని చదువుకొని గ్రంథకర్తగారి యొక్క అభిప్రాయమును గ్రహించగలరని కోరుచున్నాను. లోగడ గ్రంథకర్త శ్రీ భాగవత కృష్ణ ప్రభువులు "ఈ పరమగోప్యము యెవరెరుగరోయయ్యా నా పలుకు మదిలో నాటిన వారికే యిది నిజమయ్యా" అన్నారు. యిలమీద నెవరైన యీ కంధార్థములలోని గూఢార్థము దెలియ భ్రమనుజెందరువారు నిశ్చాయ మదెరా కృష్ణదాసు నిశ్చాయమిదెరా" అన్నారు. కనుక "శివరామదీక్షితుల మతమూ నాదుచెవియొగ్గి వింటే సమ్మతమూ విని విమర్శించకనె దీనిలోతు గననౌనె విన దెలుసుగాని దీని నమ్మినవారికెల్లా భ్రాంతి తీరదను మాటలవి కల్లా"అన్నారు. శ్రీ అచలఋషి దువ్వూరు రమణయ్యస్వాములవారు నాకు సుమారు 20సం॥ల నుండి పరిచయము. వారు కూడ మంచి గ్రంథపరిశోధకులు అనుభవజ్ఞులు వారి అనుభవమును ఈ గ్రంథమున విశదీకరించారు. కనుక వారుచేసిన ఈ ప్రయత్న మునకు సద్గురుమూర్తి సకల ఆయురారోగ్య భాగ్యములనిచ్చి ముందుకు అనేక గ్రంథములు ముద్రించు శక్తికలుగజేయాలని ప్రార్థిస్తూ పాఠకమహాశయులకు కూడ నా శుభాభి వందనములను అందజేయుచున్నాను.

ఇట్లు,

సాధుజనపాదధూళి సమిష్టిబోధానంద

శ్రీ ఉప్పులంచి క్రిష్ణమూర్తి,

షోడశవిలక్షణస్వామి

12-1-282 లాలాపేట (కోటలోపల)

సికింద్రాబాదు - 50017

తేది: 25-3-98

# అభిప్రాయము

ఈ గ్రంథకర్తయైన అచలఋషి శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారు ఆరూఢ మహాపురుషులు. సాంప్రదాయక నిజగురువులు, పరమార్థ జిజ్ఞాసువులైన యెంతోమందికి జ్ఞానదానం చేసిన గురు సార్వభౌములు, సులభశైలిలో అచల బోధను అందించగలిగిన ఋషి పుంగవులు అంతటి మహోన్నతమైన, తత్వవేత్తకావుననే అచల సాంప్రదాయమునకు మకుటాయమానమైన మహోత్తమ గ్రంథము శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువులు రచించిన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములు, పరమతత్వ కందపద్యములు అను పద్యములకు భావార్థములు వ్రాయ సమర్థులని నా అభిప్రాయము.

వీరు నా గురుదేవులైన శ్రీ సత్యప్రబోధనాచార్యులవలన నాకు సుమారు 25 సంవత్సరములనుండి పరిచితులు అంతేగాదు. నాకు పితృసమానులువారు నాపై పుత్రవాత్సల్యమును చూపించుచూ, నన్నెంతో అభిమానించు చుందురు. అందులకు వారికి నేనెంతో ఋణపడి యున్నానని నేను భావిస్తున్నాను. దేశము నలుమూలలా వ్యాపించి అందరికి అందుబాటులోనున్న బోధ అద్వైత బోధ అందు తానెవ్వరో తెలియబడి అనగా స్వస్వరూప సాక్షాత్కారము వరకే ఆబోధ ఆగిపోయినందున మానవునకు నిజమైన జన్మరాహిత్యం సిద్ధించదని నిశ్చయించి అచల ఋషులు శ్రీ బృహద్వాశిష్ట సిద్ధాంతమును నిర్ణయించినారు. ఆ సిద్ధాంతమును ప్రకటపరచిన గ్రంథము శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములను గ్రంథము అందులోని ఒక పద్యము. "పిండ బ్రహ్మాండంబులు రెండును ఆ రెంటిలోని రెండహములు ఈ ఖండములు నాల్గుగూడి అఖండంబగు యెరుక రూపుగనరా మా తండ్రి" పై కందార్థమునకు రమణయ్యస్వాములవారు వ్రాసిన వ్యాఖ్యానము బాగుగా పరిశీలించినట్లయిన వారికున్న మేధాశక్తి మనకు అవగతమౌతుంది. పిండాండము అందులోని జీవిత్వమనే అహం, బ్రహ్మాండము అందులోని ఈశ్వరత్వమనే అహం ఈ నాలుగున్నూ కలసి అఖండమైన యెరుక రూపమేగాని పరిపూర్ణమెన్నటికి గాదని, అలాగాక యిది పరిపూర్ణమని చెప్పేవారిని అనుసరించవలదని ఎంతో విశదముగా విశదపరచియున్నారు. "ఎరుకా యెరుగనిది. యెరుకా మీరినది యెరుకా మరుపులు గానిది" పరిపూర్ణమని అది నిత్యమని, సత్యమని, శాశ్వతమనితలంచి అనిత్యమైన లేనెరుకను లేనిదిగా విడవమని తేట తెల్లముగా వీరి వ్యాఖ్యానము వలన మనకు ప్రస్ఫుట మవుతున్నది.

"పరిపూర్ణమనునది యొగటి లేనెరుకానే దొకటి కలవని పరిపూర్ణ యెరుకల వస్తునిశ్చయముగా నెరిగి యెరిగిన యెరుకను వీడియుండుట పరిపూర్ణబోధ సిద్ధాంతమని ఈ గ్రంథకర్త మనకు స్పష్టపరచియున్నారు. మరొక కందార్థము " నే ననని బ్రహ్మలోపల లేనిది సంభవమునొంది లీల తనకు తామేను జగములై వెలసెను నేనది మృగజలమురీతి నిజముగాదనుచు" అను పద్యమునకు వారు వ్రాసిన వ్యాఖ్యానము బాలా చక్కగావున్నది. నేను సత్యము నాచే చూడబడు జగత్తు మిథ్యఅని అద్వైతబోధ అంటున్నది. నేను. మేను. జగత్తు ఈ మూడు అసత్యములేనని నేననని బ్రహ్మమే నిత్యమైనదని ఆ నేనని బ్రహ్మలోపల లేని యెరుక మృగజలమువలె లేకనే వున్నట్లు తోచుచున్న దేగాని అది అనిత్యమని మరియు యింకను ఎన్నో విశేషాలు మనకు అవగతమౌతున్నదని నేను విశ్వసిస్తున్నాను.

జగత్సృష్టికి కారణమైన బ్రహ్మము పరిపూర్ణ పరబ్రహ్మముకాదని యిది గూడ లేని యెరుకయని దీని కతీతమైనది అచల పరిపూర్ణ బ్రహ్మమని అది సచ్చిదానంద రహితమని సృష్టి. స్థితి లయముల నెరుగనిదని, సనాతనమని అచల సిద్ధాంతము చెబుతున్నదని మనకు వీరి రచనలో అంతర్యము అవగతమగుచున్నది. మరియు "ప్రతి లేని ఈ బట్టబయలుండ జూపి సతతము లేనెరుక లేనిదని నమ్మము" అనిన కృష్ణదాసుగారి సందేశాన్ని మనకళ్ళకు కట్టినట్లు అందించినారు. అచలఋషి శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారు వీరు యింతకు మునుపు అచలబోధకు సంబంధించిన కొన్ని గ్రంథములు రచించి ముముక్షువులకు అందించియున్నారు. వారు గురుకృపవలన ముందు ముందు మరికొన్ని వుదాత్తగ్రంథములు వ్రాసి పాఠకులకు అందించగలరని వారికి ఆశక్తి గురుదేవులు ప్రసాదించగలరని ప్రార్థిస్తూ శెలవుతీసుకొనుచున్నాను. ఈ వుత్తమ గ్రంథమునకు ముందుమాటను వ్రాసేభాగ్యాన్ని కలిగించిన అచలఋషి శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారి చరణకమలములకు నా శతకోటి దండప్రణామంబు లర్పించుకొనుచున్నాను.

ఇట్లు,
అచల శిరోమణి
జడ వెంకటాద్రిస్వాములు
కొత్తవంగల్లు.

# అనుభావము

అచలఋషి పూజ్య శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారి ప్రాయమునందు విశ్రమించక శ్రమించి సర్వజన శ్రేయోభిలాషులై అచల పరిపూర్ణులైన శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువులవారిచే రచియింపబడిన శక్తిద్వయనిరాసకంబైన శుద్ధ నిర్గుణ కందార్థ దరువులకు, పరమతత్వ కందపద్యములకు సులభశైలిలో నర్థవంతముగ, ననుభవవేద్యముగ, సర్వ జనానుకూలమగు బాషలో నచల పరిపూర్ణ మెరుంగుటలోగల మెలకువల బొందుపరచి చక్కని భాష్యమును వ్రాసి ధన్యాత్ములును సుస్థిర యశోవంతులైనారు. ఇట్టి సద్గురుమూర్తులైన శ్రీ రమణయ్యస్వాములవారు కొన్ని గ్రంథరాజములను రచించి శిష్యకోటికి జిజ్ఞాసువుల కందించిన మహనీయమూర్తులు. వీరి అచల పరిపూర్ణానుభవసారంబును గ్రహించి శిష్యప్రశిష్యులు మొదలు సామాన్య ప్రజానీకము వరకు నెఱుక నెఱింగి పిమ్మట నా యెరుకను విడిచి యీ బయలే సుస్థిరమని తలంచి భవ బంధ విమోచనులై భావితరములవారి కాదర్శప్రాయులై శిష్య బృందమునకు నచల పరిపూర్ణమును బోధించి వారిని తరింపజేసి వారు తరించగలిగినారు. ఈ కృతికర్తయగు పూజ్య సాధులైన అచలఋషి శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారి ననంతకృపారస దృష్టితో సర్వదా సంరక్షించుగాతయని యీ సద్గురుమూర్తిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

భక్తకవి కవితావాచస్పతి అనుమునిగిరి ఆస్థాన అష్టమకవి

దోనిపర్తి రమణయ్యస్వాములు

సహజాచలరాజయోగి

బుచ్చిరెడ్డిపాలెం.

తేది : 8-1-1998



# అ భి ప్రా య ము

అచలఋషి శ్రీ దువ్వూరు రమణయ్యస్వాములవారు నాకు చిరపరచితులు వీరు అచలఋషి సాంప్రదాయకులు. ఆంధ్ర దేశమునందలి నెల్లూరు జిల్లా, నవాబుపేట వాస్తవ్యులు. వీరు, వీరి మామగారు అచల పరిపూర్ణులు శ్రీ మన్నే పల్లి పెంచలయ్యగారితో కలిసి చెట్టిగుంటరోడ్డులోని సున్నపుబట్టి ప్రాంగణమున ప్రతి విజయదశమి రోజున వీరి గురువుగారైన శ్రీ ఉడుతా వెంకటదాసార్య సద్గురుస్వాముల ఆరాధనా కార్యము జరుపుతూ వుండేవారు నేను ప్రతి సంవ త్సరము వెళ్లుతూ వుండేవాడిని ఆ ఆరాధన వీరి సాంప్రదాయ అభివృద్ధికి యెంతో తోడ్పడినది.

శ్రీ అచల ఋషి దువ్వూరు రమణయ్యస్వాముల వారికి ఈ సాంప్రదాయమునందు ఎక్కువభక్తి, విశ్వాసములు కలవు. మా జేజి తాతగారు శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు రచించిన ప్రఖ్యాతిగల గ్రంథమగు శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములకు వీరు భావార్థములు రచించినారు. అచలఋషి సాంప్రదాయము నందు గొప్ప అనుభవజ్ఞులు కానిదే యిట్టి రచనకు పూనుకొనరు. వీరు నాకు సుమారు 50 సంవత్సరముల నుండి పరిచయమై యున్నారు. ఎంతో మంది భక్తాదులకు ఈ భావమునందు ఆసక్తి గలుగునట్లు చేసి, చాలా ప్రదేశముల యందు సంచరించి అచల ఋషి సాంప్రదాయమును బహుళ ప్రచారము గావించుచున్నారు. ఇది వీరి జన్మ ఫలితమని నా అభిప్రాయము. వీరి రచనావిమర్శలోని కొన్ని కందార్థములను పరిశీలించగా, వీరికి గల నిజభావము మనకు అవగతం కాగలదు. ఆ విధమైన నిజభావమును ప్రచారము చేయుచూ భక్తులకు సేవ చేయుచున్నారని నాకు నమ్మకము కుదిరి నది. వీరి వ్యాఖ్యానములోని ఒక కందార్థమును ఉదాహరణముగాగై కొనినచో, కం॥ విత్తే చెట్టయి పుట్టును. విత్తే విత్తనము రీతి వెలయును ధరపై, విత్తుకు చెట్టుకు వేరే విత్తనమొకటున్నదనిన వినకూడదోయి తనకు తా బుట్టును విన వోయి" అనే కందార్థములో గ్రంథకర్త అభిప్రాయము. సృష్టి రహస్యమును వివరించిరి. సృష్టి నిర్మాణమునకును అచల దేవునికిగల సంబంధము వివరించు టలో వీరి విమర్శనాత్మక జ్ఞానము శ్రేష్టమైనదిగా వున్నదని నా అభిప్రాయము వీరు గురు కృపవలన పరిపూర్ణ ఆరోగ్యవంతులై, అచల సాంప్రదాయ భావ మును వెల్లడించుచు మరెన్నో గ్రంథములు రచించి భక్తులకు అందజేయగలరని వీరి అభివృద్ధిని కోరుతూ ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు,

తత్వబౌతిక సారూప్యత, విశ్వధర్మ నిరూపణ, సత్యప్రభోధనాచార్యులు
బి. బాలాజిసింగుస్వాములు, (కొత్తవంగల్లు)

శ్రీమత్ శివరామదీక్షిత
అచలగురు పీఠాధిపతి



శ్రీ మద్రాజాధిరాజ మహారాజ యోగీంద్రచంద్రులు
శ్రీకృష్ణదేశికేంద్రులవారు



శ్రీ ఉడుతా వెంకటదాసార్య సద్గురుస్వాములవారు



శ్రీ మన్నేపల్లి పెంచలయ్యస్వాములు

# విషయ సూచిక

## శుద్ధ నిర్గుణ తత్త్వ కందార్థములు.

### 1. సభా విజ్ఞాపన



### 2. గురుశిష్యాన్యోన్య దర్శనం



### 3. అచల లక్షణం.



### 4. యెరుక లక్షణము

నెం. పుట

### 7. మతాల లక్షణం



నెం. పుట

### 8. పరిపూర్ణ బోధ



### 9. గురు మంత్ర ప్రతాపం

## 10 బోధ దృఢీకరణం



## 1[illegible]. బోధ స్థితి పురుష లక్షణం



## 1[illegible]. బోధ పఠన లక్షణం



## 1[illegible]. భద్రాద్యంకితం

ఓం.

శ్రీ సద్గురుభ్యోనమః

# గ్రంథ పరిచయము.

శ్రీశ్రీశ్రీ శ్రీధర శివరామదీక్షిత అశరీర నిజగురు బంధుజనులందరికీ నా మనవి! దక్షిణామూర్తి మొదలు మన స్వగురువుల వరకు అవిచ్ఛిన్నముగ సాగిన మన గురు పరంపర సుదీర్ఘ కాలము నడచి దేశకాల ప్రాంతీయ భేదముల ననుసరించి పెద్దలు అనేక విధాలుగ గ్రంథముల రచించియున్నారు. ఆదికవి వాల్మీకి మొదలు వేదవ్యాసులు, కృష్ణార్జున, ఉద్ధవ, జ్ఞానేశ్వర, శ్రీధర స్వామి, సమర్థ రామదాసు, విశ్వకవి వేమనయోగి ఇలాగ యెందరో పెద్దలు విశ్వమానవ కళ్యాణము కొరకు ఆధ్యాత్మిక రచనలుజేసి, సమాజమును జ్ఞాన మార్గమున నడిపించిరి. అందులో జనన మరణ భ్రాంతి రహితమును గురించి బోదించి, బోధించి సిద్ధాంత పరచినవారు. నల్లగొండ జిల్లా నారాయణపుర నివాసులు శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షితులవారు, ఈ మహానుభావుడు, పండిత పామరులకు అర్థమయ్యే పద్ధతిలో బృహద్వాశిష్టమును ఉద్గ్రంథమును రచించి, వారు ఆ గ్రంథములో అనేక రహస్యాలు వెలికిదీసి యథార్థ బోధను వచన రూపములో రచించినారు. ఆ వచనము చదివి సంశయ రహితులు కావచ్చునేగాని, అధ్యయనముజేసి కంఠస్తము జేయుటకు వీలుపడదు. అందువలన వారి సంతతిలో శ్రీ కంబాలూరి అప్పబ్రహ్మము సచ్ఛిష్యులగు శ్రీ పరశురామ శీతారామస్వాములవారి ఉత్తమ శిష్యులగు దక్కన్ హైదరాబాదు వాస్తవ్యులు శ్రీమద్రాజాధి రాజయోగీంద్ర చంద్రులగు శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులవారు శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కంధార్థములు. 292-22 అధ్యాయాలుగాను, క్షరాక్షరోపాది ద్వయదోష రహిత పరమతత్వ కందపద్యములు 261 రచించినారు. ఇందులో ఈ భావగర్భితమైన భావాలు అనేక ముండుట వలన పాండిత్య జ్ఞానములేని పాటకులకు ఆ భావములు అర్థము కాకపోవుట గమనించిన పెద్దలు కొందరు ఈ గ్రంథమునకు భావార్థములు వ్రాసి ఒకతూరి రెండుతూర్లు ప్రింటు వేయించి అవి రిజిష్టరు చేయించడము వలన వేరేవాళ్ళు అచ్చువేయుటకు వీలుపడకపోయినది. సాంప్రదాయకం. దేశం నలుమూలలా

# శ్రీ గురుపాద పూజార్చన శతనామావళి

సద్గురువేనమః

1. సాదురూపాయ నమః
2. సర్వాదారాయ ,,
3. స్వఛ్చాయ ,,
4. సర్వదోష రహితాయ ,,
5. శుద్దాయ ,,
6. సకలకర్మనివారణాయ ,,
7. సగుణ నిర్గుణతీతాయ ,,
8. సాక్షిరహితాయ ,,
9. సుఖదుఃఖ వర్జితాయ ,,
10. సకలపాపద్వంసాయ ,,
11. సర్వోపనిషత్సారాయ ,,
12. సృష్టిస్థితిరహితాయ ,,
13. సత్చిదానంద రహితాయ ,,
14. సనాతనాయ ,,
15. సర్వోపాది వినుర్ముక్తాయ ,,
16. చలనరహితాయ ,,
17. సమస్తపదార్థకారణాయ ,,
18. సకలలోకాయ ,,
19. సర్వదేశాయ ,,
20. సనకాదిమునీంద్రవందితాయ ,,
21. సర్వదుఃఖ వర్జితాయ ,,
22. సర్వద్వంద్వరహితాయ ,,
23. శబ్దాదితీతాయ ,,
24. సర్వతోభద్రాయ ,,
25. సహజానందాయ ,,
26. సహజమనస్కాయ ,,
27. సర్వ సంకల్పరహితాయ ,,
28. సర్వసృష్టిజనకాయ ,,
29. సర్వరూపవర్జితాయ ,,
30. స్త్రీ పురుష శూన్యాయ ,,
31. సర్వభ్రాంతి రహితాయ ,,
32. పూర్ణాయ నమః
33. ప్రసన్న చిత్తాయ ,,
34. పుణ్యపాప వర్జితాయ ,,
35. ప్రణవతీతాయ ,,
36. పరమానంద స్వరూపాయ ,,
37. పరతత్త్వాయ ,,
38. పరందామాయ ,,
39. పరమపావనాయ ,,
40. ప్రసన్నవరదాయ ,,
41. పురాణపురుషాయ ,,
42. పరమ పవిత్రాయ ,,
43. పరమ పురుషాయ ,,
44. పంచభూత రహితాయ ,,
45. ప్రకృతిద్వయతీతాయ ,,
46. పరమాణురూపాయ ,,
47. బందమోక్షరహితాయ ,,
48. భావాభావతీతాయ ,,
49. భక్తాభీష్టఫలప్రదాయ ,,
50. బుధజన వినుతాయ ,,
51. భవరోగ వినాశాయ ,,
52. బ్రహ్మాదిస్తుతాయ ,,
53. బ్రహ్మాండజనకాయ ,,
54. నామరూపరహితాయ ,,
55. నిస్సంగాయ ,,
56. నిర్మలాయ ,,
57. నిర్లేపాయ ,,
58. నిరాలంబాయ ,,
59. నిర్గందాయ ,,
60. నిరింద్రాయ ,,
61. నిరాదారాయ ,,
62. నిరంజనాయ ,,
63. నిరహంకారాయ ,,

64. నిర్వికల్పాయ నమః
65. నిరాకారాయ ,,
66. నిష్కళంకాయ ,,
67. నిరాభాసాయ ,,
68. నిర్బీజాయ ,,
69. నిస్తేజాయ ,,
70. నిరుపద్రవాయ ,,
71. నిర్గుణాయ ,,
72. నిగమార్థ ప్రతిపాదాయ ,,
73. నాశరహితాయ ,,
74. నిర్వాసనాయ ,,
75. అమృతస్వరూపాయ ,,
76. అనంతాయ ,,
77. అద్వితీయాయ ,,
78. అచలాయ ,,
79. అపరిమితాయ ,,
80. అప్రమేయాయ ,,
81. అవ్యయస్వరూపాయ ,,
82. అచ్యుతాయ ,,
83. అహంకార వర్జితాయ ,,
84. అఖండాయ ,,
85. ఆదిమధ్యాంతరహితాయ ,,
86. అపరోక్షాయ ,,
87. ఆకాశతీతాయ నమః
88. అవికారాయ ,,
89. అరూపాయ ,,
90. అమలాయ ,,
91. అజాయ ,,
92. అజడాయ ,,
93. అతీంద్రాయ ,,
94. అఖిలార్థ అతీతాయ ,,
95. అనిర్వచనాయ ,,
96. త్రిగుణతీతాయ ,,
97. దీనజనకల్పతరువాయ ,,
98. దివ్యపురుషాయ ,,
99. దృగ్దృశ్యతీతాయ ,,
100. కర్తుత్వరహితాయ ,,
101. నామరూపరహితాయ ,,
102. భక్తజన దర్శనాయ ,,
103. కరుణాసముద్రాయ ,,
104. లక్ష్యతీతాయ ,,
105. విశ్వోదరాయ ,,
106. విజ్ఞానగోచరాయ ,,
107. త్రిభువన ప్రతిష్టాయ ,,
108. సద్గురు కరుణాయ ,,



# శ్రీ సద్గురుభ్యో నమః

## ( గురు పరం పరం )

ఓం నమో బ్రహ్మాదిభ్యో, బ్రహ్మవిద్యా సాంప్రదాయ కర్తృభ్యో వంశ ఋషిభ్యో, మహాభ్యో, నమోగురుభ్యోః సర్వోపప్లవరహిత ప్రజ్ఞాన ఘన పత్య గర్ధ్యో బ్రహ్మైవాహమస్మి అహం పదార్ధరహితః బృహద్వాశిష్టం! పరమం ప్రభాకర యోగీశ్వరం, జనకంచరాజఋషిం, సుఖంచసాందీపమేవచ, స్వశ్రీ యంచ శ్రీదరం, శ్రీదరస్వామియోగీంద్రశిష్య, రామడుగు శివరామ దీక్షితార్య గురుంభజే, శ్రీ శివరామదీక్షితార్య పదపంకజచంచరీకం, కంభాలూరి అప్పయ్య మంత్రి గురుంభజే, శ్రీ అప్పయార్య దివ్య శ్రీపాదార్చిత శోభితం, పరశురామ శీతారామస్వామి గురుంభజే, శ్రీ శీతారామార్య పదకంకణకింకిణీరవం, భాగ వతుల కృష్ణదాసు గురుంభజే, శ్రీ కృష్ణదాసార్య దివ్య శ్రీ చరణారవింద మకరంద, విభన్మత్త, మనోభృంగ శ్రీ పీల్కాన శంకర్రావు గురుంభజే! శ్రీ పీల్కాన శంకరార్య సద్బోధిత, సుమనోరంజనీ, కుసుమపరిమళమిళిత వికసిత మహాత్ప్రకాశం, నిశిదళ్ళ రామబ్రహ్మార్య సద్గురుంభజే, శ్రీరామ బ్రహ్మార్య శ్రీ పాదార్చిత సుప్రసన్న పరిపూర్ణ శోభితం, శ్రీ రంగనారాయ ణార్య సద్గురుంభజే! శ్రీమన్నారాయణార్య సద్బోధిత పరిపూర్ణ పరమహంస స్వరూపం· వరదా రామమూర్తి సద్గురుంభజే! శ్రీ వరదరామార్య దివ్య శ్రీ పాదార్చనాలంకార మహాత్ప్రకాశం, దామెర్లరామమూర్తి సద్గురుంభజే! శ్రీమద ఖండ పరిపూర్ణ భోదాచార్య శ్రీ దామెర్ల రామమూర్తి యోగీశ్వర పదపంకజ చంచరీకం· ఉడుతా వెంకటదాసార్య సద్గురుంభజే! సదసద్రహితాఖండ పరిపూర్ణభోదాచార్య, శ్రీ ఉడుతా వెంకటదాసార్య శిష్య అచలఋషి దువ్వూరు రమణయ్య స్తోత్రం ఇతిః

శ్లో॥ అస్మద్గురు సమారంభం సుకరాజా ఋషి మధ్యమాం ।
బృహద్వాశిష్ట పర్యంతం వందే గురు పరం పరం ॥



# శ్రీ వేంకటదాసార్య సద్గురుభ్యోనమః

శ్లో॥ గురుబ్రహ్మ గురోర్విష్ణుః గురుదేవో మహేశ్వరః ।
గురుసాక్షాత్ పరబ్రహ్మం తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।
చక్షుర్మీలితం యేనా తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ స్థావరజంగమం వ్యాప్తం యత్కించి చరాచరం ।
గురుపాద దర్శితం యేనా తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ చైతన్యం శాశ్వితం శాంతం హోమాతీతం నిరంజనం ।
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ నిర్గుణం నిర్మలం శాంతం జంగమం స్థిరమేవచ ।
వ్యాప్తం యేన జగస్సర్వం! తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తి పూజమూలం గురోర్పదం ।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోర్కృపః ॥

శ్లో॥ గురుమద్యేస్థితం విశ్వం విశ్వమద్యేస్థితో గురుః ।
గురుర్విశ్వం సమస్తంతం తస్మై శ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ నిత్యపూర్ణాయ సత్యాయ నిశ్చలాయ నిరీహ్యతే ।
నిర్మలాత్మ స్వరూపాయ నిర్గుణాయ నమోన్నమో ॥

శ్లో॥ నిత్య బ్రహ్మస్వరూపాత్మా నిరుపాదిక నిశ్చలం ।
మనోబుద్ధి నిరోదేన నంద్యతే గురోర్వినా ॥

శ్లో॥ నిత్యం నిరంజనం వ్యాప్తం నిర్గుణం నిరుపద్రవం ।
నిష్కలంకం నిరాదారం వస్తు మద్రహితం నమః ॥

శ్లో॥ అసమాన మనిర్దేశం మచలం పరమవ్యయం ।
అనుపమానమనాదారం తత్పూర్ణం పరమంప్రభో ॥

శ్లో॥ కాలత్రయ వినుర్ముక్తం కాలాకాల వ్యవస్థితం ।
కల్లోలాది వినుర్ముక్తం పరిపూర్ణం సదాప్రభో ॥

శ్లో॥ అజ్ఞాన మూల హరణం జన్మకర్మ నివారణం ।
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకంపిభేత్ ।
గురుపాదోదకంపిత్వా గురోరుశ్చిష్ట భోజనం ।
గురుపూజా సదాద్యానం గురుమంత్రం సదాజపేత్ ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం సుకరాజారుషి మద్యమాం ।
బృహద్వ్యాశిష్ట పర్యంతం వందే గురు పరం పరం ॥

శ్రీ మద్భాగవతకృష్ణ గురు పరబ్రహ్మణేనమః

# ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

శక్తిద్వయనిరాసకంబైన

# శుద్ధనిర్గుణతత్వ కందార్థ దరువులు

— 1. సభావిజ్ఞాపన ॥ప॥ 21 —

1. కం॥ జనులారజననమరణము - లనుదొలగన్ – ద్రోయజాలు – లక్షణయుతమై – వినువారికి – కనువారికి – తనలావెరిగించుదీని – తప్పాక వింటే – అప్పుడెవార – లెప్పూడుగంటే – కనుకా వినబుద్దైతెవినుడీచదివెద-మీాకె - కనుగొనమనసైతె – కనుడీ పుస్తకమంత – తప్పాకవింటే – అప్పుడెవారలెప్పూడుగంటే 1

తా॥ జనులార జననమరణ ప్రవాహములోబడి దరియెవ్వటనో గానక! చింతించుచూ చితికిపోవుచున్న మానవులకు ఒకదరిని చూపించి వారి దుఃఖము లనుమాన్పి శాంతిని కలుగజేయునదియే ఈ గ్రంధము యొక్క లక్షణము. అంతేగాదు వేదములయందును ఉపనిషత్తులయందునూ భగవద్గీతయందును, (అహంబ్రహ్మాస్మి) నేనే బ్రహ్మమని ఏ నేనును ప్రతిపాదింప బడుచున్నదో ఆ నేనుయొక్క లావును గూడా చక్కగా వివరించగలదు. ఈ వివరణ వినేవారికి వినిపించగలను. కనేవారికి చూపించగలను. ఈ రహస్యమును మీారు యెరుగ వలయునని మనసు గల్గినవారందరూ ఈ పుస్తకంలో తెల్పెడి సారాంశమును మొదటనుంచి తుదివరకు తప్పక వినవలయునని కోరుచున్నాను.

2. కం॥ వినవలెనని కనవలెనని – మనసందునకోర్కెగల్గు మనుజులె వినుడీ – వినజేసెద కనజేసెద – ఘనమగుయీబోధవిన –కననొల్లనట్టీ–మనుజులు చనుడొచ్చిన త్రోవబట్టీ – తినుమంటె పులివల్లదని లోకులనవింటి– గనుకానెవినవాలెనన నోరాడదువిన – కననొల్లానట్టీ – మనుజులుచనుడొచ్చిన త్రోవబట్టీ. 2

తా॥ అట్టి ఈ గ్రంథమును మీరు వినవలెననియు, వినినదానిని చూడవలయుననియు యెవరికి కోరికకల్గుచున్నదో ఆ కోరిక కల్గినవారికి మాత్రమే వినిపించగలను. వినిన దానినిగూడా చూపించగలను. ఆ కోరిక మీలో కలుగకనే నేను తెల్పునది మీరు వినుడని అనుట యెట్లుండుననగా నన్ను తినుమని పులి దగ్గరకు పోయినయెడల అది వెనుదిరిగి పోవునని లోకులుతెల్పెడి సామెతగా యుండును. అందుకని దీనిపై ఇష్టములేనివారు ఈ బోధను వినకుండా పోవడమే మంచిదని నా బుద్ధికితోచి మీరు వినుడని తెల్పుటకు గూడా నాకు నోరు ఆడకయున్నది.

3. కం॥ ననుమిమునేగనిపుస్తక – మునుజేసితిదీన్ని మీరు ముదమున వినుడం – చనుటయుమిమునసుమీరలు – గనుగొని వినిపించుమనుట – కలయిట్టీమాటా – బోధనుమేల్కొ – గనలేదెచ్చోటా – ఘనులారయిటువంటికలలో ముచ్చటలాడి – గొనకోని మీరుమేల్కొని – మేల్కొల్పుడినన్ను – కలయిట్టి మాటా – బోధనుమేల్కొ – గనలేదెచ్చోటా. 3

తా॥ ఘనమైన ఈ బోధను నేను మీకు తెల్పుట మంచిదనియు ఆ బోధను మీరు వినుట మంచిదనియు ఈ పుస్తకమును వ్రాయదలచితిని. ఈ బోధను మీకు తెలియ పరచవలయునని ఉదారత్వము నాలో కలుగక పోయిన యెడల నన్ను బలవంతముగా తెలుపుడని మీరు కోరుట సాధ్యము కాని పనిగా యుండును. ఈ బోధను అర్థము జేసుకొని అందులో మెలకువలు కలుగుటకు గురుశిష్యులిద్దరు తగినవారుగా యుండవలయును. అట్లు కాదేని ఆబోధ నిష్ప్రయోజనము అగును. అందువలన ఘనమతిమంతులైనవారు మన సంభాషణమును కలలో ముచ్చట్లుగా భావించి ఈ బోధను యెరిగే దానికి మీరు ఉత్సాహపడి యెరిగించే నాకు కూడా ఉత్సాహము కలుగజేయుదురని కోరుచున్నాను.

4. కం॥ ఒరులొరులు నేనునేనని - యొరులను తననెన్న డెరుగకున్న బయలులో - నరుదెంచితననుతాగని - పరులనుగని లెన్సనేను - పరులానియ నుచూ - యెరిగేయెరుకే - బయలుండగనుచూ నిరతాముతానెందునిలువాకుండు టకూ నై - విరవిస్తిదీన్నెరుకా వినెనానిల్వదు నేను - పరులానియనుచూ యెరిగే యెరుకే - బయలుండగనుచూ. 4

తా॥ ఈ భూమిపైన సకలజనులు నేను నేను అనుచు ఒకరినొకరు యెరుగుచుండినను ఆ యెరుగుచున్న జనులనుగాని సకలసృష్టినిగాని యెన్నడు యెరుగకయే బట్టబయలు తనకుతానుగా కదలకయున్నదో ఆ బయలును ఆధారముగా జేసుకొని సకలజీవులు వచ్చుచు పోవుచు సకల వ్యవహారములు సల్పుటకు సకల జీవులలో చైతన్య రూపముగా ఏ యెరుక యున్నదో ఆ ఎరుక ఒక నాడు స్వతస్సిద్ధమైన బయలును దర్శించిన తోడనే తనకుతానే లేక పోవుచున్నదని తెలుపుటకొరకు ఈ గ్రంథము వ్రాయదలచితినని ముందుగా మీకు తెల్పుచున్నాను.

వి॥ లోకంలో గురుబోధ అన్నం పెట్టుతుందా అని అడుగుతారు. అన్నం కాదు అమృతం పెడుతుంది. అన్నంకొరకు గురుబోధ దగ్గరకు పోవలయునా' అమృతము కొరకే పోవలయును. అమృతం త్రాగాలనిన దేవతలకే సాధ్యమగునుగాని రాక్షసులకు సాధ్యముకాదు. మానవుడు అన్నముతోగాదు బ్రతికేది. దేవుని అండతో బ్రతుకుచున్నాడని పెద్దలు తెలుపుచుందురు. అన్నం దేహబాధను చల్లార్చునుగాని ఆత్మభాధను చల్లార్చలేదు. ఆత్మబాధ పరిపూర్ణ బోధామృతము త్రాగిన యెడల చల్లబడిపోవును.

5. కం॥ ఎరుకను కలలోపలనే - నరుదెంచితి మీరలట్ల యరుదెంచితిరీ - యెరుకజననేను మీరలు - యెరుకతో జనువారమనుచు - యెరిగేటి కొరకూ - గ్రంథముజేస్తి నెరిగి యీవరకూ - గురుబోధంచనుమేల్క - నరులార చేకొంటె - యెరుకానెకలజోలి నెరిగున్న నిల్వదం - చెరిగేటి కొరకూ-గ్రంథముజేస్తి - నెరిగీ యీవరకూ॥ 5

తా॥ కలతో సమానమైన యెరుకవలన నేనుగాని, మీరుగాని సృష్టికి వచ్చియున్నాము. ఆ ఎరుక తిరిగి ఎప్పుడు నశించుచున్నదో అప్పుడే నేను, మీరు నశించుచున్నాము. ఆ విషయం నేను యెరిగి, మీరుగూడా యెరిగే

టందుకు ఈ గ్రంథమును రచించితిని. ఈ గ్రంథములోని అభిప్రాయము లను కడవరకు తెలుసుకొనిన యెడల గురుబోధను, మెలకువతో ఎరుకయనే కల, భ్రాంతి ఏమాత్రము నిలువకుండా పోవునని గట్టిగా తెల్పుచున్నాను.

6. కం॥ శ్రీమించు నచలబోధను – యే మహనీయుండు జేసి – యెగజల్లెనో యీ – భూమిన్ సుజనులకొరకా – రామడుగన్వయజశివ–రామా దీక్షతులన్ - తలచి యప్పారావ్ – గుణతతులన్ - ప్రేమాతొ బొగడినేభూమి నిర్జరు పరశు – రామా సీతారామస్వామికి మ్రొక్కి శివరామదీక్షతులన్-తలచి యప్పారావ్ – గుణతతులన్. 6

తా॥ సకల విద్యలలో శ్రేష్ఠమైనది బ్రహ్మవిద్య అనబడును. ఆ బ్రహ్మ విద్యలోగూడా ఉత్కృష్టమైనది అచలవిద్య. ఈ అచలవిద్య సర్వశాస్త్రము లలో యున్న సారాంశమును వెలికితీసి తెల్పబడినదగుటవలన ఇట్టి మహో న్నతమైన పరిపూర్ణవిద్యను ఏ మహనీయుడు సుజనులకొరకు యెగజల్లినాడో అట్టి రామడుగు శివరామదీక్షిత దేశిక ప్రభువర్యులకు వారిశిష్యుడు కంబాలూరి అప్పయ్యమంత్రి సద్గురువర్యులకు, వారి శిష్యుడు మద్గురువర్యులగు పరశురామ సీతారామ సార్వభౌములకు సాష్టాంగ ద్వాదశ వందనములను ముందుగా అర్పించుకొనుచున్నాను.

వివరణ:— శ్రీమించు నచలబోధ యనగా పిండ బ్రహ్మాండములకు సంపద నిచ్చునది.

శ్రీ అనునామముతో విలసిల్లు యెరుకకు మించిన (అతీతమైన) పరిపూర్ణ విద్యను ఏ మహనీయుడు జనులకొఱకు యెగజల్లినాడో అనిగూడా తెల్ప వచ్చును.

7. కం॥ శ్రీమత్సీతారామ – స్వామి కృపన్ జెప్పనయ్యె – సదసద్ర హితం–బేమి పదార్థమొ దానిని-యీ మహికందార్థములుగా – నివి వినరయ్యా– ఓ జనులారా-ఇటు గనరయ్యా వేమారు నేమిమ్ము వేడెదింతియనుమ్మి-నామీద కృపజేసి నను జదువుమని మీర – లివి వినరయ్యా – వో జనులార– యిటు గనరయ్యా. 7

తా॥ నా గురుదేవుడైన శ్రీ సీతారామస్వాములవారి కరుణాకటాక్షంబు వలన నాకు లభించినదియును, నా స్వానుభవముతో ఆలోచించి నా హృద

దయములో నిలుపుకొనియున్న సదసత్తులనియెడు ప్రకృతిపురుషుల కతీతమైన పరిపూర్ణబోధను కందార్థములుగా రచించి, మిమ్ము శ్రద్ధగా మనసిచ్చి వినుడని కోరుచున్నాను. మాటిమాటికి అట్లు తెల్పుటకు కారణమేమనగా! ఇందులో దాగియున్న రహస్యము చాలా గోప్యమై యుండుటవలన అట్టిదానిని ఏకాగ్రతగా వినినప్పుడే అందులో దెల్పిన భావములు గోచరించి, సత్యముదగ్గఱకు పోగలరని మరీమరీ ప్రార్థిస్తూయున్నాను.

8. కం॥ శివరామదీక్షతుల – శిష్యవరుండప్పయ్యమంత్రి – యతని శిష్యుడీ – భువి పరశురామ వంశో – ద్భవ సీతారాము లతని భక్తూడ సుమ్మీ – తదోద్భధప్ర – యుక్తూడసుమ్మీ – స్తవనీయులగు మీరు – త్సాహముతో యీ గాధ – వీనుండీ నేకందార్థములచే వినిపింతు – భక్తూడసుమ్మీ– తదోద్భధప్ర – యుక్తూడ సుమ్మీ. 8

తా॥ ఈ పరిపూర్ణవిద్యను భూమిపై స్థిరపరచిన శ్రీమద్రామడుగు శివరామ దీక్షితులవారు, వారి శిష్యుడు అప్పయ్యమంత్రి, వారిశిష్యుడు పరశురామ సీతారామస్వామి దయకు పాత్రుడనై, వారి అనుగ్రహముతో నాకు లభించిన ఈ పరిపూర్ణ మార్గమును కందార్థములుగా జేసితిని. సుజనులైన మీరందరూ ఉత్సాహముతో, ఓపికగా ఈ కందార్థములను నేను చదువుచుండగా వినవలయును, లేదా మీరలైనా ఈ గ్రంథమును చదువవలయునని ప్రాధేయపడుచున్నాను.

9. కం॥ మనసిచ్చి వినుడి యిక నొక – మనవిది నాపాలి గురుని మదిలోపలనే – నునుచుకొని పెద్దలాజ్ఞను – పనిబూనుకచేస్తి నిట్టి– పద్యాములిన్నీ – తప్పొప్పు లేర్పడదిద్దుండన్నీ – ఘనమతిమంతూలుగనుకానే ప్రార్థిస్తినను మీ కటాక్షేక్షణముల వీక్షింపూచు – పద్యములిన్నీ తప్పొప్పులే – ర్పడ దిద్దుండన్నీ. 9

తా॥ ఘన మతిమంతులైన ఓ జనులారా! ముందుగా నా మనవి నాలకించండి. నా పాలి దైవమైన నా గురుదేవుని చక్కగా మనసునందు నిలుపుకొని, పెద్దల ఆజ్ఞను శిరసావహించి ఈ కందార్థములను యెంతో ప్రయత్నముతో వ్రాయదలచితిని. ఇందులో తప్పొప్పులు యేమైనా యున్నయెడల మేధావంతులైన మీరు చక్కదిద్దగలరని, మీ కటాక్షవీక్షణములు నాపై ప్రసరింపచేయగలరని మిమ్ము వినమ్రుడనై ప్రార్థిస్తూ యున్నాను.

10. కం॥ వినిమీరివిదిద్దుండని - పనిబడిప్రార్థించనేల - పరుసము నినుమి - ట్లనునెస్వర్ణముజై మని - తనకై తానౌను సన్ని - ధానామందుంటే తెల్పుడియను - మానామిందుంటే - మనవీజేసు నెపాలిమ్మనిలేగతల్లికి - తన కై తానిచ్చునుదయచేసితా - సన్నిధానామందుంటే - తెల్పుడి యనుమానామిం దుంటే. 10

తా॥ ఓ దైవస్వరూపులారా! మిమ్ము నేను ఈ పద్యములను దిద్దుండని ప్రయత్నపూర్వకముగా ప్రార్థించనవసరములేదు. యెందువల్లననగా! పరసు వేది సాన్నిధ్యములో ఇనుము యున్నయెడల తనకుతానే బంగారము కాగలదు. ఇనుము తనను బంగారము చేయుమని పరుసవేదిని ప్రత్యేకముగా ప్రార్థించ నవసరములేదు. అలాగుననే ఆవుదూడ తనకు పాలు యివ్వమని తన తల్లిని పనిపెట్టుకొని అడుగనవసరములేదు. తనదూడ తనదగ్గరకు వచ్చిన తోడనే తల్లిలోని వాత్సల్యం పొంగి దూడకు ఆతృతగా పాలిచ్చి తృప్తిని జెందును. అదేవిధముగా జిజ్ఞాసువులైన మీవద్ద ప్రీతిపూర్వకముగా ఈ కందార్థములను ఉంచిన యెడల మీరే ఉత్సాహవంతులై ఇందులో తప్పొప్పులు సవరించగల రని విశ్వసించుచున్నాను.

11. కం॥ అప్పకవీయ్యాద్యాంధ్రము - లొప్పగుమాఘాదికావ్యమొగిజ దివికృతిన్ - తప్పనికవులకుసమముగ - తప్పులులేకుండజెప్ప తరమౌనకృతినీ ఊహనుజేస్తి - మరినేనీకృతినీ - గొప్ప పక్షులతోటి - కొదువాపక్షులుసాటె కుప్పారవీధీనికూడ్యాడెటుందూకు - తరమౌనాకృతినీ - ఊహనుజేస్తి - మరినే నీకృతినీ. 11

తా॥ కవిత్వమునకు అలంకారము తెచ్చునది అప్పకవీయము రఘు వంశము, మేఘ సందేశము, కుమారసంభవము, మొదలగు ముఖ్యమైన మాఘాది పంచకావ్యములు చదివి పెద్ద పెద్ద కవులతో సమముగా తప్పులు లేకుండా తెల్పుటకు నాకు సాధ్యపడునదికాదు. అయినను నా గురుదేవుని అనుగ్రహ ముతో వారిబోధవలన నాకు కలిగిన అనుభవమును ఈ గ్రంధ రూపముగా వ్రాయదలచితిని. ఆకాశములో నిరాటంకముగా యెగిరే పెద్ద పెద్ద పక్షులతో సమముగా చిన్న చిన్న పక్షులు యెగరజాలనియట్లు గొప్పగొప్ప కవులతో సమ ముగా నా కవిత్వము సరిపోదని తలంచికూడ పిరికితనము లేక ఈ గ్రంధము వ్రాయదలచితిని.

12. కం॥ ఛందంబెరుగకపద్యము - లెందుకుజేసెదవటంచు యెందర నిననే – సందేహింపకజేసితి – నిందులతప్పంటెమీర – లివిదిద్దేరనుచూ – నే జదివితె – చెవియొగ్గివినుచూ – అందముగా – చిత్తమందిట్లుతలపోసి – కందార్థములను మీ – ముందారబెట్టితి – యివిదిద్దేరనుచూ – నేజదివితె – చెవి యొగ్గివినుచూ.

తా॥ కవిత్వము రాయడానికి క్రమమగు ఛందస్సు సులక్షణసారము మొదలగునవి చదువక ఆ నియమములు పాటించక యెందుకు గ్రంధము వ్రాయ తలపెట్టితివని యెందరు మాట్లాడినను సందేహించక ఈ గ్రంధము వ్రాయ దలచితినని ఆ సాహసము నాకు యెందుకు కలిగినదనగా విజ్ఞులైన వారు ఈ గ్రంధమును చదువు చుండిన యెడల అందలి తప్పులున్న సరిదిద్ది నాకు తెలిపెదరనియు, నేను చదువుచున్న చెవిపెట్టి శ్రద్ధతో వినుదురనియు, అలాగు విన్నందున నాకెంతో తృప్తి కలుగునని తలపోసి ఈ గ్రంధమును వ్రాయతలచితిని.

13. కం॥ పునరుక్తిగలిగియుండిన – వినికోపముశాయవలదు – వేడు కొనియెదన్ – వినువారుదూరపర్ధము – గనవలెదగ్గెరనటంచు – గల్పించి నానూ - తెలియకకాదీ - గ్రంధాములోనూ - జననీ జనకులు - తమ తన యూలపునరుక్తి - వినగోరుదురుతప్పంచనకానే నదిదెలిసి - కల్పించినానూ తెలియకకాదీ - గ్రంధాములోనూ. 13

తా॥ కవిత్వము వ్రాసేటప్పుడు ఒక పద్యములోగాని, ఒకే కందార్థము లోగాని చెప్పిన మాటను మరలా చెప్పకూడదని అది పునరుక్తిదోషమని ఛందశ్శాస్త్రములలో నియమమున్నది. ఆ నియమము నేను పాటించక ఒక్క కందార్థములోనే చెప్పిన మాటను మరల మరల చెప్పినట్లు కనబడుచుండును. దానికి కోపం చేయవద్దని ప్రార్థించెదను. అట్లు యెందుకు చేసినావని పండితోత్తములు అడిగిన యెడల నేను తెల్పునది రామాయణ, భారత, భాగవతాది శృంగార కవిత్వము కాదు అద్యాంతములులేని దైవత్వమును చూడగోరు వారికి యెక్కడో దూరములో దెల్పక దగ్గరగా చూపించవలయుననే కోరికచే అట్లు తెల్పితినేగాని, పునరుక్తి దోషమని తెలియకకాదు. పలికిన పలుకులనే పిల్లలు పలుకుచుండినను మరల మరలా బలకమని తల్లిదండ్రులు కోరినట్లుగా నేను దెలుపు పునరుక్తి దోషములపై ఆగ్రహించక యుండవలయునని కోరుచున్నాను.

14. కం॥ ఇదియాంధ్రకవిత్వంబని - మదిరోయందగదుదీని మర్మ మరయుడీ - పదియారువన్నెపసిడిని - ముదమునతోల్పెట్టె నుంచముట్టాకుం డుదురా - లోకులువాత - బట్టాకుండుదురా - యిదిగాక కులహీను డిచ్చిన ద్రవ్యాము - విదితాముగా యెంతవేత్తలైననుదాన్ని - ముట్టాకుండుదురా - లోకులువాత - బట్టాకుండుదురా. 14

తా॥ పూర్వపుమహర్షులంతా ఈ పారమార్థిక సత్యమును సంస్కృత భాషలో శ్లోకరూపముగా వ్రాసియుండిరి. అందలి విషయములు యే కొద్దిమంది భాషాకోవిధులైన పండితులకే గ్రాహ్యములు కావచ్చును. గాని సామాన్య జను లకు తెలియకపోవుట వలన ఆ కొరతను తీర్చేటందుకు ప్రతివారికి అందుబా టులో ఈ కందార్థములను ఆంధ్రబాషలో తెలుపబడితిని. అందుకు నా పైన గాని నే వ్రాసిన గ్రంథముపైగాని చిన్నచూపు చూడవద్దని మనవి చేసుకొను చున్నాను. పదియారు వన్నెలుగల మేలిమి బంగారమును, తోలు పెట్టెయందు యుంచిన మాత్రమున దాని విలువకు యెప్పుడు లోపము జరుగదు. అదీ గాక కులహీనుడిచ్చిన ద్రవ్యమును యెంత ఉద్దండ పండితులైనా, చేత పట్టకయుం డరు. అట్లనే ఈ గ్రంథములోయున్న సత్యమును గ్రహించి ధన్యులగుదురని ప్రార్థిస్తూయున్నాను.

15. కం॥ ఆసాంతముయీగ్రంధము - ప్రాసయతుల్ శబ్దగణముభావ ముయుక్తుల్ - జూచిసరిపడనిచోటను-ఈసభలోపెద్దలెల్లా - యిదిదిద్దవలెనూ దిద్దియిదేనా - మదీకద్దవలెనూ - మీసాటివారికి వ్యాసాటిలేదుంటే - నాసాటి వారిబ్రతేక్సాటిగాకుండు - నిదిదిద్దవలెనూ - దిద్దియిదేనామదికద్దవలెనూ.

తా॥ ఈగ్రంధములోయున్న కందార్థములను ఆదినుంచి అంత్యమువరకు శ్రద్ధగా పరిశీలించి అందులోని "ప్రాస" "యతి" శబ్దములు, గణములు, భావ ములు, యుక్తి మొదలైన క్రమ పద్ధతిలో లేవని మీ మనస్సుకు తోచిన యెడల ఈసభలోని గురువులైన పెద్దలందరు సరిదిద్దగలరని ఆశిస్తూయున్నాను మీరుదిద్దిన అంశములు నాబుద్ధికి సరిపోవు విధముగా యుండవలయును. మీకు ఈ గ్రంథము దిద్దేవిషయములో విసుగుపుట్టిన యెడల ఇక నాబోటివారి బ్రతుకు యెంతమాత్రమని తలంచుచున్నాను. ఇది శాస్త్రముగాదు, పురాణం అనలేగాదు. జనన, మరణ వ్యథ మానుట కొరకై వ్రాయబడిన గ్రంథము. కావున బాగుగా పరిశీలించి యందలి తప్పులు సరిదిద్దుదురని ప్రార్థిస్తున్నాను

16. కం॥ తప్పొప్పులు రెంట్నెరుగని-తప్పుతనందుండిదీన్ని-తప్పని కూశే - తప్పుడునరునకుజెప్పెద - చప్పుడుచాలించుమనుచు - సభవారువినగ సరెసరెనాని - సభవారిట్లనగా - చెప్పీనవినకుంటె - తప్పువానిదెసుమ్మీ - తప్పూగలిగినవెనుక - గొప్పావాడెట్లౌనుసభవారువినగా - సరెసరెనాని -సభ వారిట్లనగా. 16

తా॥ శాస్త్రపరిచయము, బ్రహ్మవిద్యయందు సంపూర్ణమైన అవగాహన లేనివారు ఈ గ్రంథమునందలి తప్పొప్పులను నిర్ణయించుటకు సాధ్యపడదు. తప్పొప్పులు నిర్ణయించలేనితప్పు తనయందు యుండిగూడ తనతప్పును తాను తెలియక ఈ గ్రంథమునందు తప్పులు యున్నవని వాగెడు కుచ్చిత మతులకు అట్లు అనగూడదని సభవారి ముందర మందలించెదను. అది మంచిదిగానే యున్నదని సభవారు మెచ్చుకొనేవిధముగా జేసెదను. దానినిగూడ వినక తప్పు లున్నవని వాదించుట తప్పు వానిదే గనుక, తప్పు తనయందు యుండువాడు గొప్పవాడు కాజాలడు"

17. కం॥ ఇలుజొచ్చిగ్రామసింహము - కలదొంతులగూల్చునింటిగరిత లోరుగుదొం - తులుచక్కజేతురట్లనె-యిల సుకవి జనో క్తితప్పులెంచూ దుర్జ నుడూ -తప్పొప్పుగావించు సజ్జనుడూ -తులలేనిబుద్ధిమంతులు సర్వజ్ఞులుమీరు తెలుసూ నాతలపునే దెలిపెదేమిక తప్పు - లెంచూదుర్జనుడూ -తప్పొప్పుగా- వించూ సజ్జనుడూ. 17

తా॥ ఇంటిలోనికి కుక్క ప్రవేశించి చక్కగా పెట్టబడిన కుండల దొంతు లనెల్లా క్రిందకుదోచి ముక్కచెక్కలు గావించి పారిపోయినట్లు, దుర్జనుడుగా యున్నవాడు ధర్మబద్ధులైన పెద్దల ఒప్పులను తప్పులుగా భావించి, విపరీతార్థ ములు తీయుచుందురు. చెల్లాచెదురైన కుండలను ఆ ఇంటి కులకాంతలు మరల దొంతులుగా ఎలా చక్కబెట్టుదురో అలాగున సజ్జనుడు సుజనులైన వారితప్పు లను ఒప్పులుగా భావించి వాటిని సమర్థవంతముగా నుంచగలుగును. మీరు సర్వము నెరిగిన సర్వజ్ఞులు, మచ్చలేని మహనీయులుగా గౌరవించు చున్నాను.

18. కం॥ తనగొప్ప నెంచరేమో - జనులని తలపోసి సాధు-జనకృత కవితల్-వినడితరులు వినగోరిన - వినకనరాదనుచు మనసువిరుచూదుర్జనుడూ

వినివినిపించు వేడ్కసజ్జనుడూ - కనవొచ్చె ముంజేతి కంకాణాలకు వేరే - ఘన నిల్వుటద్దాము గావాలెనామనుసు – విరుచూదుర్జనుడూ – వినివినిపించు - వేడ్క సజ్జనుడూ 18

తా॥ దుర్జనుడుగా యున్నవాడు తనమాటలే మంచివనియు తన చేష్టలే గొప్పవనియు తన నడకే ఉత్తమమనియు తన బోధయే శ్రేష్ఠమనియు తలంచి ఇతరులు తెలుపు సద్వాక్యములుగూడ వినక తన గొప్ప తానే ప్రకటించుకొను చుండును. అట్టి వానిని దైవజ్ఞాన గలిగినవారు మీ అనుభవము యేదైనా తెలుపమని ప్రాదేయపడినా అవి మీరు వినేవి కావనియు. ఆ సమర్థత మీకు లేదనియు, మూతి విరుచుకొనుచు ప్రక్క ప్రక్కకు పోవుచుందురు. అట్టి వాని ముందు మరొక పెద్దలు అపేక్షించినవారికి హితవులు చెప్పుచుండిన ఆ పెద్ద తనము, ఆ గౌరవము నాకు రాకపోయెనని లో లోపల తపనగల్గి యుండును. సజ్జనుడైనవాడు మాత్రం తనకు తెలిసినంత వరకు వివరించుచు, ఇతరులను వివరించమనుచు పెద్దల వాక్యములను పెడచెవినిబెట్టక ఆ అనుభవ వాక్యము లకు మురిసిపోతూ, వారి అనుభవములో నా అనుభవము తృణము వంటిదని, తలంచి వారికి యెప్పుడు నమోవాకములిడుచుండును. వీరి ఇద్దరిలో దుర్జనుడైన వాని కుచ్చితబుద్ధి, ముంజేతి కంకణము జూచుటకు నిలువుటద్దముతో పని లేనట్లు తెలియబడుచుండును.

19. కం॥ ఆగామీ కథయెట్లన – బాగుగవివరింతు చెవుల – పండువు గాగన్ – అగమనిగ మోపనిత్సాగరమధితార్థమవల – సాంగోపాంగముగాన్– దయతో – వినుడీ – సాంగోపాంగముగాన్ – ప్రాగర్ధ చరమార్ధ యోగాముల కును సం – యోగాముగావించి నేగు రైరిగినదంత – సాంగోపాంగముగాన్ – దయతో వినుడి సాంగోపాంగముగాన్. 19

తా॥ శ్రోతలారా! ముందు నే జెప్పబోవు కథ యెట్టిదనగా! వేదములు, ఉపనిషత్తులు, రామాయణము, భారత, భాగవత, భగవద్గీత లనెడు శ్రుతి, స్మృతులైన మహా సముద్రమునంతా తరచి శేషించిన సారాంశమును మద్గురు కరుణాకటాక్షంబున నేను పొందిన అనుభవమంతయు మీకు తెలియపరచుట ఉచితమని తలంచి ఆ రహస్యమును మీకు వివరముగా వ్రాయదలచితిని అంతే గాదు. ॥శ్రుతి॥ "ప్రాగర్థం, ప్రకృతీ దేహం, చరమార్థంతు ఆత్మయో" అన్నట్లు

ప్రాగర్థంబనెడు ఈ స్థూలశరీరంబును పరమార్థంబనెడు సూక్ష్మమైన ఆత్మయు ఈ రెండు ఒక్కటేయని జతపరచి ఇందులో ఒకదానికి అల్పత్వము ఒకదానికి అధికత్వము లేదని నిరూపించి ఈ రెండు ఒకదానిని విడచి మరొకటి యుండలేదని తెలియ పరచుటకొరకు నేను గురైరిగినదంతా ఈ గ్రంధములో తెలుపదలచి మిమ్ములను శ్రద్ధగా వినుడని ప్రార్థిస్తూయున్నాను.

20. కం॥ మోదమున బ్రొద్దుపోకకు – వాది ప్రతివాదులగుచు వర గురుశిష్యుల్ – వాదించిరనుచు నొక సం– వాదము గల్పిస్తి కలగా వదలాక వినుడీ – మొదటినుంచి తుదవెళ్ళాగనుడీ – వేదాంతార్థతీత వేత్తాలుమీరిందు యేదేది నవరించుడిదె నా విజ్ఞాపన - వదలాకవినుడీ – మొదటి నుంచి - తుదవెళ్ళాచనుడీ॥ 20

తా॥ ఒకనాడు సంతోషముగా యున్న సమయములో నా మనసులో ఒక కదలిక గలిగి వాది, ప్రతివాదులుగా గురు, శిష్యులను కల్పించి వారిద్దరు వాదించుకొను నటుల ఒక సంవాదమును కల్పనగా వూహించుకొని కలలో మువ్చట్లువలె ఈ గ్రంధమును వ్రాయబూనితిని ఈ వ్రాసినదానిలో నా అభిప్రాయమును తెలిసుకొని దీనికి తగిన సమర్థత గలిగిన వారగుచు వేదార్థముల నెల్ల పరిశీలించి కార్యరూపమైన సృష్టినిగాని, కారణ రూపమైన చైతన్య బ్రహ్మమునుగాని నిరసించి కార్య కారణములకు అతీతమైన అచల పరిపూర్ణమును తెలుపదలచితిని. అందులో అనుభవముగలిగిన సద్గురుస్వాములైన పెద్దలంతా ఈ కందార్థములను మొదట నుంచి తుదివరకు చదివి ఇందులో తప్పులుగలిగి యున్న చోట సరిదిద్దవలెనని విజ్ఞాపన చేసుకొనుచున్నాను.

21 కం॥ కొంచెములో సరిపుచ్చక - పెంచినవీ గ్రంథమనుచు పెద్దలలుగకన్ - మించిన వేడ్కతో వినుడీ - పెంచిన యర్థంబునే దె - ల్పెద లోకులెల్లా – అర్థముదెలశి - మదినుల్లాసిల్లా -- పెంచీతి పెంచీతి గొంచాము వెడలూపు - వుంచుండెనదిలోతంచెంచీ నా మదినిదె- ల్పెదలోకులెల్లా - అర్థము దెలసి మదినుల్లా సిల్లా॥

తా॥ లోకములో ఈ వేదాంత విద్య తేలికగా కనబడక హిమాలయములకన్న బరువుగా యున్నందువలన యెంతవారైనను ఈ బ్రహ్మ విద్యలోకి రాలేక వెనుకబడి పోవుచున్నారు. అట్టివిద్యను తేలికగా, సులువుగా, దగ్గరగా

చూపించకుండా యెందుకు ఇంత పెద్దదిగా గ్రంథమును పెంచినావని పెద్దలు నా మీద అలగవచ్చును. అటుల పెంచినందులకు నా అభిప్రాయము తెలియ చేయుచున్నాను. సంతోషముతో మనసిచ్చి వినవలయును. ఈ వేదాంత విద్య అనేది మహా సముద్రమువంటిది. అట్టి సముద్రములో దరి యెక్కడో, త్రోవ యెక్కడో తెలియక గంభీరముగా కనబడుచుండును. అటులనే ఈ పరమార్థ మహాసాగరములో గూడార్థములు వెలికి తీయుటకు వాటిని విశదముగా విశద పరచుటకు కొంత యెక్కువగనే ప్రయాణము చేయవలసివచ్చినది. అందువలన మీరుగూడ విసుగుచెందక నాతో పయనించవలెను. యెందుకనగా గుహ్యాతి గుహ్యమైన ఆ పరిపూర్ణ రహస్యము శాస్త్రములలో దాగియున్నది. అట్టిదానిని బయటకుదీసి చూపించేదాని కొరకునై ఇంతగా పెంచితినిగాని మరొక అభిప్రాయముకాదని తలంచవలయును.

సభావిజ్ఞాపన మొదటి అధ్యాయం సమాప్తము.



## 2. గురుశిష్యాన్యోన్యదర్శనం. 10

22. కం॥ సాధనసంపత్తియు గల - సాధకుడొకనరుడు ఘోర సంసారమునన్ -బాధపడలేక తన పు-ణ్యోదయమున గురునిగాంచి యురుతరభక్తిన్ శరణనిమ్రొక్కి - మరిమారియు క్తిన్ — బోధాజేయుము పుణ్యపురుషా మాబోంట్లాకు - సాధించదగు ముఖ్య సాధనానిపత్కె - నురుతర భక్తిన్ - శరణని మ్రొక్కి మరిమారి యుక్తిన్.॥ 1

తా॥ సాధన సంపత్తి గలిగిన ఒక మనుజుడు తన పుణ్య పరిపాకము వలన నిజము దెలుపు పరిపూర్ణ ప్రబోధకుడైన ఒక సద్గురువును ఆశ్రయించి తనలో గలిగిన ఆవేదనను వివరించుచున్నాడు. "సాధన సంపత్తి యనగా - నిత్యా-నిత్య వస్తువివేకము. ఇహమూత్ర ఫల, భోగ విరాగము-శమాది షట్క సంపత్తి-ముముక్షుత్వము" అను ఈ సాధన చతుష్టయము. వేదాంత విద్యకు ముఖ్య సోపానములుగా యున్నవి. ఈ నాలుగు సాధనలలో మొదటిదైన నిత్యా, నిత్యవస్తు వివేకము ఏ మనుజునకు కలుగునో ఆ మనుజుడు విమర్శనా జ్ఞానము కలవాడై వివేకవంతు డగుచుండును. అది యెట్లనగా, లోకములో

మానవుడు చూచుచున్న సకల రూపాదులన్నియు ఒకప్పుడు నశించుచున్నవని తెలియబడి, ఇవి అన్నియు శాశ్వతములుకావని, వాటిపై భ్రాంతినివదలి దూర దృష్టితో విచారించినవానికి, ఈ రూపనామాదుల వెనుక యే సత్తా పదార్థమో ఒక ఆత్మ వస్తువుయుండి, ఈ రూపనామాదులను ప్రకాశింపజేయు చున్నదని శాస్త్రములలో తెలుపుటజూచి ఆ ఆత్మ వస్తువును కొంత పరిశీలించగా నాలో యే ఆత్మయున్నదో ఆ ఆత్మే సర్వజీవులలో యున్నది.

"మమ్మాత్మ సర్వభూతాత్మా" అని 'శృతి' దెలిపినట్లు అన్ని ఉపాదులలో యుండె ఆత్మ స్వరూపమునే నేనని తెలియుచున్నది. అదియును గాక —

శ్లో॥ అహం సర్వశ్య ప్రభవో మత్తత్సర్వం ప్రవర్తతే॥ అని గీత 10-8 తెలిపినట్లు సర్వజీవులు నా వలననే సృష్టింపబడుచు నావల్లనే ప్రవర్తింపబడు చున్నందువలన నేను ఈ సర్వసృష్టిని జేయుచు ఆ సృష్టిలో నేనుయుండి సర్వ జీవులను కదిలింపజేయుచు నిలకడలేని ప్రవాహము తీరుగా నాలో యెడతెగని కర్మ జరుగుచునేయున్నది. అట్లు జరుగుటవలన నాకు శాంతిగాని, స్థిమితము గాని ఏ కాలములోగూడ అగుపడక యున్నది. ఏ దానికి శాంతి స్థిమితము లేదో అది లేకుండా పోవలయును. అందువలననే ॥శ్లో॥ "తన్నివృత్తిర్మోక్షః" నేను లేకుండా పోవడమే మోక్షమని శృతిగూడ తెలుపుచున్నది, ఆ నేను ఉన్నంత వరకు సకల భ్రాంతులు, సకల సంశయములు, సకల దుఃఖములు గలుగుచునే యుండును. ఈ సంశయాత్మకమైన ఘోర సంసారమును దాటు టకు నేను, అనుసరించవలసిన మార్గము ఏదైనా యున్న యెడల దానిని దెలిపి "జీవోహం" "శివోహం" అను దానికి అతీతమైనదియు, శాంతియుతమైన మార్గమును యెరిగించి నన్ను కృతకృత్యుని జేయుమని పాదంబులబడి ప్రార్థించు చుండెను.

23. కం॥ శరణాగతుడగు శిష్యుని - కరుణామృత దృష్టిచాత గని మోదము – ముప్పిరిగొన మృదు వాక్యములను — పరమ దయాళుండు గురుడు – భక్తా వినుమనెనూ – సంశయమిక – భాధింపదనెనూ – పరిపూర్ణ మొకటి లేనెరుకానెదొకటి – పరిపూర్ణ మెరుకాలనెరిగీ యెరుకను మాను – భక్తా వినుమనెనూ – సంశయమిక–భాధింపదనెనూ॥ 23

తా॥ పాదంబులంబడి శిరసావందనము లర్పించుచున్న శిష్యుని గురువు జూచి, కరుణామృత దృష్టిని ప్రసరింప జేయుచు, అతిశయించుచున్న ఆనంద

ముతో మూడుపురులతో పెనబడిన త్రాడువలె దయ. కరుణ, ప్రేమ ఈ మూడు ఒక్కతూరి పెళ్ళుబికి అలింగనము జేసుకొని బిడ్డా! నీవు ఏ సంశయము లతో, బాధబడుచు నా దగ్గరకు వచ్చితివో ఆ సంశయము లన్నియు ఇక నిన్ను బాధింపనేరవు· తెలియ వలసిన దానిని ఏనాడు తెలుసుకొందువో ఆనాడే నీ సంశయము లన్నియు నిర్మూలమగును. తెలియవలసినది తెలియలేక యెన్ని తెలిసినను భ్రాంతులు, రహితము కానేరవు. ఈ జగత్తులో పరిశీలించవలసినవి ఉన్నవి రెండు వస్తువులు మాత్రమే కనబడుచుండును. మూడవది మాత్రం కన బడక యుండును. మూడవది యున్నదను వానికి వాని అజ్ఞానమే మూడవదిగా కనబడుచుండును. ఉన్న రెంటిని పరిశీలించి సత్యమైన పరిపూర్ణమును నిలుపు కొని లేని యెరుకను లేకుండా జేసుకొనిన ఇక ఏ భ్రాంతులు ఏ సంశయములు పుట్టకుండా పోవును.

24· కం॥ యేసాధన నీకెందుకు – వీసానికి బనికిరాదు వినుమా యయ్యా – నేసాధులచే విన్నది – యేసాధనలేని బోధ – నెరిగింతు పోకూ– సాధనలందు–మరిగితే రాకూ – యేసాధనల జోలియే నొల్లననీ నీవు – బాసాజేశితివేని పరిపూర్ణ బోధ నే – నెరింగింతు పోకూ – సాధనలందు మరిగితేరాకూ 24

తా॥ శిష్యా నేను నీకుతెలుప బోవు అచల పరిపూర్ణమును దర్శించుటకు ఏ సాధనలు చేయవలసిన పనివుండదు· చీకటిలో యున్న వస్తువును చూచుటకు నేత్రమునకు దీపము యొక్క సహాయము కావలయును· సూర్యుని జూచుటకు దీపము యొక్క సహాయముతో పనిలేనట్లుగా అచల పరిపూర్ణమును దర్శించు టకు ఏసాధనల సహాయముతో పనిలేకయుండును. లోకములో అష్టాంగయోగ ములు యెనుబది నాలుగు ఆసనములు నా నా విధములైన హఠయోగములు పంచముద్రలు మొదలగునవి యెన్నియున్నను నాగురుదేవుని చే నేనుపొంద బడిన అచల పరిపూర్ణ బోధముందు ఈ సాధన లన్నియు గడ్డి పోసకు గూడ పనికిరాక పోవును నీవుకూడ అ సాధనలు చేయనని ఆ సాధనలతో పనిలేదని బాసజేసి ఈ బోధ దగ్గరకు వచ్చితివేని ఆ పరిపూర్ణబోధ వివరించగలను ఆ బోధ నీకుపట్టగలదు లేదా! ఆసాధనలుమీద నీకు అపేక్షయుండి ఆసాధనలు విడువలేక యుంటివేని ఈ బోధ దగ్గరకు రాక యుండడమే మంచిది నీకు ముందుగా తెలుపుచున్నాను.

వివరము ;— అగ్నిహోత్రునికి ఆకలి అయినచో ఒకరు వండి పెట్ట వలసిన అవసరము లేదు. సూర్యుని జూచుటకు దీపము అవసరము లేదు. ముంజేతి కంకణము జూచుటకు అద్దము అవసరము లేదు. అట్లనే పరిపూర్ణ బోధను పొందేవానికి ఏకర్మలతో ఏసాధనములతో అవసరము లేదని అభి ప్రాయము.

25, కం॥ గురువర పరిపూర్ణంబన - నెరుకన నివిరెండుయెట్టి — వెరు కోద్భవ మెం - దెరుక జనుచోటు యెయ్యది — యెరుకనునే నెట్లవిడిచే — దెరుగించు మనెనూ - అట్లనె గురు డెరిగింతు ననెనూ - చరణాధూళిని రెండు-కరమూలగొని తన - శిరమూన ధరియించి శరణానియాశిష్యు - డెరిగించు మనెనూ - అట్లనె గురు - డెరిగింతుననెనూ ॥ 25

తా॥ ఓ సద్గురువర్యా :- నామనవి నాలకింపుడు మీరుతెలిపిన అంశ ములలో పరిపూర్ణ మొకటి అనియు లేనియెరుక ఒకటి అనియు రెండు గుర్తులను తెలవిచ్చితిరి. అందులో పరిపూర్ణమనగా నెట్టిదో అది యెక్కడ యున్నదో రెండవది అయిన యెరుక అనగా యెట్టిదో ఆ యెరుక యెక్కడపుట్టు చున్నదో తిరిగి యెక్కడ లయమగు చున్నదో ఆ యెరుకను నేను విడవడానికి యే మార్గమైనా యున్నదో లేదో తెలుపమని శిష్యుడు అడుగగా ఆ గురుమూర్తి మహా సంతోషంబున నీవుకోరినట్లు సర్వము నీకొఅకుగా తప్పక వివరించెదను. అని మాట ఇవ్వగానే శిష్యుడు ఆ గురుదేవుని రెండుపాదములు కౌగలించుకొని ఆ చరణ ధూళిని తన మస్తకముపై నిడుకొని నీవే శరణు శరణని స్తుతించుచు ఆవివరము అంతయు విశదముగా వివరించుమని అంజలిబద్ధుడై నిలచెను.

26. కం॥ మొదలచలము నెరిగించెద - విదితముగాలేని యెరుక వివరింతు పయిన్ - తుద కెరుకను విడిపించెద -మదిలో నామాటనమ్మి మరి వింటివేనీ - చంచలబుద్ధి - మానుంటివేని - పదుగూరు నినుజూచి భళి శాబా స్త్రోవ - కెదురూ లేదనెటట్టు - యిదుగో నేజేసేద - మరి వింటివేని - చంచలబుద్ధి - మానుంటివేనీ ॥ 26

తా॥ శిష్యా నేను నీకు మొదట తెలియజేయునది యెట్టిదనగా ఈసృష్టికి గాని ఈ సృష్టిని జేసిన బ్రహ్మమునకు గాని పూర్వమునే యున్నదియు ఏదాని సంబంధములేక సనాతనమైనదియు సర్వ వ్యాపకమై రూప, నామ క్రియా రహితమైన ఏ అచల పరిపూర్ణమున్నదో అట్టిదానిని జూపించెదను తరువాత

విశదముగా లేని ఎరుకనుగాని ఆ ఎరుక ఉత్పత్తి లయములనుగాని తెలియ పరచి ఎరుకను విడిచేపద్ధతిని గూడ వివరించెదను. ఇన్నిటికి ముందు నీకున్న చంచల బుద్ధిని లేకుండ జేసుకొని నామీదను నామాటమీదను నమ్మకము గలిగి నేను దెలుపు బోధను శ్రద్ధగావినుచు ఆ బోధ పద్ధతిలో నడుచుకొన గలిగితివేని పదుగురు నిన్నుగాని నీవుపొందిన బోధనుగాని మెచ్చుకొని శభాష్ అనేటట్లు జేసెదను.

వివరణ:- ఈ సనాతన మైన అచలమును గురించి కృష్ణ యజుర్వేద యోగ కుండలియందు.

శ్లో॥ "తతస్తిమిత గంభీరం నతేజోనతమ స్తతం
అనాఖ్యమనభివ్యక్తం సత్కించిదవ శిష్యతే"

తా॥ శిష్యా మాయా కార్యమైన సమస్త ద్వైతమును నిషేధింపగా శాంతముగా యుండునదియు, అవజ్ఞానసగోచరమైనదియు, తేజస్సుగానిదియు చీకటి గానిదియు, పరిపూర్ణమైనదియు, పేరులేనిదియు, స్పష్టపడనిదియు, ఇం ద్రియములకు విశదీకరించుటకు సాధ్యముకానిదియు, శూన్యముకానిదియు ఒకటి శేషించి యున్నదని తెలుపబడియున్నది.

27. కం॥ మీరంతవారు గనుకనె – చేరితి మీపాదశేవ సిద్ధించుటకై – యేరింతవారు జగమున - లేరని నామదికిదోచె - లెస్సాగ వినుడీ - ఆజ్ఞకు మీర – లేదు కనుగొనుడీ – యేరీతి వినుమంటె నారీతి వినియేద - మీ రానతివ్వండి తోరామౌ యీబోధ – లెస్సాగ వినుడీ – ఆజ్ఞకుమీర – లేదూ కనుగొనుడీ॥ 27

తా॥ గురుదేవా మీరు గొప్పవారనియు, అనుభవజ్ఞులనియు, మీవద్దకు చేరితిని. ఉన్నసత్యమును ఉన్నట్లుగా నిరూపించి లేని అసత్యమును లేనిది లేకుండా జేయుటలో సిద్ధపురుషులనియు ఆశ్రయించిన శిష్యులకు సంశయము లను తీర్చి నిస్సంశయులుగా చేయుసమర్థత మీవద్ద యున్నదనియు, మీ అంతటివారు ఈ లోకములో లేరని నామనస్సుకు బాగాతెలుసుకొని మీ పాదంబులను ఆశ్రయించితిని. ఇకనన్ను కడతేర్చు బాధ్యత మీదై యున్నందు వలన యేఆజ్ఞలోనన్ను నిలువమంటారో, యేరీతిగా నన్నునడుచుకొమ్మంటారో త్రికరణ శుద్ధిగా మీమాటను తప్పిపోక నడుచుకోగలను. అదిగాక ఈ బోధను

నేను మీవద్ద యే క్రమములో వినగలిగితే ఆబోధను అందుకోగలనో ఆ క్రమమును తెలిపిన యెడల తు. చ. తప్పకుండా చేసెదను. ఇక ఆబోధను యెరిగించేదానికి నామీద దయ జూపమని శిష్యుడు ప్రాధేయ పడసాగెను.

వివరణ;- మానవునకు దృశ్యాన్ని చూచే చూపేగాని దృశ్యానికి ఆవల యున్న సత్యాన్ని జూచె చూపులేదు. ఆచూపు సద్గురినివలననే లభించవలయును.

28. కం॥ మొద్దులనైనను దొల్తురు - బద్దుల బద్దత్వ మడవి పాల్జే తురు మీ - వద్దకివచ్చిన గని - పరి-శుద్ధపు బోధో క్తమైన సూక్తాలు గుప్పీ అందుకు తగిన - యుక్తాలుజెప్పీ - పెద్దాలచే మీ ప్రసిద్దీని వినివ స్తి-దిద్దూడి నే వట్టి బుద్దిహీనుడ నన్ను - సూక్తాలు గుప్పీ - అందుకు తగిన యుక్తాలు జెప్పీ॥ 7

తా॥ గురుదేవా! జన్మతో వచ్చిన ఈ ఉపాది దోషములను మార్పు చేయగల గొప్పతనము మీలో యుండినందువలన ఎంత మూఢులైన మిమ్ము ఆశ్రయించిన యెడల వడ్రంగివాడు ఒకమొద్దును తన నైపుణ్యముతో ఒక ఉపయోగమైన వస్తువుగా చేసినట్లుగను, ఒకశిల్పి ఒక కఠినమైన బండరాయిని సుందరమైన ప్రతిమగా మలచినట్లుగను, యెంత మందబుద్ది గలవారలనైనా, తీర్చి దిద్ది జ్ఞానోదయము కలిగించగలరు. అనాదిగా వచ్చుచున్న మూఢనమ్మకాలను బుద్ధిలో నిలుపుకొని ఆ నమ్మకాలకే బలి అయిపోతూ ఉన్నవారి అజ్ఞానమును యే మాత్రము లేకుండ పారదోలెదరు. మీవద్దకు వచ్చిన వారలకు పరిశుద్ధమైన పూర్ణబోధ బోధించుచు అందుకు కావలసిన ఉపమాన ఉపమేయములు సందర్భానుసారముగా బోధించుచు ఈ బోధను బుద్ధికి పట్టింప జేయగలరని పెద్దలవలన మీ గొప్ప తనమును వినగలిగి మీ సన్నిధానమునకు చేరుకొంటిని. బుద్ధిహీనుడనైన నన్ను జ్ఞానవంతునిగా చేయుభారము నీదేనని వినయ, విధేయాలతో శిష్యుడు ప్రార్థించెను.

వి॥ కొండకు గురిపెట్టిన బాణము తప్పిపోక కొండకు తగిలినట్లు పరిపూర్ణబోధను పొందవలయుననే దృష్టితో అచలగురువును ఆశ్రయించిన శిష్యునికి తనలో ఏర్పడిన శంఖలన్నియు ఏ ఒక్కటియు తప్పిపోక సర్వము రహిత పడునని భావము.

29. కం॥ సూటిగను బోధనామది - నాటినదిక వాలువాలునని నీకై నీ-నోట నీవుబల్కు దాకను - సాటువలను జెప్పచుందు-సరేనా నామాటా -

రాగోరూచు–మరి నేనీమాటా – నూటికొక్కటె శేలు మాటాని తెలియూము – మాటిమాటికి వట్టి పాటాలేమటికింక –సరే నా నామాటా –రాగోరూచు మరినేనీ మాటా॥ 8

తా॥ ఈ పరిపూర్ణ బోధను చాలా సూటిగా సూక్ష్మముగా వినుచుండ వలయును. ఈ బోధ నిరాధారమైన బోధ అగుటవలన ఈ బోధలో ఏ ఆధారాలుగాని, ఏ గుర్తులుగాని కనబడకయుండును. దృష్టిని భ్రూమధ్యమందునో, నాశికయందునో పెట్టి చూచుచుండిన యెడల ఏదైనా ఆధారములు, గుర్తులు కనబడుచుండునుగాని ఈ అచలబోధలో ఆ గుర్తులు ఏమియు గానబడక నిరామయ స్వరూపమే కానబడుచుండును. అట్టి నిరామయ స్వరూపమును గురు సౌజ్ఞతో, గురు మెలుకువతో సూక్ష్మముగా గ్రహించదగిన ఈ బోధను నేను తెలుపుచూ నీవు వినుచు యుండిన బహుకాలమునకుగాని ఈ బోధ రహస్యము సంపూర్ణముగా పట్టుకొనే నేర్పుకలుగదు. అంతవరకు ఈబోధ నీకు అతుకుట కొరకు ఎన్నో ఉపమానములైన దృష్టాంతములను, ద్రాష్టాంతకములను, సూక్తులను చెప్పుచుందును. నీ బుద్ధి ఈ బోధలో నిలుచుట కొఱకు నీకు సరిపోవు ఇతర కావ్యములలోయున్న కథలనుగూడ వల్లించుచుందును. ఇట్లు చెప్పగా, చెప్పగా ఆ అనుభవము నీ హృదయములో నిలబడి నేను చెప్పుచున్న పూర్ణబోధ నీ బుద్ధికి ఇప్పుడు సరిపోతూయున్నదని ఆ బోధ రహస్యము నీకు తెలియబడుచున్నదని నీకు నీవే నీ నోటనుండి పలికినంతవరకు నీ ప్రజ్ఞను గమనించుచు, నీ మాటను తీసుకొనుచు మరొకమాట తెలుపుచుందును. ఈ బోధలో నీకు చాలినంత అనుభవము కలిగేటందుకు అప్పుడప్పుడు ఈ బోధ మర్మములు తెలియపరచుచుందును. అంతటి అనుభవము కలిగిన వెనుక ఏ ఇతరములగు మాటలు నూరు మాటలకన్నను పరిపూర్ణ అనుభవములో తెలుపు మాట ఒక్కమాట చాలును. అట్టి అనుభవములేక ప్రయోజనము లేని మాటలతో, పాటలతో ఏ కొంచెమైనను ఉద్ధరింపబడలేవని పూర్తిగా నమ్మి యుండుము.

30. కం॥ తానేననకను నిండిన – దానికి పేరేమి బయలు — తానే ననుచున్ నేననియెద నేనెవ్వరు — లేనెరుకవు-వుంటి వుంటే – లేనేలేననుమీ అంటివి - అంటె - లేనేలేవు సుమీ – లేనేలేనని నేను లేకా పోయిన వెనుక-

తానుండుగద వుంటె - దాన్నెట్లెరిగెదవీవు – లేనేలేనను మీ – అంటిని
అంటె – లేనేలేవు సుమీ॥ 30

తా॥ శిష్యా నేను నీకు తెలుపబోవుచున్న యెరుక పరిపూర్ణముల గురించి ముందుగా ఆ రెంటి లక్షణములను గుర్తుచేయుచున్నాను. నేను నేను అనే భావన ఏదానిలోగలుగక తనను తాను గుర్తెరుగక తనలో పుట్టి పోవుచున్న సర్వజగత్తును గుర్తించక ఏ ఆకారములులేని నిరాకార స్వరూపముతో ఏ పరి పూర్ణము ఆది మధ్యాంతములు లేక సర్వత్రానిండి యున్నదో ఆ పరబయలే శాశ్వతము సత్యమునై విరాజిల్లుచున్నది. అది తప్పమరి ఏమి కనబడుటలేదు. అని నేను తెలుపుచుండిన యెడల సర్వోపాదులలో కనబడుచు ఆ ఉపాదు లలో నేను నేను అని పలుకుచు సర్వాన్ని గుర్తెరిగేది ఒకటి యున్నదిగదా! అది ఏమిటని తిరిగి నన్ను నీవు అడగవచ్చును. అదియే లేని యెరుక, ఆ యెరుక లేకనే యున్నట్లుగా తోపించుచు సర్వ వ్యవహారాలకు కారణ కర్తగా లేకనే యున్నట్లుగా కనబడుచున్నది. ఆ కనబడు దానిని నేను ప్రత్యక్షముగా కన్నులముందు చూస్తూ యున్నానని అది సత్యమేగదా! అని మరల నన్ను నీవు అడిగినను ఆ యెరుకను లేదనియే భావించవలయును. ఇట్లు యెరుక తనను తాను విచారించుకొని తానే లేక పోయిన యెడల ఇక యున్న పరిపూర్ణమే శేషించియుండును. ఆ యుండిన పరిపూర్ణమును వున్నదని తెలిపే దానికి యెరుక అచ్చట లేక పోవును.

31, కం॥ మీ రాజ్ఞయిచ్చివుంటిరి – నేరుపుతో బయలు నెరుక నెరి
గించిపయిన్ పేరణతు యెరుకనని యి – ట్లారీతిన యెరుక పరచు – మయ్యా
మ్రొక్కేనూ – అనుమానాము – జెయ్యాకియ్యేడనూ – సారెకు మీ పాద
జలజా యుగ్మము నా హృ – త్సారాసమున నిల్పి సల్పాచు పూజానో –
యయ్యామ్రొక్కేనూ – అనుమానాము జెయ్యాకియ్యేడనూ॥ 30

తా॥ స్వామి దీనశరణ్యా ముందు మీరు నాకు శెలవు ఇచ్చినట్లుగా ఏ చలనములేని పరిపూర్ణ మేదియో యెరిగించి తరువాత చలన రూపమైన ఎరుకను గూడ తెలియపరచి ఈ రెంటిని వేరు వేరుగా నిరూపించి లేని యెరుక ను లేకుండ దృఢము చేయుదునని ప్రతిజ్ఞజేసియుంటిరి. అదే ప్రకారము పరి పూర్ణమనెడు బట్ట బయలును నెరిగించి తరువాత లేని యెరుక యెట్టిదో దానిని తెలియపరచి ఆ లేని యెరుకను లేకుండ తీసివేసి ఏ సంశయములు కలుగక

నిస్సంశయునిగా జేసెదరని మీ పాదపద్మములను నా హృదయమందు నిలుపు కొని సదా నిన్నే ధ్యానించుచున్నాను. నా యందు నీకు ఏ అనుమానములు ఏ సంశయములు లేక నా మీద దయయుంచి నా పరితాపములు బాపుమని సాష్టాంగ దండప్రణామంబులు చేయుచున్న శిష్యుని గురువు కరుణారస వాక్యములతో ఇట్లు తెలుప నారంబించెను.

గురుశిష్యాన్యోన్యదర్శనము రెండవ అధ్యాయము సమాప్తము



## : 3. అచల లక్షణం 13. ;

32. కం॥ పుట్టుట గిట్టుట లేకను – పుట్టే గిట్టేటి యెరుక పోడి మెరుగ కన్ – చట్టువలె కదలకుండును – బట్టబయల్ యిట్టిదెరిగి – భావింపదగునూ యెరుకలేక సేవింపదగునూ – వట్టి యాశలవాత పట్టూబడకను యీ – గుట్టూ దేశికునోటగట్టిగ దెలుసూక-భావింపదగునూ–యెరుకలేక సేవింపదగునూ॥ 1

తా॥ శిష్యా! ముందు అచలమును గురించి ఎరుక పరతునని తెలిపియుంటిని. అదే ప్రకారము ఇప్పుడు అచలమును గురించి తెలుపుచున్నాను. చంచల బుద్ధిని విడచి మనసిచ్చి వినవలయును. సర్వలోకా లోకములన్నియు పుట్టుచు, గిట్టుచు నున్నను, నేది పుట్టుట, గిట్టుట లేక యున్నదో ఇట్లు పుట్టుచు, గిట్టుచు నున్న సకలలోకములను నేది ఏనాడు ఎరుగక యున్నదో ఈ బ్రహ్మాండ బాండము తెల్లయు వాటికవే చలించుచుండగా, నేది యే చలనము లేక నిశ్చలముగా చట్టువలె కదలక యున్నదో అట్టి దానినే బట్టబయలని భావించవలయును. అట్టి బట్ట బయలు దర్శించవలయునన ఎరుక లేకనే దర్శించవలయును గాని ఎరుకచేత దర్శింపనలవికాదు. ఇట్లు నేను తెలుపుచుండగా ఎరుక లేక దర్శించుట యెట్లు సాధ్యమగునని యందువేమో! ఎరుకకు యెరిగే లక్షణము యున్నందువలన యెప్పుడు ఈ ఎరుక యేదో ఒక రూపాన్ని యెరుగుచునే యుండవలయును. అట్లు యెరుగుచూ యున్నందువలన దీనికి ఎరుక అని పేరు కలిగినది. ఈ ఎరుక యెప్పుడు రూపాదులనే విషయించుచుండును. రూపాదులను విడచిపెట్టి ఇది యెప్పుడు ఉండనేరదు. కట్టె యున్నచోటనే అగ్ని ప్రకాశించుచుండును. కట్టెలేనిచోట అగ్ని నిర్వీర్యమై పోవుచుండును. అట్లనే-రూపం లేని పరిపూర్ణమును ఈ ఎరుక దర్శించపోయే సరికి అక్కడ రూపము లేనం

చున ఎరుక అక్కడ నిర్వీర్యమగుచున్నది. రూప మెప్పుడు లేదో యెరిగే పని ఈ ఎరుకకు లేక పోవుచున్నది. యెరిగేపని లేనప్పుడు ఎరుక అక్కడ యున్న దనుటకు ఆధారము లేకపోవును. ఒకవేళ ఎరుక అచ్చట యున్నదనిన ఉండి యేమి ఎరుగుచున్నదని ప్రశ్నింపబడును. అందువలన అచ్చట ఎరుక లేనందు వలన, ఎరుక లేకనే సేవించవలయునని తెలుపబడినది. ఎరుకచేత సేవించ డానికి సాధ్యంకాని భగవంతుని ఉత్త, ఉత్త ఆశలతో రూపాదులను కల్పించి స్త్రీ, పురుష బేదముల నారోపించి శివ, కేశవాది నామములను సృష్టించి నిజ మైన సత్యమును కనుగొనలేక జీవితమంతా వ్యర్థము జేసుకొనక ఈ గుట్టు నిజ మెరిగిన సద్గురువులచే తెలియవలెను.

33. కం॥ యెరుకైన రీతినుండును - యెరుగ నశక్యంబటంచు యెన్నిన యెరుకన్ - యెరుగుదుననినను యెరుకకె - యెరుగుట దుర్లభముసుమ్మి - యీ వృత్త బైలూ–యెరుగనె యెరుగ–దెరుకానీ బైలూ–పెరుగాదు విరుగాదు వొరు గాదు తరుగాదు అరుగాదు కరుగాదు తిరగాదు మొరుగాదు–యీ ఉత్త బైలూ యెరుగనె యెరుగ దెరుకానీ బైలూ॥ 2

తా॥ శిష్యా! ఈ ఎరుక అనేది సామాన్యమైనదికాదు. ఇది యెచ్చటనుండి వచ్చినదో, ఎచ్చటికి పోవుచున్నదో ఆధారమే దొరకదు. కాని ఈ యెరుకకు ఆధారమంటు ఒకటియుండిన యెడల దీనికంటె అధికమైనది మరొకటి కన బడక యుండును. ఈ ఎరుకను విచారించిన పెద్దలు, "వస్తుతో నాస్తియత్త త్వం" అని తెలిపినారు. ఇది ఒక వస్తువుగా మూలమంటూ లేక పోయినప్పటికీ సర్వశాస్త్రములలో అధిక్యత సంపాదించుకొని నేను యెరుగక యున్నది. యేది లేదనియు సకల లోకములను నేనే యెరుగుచున్నాననియు నేను యెరుగనిదికాని నాకు అశక్యమైనదికాని యేదియులేదని తనను తాను పొగుడుకొనుచు తనను తానే నిలబెట్టుకొను చుండును. ఇట్లు అనుకొనుచున్న ఎరుక ఒకనాడు బట్ట బయలును ఎరుగబొయ్యేటప్పటికి నిప్పులోబడిన చెదలులాగ తనకు తానే నిర్మూలమై తానే లేకపోవును. బట్టబయలుమాత్రం ఒకనాడు పెరుగక ఒకనాడు తరుగక ఒకనాడు వరుగక ఒకనాడు కరుగక సర్వకాలముల యందును ఒకే తీరుగా ఉన్నది వున్నట్లుగానే యుండును.

34. కం॥ పలుకున బలుకగ రాకను–తలపోయుద మనిన మదికి దగు లక యెపుడున్-మొలుగ్గచ్చ సందులేకను - కలిగున్నది బట్టబయలు – గదరా

మాయన్నా-యిదిగో చూడు-కదులాదో యన్నా-పలుకన్న బలుకాక తలపన్న దెరుగాక-చలి యెండ వానాల నలయాక నిలచుండు గదరా మాయన్నా-ఇదిగో చూడు-కదులాదోయన్నా॥ 3

తా. శిష్యా! లోకములోయున్న ప్రతి వస్తువుకు ఒక రూపము, నామము యుండుట వలన ఆ వస్తువును ఇట్టిదనియు, అట్టిదనియు పలుకుటకు నోటి నుండి మాటవచ్చుచుండును. అదియుగాక రూపము లేని ఆకాశ వాయువులను గూడ వాటి ఉనికిని తెలుసుకొని ఈ నోటితో ఇట్లు ఉన్నవని తెలుపవచ్చును. ఆ బట్టబయలును మాత్రము ఇట్టిదని మాటలతో వివరించుటకుగాని మనసుతో నూహించుటకుగాని సాధ్యపడక యుండును. ఇట్లు సాధ్యపడని పరిపూర్ణము, గురుకృప గలిగిన మనుక్షణమే ములుగృచ్ఛ, సంధులేక అంతా తానుగానే తన కంటె రెండవది లేక వ్యాపించియుండును. ఇట్లు కనబడుచున్న ఆ బట్టబయలు తాను మాత్రం ఏ పలుకులు పలుకక ఏ తలంపులను యెరుగక యెంతటి చలి ఎండ, వానలకు గూడ బాధింపబడక, ఏ ఉపద్రవములకు జడియక కనబడు చుండును.

35. కం॥ సామర్థ్య మేమిజూపదు - కామ క్రోధాదికముల గలయద నిశమే-బాములెరుంగదు-యితరులు-యేమనినను మారుబల్కా దీ బట్టబై లూ-దీనికి మ్రొక్కే-రితరా జేజేలూ- నామ రూపక్రియ నటనాలన్నియు మీరి-యే మాని యనరాక-యేకామై యున్నాది-యీ బట్టబైలూ - దీనికి మ్రొక్కే-రితరా జేజేలూ॥ 4

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణము ఏ సామర్థ్యములు జూపునదిగాదు. ఈ బయలులో ఏ సామర్థ్యములు లేక పోవుటవలన "తదేవం, నిష్కళం. బ్రహ్మనిర్వికల్పం, నిరంజనమ్" ఏ కలంకములు కలుగనిది యే వికల్పములు యుండనిది. ఏ రంజనములేనిది, ద్వైవస్వరూపమని అమృతబిందూపనిషత్ తెలుపుచున్నది.

అన్ని సామర్థ్యములు యెరుకచేతనే జరుగుచున్నవి. హరి హరాదులు ఎరుక సామార్థ్యము చేతనే సృష్టి స్థితిలయములను కూర్చుచున్నారు. సూర్య చంద్రాదులు ఎరుక సామర్థ్యము చేతనే వారి ధర్మములు సలుపుచున్నారు. పంచభూతములు ఎరుక సామార్థ్యముచేతనే వాటిక్రియలు జరుపుచున్నవి. దేహాదులుకాని, ఇంద్రియాలుకాని ఎరుక సామార్థ్యముచేతనే ఆయా పనులు నెరవేర్చ

కొనుచున్నవి. బట్టబయలుమాత్రం యే సామర్థ్యములు జూపక కామ క్రోధాదుల వలన కలుషితముగాక ఈ లోకమందుగల సకల భూత గణంబులు తనలో యున్నవనిగాని, లేవనిగాని తలంచక ఇతరులు దూషించినా. పూజించినా, యే దానిని ఎరుగక రూప నామాదులను దాల్చక జగన్నాటకములో తాను పాత్రధారిగాక, యేకాలమందును నాశనములేక ఏక స్వరూపంబుగా స్వతఃస్సిద్ధంగా ఈ బట్టబయలు యుండుటవలన ఈ బట్టబయలుకే సర్వదేవతలు నమస్కరించుచున్నారు.

36. కం॥ దానము దర్మము సగుణ-ధ్యానము ప్రతిమార్చనంబు తజ్జప
తీర్థ-స్నానములివి ముక్తిదమని-మానవు లొనరించ బయలు మాటాడదేమీ -
యెరుకేలేదు - మాటాడెదేమీ - ఔనూ కాదనకా నీవనక నేననకొక్క-మేనైన
తాగాక మితిమీరి యున్నాది-మాటాడదేమీ-యెరుకేలేదు మాటాడెదేమీ॥ 5

తా॥ శిష్యా! లోకములో మోక్షము కలుగుననియో, పుణ్యము కలుగుననియో, ఈ మానవులు బంగారమును, భూమిని, గోవులను, వస్త్రములను, అన్నమును, నీళ్లను, దానము జేయుచుందురు. అధితి అభ్యాగతులకు ధర్మములు చేయుచుందురు. ప్రతిమలను అర్చించుట, పూజించుట, మంత్రోపాసనాది జపములు చేయుట, అష్టోత్తరాదులు చెప్పుకొనుట, తీర్థయాత్రలకు తిరుగుట నదీనదములలో స్నానము చేయుట చాంద్రాయ - ణాది వ్రతములు సలుపుట, మొదలగు సగుణ కర్మలు ఈ జనులు చేయుచుండినను ఈ బట్టబయలు అవుననిగాని, కాదనిగాని ఏమియు అనడములేదు. యెందువలన అనగా ఆ పరిపూర్ణములో ఎరిగే దానికి యెరుక లేక యుండుట వలన యేమియు యెరుగక యున్నది. దేహము యున్న దగ్గరే యెరుక యుండునుగాని దేహములేనిదగ్గర యెరుక యుండదు. గనుక అట్టి దేహాదులతోగూడిన స్థూల సూక్ష్మకారణ మహాకారణమను దేహాదులు ఈ పరిపూర్ణములో తెలియబడక యేక స్వరూపముగాయుండి నిర్ణయించుటకు నలవిగాని నిరావరణమై ఈ బట్టబయలు కనబడుచుండును.

37. కం॥ ఇంతంతని యనరానిది-వింతలు శాయనిది-యన్ని విధముల
గనినన్-చింతతెరుంగని దీబయ-లెంతని వినిపింతునేనీ కేమిరపృథుకా-తెల్పుట
మినుట-మిక పెద్దకథగా -సంతాతమొకరీతి సకలాదేశములాయం - దంతాట
నిండున్న దదుగో పరిపూర్ణాము - యేమిరపృథుకా - తెల్పుట మినుట-మిక
పెద్దకథకా॥ 6

తా॥ శిష్యా! పంచతన్మాత్రలతో కూడిన సమస్తమైన వస్తురూపాదులను గురించి ఇంతది అంతది అని తెలుపవచ్చును. గాని పంచతన్మాత్ర రహితమైన ఈ బట్టబయలునుమాత్రం ఇంతది అంతది అని నిర్ణయించి చెప్పుటకు సాధ్యము గాక యుండును. ఈ బట్టబయలులో ఏ సంకల్పములు, వికల్పములు లేనందు వలన తనను తాను ఎరుగక తనకు వేరుగాయున్న ప్రపంచమును ఎరుగక తనకు తానుగానే నిర్మలముగా యుండును. ఈ పరిపూర్ణమును గురించి ఎన్నివిధముల ఆలోచించినను దీనిలో ఏ క్రియ లేనందున ఏ కార్యములు చేయక, చేయించక ఉన్నది యున్నట్లుగా సూక్ష్మముకంటే అతి సూక్ష్మముగాను, మహత్తు కంటే మహత్తుగాను, గంభీరముగాను కనబడుచు సమస్త దేశముల యందును సమస్త కాలములయందును, సమస్త వస్తువుల యందును నిండి వెలితి లేనిదై భూత, భవిష్యత్ వర్తమాన కాలములయందు ఒకేరీతిగా గోచరించుచుండును. అట్టి పరిపూర్ణమందు ఏ చిత్ర విచిత్రములు ఏ కల్పనలు ప్రేకపోవుట వలన ఆ దేవ మార్గమును గురించి యేమని వర్ణించగలను, యెట్టిదని ఆరోపణ చేయగలను, ఎంతని తెలుపగలనని నా భావనలో కలుగుచున్నది.

38. కం॥ ఆకాశాదికభూతా-నీకాత్మక మగుచు యెరుక ఈ జగమయ్యెన్ రాకడ పోకడ దీనికి ప్రాకటముగ దేనిలోనో -బట్టాబయలదిరా-కాదని యంటె వట్టిపల్కిదిరా-లోకత్రయము తనలోపాల తిరుగాక-జోకాతోడుత దాని జోలె రుగ నిదియేదో-బట్టాబయలదిరా-కాదనియంటె-వట్టిపల్కిదిగా॥ 7

38. తా॥ శిష్యా! ఆకాశము, వాయువు. అగ్ని, జలము. పృథివి, అను పంచభూతములున్నూ మహదాదులనబడు అవ్యక్తము, మహత్తు, అహంకారము పంచతన్మాత్రలున్నూ ఇవి అన్నియు ఏచోట ఒకకూడిక అగుచున్నవో ఆచోటనే ఎరుక దేహములు కలుగుచున్నవి. ఆ కలిగిన ఎరుక దేహాదులే, సర్వజగత్తు అగుచున్నది. ఈ జగత్తుయొక్క రాక పోకడలన్నియు నిలకడ లేక ఏ దానిలో తిరుగుచున్నవో అదే బట్టబయలని యెరుగుము. అట్లుగాక జగత్తుయొక్క రాక పోకడలెల్లయు పరిపూర్ణములో జరగడము లేదని ఎవరైన అనిన యెడల ఆ మాటలు అనుభవములేని మాటలని తలంచుము పంచభూతములలో కూడిన లోకంబులు మూడును, ఆ బట్టబయలందు వస్తూ పోతూ యున్నను ఆ లోక ములయొక్క ప్రశక్తి యేనాడు ఆ పరిపూర్ణమునకు తెలియబడక యుండునని గట్టిగా నిర్ణయించుకొనుము.

39. కం॥ తండోప తండములుగా-దండి ఝుషాదికములన్ని తనలోపల ను-ద్దండత నుండిన పోయిన-నుండు సముద్రంబుయరుగా-కుండా నెప్పటికీ పరిపూర్ణమి-ట్లుండూ నెప్పటికీ - యండా మావుల రీతి నుండేటీ బ్రహ్మాండ - ముండిన పోయిన రెండూ గుర్తెరుగానిదుండూ - నెప్పటికీ - పరిపూర్ణమి - ట్లుండూ నెప్పటికీ॥ 8

తా॥ శిష్యా! సముద్రములో లెక్కించుటకు సాధ్యముకాని అసంఖ్యాకములైన చేపలు. తాబేళ్లు, మొసళ్లు, తిమింగలాలు మొదలగు అనేకములగు జలచరములు అందులో పుట్టుచున్నను అందులో పెరుగుచున్నను, అందులో నశించుచున్నను ఆ జలచరముల విషయము ఆ సముద్రమునకు యెట్లు తెలియబడక యున్నదో! అట్లనే ఈ పరిపూర్ణమునందు గూడ ఎన్నో కోటాను కోట్లు అనేక విధములైన జీవులు పుట్టుచుండిన, పెరుగుచుండినా, మరణించు చుండినా, ఆ పరిపూర్ణమునకు యే మాత్రము తెలియబడక, తనకేమి సంబంధము లేక యుండును. ఎండమావులతో సమానమైన ఈ బ్రహ్మాండ భాండములెల్లయు, అంతలో కనబడుచు, అంతలో మాయమగుచున్నను ఈ ప్రపంచము వున్నదని కాని, లేదనిగాని తలంచక తనకు తానుగానే ఏకమై ఆద్యాంత రహితమై యుండునది ఆ అచలపరిపూర్ణ మొక్కటియేనని భావింపుము.

40. కం॥ యెరుకతొ వచ్చిన విశ్వము - యెరుకతొ జనుగాని నిల్వదీ బయలైతే-యెరుకతొ రా దెరుకతొబో దెరుక తనందేమిలేదు -యిది నిశ్చయమురా-వుండుంటె యీ - యెరుకె తానౌరా - యెరుకా యెరిగినవస్తు వెరుకాని తెలియూము-యెరుకా యెరుగదు బయలు నిట్టిదట్టిదియన-నీది నిశ్చయమురా వుండుంటె యీ యెరుకేతానౌరా॥ 9

తా॥ శిష్యా! అనేక రూపములతో చిత్ర, విచిత్రములుగా కనబడుచున్న ఈ జగత్తు అంతయు ఎరుకతోనే పుట్టుచున్నది. ఎరుకతోనే యుంటూ యున్నది. ఎరుక పోవునప్పటికి ఈ జగత్తుకూడ ఎరుకతోనే పోవుచున్నది. పరిపూర్ణము మాత్రము ఎరుకతో వచ్చినదికాదు. ఎరుకతో వుండేదికాదు. ఎరుకతో పొయ్యేదికాదు. ఎరుకకు, పరిపూర్ణమునకు యేలాటి సంబంధము లేదని నిశ్చయించుకొనుము. ఈ ఎరుక ఆ పరిపూర్ణములో ఏ కొంతసేపు కూడ యుండేటందుకు నిలకడలేక చలనముతో కూడి వచ్చుచు, పోవుచుండును. పరి

పూర్ణము మాత్రము యెల్లకాలముల యందును చలించక ఒకే విధముగా యుం డును. అట్లు పరిపూర్ణమువలె ఈ ఎరుకగూడ కదలక యుండిన యెడల ఈ ఎరుకనే పరిపూర్ణమని చెప్పవచ్చును. అట్లు కదలకయుండె స్థిమితము ఎప్పుడు ఈ ఎరుకకు యుండబోదు? ఈ ఎరుక ఆ పరిపూర్ణము కాబోదు? ఎరుకజేసిన రూప, నామాదులనే ఈ ఎరుక యెరుగుచుండునుకాని పరిపూర్ణమును మాత్రం ఈ ఎరుక యెరుగలేదు· ఇట్టిది, అట్టిది అని చెప్పనూలేదు.

వి॥ గర్భిణీ స్త్రీ తన గర్భమునందున్న శిశువును తాను యెట్లు పోషించు కొనుచు యున్నదో, ఈ ఎరుకకూడ తాను జేసిన కల్పనలు మాత్రమే తాను పోషించు కొనుచుండును.

41. కం॥ రవి తమసమున్న దెరుగునె – ప్రవిమల దావాగ్ని చదలు బట్టుటెరుగునా–దివమును రాతిరి రాత్రిని – దివ మెరుగునె లేమి – లక్ష్మీదేవీ యెరుగునా – అన్నమునూ భూదేవి యరుగునా – భవనాశ స్థితులురా పాడేటి యెరుకాను–భవనాశస్థితిలేని బయలట్లెరుగదు – లక్ష్మిదేవీ యరుగునా – అన్న మునూ భూ–దేవీ యరుగునా॥ 10

తా॥ శిష్యా! చీకటి యెట్లున్నదో సూర్యునకు తెలియనట్లుగా భగ, భగ, మండుచున్న అగ్నిని చదలు పట్టుకోలేక యున్నట్లుగా రాత్రి యెట్లున్నదో పగలు యెరుగనట్లుగా ధరిద్ర, బాధలను లక్ష్మీదేవి యెరుగనియట్లుగా భూమి మీద పండుచున్న అన్నమును భూమికి తెలియబడనట్లుగా చావు, పుట్టుకలతో వర్తించుచు అనేక మార్పులతోగూడి వచ్చుచూ· పోవుచున్న ఎరుక విషయము గూడ చావు, పుట్టుకలులేని బట్టబయలుకు ఏ మాత్రం తెలియబడక యుండును

వి॥ గొడ్రాలి – కొడుకుకు తన తల్లి యెవరో తెలియబడక యున్నట్లుగా గొడ్రాలు తన పుత్రుడెవడో చూడలేని యట్లుగా ఈ ఎరుక యున్నదని కాని, లేదనికాని పరిపూర్ణమునకు తెలియబడక యుండును.

42· కం॥ యెరుకైన భూతపంచక – మెరుకకు చరణములు కటియు హృదయము గళమున్–శిరమును నయ్యెను క్రమమున – ధరణి మొదల్ జేసి యిట్లు–తనయా గుర్తెరుగూ–గగనము బయలం–చనరాదీమరుగూ-యెరుగా కా కాశామె పరిపూర్ణమనుచు కొందరు బల్కిరిది విని గురిదప్పియుండేవు-తనయా గుర్తెరుగూ–గగనము బయలం–చనరాదీమరుగూ॥ 11

తా॥ శిష్యా! ఈ కనబడు రూపాదులను గురించి విచారించిన యెడల యెరుకే సర్వమునకు ఆధారముగాయుండి ఈ యెరుక చేతనే పంచ భూతము లేర్పడి, ఆ పంచభూతములవలన సమస్త రూపాదులు ఏర్పడుచున్నవి. పంచ భూతముల కూడికయే ఈ దేహాదులని తెలియవలెను. పంచభూతములు లేని చోట దేహాదులు కనబడవు. పంచభూతములే దేహము. దేహమే పంచభూత ములుగా నుండును. (అనగా) మట్టేకుండలుగాను, కుండలే మట్టిగానుండును. ఈ దేహసంపదంతా పంచభూతములే అయినందున ఆకాశభూతముచే జ్ఞానము, చెవులు, నోరు ఏర్పడుచున్నవి. వాయు భూతముచే మనస్సు, చర్మము చేతులు ఏర్పడుచున్నవి. అగ్ని భూతముచే బుద్ధి, నేత్రములు, పాదములు యేర్పడు చున్నవి. జలభూతముచే ప్రాణము, నాలుక, శిశ్నము ఏర్పడుచున్నవి. భూ, భూతముచే అహంకారము, ముక్కులు, గుదస్థానము ఏర్పడుచున్నవి. యిట్లు ఈ దేహముయొక్క ఆపాదమస్తకము అంతయు పరిశీలించిన, కాళ్లు భాగ మంతయు పృథ్వీ అంశమనియు, గుహ్యభాగమంతయు జలము అంశమనియు, కటి భాగమంతయు అగ్ని అంశమనియు, కంఠ భాగమంతయు వాయువు అంశమనియు, శిరస్సు భాగమంతయు ఆకాశము అంశమనియు తెలియ బడు చుండును. ఇట్లు పంచభూతాకృతివలన ప్రపంచమంతయు నేర్పడినది. ఈ పంచభూతములలో ఒక్కటైన ఆకాశమునే కొంతమంది పరిపూర్ణమని తెలుపు చుందురు. ఆకాశము శబ్దగుణము గలిగియున్నది. పరిపూర్ణము శబ్దము లేక యున్నది. ఈ రెంటికి పొత్తును కలిపి ఒక్కటేనని తెలుపుట అనుభవములేని మాటలేగాని వాస్తవముగాదు. అట్టి మాటలు నీవు నిజమని తలంచబోకుము.

43. కం॥ విత్తే చెట్టైపుట్టును-విత్తే విత్తనము రీతి వెలయును ధరపై- విత్తుకు చెట్టుకు వేరే-విత్తన మొకటున్నదనిన వినగూడదో యీ - తనకు దా బుట్టును వినవోయీ-విత్తూ చెట్టుల రెంటి విధమీ భూమెరుగా న-ట్లు త్రాబయ లెరుగాదు-సత్తూ విత్తుల రెంట్ని – వినగూడదో యీ-తనకుదా –బుట్టును విన వోయి॥ 12

తా॥ శిష్యా! లోకములో చెట్టుముందా విత్తుముందా అని వాక్ వాదములు వేయు చుందురు. ఆ వాదనలకు అదియే మాత్రము బయటపడదు. అది బయట పడవలయుననిన చెట్టుగాని, విత్తుగాని కనుపించని ప్రళయ కాలములోనికి బుద్ధిని యెవరు పంపుదురో అట్టివారికి యేది ముందా అని

స్పష్టమగును. అట్లుగాక భూమిమీదనే జూచిన చెట్టేవిత్తుగా బుట్టుచున్నది. విత్తే చెట్టుగా బుట్టుచున్నది. ఈ విత్తు చెట్టులకు ఇంకొక వేరే విత్తనము, ఒక టున్నదనిన ఆ మాటలు వినగూడదు. వాటికవియే ఒక దానితో నొకటి పుట్టు చున్నవి. ఇట్లు కనబడు విత్తు చెట్టులకు ఒక భూమి ఆధారముగా కనబడు చున్నది. అ భూమియే లేకబోయిన విత్తుగాని, చెట్టుగాని కనబడక యుండును. విత్తు చెట్టులకు భూమియే ఆధారముగా యుండిననూ ఆ విత్తు చెట్టుల రెంటిని ఆ భూమియెన్నడు యెరుగని విధముగా ఈ బట్టబయలుగూడ తనలో యున్న ప్రకృతి పురుషులనుగాని ఆత్మానాత్మలనియెడు జీవ తనువులనుగాని ఏ నాడు యెరుగక యుండును.

41. కం॥ చెట్టేమూలము విత్తుకు–చెట్టుకు మూలంబు విత్తు క్షితిపైరెండున్ పుట్టిన వచ్చిన రెంటిని–గట్టిగ తానెరుగకుండు – గదరా యానేలా –నీవీరీతి–గనుగొనవేలా - పుట్టూచు గిట్టూచు పొలుపొందు తనువెరుక-లిట్టి విచిత్రాము లెన్నా డెరుగదు బయలు–గదరా యానేలా–నీవీరీతి కనుగొనవేలా॥ 13

శిష్యా! చెట్టుకు మూలము విత్తనము, విత్తనమునకు మూలము చెట్టుగా యుండి ఈ విత్తు చెట్టులు రెండును ఒకదాని నొకటి పోషించుకొనుచు, మహారణ్యముగా ఈ భూమిని ఆధారము జేసుకొని యుండినను, ఆ చెట్టునుగాని, విత్తనములనుగాని అవి యున్నవని పోయినవని ఆ భూమికి యెట్లు తెలియ బడక యున్నదో, అట్లనే ఈ తనువు ఎరుకలు రెండు ఒకదాని నొకటి పోషించు కొనుచు ఈ తను వెరుకలే బ్రహ్మాండ బాండములుగా సకల చరా, చర ప్రపంచముగా కనబడుచు ఈ పరిపూర్ణమును నాధారముగా జేసుకొని వస్తూ పోతూ యున్నను ఈ తనువెరుకలనుగాని, ఈ తనువెరుకలతో నేర్పడిన ప్రపంచ మునుగాని ఈ బట్టబయలు యెన్నడు ఉన్నదనిగాని, లేదనిగాని యెరుగకనే యుండును.

వి॥ చెట్టునందు పుట్టిన నిప్పు, చెట్టు వున్నంతసేపు చెట్టును ఆశ్రయించు కొని చెట్టునందే మండుచు తుదకు ఆ చెట్టును కాల్చివేసి ఆ చెట్టుతోగూడ తానూ నశించునట్లు విక్షేపరూపమైన ఈ ఎరుక దేహములతోగూడ బుట్టి దేహములో వ్యవహరించుచు దేహముతోగూడ తాను రహితమగు చుండును.

అచల లక్షణం మూడవ అధ్యాయం సమాప్తము.



## : 4. యెరుక లక్షణం॥ 20 ;

45. కం॥ యెరుకే దేహేంద్రియములు–యెరుకేవర్ణాశ్రమములు యెరుకే శృతులున్–యెరుకే నీవును నేనును–యెరుకే సతి సోదరాదులెరుగుము వత్సా–నేదీర్చెద–నిదుగోనీయిచ్చా–హరిహరబ్రహ్మాది సురనరగిరిసరి–తరుమృగముఖ చరాచరమూలు యెరుకాని–యెరుగుమువత్సా–నేదీర్చెద–నిదుగోనీయిచ్చా॥ 1

తా॥ శిష్యా! ఇప్పటి వరకు పరిపూర్ణమును గురించి తెలిపి యుంటిని. ఇక ఎరుకను గురించి చెప్పబోవుచున్నాను. ఈ ఎరుక ఒక పరిపూర్ణములోతప్ప ఇక ఎచ్చట జూచినా ఈ ఎరుక చేసిన కల్పనలే కనబడుచుండును. అందువల ననే ఈ ఎరుకను సృష్టికర్త అనియు బ్రహ్మమనియు శ్రుతులు తెలుపుచున్నవి. ఈ ఎరుకచేతనే దేహాదులుగాని, ఇంద్రియాదులుగాని సృష్టింపబడుచున్నవి. ఈ ఎరుకచేతనే హరిహర బ్రహ్మాది దేవతలుగాని, నరులుగాని, గిరులుగాని, మృగములుగాని, పక్షులుగాని, స్థావర జంగమాదులతో గూడిన సకల చరా, చరములన్నియు ఈ ఎరుకచేతనే కల్గుచున్నవి. ఈ ఎరుకే సర్వశాస్త్రములన్నిటిని కల్పింప జేసినది. ఈ ఎరుకే చాతుర్వర్ణములను నియమించు కొన్నది. నీవనియు, నేననియు, భార్యయనియు, బిడ్డలనియు, సోదరులనియు, ఈ ఎరుకే గుర్తులు పెట్టుకొని ఈ ఎరుకే అన్నిటియందును కలిగియున్నదని నిశ్చయించు కొని యుండుము. ఆ తరువాత ఎరుక వివరమంతయు నీకు సంశయము లేక విశదముగా తెలుపగలను.

46. కం॥ యెరుకే విద్యావిద్యలు–యెరుకే ప్రణవంబు నాద మెరుకే కళయున్–యెరుకే బిందువు చిత్ప–త్తెరుకే ఆనందమివినీ వెరుగూసద్బుద్ధీ–నీ నామాట–లెరుకేనిబద్ధీ -యెరుకేనిర్గుణసగుణాలెరుకే యెరుకకుయంత–ఎరుకోనేనిది యంత యెరుకా జేసితినీవిట్లెరుగూ సద్బుద్ధీ–నీ నామాట-లెరుకేనిబద్ధీ॥ 2

తా॥ శిష్యా! ఎరుకచేతనే సర్వము కూర్చబడి యుండుట వలన. ఎరుకగానిది ఈ సృష్టిలో యేది లేనందువలన విద్య అనెడు ఆత్మగాని, అవిద్య అనెడు దేహముగాని ఈఎరుకె కల్పింపజేసినది. ప్రణవనాదముకూడ ఎరుకయే ప్రణవ నాదమనగా ఓంకారము. ఓంకారము సృష్టికర్తకు ప్రతిగా నేర్పడిన ఒక శబ్ద వాచకము. ఇదియు నెరుకయేగాని మరియొకటి గానేరదు. భ్రూమధ్యమందు కనిపించు పరంజ్యోతియు ఎరుకే అగుచున్నది. ముక్కురంధ్రముద్వారా వచ్చుచు.

పోవుచున్న శ్వాస. నిస్వాసములను క్రమబద్ధంచేసి మనస్సుకు కొంతకాలము సంకల్ప రాహిత్యము చేసినదికూడ యెరుకే అగుచున్నది. సత్తు అనే ఈశ్వర చైతన్యముగాని, చిత్తు అనే వ్యాప్తిజెందిన జగత్తుగాని, ఆనంద స్వరూపమైన బ్రహ్మముగాని క్రియాశక్తితో గూడుకొని కదలిక గలిగిన సర్వమంతయు, ఎరుకేనని తలంచవలయును. సంకల్పము జనించక యుండినప్పుడు నిర్గుణ బ్రహ్మమనియు, సంకల్పము జనించునపుడు సగుణ బ్రహ్మమనియు, ఈ ఎరుకే ద్వందస్థితులు కలిగియున్నది. నీ మాటగాని, నామాటగాని ఎరుకతోగూడి, ఎరుకతోనే మాట్లాడడము జరుగుచున్నది. ఇవి అన్నియు ఒక్క యెరుకతోనే జరుగు చున్నందువలన ఈ యదార్థమును విచక్షణమైన సూక్ష్మ బుద్ధితో గ్రహించవలయును

47. కం॥ యెరుకే ఇహపరసౌఖ్యము – లెరుకే జ్ఞానంబు జ్ఞేయమెరుకే మోక్షం-బెరుకే భక్తివిరక్తులు-యెరుకే సంకల్పమని నీవెరుగూసత్కీర్తి-ఎక్కడికౌర-యెరుకా సంపూర్తి-యెరుకే జీవుండీశుడెరుకెతదేకత-యెరుకేసర్వమునే గుర్తెరిగీ చెప్పితి యీకీ-లెరుగూసత్కీర్తి-యెక్కడికౌర-యెరుకాసంపూర్తి॥ 3

తా॥ శిష్యా! మందమతులగు వారికి రూప నామాదులుగా కనబడుచు, ఇహములో సౌఖ్యమునిచ్చేది ఈ ఎరుకే. బుద్ధిమంతులగు వారికి రూప, నామ రహితమైన పరసౌఖ్యము నిచ్చేది ఈ ఎరుకే. జ్ఞానము, జ్ఞాత, జ్ఞేయము అను త్రిపుటులుగా యున్నది ఈ ఎరుకే. "మోహక్షయే మోక్షః" అన్నట్లు మోహములను క్షయము జేసుకొని మోక్షరూపిణి అయ్యేది ఈ ఎరుకే. ద్వైవము ఒకటి వున్నదనియు, భక్తితో యుండేది యీ ఎరుకే లేదని విరక్తితో యుండేది ఈ ఎరుకే. అనేక సంకల్పములతో కూడియుండేది ఈ ఎరుకే, ఏ సంకల్పములు లేక తదేకతతో యుండునది ఈ ఎరుకే. జీవుడనబడునది ఈఎరుకే. ఈశ్వరుడనబడినది ఈ ఏరుకే. ఇట్లు జగత్తు సర్వము ఎరుకే. విస్తరించి యుండగా అట్టిదానిని యెంతని తెలుపగలను. ఎక్కడికి సంపూర్తి చేయగలను. సర్వము ఎరుక పరివర్తనమేనని నేను యెరిగి ఈ రహస్యమును నీకు తెలుపుచున్నాను. దీనిని నీవు విచారించి సుగుణవంతుడవై కీర్తితో విలసిల్లవలెనని కోరుచున్నాను.

48. కం॥ చింతలతోటన నెరుక్కే–చింతల పుట్టిల్లనంగ వెలశిన దెరుకె-తంతులపేటన యెరుకె-పంతములకుచూడ -మూల బలమన్న నెరుకె-జగజ్జనన స్థలమన్న నెరుకే - భ్రాంతూల కెల్లాను పట్టాణమనజెల్లి – కాంతాది రూపూలు గల్పించుటకు – మూల-బలమన్న నెరుకే-జగజ్జననస్థలమన్న నెరుకే॥ 4

తా॥ శిష్యా! ఒక సమర్ధవంతమైన ఫలితాన్ని ఇచ్చే తోట అనేక విధము లైన దుంపలను వివిధములైన ఆకు కూరలును, రకరకములైన కూరగాయలు పండుటకు యెట్లు ఆధారమై యున్నదో, ఆ తీరుగనే ఈ ఎరుక వింత, వింతలైన ఆలోచనలకు ఎడతెగని సమస్యలకు పుట్టినిల్లుగా యున్నది. ఈ ఎరుకె కుట్రలకు, కుతంత్రాలకు, మోసాలకు, మానాభి మానములకు ఒక పేటగా యున్నది. ఈ ఎరుకె అనేక విధములయిన పంతాలకు, మంతనాలకు అహంకార, మమకారములుగా వర్తించుటకు మూల బలమైనదిగా యున్నది ఈ ఎరుకె. అనేక విధములైన భయములకు, భ్రాంతులకు, బాధలకు ఒక పట్ట ణముగా విలసిల్లుచున్నది ఈ ఎరుకె. సమస్త జీవులకు స్త్రీ రూపములు పురుష రూపములు కలిగించు సాటిలేని మేటిగాయున్నది ఈ ఎరుకె. ముగ్గురుమూర్తు లకు తల్లియైన జగన్మాతగాయున్నది ఈ ఎరుకె. ఇట్లు సర్వప్రపంచమంతయు తానుగాను తానే సర్వప్రపంచముగాను యున్నదని తెలియవలెను.

49. కం॥ అన్నియు తానై తన కవి–పన్నుగ వేరనుచు నోటబలుకుచు మరి తా – నన్నిటి నెరిగే యెరుకై – యున్నానని యెరుకే యెరుక నూహింపు చుండూ–తనలో తానే–మోహింపుచుండూ – యెన్నో విచిత్రా లీయెరుకాశాతలు వింటె - వున్నాదిలేదు లేకున్నాది కలదాని – వూహింపుచుండూ – తనలో తానే మోహింపుచుండూ॥ 5

తా॥ శిష్యా! ఎరుక సామర్థ్యము వలననే దేహాత్మలు రెండు యేర్పడి ఆ రెండు దేహాత్మలు కలసి సర్వ ప్రపంచముగా కనిపించు చున్నది. యెరుక చేతనైన ప్రపంచము ఎరుకకు వేరుగాక ఎరుక రూపమే అయియుండినను ఈ ఎరుక ఆ ప్రపంచముకంటే నేను వేరని తెలుపుచు ఆ ప్రపంచమును నేను యెరిగే సాక్షిగా యున్నానని ప్రపంచమునకు నాకు సంబంధము లేదని తనకు తానే ఊహించుచు తనకు తానే మెచ్చుకొనుచుండును. తనతో యేర్పడిన రూప నామాదులను తనకంటె వేరని తెలుపుచుండును. ఈ యెరుక చేష్టలు జూస్తూ యుండిన యెడల యున్నది లేన్నట్లుగా, లేనిది వున్నట్లుగా భ్రమించుచుండును.

వి॥ శ్లో॥ "పూర్ణమద్వయ మఖండ చేతనమ్ విశ్వబేధకలనాది వర్జితమ్"

తా॥ బ్రహ్మమనే ఎరుక అఖండ చైతన్యమునై రూప నామాదులుగా, కనబడుచు ప్రపంచము కంటే వేరుగా లేదని (ఉత్తర గీత తెలుపుచున్నది)

50. కం॥ వినుమూర్ణనాభితా - బుట్టిన మీదట – సృజనజేయు దినము హరించున్-ఘనమగుపట శతకోట్లను-తనలోపలి దారమునను తానట్టే వనునూ అట్లనె యెరుక తాబుట్టి కనునూ – పనిబూని బ్రహ్మాండ భాండ నంతములాను క్షణములోపల దృంచి-కనరాక వేవేగ-తానట్టెచనునూ-అట్లనె ఎరుక-తాబుట్టి కనునూ॥ 6

తా॥ శిష్యా! లోకములో ఒకకుండ తయారు కావలయుననిన మట్టి యుండవలయును. ఆ మట్టి తనకు తానుగాకుండకానందున, ఒక కుమ్మరి కావలయును. ఇచ్చట మట్టి-కుమ్మరి–ఈ రెండు లేనిదే కుండ రూపము కాక యున్నది. ఇక ఈ ఎరుక జేయుచున్న జగసృష్టిని గురించి విచారించిన ఎడల మట్టిరూపము ఎరుకే అగుచున్నది. కుమ్మరి రూపము ఎరుకె అగుచున్నది. అది యెట్లనగా "శ్రుతి యదోర్ణనాభీ శ్రుజతే గృహ్ణతేచ" ముండకం. సాలెపురుగు తన నోటిలోవచ్చు జిగురు పదార్థముతో, గూడులను అల్లుకొని దానియందే సంచరించుచు అందు బంధింపబడు ఈగలను ఆహారముగా తీసుకొనుచు సుఖముగా యున్నానని తలంచుచు చివరకు ఆగూడులను తానెచింపుకొని ఆ గూడులతోపాటు తాను నశించి పోవుచున్నది. ఆ తీరుగనే ఈ మూలములేని ఎరుక గూడ చిత్ర విచిత్రములుగా కనుపడుచు బ్రహ్మాండ బాండములనెల్లా అంతలో తనసత్తాచే సృష్టించుకొని ఆ రూపాదులలో తానుయుండి నేనుయున్నానని సంతసించుచు తిరిగి అంతలోనే బ్రహ్మాండ బాండములగు రూపాదులను మాయము చేసి తాను మాయమగు చున్నది. ఇట్లు ఈ ఎరుకచేయు సృష్టిని గురించి ఎరుకను గురించి ఆలోచించిన నిలకడలేని పుట్టగొడుగులులాగున కనబడుచుండును.

51. కం॥ తలిదండ్రులు జీవేశులు – యిల వ్యోమములేనుమేను లెరుక మరుపులున్-కలమేల్కలు శుక్లాశ్రం-బులు నీరాన్నములు ప్రకృతి-పురుషూడాల్మగడూ-గానై ఎరుక-కెరుకె కానబడూ-తెలశీ బయలున్నాది దెలశి యీతెలివిని తెలివిచాతనె పట్టి-తీసివెయ్యుము ప్రకృతి–పురుషూడాల్మగడూ–గా నై యెరుక కెరుకె కానబడూ॥ 7

తా॥ శిష్యా! ఈ సకల ప్రపంచమంతయు ప్రాణము దేహము రెండు గూడి ద్వంద్వ రూపముగా కనబడుచున్నది. ఈ ద్వంద్వముల లోనే ఎరుక యున్నందు వలన ద్వంద్వములైన దేహాదులనే ఈ ఎరుక అపేక్షించుచు ద్వంద్వ పద్ధతిగానే తలిదండ్రులనియు, భార్యా బిడ్డలనియు ఎరుక మరుపు

లనియు, కల మెలుకువలనియు, అన్నపానాదులనియు, శుక్ల శోణితములనియు, ప్రకృతి పురుషులనియు, భూమి ఆకాశములనియు, జీవేశ్వరులనియు, ద్వంద్వ శబ్దములనే ఈ ఎరుక బలుకుచు ద్వంద్వములనే గాంచుచు, ద్వంద్వములనే అభిమానించుచుండును. ఇట్లు ద్వంద్వాభిమానమైన ఎరుక ద్వంద్వరహితమైన పరబయలును తెలిసిన మీదట ద్వంద్వాన్ని ఆపేక్షించే ఎరుకను ద్వంద్వ ఎరుక చేతనే లేకుండా జేసుకొనవలయును.

52. కం॥ వొక దేహధారి తనువున - సకలావస్థలు జనించి చనిన విధమునన్-అకలంకమైన బయిలులో-ప్రకటంబై లేని యెరుక-బయలుండ జూచీ తన ముచ్చట-పరికించి లేచీ-వొక కొంత సేపైన వుండేటందుకు లేక-సకలాము తనవెంట జనుదేరజను బట్ట-బయలుండ జూచీ-తనముచ్చట పరికించిలేచీ॥ 8

తా॥ శిష్యా! ఒక దేహధారిగా యున్న మనుజునకు జాగ్రత స్వప్నము, సుషుప్తి అను అవస్థాత్రయములు కష్ట సుఖములు, కలిమిలేములు ఎట్లు వస్తూ పోతూ నిలకడ లేక యున్నవో అట్లనే ఏ కళంకములేని నిష్కళంకమైన అచల పరిపూర్ణమునందు ఈ కళంకమైన ఎరుక వచ్చుచూ పోవుచూ కొంత కాలమైనా ఆ బట్టబయలులో యుండుటకు నిలకడలేక తనతోవచ్చిన దేహాదులను, తనతో వచ్చిన ఇంద్రియాదులను తనతోగూడ తీసుకొని పోవుచుండును. ఇట్లు కొంతసేపైన స్థిమితములేని ఎరుక స్థిమితముగా కదలకయున్న బట్టబయలును జూచిన యెడల తనముచ్చట ఎంతమాత్రమని తనకు తనకే సిగ్గు గలుగుచుండును.

వి॥ ప్రజ్వలించుచున్న దీపము తన్నాశ్రయించిన వత్తిని, చమురును సర్వము కాల్చివేసి వానితోగూడ తాను నశించునట్లు ఈ ఎరుకగూడ సర్వము రహితపరచుకొని తానూ రహితమై పోవును.

53. కం॥ మేలుక సుషుప్తిలోపల -నేలీలం తనకుదాను - యేతెంచునొ గు-ర్తాలీల బయలులోపల-వాలాయము తనకుదానే-వొచ్చునోయన్నా-వొచ్చి హెచ్చి-చచ్చునోయన్నా-యీలోపలనే బట్టబయలున్న దెరిగితే-యేలోకమున నిల్వజాల దెరుగకుంటె వొచ్చునోయన్నా-వొచ్చి హెచ్చి-చచ్చునోయన్నా॥ 9

తా॥ శిష్యా! ఏ కళంకములేని బట్టబయలులో ఈ కళంకము కలిగిన ఎరుక ఎట్లువచ్చిన దనిన సుషుప్తిలో మెలుకువ లేకపోయినను తనంతట తానే మెలకువ యెట్లు వచ్చుచున్నదో ఆ విధముగానే పరిపూర్ణమునందు ఈ ఎరుక లేకనే తనకు తానుగావచ్చి తనలోయున్న సత్తాచే సకలసృష్టిని సకల కార్యము

లన్నియుజేసి కొంతసేపు ఈ పరిపూర్ణములో కనబడుచూ యుండి, మరలా తనకు తానే కనబడక పోవుచున్నది. ఇట్లు ఈ ఎరుక పొయ్యేలోపల పరిపూర్ణ మును దర్శించి ఆ పరిపూర్ణముండిన వ్యాపకత్వమును గుర్తించిన యెడల ఆ వ్యాపకత్వములో నా అల్పత్వము ఎంతమాత్రమని తన విషయము తానే విచా రించుకొని తాను లేనిదానినని తానే యేచోట లేకపోవుచున్నది.

54. కం॥ ఆటాడి యాడకుండును-ఆటాడిన మేనిబొమ్మ యాటాడకనే ఆటాడు నెరుక యనియెడి-యాటాడించేటివాడు-యతడేర కర్తా-అంతటికీ యా యచలామకర్తా-చేటూ పాటుల రెంటిచేవొచ్చు ఫలము-మున్మాటి కనుభవించి మరణా జననములొంద-నతడేర కర్తా-అంతటికీ యా-యచలామకర్తా॥ 10

తా॥ శిష్యా! దేహాదులనే కీలుబొమ్మలు మెలుకువ యున్నంతవరకు ఆటాడుచు నిదుర వచ్చేసరికి ఆ ఆటలు ఆడక పడిపోవుచూ, మళ్ళి తిరుగాలేచి ఆడడము ఈ ఆటలనంతా ఆడించుటకు యెరుకే కర్తగాయున్నది. పరిపూర్ణము మాత్రము ఏ కర్తృత్వములు ఎప్పుడూ పెట్టుకొనక అకర్తగానే యుంటూ యున్నది. మంచిచేసినా, చెడ్డచేసినా ఆ పని యెరుకపనే గనుక ఆ మంచి చెడ్డ లలోవచ్చు ఫలా, ఫలంబులు మాటి మాటికి ఈ ఎరుకే అనుభవించుచు జనన మరణములు బొందుచు నానా తంటాలు పడేది ఈ ఎరుకయేగాని బట్టబయలు మాత్రము యే తంటాలు పడక, యున్నది యున్నట్లుగా కదలక యున్నది.

55. కం॥ దేహమును జూచుకన్నులు - దేహమునకు వేరులేని తీరున యెరుకె-కోహంక స్త్వంతవదా-సోహం సోహంబటంచు-చూచుచుండు సుమీ- తనకుతానె - తోచూచుండు సుమీ - దేహిదేహములానె తెరగూన ప్రసరించి- దేహముగాని విదేహిగ తననూ తాజూచూచుండు సుమీ-తనకుతానె తోచూ చుండుసుమీ॥ 11

తా॥ శిష్యా! దేహముతోవచ్చుచు దేహముతోపోవుచు దేహసంబంధంతో గూడి దేహసమానముగాయున్న ఈ ఎరుకకు గలిగే అలోచనలు జూచినయెడల తాను వేరనియు, దేహము వేరనియు, శాస్త్రములలో దెలుపు చుండును. చెట్టు రూపముకన్న పువ్వురూపము రంగులతో పరిమళముగా యున్నంత మాత్రమున చెట్టుకంటే పువ్వు వేరుగాక యున్నట్లు, దేహసంబంధమైన కన్నులు దేహమును జూచినంత మాత్రమున దేహముకన్న కన్నులువేరుగాక యున్నట్లు, ఈ ఎరుక

దేహాదులలో యుండి, ప్రాణవాయు రూపముగా సోహం సోహం అనుచూ ఈ దేహాదులను యెరుగుచు ఈ దేహాదులు నేనుగానని "విదేహినని" తనకు తానే ఊహాలు పడుచుండును. అంత మాత్రమున దేహమునకు వేరుగా ఈ ఎరుక యున్నదని తలంచబోకుము.

56. కం॥ పిండ బ్రహ్మాండంబులు-రెండును యా రెంటిలోని రెండహములు యీా-ఖండములు నాల్గుగూడి య-ఖండంబగు ఎరుక రూపుగనరా మా తండ్రీ-యిది దెల్పిన – ఘనుడే తలిదండ్రీ – ఖండా ఖండములూగ గనిపించె యెరుకానే – దండీదనెటి యుద్దండూల కలనైన-గనరా మాతండ్రీ – యిది దెల్పిన-ఘనుడె తలిదండ్రీ॥ 12

తా॥ శిష్యా! ఈ ఎరుక మూలమును పరిశీలించిన యెడల దీనికి ఆధారమనునది నేది అగుపడక బహు విచిత్రముగా కనబడుచుండును. మేఘములు కేవలము నీటి ఆవిరే అయినను అందులో ఏర్పడు ఉరుములు, మెరుపులు పిడుగులు, గుండెలు దద్దరిల్లునట్లు చేయును. అట్లే ఈ యెరుక సత్తా గట్టిది. నిత్యమైనది గాక పోయినను ఎంతో బాహుల్యముగా వింత వింతలైన అద్భుత కార్యములు చేయుటకు దీని బలము వర్ణనాతీతమై యున్నది. ఇంత బలము ఈ ఎరుకకు ఎట్లు వచ్చినదని విచారించిన ఎడల దానికి నాలుగు ఆధారాలున్నవి. అవి యేవి అనిన, పంచభూత సమన్వితమగు 24 తత్వములనబడు ఇంద్రియాదులచే గూడి జఢరూపముగా కనబడుచున్న ఈ స్థూల శరీరమును పిండమని తెలుపుదురు. ఈ పిండశరీరమును అభిమానించుచూ సత్తామాత్రముగాయుండి స్థూల, సూక్ష్మ కారణ మహాకారణాది అవస్థలలో విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, ప్రత్యగాత్మ అను నాలుగు దశలతో వ్యవహరించుచున్న జీవుడు మలినరూపుడై అహంకార మమకారాలతోగూడి ఈ ఇంద్రియాదులెల్లయు నా సత్తాచే నా ఆజ్ఞ వలన వాటివాటి ధర్మములు చేయుచున్నవనియు, నేను అనువాడను లేకపోయిన ఈ దేహము, ఇంద్రియాదులు వాటి వాటి ధర్మములు కోలుపోవుననియు నేను ఇరబైఐదవ వాడనుగా యున్నానని తలంచుచు, ఏ చైతన్యము జీవతత్వముగా అహంబావనతో గూడినదై యున్నదో ఆ చైతన్యమును అచ్చట అహమని తెలుపబడినది. ఇచ్చట "24" తత్వములతోగూడి కదలక జడరూపముగానున్నదానిని పిండమనియు ఇందులో కదలిక గలిగి దేహాదులనంతా కదలించుచూ, నేను నేను నంటున్న జీవతత్వమును 'అహం' అనియు తెలుపబడినది.

ఇక బ్రహ్మాండ విషయము యెట్టిదనగా పంచ భూతములచే నేర్పడిన స్థూల దేహాదులకు ముందు సూక్ష్మభూతములగు 1 పంచతన్మాత్రలు, 2 అహంకారము, 3 మహత్తు, 4 అవ్యక్తము అనునవి నాలుగు పిండదేహములో యున్నటులనే, బ్రహ్మాండ దేహములోగూడ యున్నవి. అచ్చట విరాట్ పురుషుడు, హిరణ్యగర్భుడు, అవ్యాకృతుడు, మూలప్రకృతి అను నాలుగు దశలతో గూడుకొనియున్న దానిని బ్రహ్మాండమని తెలుపడమైనది.

ఈ బ్రహ్మాండమును చలింప జేయుటకు అక్కడ ఒక సత్తా ఈశ్వర తత్వము, మహాదాదులను కదలించుచున్నందువలన ఈ ఈశ్వర తత్వము పిండాండములో జీవునివలె కర్తృత్వము కలిగిన దగుటవలన ఆ ఈశ్వర తత్వమును బ్రహ్మాండములో అహం అని తెలుపడమైనది. ఈపిండ బ్రహ్మాండములు ఒకదానితో ఒకటి సంబంధము కలిగి ఆ సంబంధం యెట్లున్నదనిన బ్రహ్మాండములో యున్న విరాట్ పురుషుడు పిండాండమైన జాగ్రతావస్థలో విశ్వుడనబడుచు బ్రహ్మాండములో యున్న హిరణ్యగర్భుడు పిండాండమైన స్వప్నావస్థలో తైజసుడనబడుచు, బ్రహ్మాండములో యున్న అవ్యాకృతుడు, పిండాండమైన కారణదేహములో ప్రాజ్ఞుడనబడుచు, బ్రహ్మాండములోయున్న మూలప్రకృతిపై భాషిల్లు పరమాత్మ, పిండాండమైన మహాకారణ దేహములలో ప్రత్యగాత్మయనబడుచు బ్రహ్మాడములో యున్న సంపద పిండాండమునకు, పిండాండములో యున్న సంపద బ్రహ్మాడమునకు ఒకదాని నొకటి పోషించుకొనుచుండుటందువలన "యథాపిండె తథా బ్రహ్మాండే" అని శృతి తెలుపుచున్నది. నిప్పు గాలితో విస్తరించినటుల, విత్తుచే చెట్టు—చెట్టుచే విత్తులు కలిగి మహారణ్యమైనటుల ఈ ఎరుక పిండ బ్రహ్మాడములలో విస్తరింపబడుచు, అనేకాకృతులుగలదియై అఖండముగా తోచబడుచున్నది. ఈ విధమైన యెరుకను విశదముగా తెలియపరచి ఈ యెరుక మూలము ఏమియు లేదని, అంత్రదామరాకుతో సమానముగా యున్నదని నిశ్చయపరచి మళ్లీ సంశయము పుట్టక జేసిన గురుదేవుడే తల్లి—దండ్రిగా బావించవలయును. ఈ యెరుక అఖండముగా తోచబడుచున్నను, ఖండ ఖండములుగా యున్నదేగాని బట్ట బయలుగా అఖండముగా లేనందున ఇట్టి యెరుకను అఖండముగా తీసుకొని ప్రచారముచేసే ఉద్ధండులైన పండితులమాటలను కలలోనైన తలంచబోకుము. యీ పిండ బ్రహ్మాండములను కొంతమంది దేహములో కంఠమునకు దిగువ భాగమంతయు పిండ

మనియు, కంఠమునకు పై భాగమంతయు బ్రహ్మాండ మనియు, తెలుపు చుందురు. మరి కొందరు నేత్ర స్థానములోనున్న తెల్ల గ్రుడ్డు, ఎర్రగ్రుడ్డు, నల్ల గ్రుడ్డు పిండమనియు, ఆపైన యున్న సునీలము బ్రహ్మాండమని తెలుపుట గలదు. యీ పిండ బ్రహ్మాండముల వివరము విశదముగా మేము వ్యాఖ్యా నించిన విశ్వరూప రహస్యమను గ్రంధములో చూడవచ్చును.

57. కం॥ పరిపూర్ణమొకటిదక్క ని-తరమైన ప్రపంచమెల్ల తగ దెలి యుము నీ–వెరుకేనని మదిలోపల యెరుకె పరిపూర్ణమెరిగే దెరుకా నెరిగేది – యింకొక్కటిలే – దీరెంట్నేరిగేదీ - యెరుకా పుట్టువుమూల మెరుగానిదీ యెరుకే యెరుకె తాబుట్టిన దెరుగాబోయితె లేదం–చ్చెరుకా నెరిగేది–యింకొక్కటిలేదీ – రెంట్నేరిగేది. 13

తా॥ శిష్యా! బాహ్యదృష్టినివదలి గురుదృష్టితో జూచు నేర్పుగలవారలకు ఈ పరిపూర్ణము యొక్కటియే సత్యమైనదిగా గోచరించుచుండును. ఇక మిగిలిన దంతయు ఎరుక వలన కలిగిన పంచభూతముల రూపజాలమై ఒకప్పుడు కనబ డుచు ఒకప్పుడు కనబడక పోవుచుండును. పరిపూర్ణము మాత్రము ఎరుకరీతిగా రాక పోకలు కలిగియుండక శాశ్వతముగా కదలక యుండును. ఇట్లు యున్న ఎరుక పరిపూర్ణములను ఈ ఎరుకే గుర్తెరుగుచు పరిపూర్ణము ఏ కాలమందును నాశనముగాక సత్యముగా యున్నదని గ్రహించుటకు ఈ ఎరుకే ఆధారమగు చున్నది. ఎరుక సత్యముకానిది, అసత్యమని గ్రహించుటకు గూడ ఈ ఎరుకే ఆధారమగుచున్నది. ఇట్లు ఈ ఎరుక పరిపూర్ణముల రెంటిని యెరుగుటకు ఈ ఎరుకతప్ప మరేమి కానబడక యుండును. ఈ విధముగా సర్వమును యెరిగే సమర్థత కలిగిన ఈ ఎరుక తన పుట్టుక మూలమును తెలియడానికి ప్రయత్నిం చిన యెడల తనకు మూలము ఎచ్చట కనబడక తానే లేక పోవును.

58. కం॥ పాపములు పుణ్యములు భువి - బ్రాపించును యెరుకవాత భ్రమసినవారిన్ ప్రాపింప వెరుకనెడశిన–తాపసులను చిత్తమందు -తగ దెల్సు కొనుమీ–అగామి బో-ధను లెస్సా వినుమీ–పాపాలలో శుద్ధ స్పటికా సన్నిభ మైన-ఆపోజ్యోతిని ప్రత్యగాత్మ నీమదిలోన-తగ దెల్సుకొనుమీ–అగామిబో- ధను లెస్సా వినుమీ॥ 14

తా॥ శిష్యా! మనరెండు కంటిపాపల నడుమ దోసకాయ నూగువంటి సన్నని రంధ్రములందు శుద్ధ స్పటికముతో గూడిన ఒక వెలుగుయున్నది. అ

వెలుగునే ప్రత్యగాత్మ యనియు, జ్యోతి స్వరూపమనియు తెలుపు చుందురు. ఆ ప్రత్యగాత్మయను వెలుగే చక్షువుల రంధ్రములయందు యుండి సర్వరూపాదులను యెరిగెడి యెరుకై యున్నది. ఆ రూపాదులను యెరుగుట వలన యిది పాపమనియు, ఇది పుణ్యమనియు, తలపోయుచు ఆదోషా దోషములకు వశపడుచు కంటిపాపల నడుమయుండి పాప పుణ్యములను ప్రాప్తింపజేయు ఎరుకను యే మహాత్ములు రహితపరుచుకొని ఎరుకలేనివారై యుందురో, ఆపుణ్య పురుషులు, ద్వయ దోషముల నంటక పవిత్రజన్మను పొందినవారై పుణ్య పాపములకు అతీతులై యుందురు.

వి॥ నిప్పుచేత కాలుచున్న పర్వతము దగ్గరకు జీవరాసులెట్లు చేరలేవో భోధాగ్ని దగ్గరకూడ సంశయములు నిలువనేరవు. అభిమానమును త్యాగము చేసినంత మాత్రమున పుణ్య, పాపకర్మలు రహితపడవు. ఉపాది కారణమగు ఎరుక త్యాగమువల్లనే సర్వదోషములకు అతీతుడగును.

59. కం॥ యెరుకన్నను మరుపన్నను–యెరుకకు యెరుకన్న దేహియన మాయయనన్–గురుతన సా–క్ష్యనజ్ఞప్త్యన–స్ఫురణయనన్ ద్రష్టయనిన–చూడు మొక్కటిగా–యిది లేకుంటె-చూడామొక్కటిగా-మరి చలాచలమూల మర్మా మెరిగేటి దన్న-యెరిగి తాలేనావి-యెగిరీ పొయ్యేటిదన్న - చూడూమొక్కటిగా యిది లేకుంటే–చూడామొక్కటిగా॥ 15

తా॥ శిష్యా! ఈ జగత్తులోనున్న సకల రూపాదులను సకల వ్యవహారములను పరిశీలించి జూచిన యెడల ఈ ఎరుకగానిది ఏ ఒక్కటియు కనబడక సర్వము ఈ యెరుకే అగుచు ఈ ఎరుకచేతనే సర్వము భాసిల్లుచున్నది. సర్వ జీవుల రూపాదులును ఈ ఎరుకే అగుచున్నది. ఈ రూపాదులలోయున్న తెలివి గూడ ఈ యెరుకే అయియున్నది. ఈ ఎరుకకు ఎరుగుట – మరచుట అను రెండు ధర్మములు సహజముగా యున్నవి. ఈ ఎరుక దేహములో యుండి ఆత్మ అనబడుచు పరమాత్మను నేను అగుదునని ఈ ఎరుకే తలంచుచుండును. మాయయని శృతులలో నిర్ణయింపబడినది ఈ ఎరుకే. సకలేంద్రియములు రహితపడిన స్థితిలో స్ఫురణ మాత్రముగా యున్నది ఈ ఎరుకే. దేహముగాని విదేహనని చెప్పుకొనుచున్నది ఈ ఎరుకే! అవస్థాత్రయములకు సాక్షిగా యుండి అవస్థాత్రయములను యెరిగేది ఈ ఎరుకే! ఈ కనబడుచున్న రూపాదులన్నియు దృశ్యము, ఆ దృశ్యాన్ని యెరిగే ద్రష్టనునేనని తెల్పేది ఈఎరుకే.

ఈ ఎరుకే లేకయున్న సమ_స్తమును ఎరిగేది ఇంకోకటిలేదు. కదలిక కలిగిన రూపాదుల ధర్మము లెల్లయు కదలిక లేని పరిపూర్ణము. ధర్మము లెల్లయు, ఈ ఎరుకే యెరుగుచూ ఒకనాడు తనను తాను యెరుగబొయ్యేటప్పటికి, తానే లేక పోవడముకూడ ఈ ఎరుకకే తగియున్నది.

60. కం॥ అనుమానము మదినుంచక-వినుమింకను యెరుకపేర్లు-వివరించెద బు-ధ్యన చి_త్తంబన మానస—మనిన హంకారమనిన నంతఃకరణనినన్ సంకల్పమంచని-నా యిచ్చనినన్ – తన నితరులనే తానని గుర్తెరిగెటిదన్న – తననేకా నితరూల తననూ దెలిసెటిదన్న నంతఃకరణనినన్ సంకల్ప-మంచని నాయిచ్చనినన్॥ 16

తా॥ శిష్యా! మానవుడు తల్లిగర్భమునుండి భూమిమీద పడిన క్షణము నుండియు ఈ లోకము వానిని భ్రాంతులలో, సంశయాలలో, బూటకాలలో ముంచి పెంచుటవలన సత్యము అసత్యముగాను, అసత్యము సత్యముగాను బుద్ధికివచ్చుచున్నది. అందువలన నీవు ఆ సంశయబుద్ధిని విడిచి నేను తెలుపుచున్న మాటలను అవునా కాదాయని అనుమానము లేక శ్రద్ధతో వినవలయును. ఈ దేహమునకున్న ఇంద్రియాలలో నేత్రముకన్నా గొప్పది బుద్ధి. "ఈ బుద్ధి మనకుకలుగు అవస్థాత్రయములలోనూ పనిచేయుచున్నది. నేత్రము మాత్రము ఒక జాగ్రతావ_స్తలోనే పని చేయుచుండును. అందు వలన "బుద్ధిర్గతి సూర్య" అనగా బుద్ధి, సూర్యునివలె ప్రకాశించుటచేత ఈ బుద్ధిని ఆశ్రయించుకొని సర్వేంద్రియములు వాటి, వాటి వృత్తులు చేయుచున్నవని శృతులు తెలుపుచున్నవి. అట్టి ప్రకాశమానమైన బుద్ధిగూడ ఈ యెరుకే అగుచున్నది. సకల సంశయములకు కారణమైన చి_త్తముకూడ యెరుకే అగుచున్నది. సకల సంకల్పములకు పునాదియైన మనసుగూడ యెరుకే అగుచున్నది. అఖిల వ్యవహారములకు నేను నేను అనుచు ముందుకు వచ్చుచున్న అహంకారముగూడ యెరుకే అగుచున్నది. శుభా శుభములను ఉత్ప_త్తిజేయు అంతఃకరణము - యెరుకే అగుచున్నది. ప్రతి కార్యమందును చింతన కలిగించె యిచ్చయు ఈ ఎరుకే అగుచున్నది. సంకోశ వికాశములతో గూడిన సంకల్పము యీ ఎరుకే అగుచున్నది. ఈ విధముగా పరిణమించిన ఎరుక నీవనియు, నేననియు, ఇతరులనియు గు_ర్తించుచు ఆ గు_ర్తించిన యితర సముదాయము కంటే నేను వేరుగా యున్నానని తనకుతానే అనుకొనుచుండును. కాని అందులో నేనుగూడ ఒకదానినని యెరుగక లేక యుండును.

61. కం॥ విను మితరులు ఎరుకను-సాక్ష్యని పల్కిరి నేనుసాక్షి నహమని నీతో-వినజెప్పితి నింతియె వే-రనకూడదు రెంటినొక్కటని తెలుసుకోరా మాటల భేద-మని కనుకోర్రా-అనరాని వినరాని కనరాని బయలందు-తనకై తానరుదెంచి తనకై తాజనునీ - సాక్ష్యని తెలుసుకోరా - మాటల భేద- మని కనుకోర్రా॥ 17

తా॥ శిష్యా! సకల రూపాదులకు రూపుదిద్దినదియు, సకల రూపాదులలో చైతన్యరూపముగా యుండునదియు, ఆ రూపాదులను ఆడించునదియు యీ యెరుకే. అయినను యీ ఎరుక సత్తా యేమిటని విచారించువారికి ఈ ఎరుకకు ఎక్కడా ఒక ఆధారము కనిపించక యుండును. ఇట్టి యెరుకను శాస్త్రవేత్తలు రూపాదులవలె నశించక రూపాదులను యెరిగే సాక్షిగా యున్నదని తెలుపుచుందురు. నేనుగూడ వారు చెప్పేదానికి ఆమోదించుచు అది లేని అహమని తెలుపుచున్నాను. అట్లు ఎందుకు అనవలసిన దనగా బియ్యము, నీరు, అగ్ని చేరినచోట అన్నమగుటకు ముందు (లేకనే) ఒక పొంగు అనే ఉజ్వలత అచట కలిగి వెంటనే అణగిపోవును. అటులనే దేహము అంతఃకరణం ఎరుక ఎచ్చట కూడిక కలుగుచున్నదో అచ్చటనే నేను నేను అను అహము పుట్టి దేహ దార్ఢ్యము సన్నిగిలేటప్పటికి ఆ అహము సన్నగిలి పోవుచున్నది. అట్టిదై ఈ అహము అగుటవలన దీనిని లేని అహమని తెలిపినాను. సాక్షి అనినా, అహమనినా ఈ రెంటిని వక్కటిగానే భావించి మాటల భేదమేనని తలంచవలయును. కంటితో చూచుటకుగాని, చెవులతో వినుటకుగాని, నోటితో తెలుపుటకు సాధ్యముకాని ఏ పరిపూర్ణమున్నదో, ఆ పరబయలునందు ఈ నేను, నేననెడు అహము (ఎరుక) తనకు తానేవచ్చి తనకుతానే మటుమాయమై పోవుచుండును.

62. కం॥ వన్నియలై దొకచోటను-పన్నుగ గలసినది హృదయ పద్మంబనుచున్-యెన్నుదురు జనులు ఎరుకం-దున్నాదని శృతులు-బల్కు-చున్నావి సుమ్మీ-తెలుసుటె మోక్ష - మన్నావి సుమ్మి - వొన్నెలన్నియు మీరి వున్నా వస్తువజాడ-నెన్న డెరుంగాక యన్నో రీతులు బల్కుచున్నావి సుమ్మి-తెలుసుటె మోక్ష-మన్నావిసుమ్మీ॥ 18

తా॥ శిష్యా! ఈ ఎరుక అఖండముగాయున్న పరిపూర్ణములో విచారించిన వారికి కనుపించక పోయినను ఖండ ఖండములుగా కనిపించు బ్రహ్మాండ బాండములలో మాత్రము కనబడుచుండును. బ్రహ్మాండ బాండములు వేరుగా

యెరుక వేరుగా రెండు విధంబులుగా యున్నవా? అని అనిన యెడల "సోకా యత బహుస్యాం ప్రజాపతి" అని ఉపనిషత్తులు తెలిపినట్లు మూలములేని గుర్తెరిగే ఎరుక అనే చేతన బ్రహ్మము జగత్తును పుట్టింపగోరి, తనకంటె ఇతర పదార్థము లేనందువలన తానే తన స్వరూపమును మహదాదులుగాను, పంచ భూతములుగాను వానిచే రూపాదులు నొనర్చి ఆ రూపాదులలో తాను నేత్ర స్థానమునందు చేరి సకలమును గుర్తించుచున్నందువలన "హృదయ మద్యే, స్థితం గుహ్యం-అంగుష్ఠం పరమాత్మః" అనగా జాగ్రతావస్థలో ఐదు వన్నెలు గల ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు, సునీలముగల నేత్ర స్థానములో. ఎరుక వున్నప్పుడు మాత్రము ఇంద్రియాదులెల్లయు వాటి, వాటి ధర్మములు జేయు చున్నవి. ఆ స్థానమును ఎరుక తొలగిన యెడల ఇంద్రియాదులు వాటి కర్మ ములు కోల్పోవు చున్నవి. ఇట్టి నేత్ర స్థానమును హృదయ పద్మమనియు హృత్ కమలమనియు, తెలుపుచు ఆ స్థానములోయున్న యెరుకను తెలుసుకో వడమే మోక్షమని శృతులు తెలుపుచున్నవి. ఐదు వన్నెలుగల స్థానములో ఎరుకయుండి అనిత్యమైన రూపాదులను చూడడమేగాని, ఐదు వన్నెలకు మీరి యున్న సత్యమైన పరిపూర్ణమును మాత్రము యేనాడు ఈ యెరుక చూడ లేక యెన్నో విధములుగా లేనిది వున్నదనియు, వున్నది లేనిదనియు మాట్లాడి మాట్లాడి ఒకనాడు తనకు తానే లేకపోవుచున్నది.

63. కం॥ చులుకని యుక్తిగ నొక్కటి – తెలిపెద విను సందియంబు దీరును దీనన్–పలుకున గలిగిన యర్థము – పలుకును విడనాడి నిల్వ – బడు చోటింకేది- రెండుగ-వొక్కపలుకే అయినాది-తెలియుమీలాగున తెలివి దేహ ములయ్యె తెలివె తనువునుబాసితెలివి స్థిరముగ నిల్వ-బడుచోటింకేదీ-రెండుగ- వొక్కపలుకే అయినాది॥ 19

తా॥ శిష్యా! ఎరుక దేహములు రెండు వేరు వేరనియు, యెరుక సత్య మనియు, దేహము-అసత్యమనియు-శృతులు. (గీత 2 వఅ. 16.)తెలుపుచున్నవి. ఈ రెండు ఒక్కటే అగునుగాని, వేరు వేరుగా లేవని నేను తెలుపుచున్నాను. నేను తెలిపిన విషయము నీకు సరిగా యుండుటకు సులభముగా అర్థమగుటకు ఒక యుక్తిని జూపుచున్నాను. దీనితో నీ సంశయము తీరిపోగలదు. అది యెట్ల నిన పలుకు అనగా మాట–ఆ మాట పలికినపుడు ఆ మాటలోయున్న అభిప్రా యము, ఆ మాటలోనే యిమిడియున్నది. కాని ఆమాటను విడిచి అభిప్రాయము

వేరుగా మరొకచోట కనబడుటలేదు. మాటగాని, ఆ మాటలోయున్న అభిప్రాయముగాని రెండు ఒకటేనైనటుల ఈ ఎరుక దేహములు రెండు ఒక్కటేగాని వేరు వేరుగా కనుపించవు. వేరు వేరుగా యున్నవని తెలిపిన యెడల యెరుక దేహమును విడిచి యెచ్చోటనైనా కనబడవలెను. అట్లు కనబడలేదు కనుక ఈ ఎరుక దేహములు రెండు ఒక్కటేనని తెలియవలయును.

వి॥ కట్టెయందలి అగ్నిని తెలుసు కొనవలెననిన అంపముతో కోసినను బాడిశతో నరికినను, ఆ అగ్ని తెలియబడదు. రెండు కట్టెలనుచేర్చి రాపిడివేసి నచో ఆ అగ్ని బయటపడును. అట్లనే గురుబోధయను విచారణ వలననే ఎరుక అనునది యేమిటని తెలియుటకుగాని, ఆ యెరుక రహితపడుటకుగాని సమర్థత యేర్పడును.

64. కం॥ యెరుకైన భూతముల నీ–వెరుగుము ఆకసము గాడ్పు యింగలమును నీ–ళ్లిర వందనేలయని నే–నెరిగిన పద్ధతిని నీకు–నెరిగించినానూ – ముజ్జగమూలయ్యేను–వీట్లతోనూ పరిపూర్ణమందు కన్పడుచు తమకుదామె–మరి కాన – రావిట్టిమార్గాముకల వీటి నెరిగించినానూ – ముజ్జగమూలయ్యేను వీట్లతోనూ॥ 20

తా॥ శిష్యా! ఈ ఎరుక సకలసృష్టికి ఆధారమగుటవలన ఈ యెరుకనే శుద్ధచైతన్య పరబ్రహ్మమనియు, ఆ బ్రహ్మముకంటె రెండవదిలేదనియు "సదేవ సౌమ్యేదమగ్ర ఆ సీత్ ఏకమేవా ద్వితీయం" అని ఛాందోగ్యోపనిషత్ తెలిపిన విధముగా సృష్టికిముందు అద్వితీయమై తనకంటె మరొక పదార్థము లేక ఏకరూపముగాయున్న చేతన బ్రహ్మము (ఎరుక) ఒక్కటే ఈ సృష్టికంతా కారణము మూలపదార్థమై యున్నది. ఈ ఒక్క యెరుకే యెట్లు సర్వలోకాలోకము లెల్లను పుట్టించినదని విచారించిన ఒకశిల్పి ఒకే ఇనుముచేత అనేక ఆయుధాలను చేసుకొని ఆ ఆయుధాలు అన్నిటితో తాను సంకల్పించుకొన్న ప్రతిమలను చేసుకొనునట్లు ఈ ఎరుక తనసత్తా చేతనే పంచభూతములను నిర్మించుకొని సకల సృష్టికి తానే మూలకారణముగా యున్నది. అది యెట్లనిన ఈ ఎరుక సత్తామాత్రమై శుద్ధముగా యున్నప్పుడు నిర్గుణ పరబ్రహ్మమనుచు, ఆ నిర్గుణ పరబ్రహ్మము కంపించిన ఆకాశమనబడుచు. ఆ ఆకాశముకదలిన వాయువనబడుచు. ఆ వాయువు మూర్తీభవించిన అగ్ని యనబడుచు, ఆ యగ్ని చల్లారిన జలము అనబడుచు. ఆ జలము గట్టిబడిన భూమి అనబడుచు ఇట్లు సృష్టికి పూర్వమే

యుండి కదలికతోగూడిన యే ఎరుకయున్నదో ఆ ఎరుక సత్తాయే పంచభూత ములై ఆ పంచభూతములచేత స్వర్గ-మర్త్య-పాతాళ లోకములన్నియు సృష్టికి రాగలుగుచున్నవి. ఇట్లు పంచభూతములచే నేర్పడిన అండ-పిండ-బ్రహ్మాం డములైన సర్వసముదాయమంతయు ఆ పరిపూర్ణ పరబయలునందు ఒకప్పుడు కనబడుచు ఒకప్పుడు కనబడక పోయినను ఆ అవల పరిపూర్ణము మాత్రము సర్వకాలముల యందును కదలక తనకుతానుగానే యున్నదనియు నేను బాగా విచారించి ఉన్న పద్ధతిని నీకు తెలుపుచున్నాను.

యెరుక లక్షణం నాలుగవ అధ్యాయం సమాప్తము.



## -: 5 యెరుకోత్పత్తి లక్షణం. 19 :-

65. కం॥ యెరుకోత్పత్తిని దెలియగ – సరసిజ గర్భాదులైన బాలరనె టిచో- నరుడెంతవాడు వాడది-యెరుగుదునన - వట్టిమాట–లివి వింతగాకా– తప్పదు వాని-కిక రాకపోకా–అరమరలేక సద్గురుమూర్తి చరణా పం–క్కరు హద్వయార్చాన నెరుగాని నరుమాట – లివి వింతగాకా - తప్పదు వాని-కిక రాక పోకా॥ 1

తా॥ శిష్యా! ఉరుములు, పిడుగులు యొక్క శబ్దములకు బండలుగూడ గడ గడలాడును. ఈ ఉరుములకు పిడుగులకు మూల పదార్థమేమని విచా రించుచూ పోయిన యెడల నీటి ఆవిరని తేలును. అట్లనే సకల దేహాదులను సృష్టించి ఆ దేహాదులలో యుండి సర్వమును గుర్తించుచు నేను నేను అను చున్న ఆ ఎరుకయొక్క సహజ పదార్థ లక్షణము. దాని ఉత్పత్తి ఎక్కడ జరుగుచున్నదని విచారించుటకు ప్రయత్నించిన ఎడల దానిమూలము గనుటకు హరి హర బ్రహ్మదులకుకూడ సాధ్యముగాక యుండును. ఎందువల్ల ననగా, ఆ ఎరుకకు ఒక మూలమంటూ కనబడక యుండును. (లేక) స్వతస్సిద్ధమా! అని విచారించిన అటులకూడ కనబడక యుండును. ఇట్టి ఎరుకను కొంతమంది మూలముందనియు, మేము చూచితిమనియు, మాకే తెలుసుననియు, మరి యెవ్వ రికి తెలియదనియు, మాకుశిష్యులైతే తెలిపెదమనియు స్వార్థం లోపల పెట్టు కొని అజ్ఞానులగువారికి ఆశలు పెట్టుచుందురు. అట్టివారలకు రాక పోకలేగాని రాక పోకలులేని మార్గమును గనజాలరు! మూలములేని యెరుకకు మూల

ముందని వారికి ఎందుకు తోస్తూయున్నదనిన, ఒక అచల గురువును ఆశ్రయించక యే గురువు ఏమి తెలుపునో అని ఒక్కొక్క గురువు దగ్గర ఒక్కొక్క మాట వినుచు సందేహ నివృత్తికాని దోషముచే వీరికి ఆ విక్షేప భావము కలిగినది. అట్లుగాక సత్యమునుజూపించు సద్గురువునుచేరి అరమరలులేక భక్తి విశ్వాసములతో వారి చరణ కమలములను పూజించి వారి కరుణకు పాత్రులై పూర్ణబోధలోయున్న తీర్పులను గురుముఖేణా గ్రహించినవారికి ఎరుకగుట్టు బయలుపడునుగాని అట్లుగాని వారి మాటలు చిత్ర విచిత్రములుగా కనబడు చుండును.

66. కం॥ లేనెరుక బయలు లోపల – తానెట్లు జనించె ననిన తగవిను వంధ్యా-సూనునిగతి వియదబ్జ వి – ధానంబున యక్షరాజ – ధానీ విధమునన్ రజ్జువు సర్పమైనా విధమునన్-స్థాణు పూరుషుని చందాన మృగజల–శశ విషాణము స్వప్నానందముగ – రాజధానీ విధమునన్ - రజ్జువు సర్ప – మైనా విధమునన్॥ 2

తా॥ శిష్యా! సనాతనమై! స్వతఃస్సిద్ధమై తనకు తానుగాయున్న పరిపూర్ణములో ఈ ఎరుక లేకనే కనబడుచు ఈ యెరుక జేయుసృష్టిగూడ ఎట్లున్నదని విచారించ గలిగితే ఈ లోకములో గొడ్రాలిబిడ్డ అనే మాటకలదు. ఆ బిడ్డ ఎచ్చట యున్నాడని వెతికితే యెచ్చటా కనిపించడు. ఆకాశ పుష్పము అనే మాట కలదు. ఆ పుష్పము ఎచ్చట వెతికినా అగుపడదు. రజ్జు సర్పమనే మాటకలదు. ఆ సర్పమును ఏ దిక్కు దిక్కులు వెతికినా కనుపించదు. గంధర్వ నగరమనే పేరు కలదు. ఆ నగరమెచ్చట యున్నదో అని శోధించిన కానరాదు. దారు పురుషుడు అనే మాటకలదు. ఆ పురుషుని యెచ్చట గాలించినా కనిపించడు. స్వప్నానందమనే మాటకలదు. ఆ ఆనందమును వితరణజేసి చూచిన, యెచ్చటా కనుపించదు. ఆ విధముగానే ఈ యెరుక యున్నట్లుగా తోచుచున్నదిగాని గురుదృష్టితో విచారించ గలిగిన లేక పోవుచున్నది.

67. కం॥ లేనెరుకను యెరుకనియన–లేనెరు కెట్లా – య ననిన లెస్సగ వినుమా–లేని మృగజలము వంధ్యాసూనులు గలిగుండి వెదకి – చూడాలేనట్లూ యీ లేనెరుక-యాడాలేదిట్లూ – స్థాణుపూరుషూడు శశవిషాణము–గగన ప్రసూనాము నరునీ స్వప్నా నందమివి వెదకి – చూడాలేనట్లూ – యీ లేనెరుక – యాడాలేదిట్లూ॥ 3

శిష్యా! ఈ ఎరుక లేనిదేకదా! ఈ లేని ఎరుకకు ఎరుక అనే పేరు యెందుకు పెట్టినారని అందువేమో! యెండమావులలో నీరు లేక పోయినా ఎండమావుల నీరు అనుపేరు వచ్చినట్లుగను, గొడ్రాలికి బిడ్డలు లేక పోయినను గొడ్రాలుబిడ్డ అనుపేరు వచ్చినట్లుగనూ, మొద్దులో మనిషి లేకపోయినా ధారు పురుషుడని పేరువచ్చినట్లుగను, కుందేటి కొమ్ములు లేకపోయినను కుందేటి కొమ్ము అనే పేరు వచ్చినట్లుగను, ఆకాశ పుష్పము లేక పోయిన ఆకాశ పుష్ప మని పేరు వచ్చినట్లుగను, స్వప్నానందముకు ఆధారము లేక పోయిన స్వప్నా నందమనే పేరు వచ్చినట్లుగను, ఈ ఎరుక అనేది లేక పోయినను పై వాటి కంతా లేకనే పేర్లు యెట్లు వచ్చినవో అలాగుననే ఈ ఎరుకకుగూడ ఎరుక అనే పేరు వచ్చినదని తెలియవలెను.

68. కం॥ యెరుకోద్భవ మెట్లన్నను–సరళంబగు నారికేళ సలిలముభంగిన్ – యెరుకెట్ల బోవునన్నను – కరిమ్రింగిన వెలగపండు –కరణిగ నెరుగూ తిరిగిరాని కరణింకోటెరుగూ–పరిపూర్ణమున్నాది యెరుకా– తానెరిగితే –యెరుకే మ్రగ్గును–భస్మాసురుడు మ్రగ్గిననాటి – కరణిగ నెరుగూ తిరిగిరాని – కరణింకోటెరుగూ॥ 4

తా॥ శిష్యా! ఈ యెరుకకు యే ఆధారము లేక పోయినను తనకు తాను యెట్లు వస్తూ యున్నదనియు, మరలా తనకు తాను యెట్లు పోవుచున్నదనియు విమర్శకు పోయిన యెడల టెంకాయలోనికి నీరు యెట్లు వచ్చుచున్నదో! అటులనే యెరుక రావడము జరుగుచున్నది. ఏనుగుమ్రింగిన వెలుగపండు యందు గుజ్జు ఎటుల మాయమగుచున్నదో అటులనే ఈ ఎరుక రావడము, పోవడము జరుగుచున్నది ఇట్లు వస్తూ పోతూ యున్న యెరుక ఏ రాక పోకలు లేని పరిపూర్ణము ఒక్కటి యున్నదనియు, ఆ పరిపూర్ణము యున్నందువలన నారాక పోకలు జరుగుచున్నవనియు ఈ యెరుకకు ఏనాడు తెలియ బడుచున్నదో ఆనాడు భస్మాసురుడు తన చేతులను తన నెత్తిమీద బెట్టుకొని తాను భస్మమై పోయి నటుల యీ యెరుకగూడా తన విషయం తాను తెలుసుకొని తాను భస్మమై పోవును.

69. కం॥ సంతోషా సంతోషము – లంతలో గనవచ్చి పిదప నరుగు నెచటికో వింతై య్యున్నది చూచితె యింతియె సుమి యెరుకపుట్టు – వికదెల్పు కోరా–సంశయమేల–యిది నమ్ముకోరా–యంతాని దెలుపూదు యీ దేవమార్గా

మం-దంత్రాట బహు వొన్నెలగుపడి యగుపడ-విక-దెల్సుకోరా—సంశయమేల యిదినమ్ముకోరా॥ 5

తా॥ శిష్యా! లోకములో ప్రతి మనుజునకు ఒక సమయములో సంతోషము గలగడము, మరి యొక సమయములో దుఃఖము గలగడము పరిపాటిగా యున్నది. ఇట్లు కలిగెడి సుఖ దుఃఖములకు నిలకడలేక అంతలో కనబడుచు, అంతలో లేక పోవడము ఎంత విచిత్రముగ తెలియబడు చున్నదో! అటులనే ఈ యెరుకగూడ నిలకడ లేక పరిపూర్ణములోకి రావడము, బహురూపములుగా కొంతసేపు కనబడడము, అంతలోనే తిరిగి పోవడము జరుగుచున్నది. ఈ విషయమునందు సంశయముగాని, అనుమానముగాని లేక దృఢముగా నా మాట నమ్ముము. అంతేగాని ఈ దేవరహస్యమును యెంతని తెలుపగలను. ఎంతని నీవు వినగలవు. అందువలన నీవు విశాలమగు సూక్ష్మ దృష్టితో పరిశీలించిన యెడల నీకు నీకే తెలియబడగలదు.

70. కం॥ రాకడ పోకడ లేకను-యేకస్థితి నుండునట్టి ఈ బయలందున్ రాకడ పోకడ గలిగి యనేకముగా దోచు లేని-యెరుకా సుసీలా—ప్రతిమలోలేని పెరుమాళ్ళలీలా-లేకాతోచిన యెరుక లేనేలేదనుచు నీ-కీ కీలు గురునీవె ఎరుకై తె-జాలుల్లక్కెరుకా సుసీలా-ప్రతిమలో లేని-పెరుమాళ్లలీలా॥ 6

తా॥ శిష్యా! ఏనాడుకూడ రూపనామాదులు పొందక ఏ విధమైన చలనాదులు లేక ఒకప్పుడు రావడము, ఒకప్పుడు పోవడము అనేదిలేక యే మార్పులు అందులో కనపడక ఏకస్థితిగా కదలకయున్న పరిపూర్ణ పరబయలునందు అనేక రూపనామాదులతో, అనేక చలనాదులతో, అనేక విధములైన మార్పులతో సృష్టి నాశములు కలిగిన ఈ ఎరుక యొక్క ఆటలు ఎట్లు ఉన్నవనిన, గుడిలోయున్న ప్రతిమలో దేవుడు వున్నాడనె నమ్మకముతో లోకులందరు పూజాదులు, నిత్య నైవేద్యములు జరుపుచుండినను నిజములో యేనాడు ఆ విగ్రహములో దేవుడు లేనటుల ఈ ఎరుకకూడ లేనిదైనను, వున్నట్లుగా భ్రమింప జేయుచున్నది. ఈ మర్మమును సృష్టి రహస్యము దెలిసిన సద్గురు వలన తెలియబడిన యెడల బ్రాంతి రూపముగా దోచబడు ఈ ప్రపంచ మంతయు కల్పితమని నిర్ధారణయగును.

71. కం॥ వనిగల్లుదకములోపల–తనకై తావొచ్చి తనకుతానేగు విధం బున పరిపూర్ణములోపల తనకై తావొచ్చి యెరుక తనకై తా జనునూ–అచలం బున్నదని-తానెరిగిననూ–తనలేమి నిజమాని తనకె తోచును తోచి – తనకల్మి మృషగా భా–వనజేసి నిలువాక – తనకై తాజనునూ - అచలంబున్నదని – తా నెరిగిననూ॥ 7

తా॥ శిష్యా! చెట్టు లేకనే కాయయున్నదనిన, తల్లిలేకనే బిడ్డయున్నదనిన అది నమ్మదగిన విషయము కాకయుండును. అటులనే ఈ ఎరుకకు మూలము లేకనే యున్నదనిన అది నమ్మదగిన మాటగా యుండదు. అట్టిది ఈ యెరుక అయినప్పటికి పరిపూర్ణమునందు ఈ ఎరుక ఎట్లు కనుబడుచున్నదనిన, వడ గండ్లు జలములో లేకనే వాటికవే కనబడుచు తిరిగి వాటికవే అంతరించిపోయిన టుల, పరిపూర్ణములో ఈ ఎరుక తనకు తానేవచ్చుచు, తనకుతానే అంతరించి పోవుచున్నది. ఇట్లు వచ్చుచు పోవుచున్న ఎరుక పరబయలును ఏనాడు దర్శిం చునో ఆ నాడు తానులేని దానిననియు, అశాశ్వితమనియు తనకు తనకే తెలియ బడుచు తానే లేకుండ పోవును.

72. కం॥ పరిపూర్ణములో దోచుచు-యెరుకే చను తనకుదానె యేర్పడ వినుమీ–తొరటలు తొమ్మిది గలదై -తరితీపుల నొందుచుండి–తనువానదగుచు అచలంబున్నా -దని తాలేననుచూ–మరుగిట్లెరుకకు తెలియ యెరుకె నిల్వదుగాని పరిపూర్ణముండు దాన్నెరిగేదెట్లిక గుర్తు-తనువానదగుచూ అచలంబున్నదని-తా లేననుచూ॥ 8

తా॥ శిష్యా! ఈ ఎరుకకు రూపముగాని, స్థానముగాని సహజముగా లేక పోయినను పరిపూర్ణములోకి మాత్రం తనకుతానే వచ్చుచు, తనకు తానేపోవుచు ఎంతో అంద చందాలతో గూడిన తొమ్మిది రంధ్రములుగల దేహాకారములు దాల్చుచు ఆ దేహ సంబంధమైన చావు పుట్టుకలు, ఆకలి దప్పులు, సుఖ దుఃఖ ములు, పుణ్య పాపములు బంధమోక్షములు, అనుభవించుచు ఒకానొకనాడు తన కంటే వేరుగా అనంతముగా శాశ్వితముగా ఒక పరిపూర్ణమున్నదని తెలుసుకొని ఆ పరిపూర్ణమును సందర్శించిన వెంటనే తానే నిలువకుండాపోవును. పరి పూర్ణము మాత్రము యే కదలికలులేక తనకు తానుగానే యుండును. ఇట్లు నిలువ కుండ పోయిన యెడల ఎరుక ఏ చలనాదులు లేకయున్న ఆ పరిపూర్ణమును మాత్రము ఇట్టిదనియు, అట్టిదనియు యెన్నడు చెప్పలేక పోవును.

73. కం॥ తొలుకారు మెరుపుకైవడి–పొలుపుగ నీళ్ళందుదోచు బుగ్గల రీతిన్–అల సూర్యకిరణమందున-గల నీళ్ళంబలెనె యెరుక–గనపించునయ్యా–అంతలో యచట–గనిపించదయ్యా–కలకాల మొకరీతి గలిగుండదీ యెరుక – తిలకింప పవలు రాత్తిరి దిరుగు విధమూన–గనిపించునయ్యా–అంతలో ఎచట గనిపించదయ్యా॥ 9

తా॥ శిష్యా! ఈ ఎరుకయొక్క నిలకడను గురించి, దీని పరివర్తనము గురించి ఆలోచించుచుండిన యెడల తొలకరి మెరుపు అంతలో గనుబడి, అంతలో యెట్లు పోవుచున్నదో నీటిలో బుడగలు అంతలో గనబడి అంతలో ఎట్లు చితికి పోవుచున్నవో, సూర్యకిరణములతో యేర్పడిన ఎండమావుల జలము అంతలో గనుబడి అంతలో ఎట్లు మాయమగుచున్నదో, రాత్రి రాగానే పగలు ఎట్లు పోవుచున్నదో, పగలు రాగానే రాత్రి ఎట్లు పోవుచున్నదో ఆ విధముగా ఒక క్షణముగూడ ఈ యెరుకకు నిలకడ లేక జాగ్రత నుంచి స్వప్నములోకి, స్వప్నమునుండి సుషుప్తిలోకి, సుషుప్తి నుండి తిరిగి జాగ్రత్తలోకి బండి చక్రం లాగా తిరుగుచుండును. గాని ఒక్కరీతిగా యుండు స్థిమితము యెప్పుడూ ఈ ఎరుకకు లేనే లేదని తెలియవలెను.

వి॥ తల్లిలేని బిడ్డకు కులము, గోత్రము, నీతి, శుభ్రత, ఒక స్థానములో నిలకడ యెట్లు వుండదో అట్లనే ఈ మూలములేని ఎరుకకుగూడ ఒక భద్రత, ఒక నిలకడ అనేది లేక వ్యవహరించుచుండును.

74. కం॥ కట్టెందునిప్పులేకనె – కట్టియ నొక సమయమందు గనుపడి బహుగా–మిట్టిపడి తుదకు గనుపడ-దట్టిదె సుమి ఎరుక పుట్టు–వమల విచారా తనకుదానె-యెరుదెంచె-నౌరా–పుట్టుగిట్టుటలానె నట్టేటనిలచుండి–బట్టాబయలు పొడగట్టిన గనుపాడ–దమలావిచారా–తనకుదానె-యరుదెంచె నౌరా॥ 10

తా॥ శిష్యా! మెలుకువ గలిగిన బుద్ధితో ఆలోచించుచుండిన యెడల ఈ ఎరుకయొక్క రాక పోకలు, దీనిచర్యలు విచిత్రముగా కనబడుచుండును. కట్టెలు యేదానికది వేరు, వేరుగా యున్నప్పుడు నిప్పు అనేది యెచ్చటా కనబడక యుండును. ఆ కట్టెలు ఒకదానితో నొకటి రాపిడి చేసిన యెడల అక్కడనే ఒక నిప్పు కనబడి ఆ కట్టెలను కాల్చి తుదకు ఆ నిప్పుగూడ కనబడక యెట్లు పోవుచున్నదో ఆ విధముగానే ఈ యెరుకగూడ తనకు తానే పుట్టుచు, తనకు తానేనశించుచు చావుపుట్టుకలనే మహాసంసార ప్రవాహములోబడి మునుగుచు,

తేలుచు కనురెప్ప పాటైనా సుఖములేని ఈ ఎరుక ఒకనాడు ఆ బట్టబయలును దర్శించిన వెంటనే ఆ ఎరుక పోలిక యెచ్చటను కనిపించకపోవును. ఈ ఎరుక పాట్లు యిట్లున్నవని పరిశుద్ధ బోధకుడవై వినగలిగితివేని ఈ ఎరుక మర్మము తెలియగలదు. అట్టి విమల విచారణ నీకు లేకయుండిన ఎడల యెరుక భ్రాంతి నీకు తొలగక యెరుకనే పరిపూర్ణమని నమ్మవలసి వచ్చును.

75. కం॥ తన మూలము తలిదండ్రులు - తనవలెనె వారు వారి తలి దండ్రులకున్ - తనవలెనెగాని యన్యము - గన జనన స్థానమొకటి - గలదాన తరమా - బ్రహ్మాదుల - కది దెలియ తరమా - వినుము ఈ బ్రహ్మాండ జననాము నీ నాయం - దున నైనదిదియు గాదని వేరే యింకొక్కటి - గలదనతరమా - బ్రహ్మాదూల - కదిదెలియతరమా॥ 10

తా॥ శిష్యా! ఈ సృష్ఠిరహస్యము చాలా విచిత్రమైనదిగా యుండును. ఈ రహస్యమును సూక్ష్మముగా శాస్త్రముల పరిశోధన చేతను తన స్వాను భవము చేతను పై నుండి ఈ దేహము వరకు విచారించిన వారికి అందున్న నిజము గ్రహించగలరు. కాని అట్లుగాక తెలుసుకోవడము మహా కష్టమైనదిగా యుండును. గింజలో రెండు బద్ధలమధ్య ఒక అంకురము పుట్టుచుండును. ఆ అంకురానికి ఆ రెండుబద్దలు ఎట్లు ఆధారమగుచున్నదో అట్లనే ఈ తను వులు ఏర్పడుటకుగూడ తల్లిదండ్రులు ఆధారముగా యుందురు. ఆ తల్లి దం డ్రులకు వారి తలిదండ్రులు వారికి వారి తలిదండ్రులు కారణ మగుచుందురు గాని అట్లుగాక సృష్ఠికి మరొక మూల కారణముందని తెలుపుటకు బ్రహ్మాదు లకుగూడ సాధ్యముగాక యుండును. ఈ బ్రహ్మాండ బాండములన్నియు నీవు నేను అనుచుండు ఎరుకవలనే నేర్పడినవి. కాని వేరే ఇంకొక దానివలనగాని, పరిపూర్ణమువలనగాని ఈ జగత్‌సృష్ఠి కలుగలేదని స్పష్టంగా తెలియవలయును.

76. కం॥ కనరానిదాన్ని శూన్యం - బని యనదగుగాని బయలు ననద గదుసుమీ - కనవచ్చుచున్న దిందులో - కనుగొనుటకు యెరుకలేదు - కనుగొన రాదా - యెరుకనె శూన్యమని - యనరాదా - కనవొచ్చెనా లేద కనుగొంటిలే దాని యనరాద భయమేమి యనుమానించకు మిదుగో - కనుగొనరాదా - యెరుకనె శూన్యమని - యనరాదా॥ 12

తా॥ శిష్యా! ఒకప్పుడు కనబడుచు ఒకప్పుడు కనబడక పోవుచున్న యెరు కను శూన్యమనియు, లేనిదనియు తెలుపవచ్చునుగాని ఆది మధ్యాంతములు లేక

భూత భవిష్యత్ వర్తమానకాలములయందు ఒకేతీరుగా ప్రత్యక్షంగా కనబడు చున్న ఈ అచల పరిపూర్ణమును మాత్రము శూన్యమనియు, లేనిదనియు చెప్ప గూడదు. ఆ అచల పరిపూర్ణములో ఈ ఎరుక ఒకప్పుడు వచ్చుచు, ఒకప్పుడు పోవుచున్నదని నీకే తెలియబడుచు తెలుసుకొనే దానికి ఈ ఎరుకే లేక పోవు చున్నది. అచల పరిపూర్ణము మాత్రము ఏ కాలమందును కదలక కనబడుచు, వున్నది వున్నట్లుగానే యున్నది. అట్టిదైన పరిపూర్ణమును శూన్యమని నీవు తెలు పక ఒకప్పుడు కనబడుచు, ఒకప్పుడు కనబడక పోవునది ఈ ఎరుకే అయినం దువలన ఆ ఎరుకను శూన్యమని తెలుపుటకు భయపడక యెరుకను శూన్యమ నియు, బట్టబయలును సత్యమనియు నిర్భయంగా యెలుగెత్తి పలుకుచుండుము.

77. కం॥ యెరుక బయలందులేమిని-యెరుకను శూన్యంబటంచు యెరి గించబడెన్-యెరుగుమిదె ఆకసం-బిట్లెరిగితె యెరుకాకసములు-యేకమౌగదరా ఆకసము బయ-లేకమెట్లౌరా-పరిపూర్ణమిదుగొ కన్పడు శూన్యమనరాదు-యెరి గుండు మెదిరిస్తె-యిక నాపై జూచేవు - యేకమౌగదరా ఆకసము బయ-లేకా మెట్లౌరా॥ 13

తా॥ శిష్యా! ఈ ఎరుక పరిపూర్ణమందు కనబడక రూపములయందు మాత్రం క్రియారూపముగా వర్తించుచు, ఒక సమయములో కనబడుచు, ఒక సమయములో కనబడక పోవుటవలన ఈ ఎరుకను శూన్యమని చెప్పవలసి వచ్చి నది. ఈ ఎరుకయే ఆకాశముగాను, జ్ఞాతగాను, శబ్దబ్రహ్మముగాను, పరివర్తన ములై కనబడుచున్నది. విచారించిన ఎడల ఓంకారముగాని, ఆకాశముగాని, ఎరుకగాని, శబ్దబ్రహ్మముగాని అన్నియును నువ్వుల యందు నూనె వలెను, పుష్పమునందు పరిమళము వలెను వేరు వేరుగా కనబడక ఒక్కటిగానే యున్నవి. అట్టి ఎరుకను పరిపూర్ణమని తలంచి ఈ రెండు ఒక్కటేనని పొరపా టుతోనైనా నా ముందు తెలుపక యుండుము. ఇదిగో నా చేయి ఎక్కడ ఆడు చున్నదో బాగా చూచి ఏకతీరుగాయున్న పరిపూర్ణ బయలును దర్శించి - అదే సత్యము, స్థిరము అని నిర్ణయించుకొని ఒకకాలమందు కనబడుచు ఒకకాలమందు కనబడక పోవుచున్న ఎరుకనుగాని ఆకాశమునుగాని లేని దానిగా భావించ వలయును. బయలు ఆకసములు రెండు ఒక్కటేనని మాత్రం ఎన్నడూ తలంచ కుము.

78. కం॥ కనుపడెడి బయలులోపల-కనుగొనలేదయ్యె యెరుక గావున శూన్యం-బనవలశె దీన్నె ఆకస-మనవలశెను దీన-విశ్వమాయనోయప్పా-యింతకు వేరె-మాయ యేదప్పా-కనుకానె యీ విశ్వమును లేనిదని లెస్స - విన జెప్పనాయెను కనబోకుండని పోని-మాయనోయప్పా-యింతకు వేరె-మాయయేదప్పా॥ 14

శిష్యా! ఈ అచల పరిపూర్ణము యెటు జూచిన ఒక్కతీరుగా కనబడుచు, నీకు క్రిందా నీకు పైనా నీ ముందు నీ వెనుకానిండి సందులేక నిరామయముగా వెలితి లేక వ్యాపించి యున్నదికదా! అట్టి బయలులో ఈ ఎరుక అంతలో కన బడుచు అంతలోనే కనబడక పోయినందువలన ఈ ఎరుకను శూన్యమని తెలుప వలసి వచ్చినది. ఈ ఎరుకయే ఆకసముగా వర్తించుచు, సకలసృష్టిని జేయుచు, లోకా లోకాలుగా తెలియబడుచు అంతలో లేక పోవుచు వున్నందువలన దీనిని మాయయనియు, ఇంతకు మించిన మాయ ఇంకొకటి లేదనియు పదే పదే నీకు చెప్పవలసివచ్చినది. ఇట్లు తెలుపుటచేత నీ బుద్ధికూడ స్థిరపడివున్న యదార్థము తెలియబడుటవలన ఈ మాయను యేనాడు తలంపుకు రానీయక అచల పరి పూర్ణమునందే దృఢభావము గలిగియుండుము.

79. కం॥ అహమనదుగదా అచలము-అహమున్నదొ లేదొ చూడదది నిజమె కదా-అహమును బుట్టించదుగద-అహముదయించేటివరకె - అదివున్న దిగదా-అహమెవిశ్వమై-నిల్చిందిగదా-అహమె ఈ ముచ్చట్ల నన్నింటెన్నెరుగును గద-అహమె తా లేనాని యరిగితె సరిగద - అదివున్నదిగదా-అహమెవిశ్వమై నిల్చిందిగదా॥ 15

తా॥ శిష్యా! ఈ బట్టబయలందు ఏ కదలికలుగాని, ఏ గుణములుగాని, ఏ మార్పులుగాని, ఏ రూపాదులుగాని, ఏ చలనాదులుగాని, ఏ ప్రళయములు గాని లేక యెల్ల కాలముల యందును స్తబ్దతగానే యున్నది. అట్టి దానిలో అహము (ఎరుక) లేనందువలన, నేను ఇట్లు యున్నానని యెప్పుడూ తాను అనుకోదు. దృశ్యముగా కనుపించు సకల రూపాదులను ఈ అచలము సృష్టిం చనూలేదు. ఆ రూపాదులు తనలో యున్నవనికూడ తాను ఎరుగదు. ఈసృష్టి జరుగకమునుపే ఈ విశ్వము కనబడకముందే ఆ పరిపూర్ణము తనకు తానుగా సనాతనముగా యున్నది. ఈ రూపాదులనెల్లయు ఎరుకే సృష్టిజేయుచు ఎరుక

జేసిన రూపాదులను యెరుకే జూచుకొని ముచ్చటపడుచు ఒక నాడు తన విషయము తానే తెలుసుకొని నేను లేని ఎరుకనని తనకు తనకే దృఢమైనపుడు ఇక వున్నది ఆ పరిపూర్ణమేగాని రెండవది లేదని నిశ్చయ భావము గలిగి ఈ ఎరుకే లేక పోవును.

80. కం॥ ఆవరణము నాకసము – నిరావరణము నచలమనుచు అనిరి మహాత్ముల్ – ఆవరణము మితిగలిగిన–దావరణములేంది–యమితమని తెలుసుకోరా–యీ రెంట్ని వే–రని కనుక్కోరా–ఆవరణముననే నిరావరణమునుజూచి యావరణమెడలీన నావాలమాట లేదని కనుక్కోరా – యీ రెంట్ని – వేరని కనుక్కోరా॥ 16

తా॥ శిష్యా! ఆకాశము ఆవరణముగా మితము గలిగి సర్వ సృష్టికి ఆధారమగు కూటస్థ బ్రహ్మముగా యున్నదనియు, పరిపూర్ణము మాత్రము నిరావరణమునై మితము మీరినదై, సర్వసృష్టికి అతీతముగా యున్నదనియు, ఈ రెండు వేరు వేరుగా యున్నవనియు, ఈ రెంటి ధర్మములు యెరిగిన మహాత్ములు తెలుపుచుందురు. ఆకాశములో శబ్దగుణమున్నది. పరిపూర్ణము నిశ్శబ్దముగా యున్నది. "ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో పూర్ణముచ్యతే" అని శ్రుతి యున్నది. ఇట్టి ఆవరణమైన ఆకాశమే ఎరుకగాను, జ్ఞాతగాను యుండుటవలన అజ్ఞాత అను ఎరుక చేతనే నిరావరణమునైన పరబయలును తెలుసుకొని ఆవరణముతో గూడియున్న ఎరుక పోయినపిమ్మట నిరావరణమైన అచలము మిగిలి యుండును. ఇక మాట్లాడుటకు ఎరుక అక్కడలేక పోవుచున్నదని తెలియుము.

వి॥ "సర్వ సృష్టి రయం యాతి తదాదృశ్యం సవిస్తరం బ్రహ్మాండ
మూష్మరూపేణా గగనే మిళితం భవేత్"

ప్రపంచ రూపాదులన్నియు నేకపదార్థముగా మారునట్టి స్థానమే ఆకాశమనబడును. ఆ ఆకాశముయొక్క సూక్ష్మ భాగమే ఆత్మ (ఎరుక) అనబడుచున్నది. ఈ ఆత్మ చేతన పద్దతిలో యుండునపుడు సృష్టి నిర్మాణ దక్షత గలుగు చుండును. ఈ ఆత్మ తటస్థ లక్షణమందు సర్వమూ లయమగు చుండును. కావున మనము చూచుచున్న సర్వ బ్రహ్మాండ భాండములన్నియు లయ కాలములో ఆవిరి రూపముగామారును. అది ఆకాశమునందుకలసి ఆత్మయందు లయమగు చుండును. ఇట్లు ప్రవృత్తి, నివృత్తులు పరంపర జనితములై ఆకాశాత్మలయందే లయమగుచుండును గాని పరిపూర్ణమునకు ఏ సంబంధము లేక యుండును.

81. కం॥ ఆకాశము శూన్యంబని–లోకులు మొరబెట్టి దానిలో పవనా దుల్ - ప్రాకటముగ బుట్టినవని–చీకాకుగా జెప్పినారు - ఛీ వినరాదూ - వంధ్యా - సంతీ - క్షితిలోన లేదూ - కాకుంటె విను చోద్యమౌ కుందేటికి కొమ్ము - లీ కాల మునసె మేమే కంటిమనుమాట ఛీ–వినరాదూ–వంధ్యా సంతిక్షితిలోనలేదూ॥

తా॥ శిష్యా! కొంతమంది తత్వవేత్తలు ఆకాశమును శూన్యమనియు, ఇందులో యేమియు లేదనియు తెలుపుచు మరలా శబ్దగుణమైన ఆకాశములో శబ్ద స్పర్శ గుణమైన వాయువు కలిగినదనియు, ఆ వాయువులో శబ్ద స్పర్శ -రూప గుణమైన అగ్ని పుట్టినదనియు, ఆ అగ్నిలో శబ్ద స్పర్శ రూప–రస–గుణమైన జలము కలిగినదనియు, ఆ జలములో శబ్ద - స్పర్శ – రూప – రస – గంధ ములతో గూడిన పృథివి ఏర్పడినదనియు, నిర్ణయించి ఈ పంచ భూతము లచే ప్రపంచ సృష్టి అయినదని తెలుపుచుందురు. ఈ ఆకాశము శూన్యమైన యెడల మిగతా నాలుగు భూతములు ఎచ్చటనుండి వచ్చియుండును. ఈభూత ములే లేకపోయిన ఈ సృష్టియంతా ఏ దానిచేత కనబడుచుండును. అందువలన ఈ శబ్దగుణమైన ఆకాశమే ప్రతివాక్కు - ద్వారమునందు పలుకు రూపముగా కనబడుచున్నది. ఇట్లు ఆకాశమునకు క్రియాలక్షణములు కనబడుచూ యుండగా ఆ ఆకాశము శూన్యమని తెలుపుట ఎట్లున్నదనిన! ఆమె బిడ్డలులేని గొడ్రాలు అని తెలుపుచూ ఆ బిడ్డను మేము చూచి వచ్చినామని తెలుపుట యెంత విచిత్ర ముగా యుండునో కుందేటి కొమ్ములను మేము కొలత తీసుక వచ్చినామని తెలుపుట యెంత శోద్యముగా యుండునో అట్లనే ఆకాశము శూన్యమని తెలు పుచు మరలా అందులో పవనాదులు పుట్టినాయని తెలుపు మాటలు వింతమాట లుగా కనపడుచుండును. ఆ మాటలు మనస్సునకు చీకాకు పరుచుటయే గాక, విసుగును కలిగించు చుండును.

82. కం॥ లేనెరుకను బయలందున–లేనేలేదనక యితరులేలపలికిరో– లేనిది కలదని పిదపను–లేనేలేదనుచు సిగ్గు - లేకా యీ లీలా–ఛీ వినకీ–చీకాకు నీకేలా–మేనం దశుద్ధాము తానలుకొని మళ్లి–పూని కడిగినరీతి నౌను శిగ్గొక యింత - లేకా యీ లీలా–ఛీ వినకీ–చీకాకునీకేలా॥ 18॥

తా॥ శిష్యా! లోకములో కొంతమంది పరిపూర్ణ బోధలోయున్న, స్వచ్ఛంద స్థాయిని తెలుసుకొన లేక ఆ బోధలోయున్న ధర్మ మర్మములు అట్టి

అచల గురువులదగ్గర నిలకడ గలిగి పొందలేక అనుభవములేని మాటలతో ఈ ఎరుక బయలులో యుందని కొంతసేపు తెలుపుచుందురు. మరలా కొంతసేపు ఈ ఎరుక బయలులో లేదని తెలుపుచుందురు. ఇట్లు దెలుపుటకు వారికి సిగ్గు కూడ యుండదేమో. ఎరుక బయలులో యున్నయెడల వున్నదని తెలుపవచ్చును. లేక యున్నచో, లేదని తెలుపవచ్చును. ఛీ - ఛీ - ఈ ధ్వందపు మాటలు యెన్నడూ వినకూడదు. వారిప్రక్కకూడ ఉండగూడదు. ఛండాలమును శరీరమునకు పూసుకొనడమెందుకు, దుర్గందమని మరల కడగడమెందుకు. అటులనే ఈ ఎరుక బయలగుతుందని తెలుపడమెందుకు మరలా యెరుక బయలుకాదని తెలుపడమెందుకు. ఈ నిలకడలేని గురుబోధలను యెన్నడు నీవు వినబోకుము. ఆ మాటలను గూడ నీ చెవిలోనికి రానీయకుము.

వివరణ: ఉదయమునుండి సాయంత్రమువరకు కష్టపడి వడికిన నూలు దారముతో పొయ్యిని వెలిగించినట్లు లోభిబుద్ధిగల ఎరుకభ్రాంతి పరులు పరిపూర్ణబోధను చిన్నా భిన్నము చేయుచుందురు.

83. కం॥ అన్నపుసూక్ష్మాంశము మను-సెన్నగ నీరంబు ప్రాణ మెరుగుము యీ రెం-డెన్నడు కలియవొ నాడే-సున్నసుమీ యెరుకమాట-సుగుణ సంపన్నా-కలసుటె యెరుక-సుమి యింతకన్నా – వున్న దెరుక మూలమన్నాది వినలేదు-యెన్నాడు యీ భ్రాంతి నిన్నంటనివ్వకు-సుగుణ సంపన్నా-కలసుటె యెరుక సుమి యింతకన్నా॥ 19

తా॥ శిష్యా! ఏ ఎరుకను సకలశాస్త్రములలో దైవముగా నిలిపి పోషించుచున్నారో! ఆ ఎరుక రహస్యము విచారించబోయిన యెడల మనము నిత్యము భోంచేయుచున్న అన్నము జీర్ణకోశములోబడి అచ్చట మూడు భాగములై ఆ మూడు భాగములలో స్థూలాంశము మలముగాను, మద్యాంశము మాంసముగాను, సూక్ష్మాంశము మనసుగాను యేర్పడుచున్నది. ఇక మనము త్రాగేనీరు కూడ మూడు భాగములై ఆ నీరు స్థూలాంశము మూత్రముగాను, మధ్యాంశము రక్తముగాను, సూక్ష్మాంశము ప్రాణముగాను యేర్పడుచున్నది. ఇట్లు అన్నము వలన మనసుయున్ను నీరు వలన నాశికలోవచ్చు ప్రాణమున్ను-కలుగుచున్నవి. ఈ ప్రాణ మనస్సులురెండు జాగ్రతావస్తలో (ముఖ స్థానమందు) కలసినప్పుడు మాత్రము నేను నేను అను గుర్తెరిగే ఎరుక ఏర్పడి నా నా సంకల్పములు, నా

నా కోర్కెలు జనించు చున్నవి. స్వప్నావస్త-సుషుప్తావస్తలలో ఆ మనస్సు ముఖ స్థానమును విడచి కంఠస్థానము, నాభిస్థానము చేరుటవలన అక్కడ ఎరుక లేక యుండుట వలన ముందుండు జాగ్రతావస్థలో యున్న అభిమానములు, కోర్కెలన్నియును కోల్పోవుచున్నవి. ఈ విషయములన్నియు సూక్ష్మముగా ఆలోచించగలిగే సుగుణ సంపన్నుడా! అన్నము వలన యేర్పడిన మనసు, నీరమువలన నేర్పడిన ప్రాణము ఈ రెండు ఒక దగ్గర యున్నప్పుడు ఎరుక కనబడుచుండును. ఈ రెండు వేరయిన యెడల ఎరుక కనబడక పోవుచుండును. ఈ విధముగా విచారించగలిగినయెడల ఎరుకకు మూలము కనపడకవుండును. అందువలన ఈ ఎరుక భ్రాంతిని ఎన్నడు నీ దగ్గరలేకయే జేసుకొనవలయును. పై విషయము చాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకమహర్షి శిష్యుడైన శ్వేతకేతువునకు తెలిపి నట్లును భగవద్గీత: 17-7 శ్లో॥ నందుయున్నది.

యెరుకోత్పత్తి లక్షణం ఐదవ అధ్యాయం సమాప్తము.



## -: 6. యెరుకను విడిపించుట. 22 :-

84. కం॥ పిల్లలు తాట్యాకులతో-పిల్లల గావించి పెండ్లి పేరంటంబుల్ కొల్లలుగజేయ వారల తల్లులుగని సత్యమనుచు-తలచేరా మదినీ-నిను నీవిట్లు దలచరా మదిని॰కల్లా సంసారముగని మానవులు సంత-శిల్లాగ గురు మంత్ర సిద్ధూలు నిజమాని-తలచేరా మదినీ-నిను నీవిట్లు దలచరా మదినీ॥ 1

తా॥ శిష్యా! పిల్లలు ఆటలాడుకొను సమయములో మట్టితో, రాయితో గూడిన ఆడబొమ్మలను, మగబొమ్మలను చేసుకొని పాతగుడ్డలు చీల్చి చీరలు, దోవతలు కట్టబెట్టి పెండ్లిండ్లు, పేరంటంబులు, ఊరేగింపులు చేయుచు, గుజ్జన గూళ్లను వండుకొనుచు అందులో నొకరినొకరు కలహములుపెట్టికొని పోట్లాడు కొనుచుందురు. ఆ పోట్లాటలను చూచుచున్న పెద్దలైన తలిదండ్రులు నవ్వుకొనుచు, వీరికి తెలియక పిల్లచేష్టలు చేయుచున్నారని అది నిజంకాదని తలంచు చుందురు. అట్లనే ఈ లోకములో పామరులుగా యున్నవారు భ్రమ రూపమైన కర్మలు జేయుచు, విగ్రహ పూజలు సలుపుచు అవి సత్యమని సంతసపడువారి నెల్ల గురుమంత్ర సిద్ధులుగాయున్న మహాత్ములు జూచి వారిమదిలో ఇట్లు తల

పోయుచుందురు. చెట్టుమీదకొమ్మ చెక్కితే బొమ్మ, ఆలయంలో పెడితే అమ్మ అయినదని వారిలో వారు నవ్వుకొనుచుందురు. అందువలన నీవుగాని, నీతో గూడిన ప్రపంచముగాని సత్యమని నమ్మియుండకుము.

వి॥ అమావాస్య చీకటియందు ఆవరించిన మేఘములు చీకటిని అభివృద్ధి పరచినట్లు మానవులుజేయు కర్మలు అజ్ఞానమును అభివృద్ధి జేయునేగాని జ్ఞానమును గలిగించలేవు. అట్టి జ్ఞానము గురుబోధయందే సంపాదించవలయును.

85. కం॥ మేనెరుకల రెండింటిలొ - దానినియిది దీనినదియు తగ సృజియించున్ – మేనెరుక లివియు మూలము - లేనిదె సృజనయ్యె ననుచు - లేనేలేవంటి – అంటెతప్పు - లేనేలేదంటీ – మేనెరుకలిప్పుడు దేనందున్నవో చూచి - లేని మేనెరుకల లేనివనుచు నమ్ము లేనేలేవంటి - అంటెతప్పు లేనే లేదంటీ ॥ 2

తా॥ శిష్యా! ఈ మేనెరుకలు రెండు ఒక దాని నొకటి సృష్ఠించుకొనుచు "అనగా" మేనువలన యెరుక పుట్టుచు, ఎరుకవలన మేనుపుట్టుచు ఒక దానితో నొకటి వృద్ధిపొందుచు వకదానిని విడిచి వకటి యుండలేక వచ్చేటపుడు రెండు కలిసివచ్చును. పొయ్యేటపుడు రెండు కలిసి పోవుచు వాటికవే రావడము వాటి కవే పోవడం జరుగుచున్నది. కాని వీటికి ఇంకొకటి మూలమున్నదనే మాట మాత్రం అనగూడదు. ఆ మాట నిజమేనని, అట్లు అనడము తప్పుకాదని నేను తెలుపుచున్నాను. ఈ నేను మేనులు రెండు వకటిగా కలుసుకొని దేనియందు కనబడుచున్నవో, దేనిలో ఆటలాడు కొనుచున్నవో ఆ పరిపూర్ణమును బాగుగ యుండ జూచుకొని లేని మేనెరుకలను లేనివిగానే తలంచుచుండుము.

వి॥ మేనెరుకలు రెంటిలో ఒకటి సత్యమనియు, రెండవది అసత్యమనియు

"నాసతో విద్యతే భావోనభావో విద్యతే సతః"

తా॥ దేహము అశాశ్వితము కలదియై, చావు పుట్టుకలతో నున్నదనియు, ఆత్మ శాశ్వితమునై చావు పుట్టుకలు లేక యున్నదనియు, భగవద్గీత; 2-16 శ్లో॥ చెప్పబడుచున్నది.

86. కం॥ యెరుక పనిచేయదనకుము – యెరుగుట మరచుటలు రెండు యెవ్వరిపనులో-యెరిగింపుము నా[మోలను-వెరువను తప్పితివెదెబ్బ – వేశేను

చూడూ—అట్లనకుండా జేశేనునేడూ-వెరపించుడెదెబ్బ వేశేన నాతండ్రి-ఎరిగించి పై మర్మమెరుకాను నేదీశి-వేశేనుచూడూ—అట్లనకుండ-జేశేనునేడూ॥ 3

తా॥ శిష్యా! ఈ ఎరుకకు అచల లక్షణమున్నదని కొంతమంది తెలుపుటవలన, ఆ మాట విని ఈ ఎరుక యేపనియు చేయక అచలముగా యుండునని యెన్నడూ తలంచబోకుము. ఈ ఎరుక అచలముగా కదలకయున్న ఎడల ఎరుగుట, మరచుట, సంకల్పించుట, నిస్సంకల్పముగా యుండుట ఈ పనులెల్లయు యెవరు చేయుచున్నారో ఆలోచించి తెలుపుము. ఆ ఆలోచన సరిగా చేయక తప్పు చేసితివేని తప్పక నీమీద దెబ్బవేసెదను. మళ్లీ ఆలోచన లేని మాటలు మాట్లాడక చేసెదను. ఇట్లు తెలుపుచున్న గురుమూర్తిని శిష్యుడుజూచి అయ్యా వూరకే మాట మాత్రముగా నన్ను భయపెట్టక, నిజముగా నన్ను కొట్టి అయినా, తిట్టి అయినా తండ్రితో సమానముగా దగ్గరకు తీసుకొని ఏ దాని యందు యెరుక మరుపులు కలుగుచున్నవో, ఏ దానిలో ఎరుక మరుపులు లేక యున్నవో పై మర్మములనంతా నాకు దృఢముగా నెరిగించి మరలా సంశయములు లేక జేయుమని శిష్యుడు ప్రార్థించగా గురువు దయగలవాడై యెరుక మర్మములను యెరిగించి యెరుకయందే ఎరుకమరుపులు, సకల సంకల్పములు పుట్టుచున్నవిగాని బయలునందు యేదియు పుట్టలేదని నీకు స్పష్టముగా తెలిసేటట్లు చేసెదనని గురువు గట్టిగా తెలుపుచున్నాడు.

87. కం॥ లేనికల గలిగినప్పుడు-దానికి దశదిశలయందు తగ మొదట కొనన్ - తానంటకున్న మేల్కను - లేనికలే చూచెనేని - లేకాపోవుగదా - కలతో మేల్కలేకా పోదుగదా - లేనెరుక బయలు లీలీలాగ నీకెపుడు - గాన వచ్చితె బోధగావాలె ననవపుడు - లేకా పోవుగదా-కలతొ మేల్కలేకా పోదుగదా॥ 4

తా॥ శిష్యా! ప్రతిమనుజునకు కల అనేది సహజముగానే వస్తూయున్నది గదా? ఈకళను పొందుచున్నంతవరకు మెలుకువ అనేది అచ్చటగాని, ఎచ్చటగాని ఏ తట్టుచూచినా కనబడక యుండును. తిరుగా మెలుకవవచ్చిన తర్వాత ఆ మెలుకువలో ఆ కళను చూడబోయిన ఆ కల అచ్చట, యెచ్చట యేతట్టు జూచిన కనబడక యుండును. లోకములో ఈ కల మెలుకువలను తెలియనివారు ఎవ్వరూ యుండరు. ఈ కల రానివారు ఒకానొకరు యుండినను వుండ

వచ్చును. వారు ఎరుక భ్రమలేని శుద్ధ జ్ఞానులగుటవలన వారికి మనోవాసనలు లేకపోవుటచేత వారికిమాత్రమే కలరాక యుండునుగాని ఎరుక భ్రమలోయున్న వారి కందరికి స్వప్నములు తప్పక వచ్చుచునే యుండును. ఇట్లు వచ్చు చున్న కల యున్నంతవరకు జాగ్రత యెట్లు కనబడదో, జాగ్రత యున్నంత వరకు కల యెట్లు కనబడకయుండునో, అలాగుననే కల అనే ఎరుక యున్నంతవరకు జాగ్రత అనే పరిపూర్ణ దర్శనము కాకయుండును. జాగ్రత అనే పరిపూర్ణ దర్శనము అయినవారికి కల అనే ఎరుక కనబడక యుండును. ఈ లాగున యెరుక పరిపూర్ణములు రెండు ఒకదాని నంటక ఒకటి యున్నదని ఏనాడు ఈ అచలబోధ దృఢమై ఎరుక భ్రాంతి లేకపోవునో, ఆనాటికి ఈబోధ సమాప్తమై మరలా మరలా ఈ బోధను వినవలయుననే కోరిక గలుగక యుండును.

88. కం॥ వొంటుకు దాపల బిందో్వం – ట్లంటించిన కొలది లెక్క అధికంబగు నా – వొంటుకు వలపలబిందో్వక – టంటించిన లెక్క వృళ్లక్యోగదనోయీ – వొంటుండి లేం – దొగదనో యీ – తంటాదీరును, చూడు దాని వలెనె యెరుక – కంటె బయలును తాను గలిగుండి తనకుళ్ళక్యో గదనోయీ వొంటుండి లేందొగదనోయీ॥ 5

తా॥ శిష్యా! యెన్నో చిత్ర విచిత్రములుగా కనిపించుచున్న ఈ యెరుక పుట్టువు మూలమును యదార్థముగా విచారించబోయిన బుద్ధిమంతులకు దీనికి ఆధారమంటూ వకటి కనబడక పోయినను అదిఉన్నట్లుగా కనిపించుచు ఎంత వారినిగూడ భ్రమింపజేయుచు యెన్నో ఆశలను కలగజేయు చున్నవి. అట్టి ఎరుక గుట్టును గుర్తెరిగిన అచల గురుపుత్రులు దీనిని వారి దృష్టితో యెట్లు జూచుచుందురనిన ఒకటి అనుఅంకెకు కుడిప్రక్కన సున్నా పెట్టిన పదియగును. యింకోసున్న పెట్టిన నూరు అగును సున్నాలు పెట్టేకొలది లెక్క అధిక మగుచుండును. అదే ఒకటి అను అంకెకు ఎడమవైపున ఎన్ని సున్నాలు బెట్టినా ఆ ఒకటిగాని ఆ సున్నాలకుగాని గౌరవం ఆదిక్యత కలుగకయుండును. అట్లనే ఒకటికి కుడి ప్రక్కన పెట్టిన సున్నాలుగా పరిపూర్ణమును చూస్తూ యుండవలయును. ఒకటి యెడమ ప్రక్క పెట్టిన సున్నాలుగా ఎరుకను జూస్తూ యుండవలయును, ఇట్లు ఎరుక పరిపూర్ణములను చూస్తూ యున్నప్పుడు కంటికిముందు యెరుక కనబడుచుండినను ఎడమ ప్రక్క యున్న సున్నాలు వుండియు లేనివే అగుటవలన ఆ సున్నాలకు విలువలేనియట్లు ఈ ఎరుకకు ఆదిక్యత లేకపోవును.

ఆ ఆధిక్యత ఈ ఎరుకకు ఎప్పుడు లేకపోవునో ఎరుకతో కలిగే ఆశలుగాని, మోహాదులుగాని, అందులో గలిగే ప్రియ ప్రమోదములుగాని ఇక ఏమియు నీదగ్గర పుట్టకుండపోవును. అప్పుడు నీ హృదయములో కుంభవర్షము కురిసి ఆగిపోయినట్లు వుండును.

89. కం॥ యెరుకొక్కటుండెనేనియు – యెరుకే ఈ విశ్వరూప మేర్పడ దాల్చున్ – యెరుకొక్కటి లేకుండిన - యెరుకైన ప్రపంచమున్న – దెవరెరిగేరికనూ - లేదనసైన – నెవరుండేరికనూ - పరిపూర్ణమైనట్టి బయలుండ గనిపెట్టి - గురునీ వాక్యముబట్టి – గురుతూ బోగొట్టితె యెవరెరిగేరికనూ - లేదనసైన నెవరుండేరికనూ॥ 6

తా॥ శిష్యా! ఈ ఎరుక ఒక్కటి యుండుట వలన సమస్త రూపాదులు ఏర్పడి బ్రహ్మాండ భాండములుగా ప్రపంచమను పేరుతోకనులకు కనబడుచున్నది. ఈ ఎరుక అనేది లేకపోయిన యెడల ఈ సృష్టియంతయు నేదానితో నేర్పడి యుండగలదు. ఇది ప్రపంచమని ఎరుగుటకుకూడ ఏదియుండి ఎరుగగలదు. సృష్టిరావడానికిగాని, ఈ సృష్టిని ఎరగడానికిగాని ఎరుకే ఆధారమై యుండుటవలన ఈ ఎరుకనే బ్రహ్మమని ముందు పెద్దలంతా "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా" అర్జునా! నాలో స్వకీయమగు మాయాశక్తి యుండుటవలన ఆ మాయాశక్తితో రూపాదులను నిర్మించుకొని ఆ రూపాదులలో నేను వుండి సకల వ్యవహారములు జరుపుచున్నానని గీతలో కృష్ణభగవానుడు 4-6 శ్లోకములో తెలిపినట్లు ఈ ఎరుకకుయున్న సమర్థత లేనిదానిని కలిగించు "మాయాశక్తి" యుండుటవలన ఆ శక్తితో రూపాదులను జేయుచు, ఆ రూపాదులలో తానువుండి ఆ రూపాదులను ఆడించుచు, తాను పొయ్యేటప్పుడు తనతో ఏర్పడిన రూపాదులనుగూడ తనతో తీసుకొని పోవుచుండును. ఇట్లు ఈ ఎరుక రూపాదులతో వచ్చుచు, రూపాదులతో పోవుచు రాక, పోకలు గలదియై యుండును. ఏనాడు అచల బోధకుడైన సద్గురువువలన రాక పోకలులేని పరబయలును దర్శించిన వెంటనే రాక, పోకలు కలిగిన ఎరుకకు తనమర్మము తెలియబడి ఆ ఎరుకగుర్తు రహితపడగానే ఇక ప్రపంచమున్నదనిగాని, లేదనిగాని యెరిగేవారు యెవ్వరూయుండరు.

90. కం॥ తెలుపు మృధుత్వము మధురము–గలవస్తువు చక్కెరనుచు గనుగొన్నట్టూ - తెలివి శరీర జగంబులు – గలవస్తువు బిందువనుచు - గను

గొనరాదా - నేదెల్పితే - విని నమ్మరాదా - తెలివీవె బయలుండ దెలసి యీ తెలివిని - తెలివిబాతనె పట్టి తీసివెయ్యర పోని - కనుగొనరాదా - నే దెల్పితే - విని నమ్మరాదా॥ 7

తా॥ శిష్యా! చెక్కర అనునది ఒకటైనప్పటికి దానియందు తీపుగా యుండుట మృధువుగా యుండుట, తెలుపుగా యుండుట అనుమూడు ధర్మములు ఆ చక్కెరలో కలిగియున్నటుల ఎరుక ఒక్కటియైనను దానియందు సర్వమును గుర్తెరుగు లక్షణము, దేహాదులు ఏర్పడు లక్షణము, జగత్తుగా కనుపించు లక్షణము ఇట్లు మూడువిధములైన పరివర్తనము గలిగేలక్షణము. ఈ ఎరుకయందు మూర్తీభవించి యున్నదని తెలుసుకొనుము. ఇదియే వాస్తవమైనదని నా మాటలను సంశయములేకుండా నమ్ముము. ఏ ఎరుక సర్వమును గుర్తించుచున్నదో ఆ ఎరుక చేతనే ఆ అచల పరిపూర్ణమనియెడు సత్యమును ఉండజూచుకొని అసత్యమైన ఎరుకను లేకుండా జేసుకొనుము.

వి॥ లోకములో బొగ్గు సహజముగా నలుపు పదార్థమైనను దానినితెల్లగా జేయుటకు ఏదానిచేతను సాధ్యపడదు. ఒక అగ్ని మాత్రమే తెల్లగాజేయగలదు. అట్లనే సర్వసంశయములతో, సర్వదుఃఖములతోయున్న మానవుని ఏ బోధలు సంశయ నివృత్తిని జేయజాలవు. ఒక పరిపూర్ణబోధయే పవిత్రుని జేయగలదు.

91. కం॥ లేనెరుక బయలులోపల - తానై తనకేరుపడిన తనమూలమునే - తా నెరుగదలచినప్పుడు - తానే - లేకుండు - దృష్టాంతము వినుమిచటా - కల దోచాదె - తనకై తానెచటా -- తానై తోచిన కల తనమేల్కగనబోతె - తానే తనకులేదు తగియున్న దీ - దృష్టాంతము వినుమిచటా - కలదోచాదె తనకై తానెచటా॥ 8

తా॥ శిష్యా! ఈ ఎరుక ఇట్లున్నదని చెప్పుటకు సాధ్యముకాని అనేక దేహాదులను సృష్టిజేయుచు, తానే దేహాదులుగా కనబడుచు తానే ప్రపంచంగా యుండుచు, తానే ఆత్మగాను, తెలివిగాను ప్రసిద్దిని పొందుచు, తానే సర్వమును గుర్తించుచు తానే అఖిల దేహాదులలోయుండి నేను నేను అనుచు ఏ యెరుక యున్నదో ఆ ఎరుక సర్వమును గుర్తించి తెలిసికొనునటుల తన విషయము గూడ గుర్తించి తెలుసుకోవలయునని ఒకనాడు ఆ కోరిక కలిగి తనకంటే ముందుగాయున్న పరిపూర్ణ పరబయలునందు తాను, తన సంపద, తనశక్తి ఎక్కడ

యున్నదని, యెట్లుయున్నదని ఎరుగుటకు ప్రయత్నము జేసిన యెడల తానే కనబడక పోవును. దానికి ఒక దృష్టాంతముగూడ చెప్పుకోవచ్చును. స్వప్నావస్థను పొందుచున్నవానికి ఆ స్వప్నములో ఏనుగులు, గుర్రాలు, రథములు, పల్లకీలు జూచి సంతోషపడుచు మెలకువవచ్చి చూచితే అచ్చట యేమియు కనబడక దానికి మూలమేదియు దొరకక ఎట్లు యున్నదో అట్లనే కలతో సమానముగా తోచిన ఎరుక తన మూలము తాను గనబోయిన తానే లేక పోవును.

వి॥ ఆ దృష్టి కలుగవలయుననిన కలితిలేని స్వచ్ఛందమైన పరిపూర్ణ సద్గురువులవలన కలుగవలసినదేగాని అన్యులకు సాధ్యంకాదని తలంచవలెను.

92. కం॥ చచ్చుట పుట్టుట మేలుక - వచ్చుట గాఢా సుషుప్తి వచ్చుట లీనా - ల్గచ్ఛముగ సహజమెరుకకు - పొచ్చము యీ యెరుక నిల్వబోదు మాయప్పా - అచలము కిట్లు - లేదుగదప్పా మచ్చీకతో రెంటి మర్మాము నీకిప్పు - డెచ్చాగ దెల్పితి నెరుగు - మెరుక నిల్వబోదూ మాయప్పా-అచలముకిట్లు - లేదుగదప్పా॥ 9

తా॥ శిష్యా! ఈ ఎరుక ఒక నిమిషముకూడ స్థిమితముగా యుండలేక పుట్టుట, చచ్చుట, నిద్రపోవుట, మెలకువ వచ్చుట అను నాలుగు ధర్మములు ఈ యెరుకకు సహజముగా కనబడుచు, ఒక నాడు తానే లేకపోవుచున్నది. అచల పరిపూర్ణము మాత్రము అట్లుగాక ఎప్పుడు ఒక తీరుగా యుండుచు, యెల్లవేళల కదలక ఏ మార్పులుగూడ కనబడక, ఉన్నది యున్నట్లుగానే యున్నది. ఇట్లు రెంటి విషయములు అనుభవరూపముగ నీవే చూడగలిగితివేని నీబుద్ధికి నీకే స్పష్టమగుచున్నది. అట్లు నీకు వున్నది వున్నట్లుగా స్పష్టపడుటకు నేను ఇప్పటి వరకు జేసిన బోధవలననే ఆ అనుభవము నీకు కలిగినదని నీకు నీవే తృప్తిని ఆనందమును పొందగలుగు చుందువు. అందువలన ఈ బోధ ప్రయాణములో బాగా నడువగలిగే నేర్పుగలిగి పరిపూర్ణము సత్యమనియు, ఎరుక అసత్యమని ఈ నిర్ణయాన్ని దిగజార్చుకొనక నిలకడ కలిగియుండుము.

93. కం॥ యెరుకను కలలో పురుషుని - కెరుకే యీ విశ్వమగుచు యేర్పడు కలగా – యెరుక బయలుగని తాలేం – దెరిగిన నెరుక కదిమేల్క యిదినమ్ము లెస్సా - యెరుకతో పొందు – వదులాదెపిస్సా – యెరుకానె

కల నీకు యెప్పూడుదోచితె - యెరుకా లేందను మేల్కనెరుగు మప్పుడె వాలు
యి దినమ్ము లెస్సా - యెరుతొా పొందు - వదులాదెపస్సా॥ 10

తా॥ శిష్యా! కలలో కనిపించిన పురుషుని జూచి వానితో మాట్లాడి ఆ పురుషుడు ఇచ్చిన ద్రవ్య వస్తువులను పుచ్చుకొని సంతోషపడి మెలుకువవచ్చి చూచిన యెడల ఆ పురుషుడుగాని, ఆ వస్తుసముదాయముగాని ఎచ్చట వెతికినా కనుపించనియటుల ఈఎరుకగాని, ఈ యెరుకచేసిన విశ్వసముదాయ మంతయు కలతో సమానముగా యున్నది. కనుక గురు మెలుకువ అనే పరిపూర్ణమును దర్శించినవానికి ఆ దర్శన మెలుకువలో ఈ ఎరుకయున్ను, ఈ యెరుకతోనైన ప్రపంచమున్ను ఎచ్చటజూచిన యే మూలజూచిన కనుపించక పోవును. ఇట్లు గురుముఖతా తెలుసుకొనిన పరిపూర్ణమును బాగుగా యుండజూచుకొని కలతో సమానమైన ఈ లేని యెరుక నీకు యెక్కడెక్కడ కనుపించినా ఇది కలయేకదా అని తలంచుటే గురు మెలుకువయని భావింపుము. అట్టి ఆలోచన వితరణలేక తెలివిలేనివాడవై ఇక ఏనాడు యెరుక బయలగునని మాత్రము పొరపాటున నైనా అనబోకుము. యెరుక పొత్తుగాని, యెరుక సంబంధముగాని లేనివాడవై యుండుము. ఇదే గురుమెలకువలోయున్న గొప్పతనమని నెరుగుము.

94. కం॥ చిత్తరువు రంగుగోడల - నెత్తెరగున దెలసినావొ నీవిప్పుడు నీ-చిత్తమున జగము నెరుకను-వృత్తబయలే నట్లదెలియు మూహ తోడుతనూ తెలిసి విడువుమూహ జగములనూ అత్తెరగున జేస్తె ఆవాలి మాటాను-యె త్తెర గని-తెలియ నెవరుండేరటుమీద-నూహతోడుతనూ-తెలసి విడువు - మూహ జగములనూ॥ 11

తా॥ శిష్యా! ఈ యెరుక అచల పరిపూర్ణ పరబయలునందు యెట్లు కన బడుచున్నదనిన వీధులలో గోడలపైన అనేక చిత్ర విచిత్రములైన బొమ్మలు పలురంగులతో వ్రాసియుండడము కనులకు ఎంతో ఆనందము కలిగించు చుండును. ఒకనాడు ఆ ఆనందమును కలిగించిన బొమ్మలు కొంతకాలమునకు మాసిపోవుచుండును. వర్షమునకు కరగిపోవు చుండును. ఆ బొమ్మలను గీకివేసి మరొక బొమ్మలనుగూడ వేయుచుందురు. ఇట్లు అనేకమైనబొమ్మలు ఆ గోడల మీద కనబడుచు కొంతకాలమునకు ఆ బొమ్మలు చెడిపోవు చున్నను, ఆగోడ మాత్రము అట్లనే యుండి తనమీద బొమ్మలు వున్నాయనిగాని, లేవు అనిగాని ఆ గోడలకుయెట్లు తెలియబడక యున్నదో, అట్లనే ఈ ఎరుక జగంబులుగూడ

ఆ పరిపూర్ణములో కనబడుచు వస్తూ పోతూ యున్నను ఆ పరబయలుకు యే మాత్రము తెలియబడకనే ఈ సృష్టివిధానము జరుగుచున్నదని నీకు నీవే ఆలో చనజేసి తెలిసికొనుము. అట్లు తెలుసుకొనిన ఎరుక జగములను లేనేలేవని నీకు దృఢమైన యడల ఇక ఎరుక జగములు వున్నవనిగాని, లేవనిగాని చెప్పుటకు అక్కడ ఎరుక లేక పోవునని తలంచవలయును.

95. కం॥ పరిపూర్ణములో లేనిదె – యెరుకొక్కటిదోచి తననుయెరిగిన మృషగా – యెరుకే విడుచు నదెట్లన – కరములు తమపనులుతా మెగడు పూనట్లుగనూ – యిదిగాకుంటె – కలదింకొక్కటి వినూ – మరి కానిదామాట మంచీదీమాటాని – పరిపారివిధమూల పలుకె పలుకుల పని – గడుపూనట్లు గనూ – – యిదిగాకుంటె – కలదింకొక్కటి వినూ॥ 12

తా॥ శిష్యా! స్వతఃసిద్ధముగాయున్న పరిపూర్ణములో ఈ యెరుక అనేది లేకనే కనబడుచు అనేక విధములైన ఆటలు ఆడుచు, ఆ ఆటలనంతా చూపించుచు, ఒకనాడు తన విషయము తాను తెలుసుకొనగానే నేను లేనిదానినని తన సంగతి తనకే స్పష్టపడి తానే లేకుండా పోవును. అది ఎట్లనగా చేతులు చేతులకు తగిన పనులన్నిటిని చేసి చేసి వాటికవే చాలించు కొనునట్లుగా ఇంకనూ వాగింద్రియము మంచిమాటలుగాని, చెడ్డమాటలుగాని మాట్లాడి మాట్లాడి తనకు తానే మాట్లాడక మానుకొనినట్లుగా ఈ ఎరుకకూడ ఆ పరిపూర్ణములో ఆడినంతవరకు ఆడి ఆడి తుదకు తానే కనబడక పోవుచుండును.

వి॥ ఘటమును యెత్తుకొని పోవువాడు దానియందలి జలము మాత్రమే తీసుకొనిపోవునుగాని, ఆకాశమును తీసుకపోలేనట్లు బ్రహ్మాండ భాండములుగా కనిపించుచున్న ఈ యెరుక అనేక చిత్ర విచిత్రములైన మార్పులు చేయుచు, తానుగూడ మార్పులు జెందుచు యుండునేగాని అచల పరిపూర్ణమునుమాత్రం ఏ మార్పులు చేయలేక యుండును.

96. కం॥ తలయెత్తి చూడ జాలునె – అల చీకటి యెదుట నిల్చి యజ్ఞాప్తుకళన్ – కలవచ్చి మేల్కయందున –గల చేష్టలు మోలనిల్చి – గను గొనగలదా – అట్లనె యెరుక – కనుగొనగలదా యిలలొ సద్గురుబోధ నెరిగిన నరుని చే- ష్టలు గంటె నుళ్ళక్కి సద్గురు బోధొట – కనుగొనగలదా – అట్లనె యెరుక – కనుగొనగలదా॥ 13

తా॥ శిష్యా! అంధకారముగా కనిపించుచున్న కటిక చీకటి సూర్య కిరణములు సోకగానే ఆ అంధకారము అచట నిలువలేక ఎటుల మటుమాయమగుచున్నదో స్వప్నములో కనబడు దృశ్య సముదాయమంతయు మెలుకువ కలిగిన వెంటనే ఏ ఒక్కటైనా అచ్చట కానరాక పోవుచున్నదో అటులనే, పరిపూర్ణ బోధను సాంగోపాంగముగా అవగాహన చేసుకొని దృఢమైన ప్రజ్ఞగలవారి ముందు ఈ యెరుకయొక్క వ్యవహార – మేమియు నిలువకుండా పోవును. ఈ జగత్తులో అచల గురువువలన పరిపూర్ణ బోధను పొందిన గురుపుత్రుడు తాను పదుగురిలోయుండి, పదుగురితో సమానంగా ఎరుక చేష్టలు సలుపు చుండినను అవి సత్యమని తాను ఎన్నడూ తలంచకనే యుండును.

97. కం॥ అంటదుకల మేల్కను మే–ల్కంటదు కలనెన్నటికిని కడు నిశ్చయ మీా– రెంటి క్రియ గుర్తు బయలుల – రెంటిని రెండంటకుండు – రెండ్రెంటిలోనూ – కలయెరుకా లీ – రెండూ మిథ్యేనూ – దంటాగ మేల్క బయలుంటా వెప్పటికెరిగి గెంటూమ పై రెంట రెంటీ కలయెరుకాల రెండ్రెంటి లోనూ – కలయెరుకా లీ – రెండూమిథ్యేనూ॥ 14

తా॥ శిష్యా! కలలో మెలుకువ యెట్లు లేక యున్నదో మెలుకువలో కల యెట్లు లేక యున్నదో అదే విధముగాయున్న పరిపూర్ణ మెరుకలను విచారించి చూచిన యెడల పరిపూర్ణములో యెరుకలేక యున్నది. ఎరుకలో పరిపూర్ణము లేక యున్నది. ఈ రెంటికి ఒకదాని కొకటి సాపత్యము కుదురక పోవుటవలన ఎరుక పరిపూర్ణమగునని పరిపూర్ణము ఎరుక అగుననే కల్పనలు విడిచిపెట్టుము. కలతో సమానమైనది యెరుక అని భావించుము. మెలుకవతో సమానమైనది పరిపూర్ణమని భావింపుము. ఈ బావన బాగుగా కుదిరిన యెడల యెరుక అనే కల పోయి పరిపూర్ణమనే మెలుకువ స్థిరపడి యుండును.

98. కం॥ యెరుగదు సుషుప్తిని జాగ్రత – నిరవంద సుషుప్తి రెంటి నెరుగఁను మేల్క – ట్లరయగ బయలెరుకల రెంటెర్రుగదు బయెలెరుక–రెంటి నెరుగుచు నుండూా – గురుముఖమూాన – నెరిగి యీా రెండూ – తిరమూాగ యెరుకాను తీసివేసితెజాలు – పరులూా నేననియేటి పలుకే లేకుండు ని – ట్లెరు గూచు నుండూ – గురుముఖమూాన – నెరిగీ యీారెండూ॥ 15

తా॥ శిష్యా! మనము నిత్యము అనుభవించుచున్న సుషుప్తి అనే అవస్త ఆ సుషుప్తిని గురించి సుషుప్తి ఎరుగలేక పోవును. మరియు జాగ్రతావస్తను

గురించియు ఎరుగలేక పోవును. జాగ్రతావస్త మాత్రము జాగ్రతావస్తను ఎరుగును. సుషుమ్నావస్తను గురించి ఎరుగును. అటులనే ఎరుక మాత్రము తన విషయమైన యెరుక కల్పనలు యెరుగును. పరిపూర్ణస్థితిని యెరుగును. పరిపూర్ణము మాత్రము తనవిషయము తనకుతెలియదు. ఎరుక విషయము తెలియదు. ఇట్లు ఈరెంటి విషయములు సద్గురుద్వారా తెలుసుకొని లేని ఎరుకను లేకుండా జేసుకొనిన మీదట ఇక నేను బ్రహ్మమును అగుదుననిగాని, నేను బయలు అగుదుననిగాని ఈ ఎరుకకు ఆ ఆశలు పుట్టకుండా పోవును. ఎందువల్లననగా ఈ ఎరుక లేనిదిగనుక లేని ఎరుక బ్రహ్మముకాదు. బయలు కాజాలదు.

99. కం॥ సంకల్పము లేనిదె ని - స్సంకల్పములోన చోచు చను దోచు చనున్ - సంకల్పము తప్పన ని - స్సంకల్పము నెరిగెనేని - చను తా లేన నమా - నిస్సంకల్ప - మును నిల్చెదనుచూ సంకల్పించుట కింక సంకల్పమేది ని -స్సంకల్పమందిట్లు సంకల్ప మెరిగితే - చను తా లేననుచూ - నిస్సంకల్ప మును నిల్చెదనుచూ॥ 16

తా॥ శిష్యా! అనేక సంకల్ప వికల్పాదులతో గూడియున్న ఈ యెరుక ఏ సంకల్ప వికల్పాదులులేని పరిపూర్ణములో కనబడుచు, ఆ పరిపూర్ణములో ఒక కొంతసేపు వుండుచు, మరలా కనబడక పోవుచు నిమిషమైన నిలకడలేక వర్తించుచున్నది. అట్టిదైన ఈ ఎరుకకు సంకల్ప వికల్పాదులే రూపమై, ఆ సంకల్ప వికల్పాదులతో చరియించుచున్న ఈ యెరుక ఏ సంకల్పమూ లేని నిస్సంకల్పమైన పరిపూర్ణమును దర్శించినప్పుడు ఆ నిస్సంకల్పమైన అచల పరిపూర్ణము ముందు నా నిలకడలేని సంకల్ప మెంతమాత్రమని తనకు తానే ఈ యెరుక లేక పోవుచున్నది.

వి॥ లోకమంతా ఆవరించిన చీకటిని ఏ సహాయము లేకనే సూర్యుడెట్లు నాశనము చేయునో ఆ విధముగా అనేక సంశయాలతో గూడి సకల దుఃఖము లచే పరితపించుచు అశాంతితో గూడియున్న మనుజుని ఒక పరిపూర్ణబోధ మాత్రమె ఏ సహాయము లేక శాంతిని చేకూర్చి సర్వదుఃఖములనుండి బయట పడవేయును.

100 కం॥ ఎరుక తనకు దా విడిపో-దెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ - గురుడొకడుదప్ప గురునకు - పరిచర్యయొనర్చి బోధ - పద్ధాతి

వినినన్ - తిరిగిరాని – పద్దతి గనినన్ పరిపూర్ణ ఎరుక యేర్పరుచ నెరుకలేక హరిని స్వప్నముగన్న కరిభ్రమగ్గినట్లొ యీ - పద్ధతి వినినన్ తిరిగిరాని – పద్ధతిగనినన్॥ 17

తా॥ శిష్యా! సకల దుఃఖములకు, సకల భ్రాంతులకు కారణమైన ఈ ఎరుక తనకుతానుగా ఎవ్వరిని ఎన్నడు విడిచిపెట్టక యుండును. ఈ జగత్తులో ఎంతవారుగూడ ఈ ఎరుకను పోగొట్టజాలరు. ఒక్క అచల గురుమూర్తియే ఈ ఎరుకను పోగొట్టుటకు సమర్థత కలిగినవాడుగా యుండును. అందు వలన అట్టివానినివెదకి ఆయనకు దయగలుగువరకు పరిచర్యలుజేసి అతనిని మెప్పించి ఆయన హృదయమును ప్రసన్నత చేసుకొనిన యెడల అతనికి కరుణకలిగి పరిపూర్ణమనగా నెట్టిదో, నెరుక అనగా నెట్టిదో ఈ రెంటిని వేరు వేరుగా విమర్శగా తెలుసుకొన్నవారికి స్వప్నములో సింహమునుగనిన యేనుగు ఎట్లు మరణించునో అట్లనే ఈ అచలబోధ వినగానే ఎరుకగూడ ఏ మాత్రము నిలువలేక నిర్మూలమైపోవును. అట్లుగాక ఎన్ని శాస్త్రములు చదివినా, ఎన్ని జపతపాదులు సల్పినా ఈ ఎరుక తనకు తానుగా ఎవ్వరిని విడిచిపెట్టక భ్రాంతి రూపమైన హిమాలయములను నెత్తినబెట్టి అనుక్షణం వేదించుచుండును.

101, కం॥ అపరోక్షమౌనె మనుజుల – కు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్ – అపరోక్షమౌను మనుజుల – కు పరోక్షంబైన బయలు - గురుకృపగలుగా - కీలిదెలేని – యెరుకా తా తొలుగా – విపరీతమౌ బుద్ధి విడచి నీవెప్పుడు - ఉపచారములు జేయుచుండూము గురునీకి – గురుకృప గలుగా – కీలిదె లేని – యెరుకా తా తొలుగా॥ 18

తా॥ శిష్యా! రూప నామ క్రియా రహితమైన అచల పరిపూర్ణము ఎక్కడో పరోక్షముగా యున్నదేమోనని అడవులకు పోయి అన్న ఆహారములుమాని కఠోరమైన తపస్సులు చేసినను కనుపించని ఆ దివ్య దర్శనము గురువు కృప గలిగి ఆ సద్గురుమూర్తి జూపగనే నీ దగ్గరనే యుండుచు నీకు ముందు నీకు వెనుక సర్వత్రానిండి అపరోక్షముగానే కనబడుచుండును. ఆ కీలు గురువువలన తెలియకపోయిన యెడల ఎరుక దృష్టి వదలిపెట్టక పరబయలు గోచరముగాక యుండును. అందువలన విపరీతపు బుద్ధులను విడచిపెట్టి సద్గురు కటాక్షము నీమీద కలుగునట్లు త్రికరణ శుద్ధితో సేవలుచేస్తూ యుండిన యెడల ఆయనకు

నీమీద దయగలిగి ఆ రహస్యము నీకు రూఢీ పడునట్లుగా వస్తునిశ్చయముగా జూపించి నీ సంశయంబులను రహితపరచి నిన్ను కృతకృత్యుని జేయగలడు.

102. కం॥ నేనెవ్వడనను జీవుడు– నేనే నేననును శివుడు యీ రెండ సకన్ – తానుండు నచలమివీటిని – నేనెరిగరిగినను పైది నేనెట్లనీనీ – నేన నకున్న – తానెట్లనీనీ – నేనన్నదాంట్లొదె నీ నా ప్రసంగాము – తా నన్న దాంట్లొనే తలపోయవలె నిట్లు – నే నెట్లనీనీ నే ననకున్న – తానెట్లనీనీ॥ 19

తా॥ శిష్యా! చతుర్వింశతి తత్వములతో కూడిన దేహములో యుండుచు, ఆ దేహమును అభిమానించుచు తనవిషయము తాను మరచిపోయి ఈ దేహమే నేను అని అనుకొనువాడు జీవుడగుచున్నాడు. ఈ దేహము ఈ దేహము నా శ్రయించుకొనియున్న సర్వేంద్రియములు వాటి వాటి ధర్మములు చేయుటకు యేశక్తి ఆధారముగాయున్నదో, ఆ శక్తియే నేను అని అనుకొనేవాడు ఈశ్వరు డగుచున్నాడు. ఈ రెండు తలంపులు లేక తనకు తానుగా కదలక నిశ్చల ముగా యున్నదే పరిపూర్ణము. ఆ పరిపూర్ణమును నీవు నేను అని తెలుపుతున్న ఈ ఎరుక తెలుసుకొని నీవు నేను అనుమాటలు పోయినయెడల ఆ పరిపూర్ణమే శాశ్వితముగా నిలచియుండును. నేను నీవు అను ప్రసంగము లన్నియు ఎరుక ప్రసంగములేగాని ఆ అచల పరిపూర్ణము ఏ ప్రసంగములు చేయకయుండును.

వి॥ దేహాత్మలు రెండును అస్థిరములని పూర్ణబోధచే తెలుసుకొని సకల శాస్త్రముల జోలినివీడి సత్యముగా యున్నదియు, నాశరహితమైన అచల పరి పూర్ణము యేదిగాయున్నదో అట్టిదానిని మాత్రమే జ్ఞాని ఉపాసన జేయుచుండును.

103. కం॥ తొర్రలు తొమ్మిదిగల మే – న్మ్రరికి యొక రెంటిలోన – మ్రరలు నాల్గున్ – డెర్రది తెల్లది నల్లది కర్రెది – దా నగ్రమందు – గల దొక్క తూటూ – అది యెరుకానె పులు గుండెబోటూ – కుర్రా గురుబోధానె గొడ్డాలి చేబూని – మ్రరిపులుగుల రెంట్ని మలచి కొట్టర పోని – కలదొక్క తూటూ – అది యెరుకానె – పులుగుగుండెబోటూ॥ 20

తా॥ శిష్యా! ఎరుక చేసిన సృష్టిలో మ్రరిచెట్టుతో సమానమైన తొమ్మిది రంధ్రములుగల దేహ నిర్మాణము చాలా గొప్పది. ఈ దేహ నిర్మాణములో ద్వంద్వ ఐక్యతగలిగిన ఇంద్రియాదులుగలవు. కాళ్లు రెండుగా యున్నను నడక వక్కటిగానే యుండును. చేతులు రెండుగా యున్నను, పని ఒక్కటిగానే యుం

డును. చెవులు రెండుగా యున్నను శబ్దము ఒక్కటిగానే యుండును. పెదవులు రెండుగా యున్నను పలుకు ఒక్కటిగానే యుండును. ముక్కు రంధ్రములు రెండుగా యున్నను వాసన ఒక్కటిగానే యుండును. నేత్రములు రెండుగా యున్నను చూపు వక్కటిగానేయుండును. ఇట్లు ద్వంద్వ ఐక్యత గలిగిన ఇంద్రియాదులలో నేత్రేంద్రియమునందు ఎర్రది-తెల్లది-నల్లది-క్రెది (లేక సునీలముగా) యున్న చోటులో దోసకాయ నూగువంటి సన్నని రంధ్రముగలదు. ఆ రంధ్రములో ఎరుక అనే పులుగుయుండి, సర్వాన్ని గుర్తించుచు నేను నేను అనుచున్నది. ఆ గుర్తించే ఎరుక సకల భ్రమలను కలిగించుచు సర్వ భ్రాంతులకు కారణమైయున్నది. అట్టి ఎరుకను నేను నీకు ఇప్పటి వరకు బోధించిన బోధ అను గొడ్డలిచే నరికి వేసిన యెడల ఇక ఏ సంశయములు, ఏ కోరికలు పుట్టకపోవును.

104. కం॥ తనువుతొ వొచ్చిన యెరుకే - తనువును తనువనుచు తనను తానని యెరుగున్ - తనువును బాసిన మీదట - తన నా దేహమును రెంట్ని తా నెరుగదపుడూ - అదిగనుక తా లేనే లేదెపుడూ - అనుమాన రహితా మిందచలామున్నది కంటె తన మాట తలపోయ తనకే సిగ్గయి తనను - తా నెరుగదపుడూ - అది గనుకా తా - లేనే లేదెపుడూ॥ 21

తా॥ శిష్యా ఈ ఎరుక తనువుతోగూడవచ్చి ఆ తనువులో తాను వుండి ఈ తనువును తనువని యెరుగుచు, తనను తానని యెరుగుచు ప్రపంచమును ప్రపంచమని యెరుగుచుండిన ఈ ఎరుక ఒకనాడు ఈతనువును విడచిపెట్టగనే ఇది తనువని యెరుగక తనను తాను యెరుగక ఇది ప్రపంచమని యెరుగక అసలే ఆ ఎరుక లేకపోవు చున్నది. ఇట్లు ఈ ఎరుక అసలే లేకపోవుచున్నదని నేను తెలుపడములో నీకు అనుమానము గలిగిన యెడల ఆ అనుమానము తీరుటకు ఆధ్యాంతములు లేని సంపూర్ణముగానిండి ఏ చలనాదులులేకయున్న అచలమును జూచుచు అందులో ఈ ఎరుక విషయము ఆలోచించితివేని ఇక ఈ ఎరుకమాట యెత్తడానికి ఎరుకకే సిగ్గుగా తోచును.

105. కం॥ ఉప్పెనచేజెడు తరువు వొ - కప్పుడు వి త్తనము పుచ్చు నా రెంటికి ఈతిప్పలు దప్పవు ధర యే - తిప్పలు తా నెరుగ దిట్లు - తెలుసు గదోయీ తను వెరుకా బయి - లుల నట్లెరుగోయీ - గొప్పైన గురుబోధ

చొప్పున నెరిగి యీ తిప్పాలు గలవాట్ని – తప్పాదీసితెవాలు - తెలుసూ గ
దోయీ - తను వెరుకా బయలుల–నట్లెరుగోయీ॥ 22

తా॥ శిష్యా! భూమి మీద కనబడుచున్న వృక్షములన్నియు ఒక నాడు గాలి వానకు పడిపోవుచున్నవి. ఆ పడిన వృక్షములతో గూడ విత్తనములు నీటిలోబడి అందున్న అంకురములు నశించి పోవుచున్నవి. అట్లు ఆ చెట్లుగాని, విత్తనములుగాని పడే తిప్పలు ఆ భూమికి యెట్లు తెలియబడక యున్నదో, ఆ లాగుననే ఈ ఎరుకగాని, ఈ దేహాదులుగాని పుట్టుచు, చచ్చుచూ యున్నను ఈ సంగతే అచల పరిపూర్ణమునకు తెలియబడదు. అన్ని తిప్పలు పడేదంతా ఎరుక దేహములేగాని, పరిపూర్ణము ఏ తిప్పలులేక యున్నది–యున్నట్లుగానే యున్నది. ఇట్టి గొప్పదైన పరిపూర్ణ బోధను ఈ మానవులు తెలుసుకొనలేక తిప్పలు పడడమేగాని ఏ తిప్పలులేని మార్గము దగ్గరకు ఎంత తెలిపిన, యెన్ని ఉపమానములు చెప్పినా రాజాలక పోవుచున్నారు.

యెరుకను విడిపించుట ఆరవ అధ్యాయం సమాప్తము.



## -: 7. మతాల లక్షణం 29 :-

106, కం॥ మతముల వారలు తమ స - మ్మతమైనటువంటి - శాస్త్ర
మర్యాదలచే - మిత మేరుపరచుకొని బహు - గతులను కలహింతు రట్టి-గతి
నీకెమిటికీ – వెపలతజెందె స్థితి నీకేమిటికీ – ప్రతిలేని యీ బట్టబయ లుండ
చూచి సం - తతములే నెరుకలేదని నమ్ముమిక – వారిగతి నీ – కేమిటికీ –
వెపలతజెందె స్థితి నీకేమిటికీ॥ 1

తా॥ శిష్యా! ఈ లోకము అంతా అనేక మతములలో, అనేక సిద్ధాంతములలో మునిగియున్నది. ఆ మతములు, ఆ సిద్ధాంతములన్నియు ఈ లేని ఎరుకనే. దేవుడని నమ్ముచు వారి వారికి సరిపడిన మతము నొకదానిని ఏర్పరచుకొని నా మతము దొడ్డదనియు, నీ మతము అల్పమైనదనియు ఒకరినొకరు పోట్లాడుకొను చుందురు. అట్లు పోట్లాడుకోవలసిన గతి నీకులేదు. వారు మతి భ్రమలచే పడినట్లు, ఒట్టి భ్రాంతులతో పడే అవసరమూలేదు. ఈ ఎరుక లేని

దని—నిరూపించేదానికి అనేకదృష్టాంత, ద్రాష్టాంతములతో నీ బుద్ధికి అనువుగా తెలియబరచినాను. ఇది లేని యెరుకేనని మళ్ళీ నీకు సంశయము కలుగక స్థిర పరచినాను. ఇక ఎరుకతో ఏ పొత్తు పెట్టుకొనక నేను నీకు తెలిపిన సాటిలేని అచల పరిపూర్ణమును సత్యమని దృఢముగా నమ్ముకొనుము. సంతతము ఈ లేని ఎరుకను లేదని తలంచుచు మరువక యుండుము. ఇట్లు ఉండగలిగితివేని లోకములో పడేవారి శ్రమలు, బాధలు నీ దగ్గరకు రాలేక పోవును.

వి॥ ప్రజ్వలించుచున్న అగ్నిలో వేసిన కట్టెలు బూడిదైనట్లు పరిపూర్ణ బోధ అను అగ్నిలో సర్వమతములు, సర్వ సిద్ధాంతములు బూడిదై పోవును. వున్న సత్యము గోచరించును.

107. కం॥ ద్వైతాద్వైతవిశిష్టులు - నైతురు విని నైసరెపుడు నైసక పిదపన్ - నైతురు క్రమమున వేరన- నా తతమతి జీవశివులనవి వినబోకు- నే బోధించి – నది విడబోకూ - పూతా మూ బయలూను పొడజూచి గురునీచె - ద్వైతాద్వైతవిశిష్టద్వైతాములను మాను — మవి వినబోకూ - నే బోధించి - నది విడబోకూ ॥ 2

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో నిజమనునది తెలియక దేవుడనగా ఎట్టి వాడో అను ఆలోచనగూడరాక దైవము మీద యున్న నమ్మకముచే కొంత మంది ద్వైతమతస్తులు దేవుడు సర్వజ్ఞుడు, చావుపుట్టుక లేనివాడు. జీవుడు కించిజ్ఞుడు, చావుపుట్టుక కలవాడు. జీవుడు జీవుడేగాని దేవుడు ఎన్నటికినీ కానే కాడని తెలుపుచుందురు. కొంతమంది అద్వైతమతస్థులు సృష్టికతీతమైనవాడు భగవంతుడనియు ఆయన విభూతులే-బ్రహ్మ-విష్ణు - మహేశ్వరులనియు, వీరి వలననే సృష్టి జరుగుచున్నదనియు, జీవుడుగాని, దేవుడుగాని ఈ ఇద్దరూ ఒక్కటేగాని భేదములేదని తెలుపు చుందురు. కొంతమంది వైష్ణవ మతస్థులు దేవుడు ఒక్కడె జగత్తుకంతా ఆధారము. ఆ విష్ణుమూర్తికంటె మించిన దైవము ఎచ్చటా కనబడదని తెలుపుచుందురు. కొంతమంది శాక్తేయ మతస్తులు ఆది శక్తియే జగత్తుకంతా ఆధారమైనది, ఆ శక్తి లేకపోయిన ఏది జరగదు, ఆ శక్తియే జగన్మాత రాజరాజేశ్వరి, త్రిపుర సుందరి, పార్వతీ అని స్త్రీ శక్తిని ఆరాదించుచుందురు. ఇట్లు చెప్పుకొనువారి మాటలుజూచిన ఒకరిమాటకు ఒకరి

మాట సంబంధముయుండక ఎవరికి తగిన నిర్ణయం వారిదే అగుచు ఇందులో దేవుడు ఎవరో తెలియెక మతి చపలులు మాట్లాడు కొనునట్లు మాట్లాడుకొను చుందురు. అవి అన్నియు చెవులలోనికి రానియ్యక నేను చెప్పినబోధను విడువక యుంటివేని ఏ భ్రాంతి నిన్ను అంటక యుండగలదు.

108. కం॥ కొందరు దశవిధనాదము – లందున నభపంచకంబునందున చక్రా – లందున లక్ష్యధ్యానం - బందున హంసందు బుద్ధి నాటింతురోయీ - యోగములందు–నటియింతురోయీ అంది సిద్ధులచాత నానందింతురు కొంద - రందారి మనుసీబోధందె నీ వుండూము నాటింతురోయీ - యోగములందు - నటియింతురోయీ॥ 3

తా॥ శిష్యా! దైవము మీదనున్న అభిలాషచే ఆ దైవమును దర్శించవలయునని ఈ మానవులు పడేపాట్లు అంత యింతన రాక యున్నది. కొంతమంది దశవిధనాదములయందు మక్కువ గలిగి ఆ నాదములను వినుచు, ఆ నాదములయందు తద్ధైక్యముతో అదే దైవమని నమ్మి యుందురు. కొంతమంది నభపంచకమునందు యుందురు. నభపంచకమనగా! పంచేంద్రియములు స్వాధీన పరచుకోవడములో ఒక్కొక్క ఇంద్రియమున గలుగు ఫలితమును అనుభవించుటయగును. అది యెట్లనగా, జ్ఞానేంద్రియంబులు స్వాధీనపరుచుకొనినవారికి ఆత్మసంధానము కలుగుననియు, మనస్సు స్వాధినపరుచుకొనిన వారికి యోగము సిద్ధించుననియు, బుద్ధిని స్వాధీన పరచుకొనిన వారికి అభిలాష సిద్ధించుననియు, చిత్తమును స్వాధీన పరచుకొనినవారికి దైవచింతన సిద్ధించుననియు, అహంకారము స్వాధీన పరచుకొనిన వారికి ఇష్ట దేవతాకృప ప్రాప్తించుననియు వారి వారి అభిలాషకొలది, ఇంద్రియములను నిగ్రహించుచుందురు. కొంతమంది షట్చక్రములయందు హంసగమనమును చేయుచుందురు. కొంతమంది భ్రూమధ్యమునందును, నాశికయందును, కంఠమునందును, వక్షస్థలమునందును, నాభియందును, బ్రహ్మరంధ్రము నందును లక్ష్యము నిలుపుచుందురు. కొంతమంది అష్టాంగ యోగములనియెడు యమ – నియమ– తను - మానస – ప్రాణాయామ – ప్రత్యాహార – ధ్యాన – ధారణ – సమాదుల యందు యుందురు. ఇట్లు చేయుచు వారికి కలుగు ఆనందములను పొందుచుందురు. ఇవి అన్నియు ఎరుక భ్రాంతులేగాన అట్టివారు జేయుచున్న

మాట సంబంధముయుండక ఎవరికి తగిన నిర్ణయం వారిదే అగుచు ఇందులో దేవుడు ఎవరో తెలియెక మతి చపలులు మాట్లాడు కొనునట్లు మాట్లాడుకొను చుందురు. అవి అన్నియు చెవులలోనికి రానియ్యక నేను చెప్పినబోధను విడువక యుంటివేని ఏ భ్రాంతి నిన్ను అంటక యుండగలదు.

108. కం॥ కొందరు దశవిధనాదము – లందున నభపంచకంబునందున చక్రా – లందున లక్ష్యధ్యానం - బందున హంసందు బుద్ధి నాటింతురోయీ - యోగములందు–నటియింతురోయీ అంది సిద్ధులచాత నానందింతురు కొంద - రందారి మనుసీబోధందె నీ వుండూము నాటింతురోయీ - యోగములందు - నటియింతురోయీ॥ 3

తా॥ శిష్యా! దైవము మీదనున్న అభిలాషచే ఆ దైవమును దర్శించవలయునని ఈ మానవులు పడేపాట్లు అంత యింతన రాక యున్నది. కొంతమంది దశవిధనాదములయందు మక్కువ గలిగి ఆ నాదములను వినుచు, ఆ నాదములయందు తద్దైఖ్యముతో అదే దైవమని నమ్మి యుందురు. కొంతమంది నభపంచకమునందు యుందురు. నభపంచకమనగా! పంచేంద్రియములు స్వాధీన పరచుకోవడములో ఒక్కొక్క ఇంద్రియమున గలుగు ఫలితమును అనుభవించుటయగును. అది యెట్లనగా, జ్ఞానేంద్రియంబులు స్వాధీనపరుచుకొనినవారికి ఆత్మసంధానము కలుగుననియు, మనస్సు స్వాధినపరుచుకొనిన వారికి యోగము సిద్ధించుననియు, బుద్ధిని స్వాధీన పరచుకొనిన వారికి అభిలాష సిద్ధించుననియు, చిత్తమును స్వాధీన పరచుకొనినవారికి దైవచింతన సిద్ధించుననియు, అహంకారము స్వాధీన పరచుకొనిన వారికి ఇష్ట దేవతాకృప ప్రాప్తించుననియు వారి వారి అభిలాషకొలది, ఇంద్రియములను నిగ్రహించుచుందురు. కొంతమంది షట్చక్రములయందు హంసగమనమును చేయుచుందురు. కొంతమంది భ్రూమధ్యమునందును, నాశికయందును, కంఠమునందును, వక్షస్థలమునందును, నాభియందును, బ్రహ్మరంధ్రము నందును లక్ష్యము నిలుపుచుందురు. కొంతమంది అష్టాంగ యోగములనియెడు యమ – నియమ – తను - మానస – ప్రాణాయామ – ప్రత్యాహార – ధ్యాన – ధారణ – సమాధుల యందు యుందురు. ఇట్లు చేయుచు వారికి కలుగు ఆనందములను పొందుచుందురు. ఇవి అన్నియు ఎరుక భ్రాంతులేగాన అట్టివారు జేయుచున్న

కొనుము. ఆ పరిపూర్ణములో నీవుకనబడక ఆ పరిపూర్ణమే నీకు కనబడుచుండిన ఇక నేను లేనివాడనని నీకు నీవే నిశ్చయించుకొనుము. ఈ పరిశీలనలో నీకు యేదైనా అనుమానము కలిగినయెడల నన్ను అడిగి తెలిసికొనుము.

111. కం॥ మానవుడు చేయబూనిన – దానిని లోతెరిగి చేయదగునని మదిలో – నే నెరిగి నీకుజెప్పితి – పూనుము రుచిబుట్టదేని – పోనీ నీ మనసూ – రుచిబుట్టితె – పూనూ నీ మనసూ – నేనేమి యనబోతె నీ కేమిదోచూనో – లేని నిష్టూరాము లేకుండుటే లెస్స పోనీ నీ మనసూ – రుచిబుట్టితె – పూను నీ మనసూ॥ 6

తా॥ శిష్యా! మానవుడు ఏపని జేయతలచుకొనినను ఇది సాధ్యమగునా? కాదా? దీనిలో లాభమువచ్చునా? నష్టమువచ్చునా? అని ముందుగా ఆలోచించి ఆ పనిలోకి ప్రవేశించును. అట్లనే నేను నీకు తెలుపుచుండిన బోధ నీ మదికి చక్కగా అతుకుచు, దానిమీద నీకు ఇష్టము కలుగుచు, అచ్చట మనసు నిల బడుచు యుండెనేని నా మాటయందు, నాయందు నమ్మకము కలిగియుండుము. ఆ మాటలు నీకు పట్టక దానియందు నీకు అభిలాష లేక యుండిన యెడల ఈ బోధను బలవంతముగా వినవలసిన పనిలేదు. ఆ చోటు విడచిపెట్టి పోవ డమే మంచిది. అంత్య నిష్టూరముకన్నా, ఆదినిష్టూరమే మంచిగా యుండును. అనగా ఈ బోధలో యేదో యున్నదని దేవతలువచ్చి నిన్ను విమానము మీద యే వైకుంఠమునకో, కైలాసమునకో తీసుకపోవుదురని పిచ్చి పిచ్చి ఆలోచన లతో యుండి, బోధ సారాంశమును తెలిసిన మీదట – ఆ దేవతలు కనబడక పోయిన యెడల ఇంతేనా అని మధ్య నిష్టూరపడేదానికన్నా ఆదిలోనే నా దగ్గ రకు చేరకయుండడము మంచిదని నా ఉద్దేశ్యము.

వి॥ మూఢులుగా యున్నవారు తీర్థములలో, క్షేత్రములలో, వృక్షము లలో, ప్రతిమలలో, దేవుడున్నాడని తలంచుచుందురు. యోగులు ఆ బొమ్మ లలో దేవుని జూడక తనలో యున్నాడని తలంచుచుందురు. పరిపూర్ణవేత్తలు తమ కంటిముందునే ఆ దేవుని చూచుచుందురు.

112. కం॥ పంచాదశక్షరముల ప్రపంచము తా నుద్భవించె ప్రణ వాక్షర మం – దంచు శృతులెన్నె దాన్నెరుకంచని నీ వెరిగి యెరుగు మచలా ము దీనన్ – నిల్పకు మెరుక – నచలాములోనన్ – చంచాలమతిచాత చతు

రాక్షరెక్కూవం - చెంచేద వెందుకు యిది నమ్మకెరుగూమి - యచలాము దీనన్ - నిల్పకు మెరుక - నబాలాములోనన్ ॥ 7

తా॥ శిష్యా! ఒకటిగా స్వల్పముగాయున్న చీపురుపుల్ల అనేక పుల్లలు కలిసెనేని ఒక కట్టయై అది ఉపయోగ వస్తువైనట్లు ఈ ఎరుక ఒకదాని కొకటి కలియికచే "గుణాగుణేశు వర్తంతే" గుణములలో గుణములు కలిసి అనేక గుణములయొక్క వర్తనే సకల ప్రపంచమని 3-26 గీత తెలిపినటుల శృతు లలో బ్రహ్మమని తెలుపబడుచున్న ఈ ఎరుకయందు మొదట మహత్తు అహంకా రము పంచతన్మాత్రలు కలిసి ఏడును సృష్టకి పునాదులు అగుటవలన "సప్త ప్రాణప్రవంతి" అని ముండకం తెలిపియున్నది. ఈప్రాణాలను భగవద్గీత విశ్వ రూపముదగ్గర సప్తమహర్షులని తెలిపియున్నది. ఈ ఏడు ప్రాణాలకు ఒక్కొ క్కదానికి ఏడేసి ప్రాణాలు కలుగుటవలన నలబైతొమ్మిది ప్రాణములై జగత్తు ను విస్తరింపజేయుటచే "సప్త ఇమే లోకా మేఘ శర న్తి-ప్రాణాగుహాశయాని- "హితా-సప్త-సప్త" ఈ లోకములోయున్న సర్వజీవులు "సప్త-సప్త" నలబై తొమ్మిది ప్రాణములచే రూపాదులు కూడికగలుగు చున్నదని "ముండకోపని షత్" తెలుపుచున్నది. ఈ ప్రాణములను అక్షరములుగా తీసుకొని యాబై అక్షరములు కలిగిన ప్రణవమను ఓంకారముతో జగత్తు పుట్టినదని ఈ ఓం కారమేబ్రహ్మమని తెలుపుచుందురు. ఇంకనూ నారాయణ॥ లేక సోహం॥హంసో॥ అను చతురాక్షరిని బ్రహ్మమని శ్రుతులు తెలుపుచుండును. ఇట్లు యెందరు యెన్నివిధముల తెలిపినను నీవు చెంచలమతిని విడిచిపెట్టి ఇవి అన్నియు ఒక ఎరుక కల్పితమేనని తలంచి ఆ అచల పరిపూర్ణములో ఈ ఎరుక ఎన్నడులేదని నిశ్చయబుద్ధితో నుండవలెను.

వి॥ ఈ నలబైతొమ్మిదిని మరుత్తులుగా గీత విశ్వరూపము దగ్గర తెలిపి యున్నది. ఈ వివరణ విశదముగా మేమువివరించిన విశ్వరూపరహస్యము అను గ్రంథములో చూడనగును.

113. కం॥ యెరుక జడమజడ మీా జగ - మరయగ పరి-పూర్ణమేమి యనరానిది యా - యెరుక జగములస్థిరముల - పరిపూర్ణము శాశ్వితపుది - పాటించి కనరా - కావారెండీ - పాటీవి వినరా - గురుముఖమున వీన్నే నరుడూ గుర్తెరుగూనా-తిరిగి పుట్టడు వాడీ ధరపై మునుపటివలె - పాటించి కనరా - కావారెండీపాటీవి వినరా॥ 8

తా॥ శిష్యా! జడరూపము కనబడుచున్న ఈ దేహమునకు కరచరణము లైన అవయవాదులను రూపుదిద్ది కూర్పుచేసినది ఈ ఎరుకే. ఆ దేహాదులలో చైతన్య రూపముగా కనబడుచు, తెలివిగా యున్నది ఈ ఎరుకే. అనేక రూపాదులతోగూడి ప్రపంచముగా కనిపించుచున్నది ఈ ఎరుకే. సర్వము అగుచు, ఈ ఎరుకనెడి ముద్దయందే అఖిల ప్రపంచ ముండుట వలన ఈ దేహాదులుగాని, అందులోయున్న తెలివిగాని. సకల ప్రపంచముగాని, ఎరుకతో సమానముగా, నిలకడ లేక అస్థిరములగు చున్నవి. పరిపూర్ణము మాత్రము అట్లుగాక శాశ్వతముగా కనబడుచు రాకపోకలు లేక యున్నది. ఈ యదార్థమును గురుముఖేణా తెలుసుకొని నిత్యా నిత్యములను పరిశీలించుచు లేని దానిని లేనట్లుగ, ఉన్న దానిని వున్నట్లుగా బుద్ధియందు స్థిరముచేసుకొని ఎవరు ఈ ప్రపంచమునందు మెలగుచుందురో అట్టివారు మునుపటివలె మరలా భూమిమీద పుట్టక యుందురు.

114. కం॥ కొందరు భూతము లైదిటి – యందున విత్తంబునుంతు రధికములనుచున్ – కొందరు యేమియు లేదని యం – దురు గుర్తెరుగు మిన్ని – యపశబ్దములెరా – యివి నిలువాని - వని తెలియవలెరా - యందారెన్నన్నా నీ కెందూకు బయలూను – ముందూగ గని గుర్తు నెందుండనివకవ్వి- యపశబ్దములెరా - యివి నిలువాని - వని తెలియవలెరా॥ 9

తా॥ శిష్యా! కొన్ని మతములవారు పంచభూతములు సృష్టికాధారమనియు, ఆ పంచభూతములే సృష్టి-స్థితి-లయములు జరుపుచున్నవనియు, సృష్టికి నాశనము ఉన్నదిగాని, పంచభూతములకు నాశనము లేక ప్రళయములోగూడ వున్నదని ఈ పంచభూతములకు మించినది లేదని ఈ పంచభూతములే దేవుడని తెలుపుచుందురు. మరి కొందరు యేమి లేదు అంతా వుత్తది. అందరూ పొయ్యేది చివరలో అక్కడికేనని పలుకుచుందురు. ఈ మాటలన్నియు తెలిసిన పెద్దల వ్యాఖ్యముల దగ్గర మెలగనివారి అపశబ్దపు మాటలేగాని సత్యమైన మాటలు కావని తలంచుము. ఎవరు ఎన్నిమాటలు తెలిపిన నేను నీకు తెలుపుచుండిన పరిపూర్ణ బోధకంటే అధికము -- సమానము కాదని, దృఢమైన భావన కలిగి ఆ మాటలయందు మనసును పోనివ్వక యుండుము.

వి॥ పామరులు విగ్రహములను దేవుడని పూజింతురు. బ్రాహ్మణులు అగ్నిని దేవుడని ఉపాసింతురు. మునులు హృదయ స్థానమును దేవుడని

నమ్ముదురు. పరిపూర్ణ వేత్తలు సర్వత్రా దేవుడున్నాడని నిశ్చయించుచుందురు.

115. కం॥ కొందరు కర్మమునే బా - గందురు మరికొంద రెక్కువందురు తనువున్ - కొందరు ప్రాణములధికము - లందురు నీ కిట్టి వట్టి – యాశ లేమిటికీ – వారితో పొందు - జేశె వేమిటికీ యెందారి మాటల నెన్నీన యీ బోధ - కిందీవెకాని పైకెక్కేవి గానిట్టి - యాశ లేమిటికీ – వారితొ పొందు జేశెవేమిటికీ॥ 10

తా॥ శిష్యా! లోకములో స్నాన సంధ్యలు, చాంద్రాయణాది వ్రతములు, యజ్ఞ యాగాది క్రతువులు, తీర్థయాత్ర గమనాదులు మొదలగు సత్కర్మములు కొంతమంది చేయుచుందురు. మరి కొందరు కాయశిద్ధికై అష్టాంగయోగములు సలుపుచుందురు. కొంతమంది ప్రాణమును నిలుపుటకుగాను ప్రాణాయామము చేయుచుందురు. నీవు వారి ప్రయాసలు పెట్టుకొనక, అట్టివారితో స్నేహము చేయక, వారి మాటలను నీ చెవిదగ్గరకు రానీయక యుంటివేని నీకే మేలుగా యుండును. వారు యెన్నెన్నో ఆశలు పెట్టుకొని పడరాని బాధలు పడుచుందురు. ఆ బాధలన్నియు ఈ బోధకు క్రిందివేగాని అధికము కావని తలంచుము.

116, కం॥ తను వెరుకలు రెండొొక్కటి - యని యనరాదనుచు కొందరందురు భువిలో - తను వెరుకలలో నొక్కటి - గనరాకుంటేను రెండు – గనరావోయన్నా – రెండొొక్కాటె – వినరా మాయన్నా అనుమానమికయాల అందారి మాటాలు – వినబోక నేబోధించినరీతి నెప్పుడు - గనరావోయన్నా – రెండొొక్కాటె – వినరా మాయన్నా॥ 11

తా॥ శిష్యా! ఈ తెలియబడుచున్న తను వెరుకలు (దేహాత్మలు) రెండింటిలో దేహము చావుపుట్టుకలు కలిగి అనిత్యమై యున్నదనియు, ఆత్మమాత్రము చావు పుట్టుకలు లేక శాశ్వితముగా యున్నదనియు ఈ రెండు వేరు వేరుగా యున్నందున ఒక్కటిగా చెప్పకూడదని భగవద్గీత 2-16 ఉపనిషత్తులు మొదలైన గ్రంథములలో తెలుపుచుందురు. ఈ రెండు వేరువేరుగా యున్న యెడల ఒకటిపోతే ఒకటి యుండవలయును. అట్లు యుండకపోతే రెండూపోవు చున్నవి. ఉంటే రెండు యుంటూయున్నవి. ఇట్లు యుండుటవలన ఈ రెంటినీ ఒక్కటే అని తెలుపవలయుగాని వేరు వేరని యెన్నడూ అనగూడదు. ఇట్లు నేను తెలిపిన విషయములో యే మాత్రము అనుమానము జెందక యెవరి మాటలు

వినిపించుకొనక నేను నీకు బోధించిన బోధయందే నమ్మకము గలిగి స్థిరత్వ మును దిగజార్చుకొనక యుండుము.

వి॥ ప్రపంచములోనున్న సర్వనదులన్నియును తూర్పు దిశకు పోతూ యుండగా హిమాలయముల ప్రక్కనయున్న నర్మదానది మాత్రము పడమర దిశకు పోయినట్లు సర్వశాస్త్రములు తెలిపెడి సారాంశము ఒక వాలుకుపోతూ యుండగా పరిపూర్ణబోధ తెలిపే సారాంశము ఎదురు నడిచినట్లుగా యుండును. అందువలననే ఈ బోధ దగ్గర ఎంతవారు నిలువక పోవుచుందురు.

117. కం॥ కన్నులప్రక్కల ప్రేళ్ళిడి - తిన్నగ భ్రూమధ్య మందు దృష్టి నిలిపి యుం - దున్నది వెన్నెలలో బయలన్నా కనుమందు రెరుకె - అది నిలువదోయీ -తనువుతో బొయ్యేదని - దెలియుమోయీ - యన్ని తను వులువచ్చి యరిగీన ఝణకాక - వున్నాబయలిది జూచి వుళ్లక్కెరుకనుమాను- మది నిలువదోయీ - తనువుతో బొయ్యేదని - తెలియుమోయీ॥ 12

తా॥ శిష్యా! కొంతమంది గురువులు అమాయక ప్రజలకు ఆశలు కలి గించి పరిపూర్ణమును జూపించెదమని చీకటి గదిలోనికి తీసుకపోయి రెండు కన్నుల ప్రక్కన చూపుడుప్రేళ్ళతో నొక్కగా చూపు భ్రూమధ్యమందుకు పోవుటవలన అచ్చట చిత్కళలు కనబడుచుండును. ఆ కళలను పండువెన్నెల బట్టబయలని తెలుపుచుందురు. అదే పరిపూర్ణమని ఈ అజ్ఞానులు నమ్ముచుం దురు. ఆ కళలు ఎరుక లక్షమైనందువలన తనువు వున్నంతవరకే కనబడు చుండునుగాని, తనువుపోయిన వెనుక ఆ కళలు కనబడవు. అవిలేని ఎరుక రూపములైనందువలన ఒకప్పుడు కనబడుచు, ఒకప్పుడు కనబడక పోవు చుండును. పరిపూర్ణము మాత్రము అట్టిదికాదు. ఇటువంటి తనువులు ఎన్ని వస్తూ పోతూ యున్నను. యేమాత్రము చెలించక సర్వవ్యాపకముగా కదలక ఒక్క తీరుగానే కనబడుచుండును అట్టి పరబయలును సత్యమని నమ్మవలయు గాని ఒక సమయములో కనబడి ఒక సమయములో లేకపోవు దానిని పరిపూర్ణ మని నమ్మకూడదు. ఈ చిత్ కళలను లేని ఎరుక కాంతులని ఉత్తవి అని తలంచవలయుగాని నిజమని మాత్రము నమ్మగూడదు.

118 కం॥ జను లాత్మానుభవంబై - నను ముక్త్యని పల్కిరిట్లు నమ్మకు మెరుకె - కనరా దెచ్చట గురుకృప - ననుభవ మెవ్వరికి పైన - ఆ మాట

నిజమో - అనుభవ ముల్ల - క్కమాట నిజమో వినజెప్పుమీా - రెండువరించి పైమాట - విని నేముందరిబోధ వినిపింతు వేవేగ - అమాట నిజమో - అను భవ ముళ్ళ - క్కమాట నిజమో॥ 13

తా॥ శిష్యా! లోకములో కొంతమంది తత్వవేత్తలు ఆత్మసాక్షాత్కారము మోక్షమని తెలుపుచుందురు. ఆ ఆత్మ ఎరుక అనియు, ఆ అనుభవము ఎరుకదే ననియు గుర్తించిన నిజగురుపుత్రులకు ఆ ఆత్మానుభవము లేనిదై దేహము ఉన్నప్పుడు మాత్రమే కనబడుచు దేహము పోయినవెనుక కనబడక యుండును. అట్లు యుండుట వలన ఆ ఆత్మానుభవము హుళ్ళక్కని తెలుపుచున్నాను. ఈ ఆత్మ హుళ్ళక్కని నేను చెప్పినమాట నిజమో, పైన దెలిపినవారి మాటలు నిజమో ఈ రెంటిని బాగుగా విచారించి సందేహించక ఉన్న విషయం ఉన్న ట్లుగా తెలిపితివేని నీ ఆలోచనను, నీ ప్రజ్ఞను నేను గమనించి ఇక తెలుపబోవు అచల బోధను దృఢముగా యెరిగించగలను.

వి॥ మణిమంత్ర, ఓషదులచేత అగ్నియొక్క ప్రకాశశక్తి (ఉష్ణశక్తి) కట్టుబడినట్లు అచల పరిపూర్ణ బోధదగ్గర అఖండ చేతనముయొక్క ఆత్మశక్తి కట్టుబడుచున్నది. (రహితపడుచున్నది) ఈ ఆత్మ (ఎరుక) దేహములోవున్నది. ఒక్కటైనను దాని పరిణామదశలో ఆత్మ అనియు, జీవాత్మ అనియు, సూత్రా త్మయనియు, అంతరాత్మ యనియు, పరమాత్మ అనియు, పరిశుద్ధాత్మ అనియు, ప్రత్యగాత్మ అనియు, కేవలాత్మ అనియు అష్టాత్మలుగా తెలుపుచుందురు. లేని ఎరుక పరిణామదశలకే ఇన్ని పేర్లు కలిగియున్నవి.

119, తనను తా గనిన మోక్షం - బని పల్కిరిగాని జనులు అదినమ్మ కుమి - తనను తా బట్టబైటను - గనబోయితె తనకు దానె - కానరాదోయీా విశ్వము తనకు - కానరాదోయీా-తననుంచైనది గనుక తానువిశ్వము రెండు- గనిపించు టుల్లక్కగావున తనకుదా - కానారాదోయీా - విశ్వము తనకు - గానరాదోయీా॥ 14

తా॥ శిష్యా! తననుతాను తెలుసుకోవడము మోక్షమని శ్రుతులు తెలుపు చున్నవి. స్థిమితముగా విచారించిన యెడల ఏది సత్యమై, సుప్రసిద్ధమై సర్వత్రా నిండియున్నదో అట్టి పరిపూర్ణములో తనను తాను జూచిన యెడల అచ్చట నేననే ఎరుక లేకపోవుచు తన విషయం తనకు కనుపించక యున్నది. ఈ

ఎరుక ప్రపంచమనబడు రూపాదులలో మాత్రమే కనబడుచు రూపరహితమైన పరిపూర్ణములో ఎక్కడ వెతకినా కనబడక పోవుచున్నది. ఇట్లు ఒక దగ్గర కనబడుచు, ఒక దగ్గర కనబడని ఈ మాయాజాలమైన ఎరుకను దర్శించినంత మాత్రమున మానవునకు స్థిమితము, మోక్షము కలుగనేరదు. సర్వకాలముల యందును, సర్వలోకముల యందును వ్యాపించి ఏ పరిపూర్ణమున్నదో ఆ పరిపూర్ణమును దర్శించిన యెడల సత్యము గోచరించి మోక్షము తప్పక కలుగును గాని, లేని ఎరుకను దర్శించినంత మాత్రమున సర్వసంశయములు రహిత పడి కృతకృత్యులు కానేరరు. ఈ ఎరుకవలననే ప్రపంచము ఏర్పడి ఈ ఎరుక ప్రపంచములు రెండు ఆ అచల సుధారాశిలో ఎచ్చట కనబడక పోవుటవలన తనను తాను ఎరుగడము మోక్షమని తెలుపగూడదు.

వి॥ శ్రుతులయందు మాత్రం:– "ఏకో దేవా సర్వభూతేషు, గూఢ సర్వ వ్యాపి సర్వభూతాంతరాత్మ" ఏక స్వరూపుడైన పరమేశ్వరుడు సర్వవ్యాపిగా యున్నందువలన సర్వభూతములలో గూఢముగా యుండుచు అంతరాత్మగా యున్నాడని తెలుపుటవలన తనకుతాను తెలుసుకోవడమే మోక్షమని తెలుపడమైనది. అది ఎరుక దగ్గర తెలిపిన విషయముగాని పరిపూర్ణము దగ్గర తెలిపిన విషయము కాదని తలంచవలయును.

120. కం॥ మాయగదా లేనియహం – బాయగదా తనను దానె అచలము యేర్పా – టాయగదా మాయనలేం – దాయగదా మాయచిత్ర – మాయాగదోయీ – సంశయమంత – పాయగదోయీ – మాయాసమూలాము మాయజూస్తుండంగ – మాయమైపాయను – మాయాకే యిది చిత్ర – మాయగదోయీ – సంశయమంత పాయగదోయీ॥ 15

తా॥ శిష్యా! ప్రతి ఉపాదిలో నేను – నేను–అనుచు అహం రూపముగా వర్తించుచున్న ఈ ఎరుక తనకు తానే మాయగా వచ్చుచు, కొంతకాలము ఉండుచు మరలా తనకుతానే మాయగా లేకపోవుచున్నది. ఇట్లు వస్తూ పోతూ యున్న ఎరుక ఒకనాడు రావడము పోవడములేక స్థిరముగాయున్న పరబయలును జూచిన వెంటనే తానుగాని, తనతో ఏర్పడిన చిత్ర విచిత్రములైన ప్రపంచముగాని మాయయేయని తనకు తనకే తోచబడి తాను వుండి, తాను చూస్తూ యుండగానే తానును తనతో ఏర్పడిన ప్రపంచము మాయగా లేక

పోవుటజూచి తనకు తనకే ఆశ్చర్యముగ, విచిత్రముగ కనబడుచుండును. ఈ మాట నిజమో కాదో నీవు బాగుగా ఆలోచించు కొంటివేని ఎరుకయొక్క విషయము నీకు తెలియబడి, నీ సంశయములెల్లయు నిర్మూలమగును

వి॥ ఈ పరిపూర్ణ బోధను గ్రహించుటకు దేహారోపణలు పనికిరావు. సాంప్రదాయ గురువులచే ఉన్నది వున్నట్లుగా తెలుసుకోవలయునేగాని శాస్త్రములు చదివి ఊహాపోహలతో గ్రహించుటకు ఈ అచలబోధ సాధ్యపడదు. అట్లు గ్రహింప బూనుట శూన్యపద్ధతియగుచు తాను చెడుటయేగాక తనను ఆశ్రయించిన వారినిగూడ అధోగతిపాలు చేయును.

121. కం॥ లేనీ యహమున్న బయలును – లేని ప్రపంచమును తనను లెస్సగ తనతో తాను విమర్శించిన యా – లేనివి లేకుండు నవల – లేదూ యేమాటా – యిట్లననైన లేదు యేమాట – లేనియహ మీ బైట లేనె లేదిది జూచి – లేనీది కలదాని లేనిమాటాడేవు – లేదుయేమాట – యిట్లననైన – లేదు యేమాటా॥ 16

తా॥ శిష్యా! లేకనే కనబడుచు అహం రూపముగాయున్న ఈ మాయ ఎరుక తననుగాని, తనతోగూడ వచ్చిన ప్రపంచమునుగాని అఖండముగా కనబడుచున్న అచల పరిపూర్ణములోకి రావడము, పోవడము బాగుగ చూచుకొని ఆ విషయమంత విమర్శించుకొని దృఢముగలిగిన మీదట ఇక లేనిదెప్పుడు లేక పోవునో, ఉన్నదే నిజమగుచున్నది. ఆ నిజమైనదాని దగ్గర ఇది ఉన్నదని గాని, ఇది లేనిదనిగాని అనుటకు మాటేరాకయుండును. మాట యెప్పుడు లేదో మాటతోగూడిన అహంలేనిదై ఆ బట్టబయలు దగ్గర నేను లేకపోతినని నీకు నీకేగట్టిగా తెలియబడిన యెడల ఇక వున్నదను మాటగాని, లేదను మాటగాని ఈ మాటలను విడచిపెట్టవలయును.

122. కం॥ పరిపూర్ణమెరుక లెట్టివా – గురుముఖమున రెంట్ని లెస్స గురుతెరిగెరుకన్ – సరిపుచ్చుకొన్న మృషయని – పరిశుద్ధపుబోధ యీది – పాటించి కనరా – శివరామూల – పద్ధాతి యిదెరా – నరులు కొందరు బల్కి రెరుకాను మ్రింగి యీ – పరిపూర్ణమయ్యె మంచెరుగాక – చెడుటాకై – పాటించి కనరా – శివరామూల – పద్ధాతియిదెరా॥ 27

తా॥ శిష్యా! పరిపూర్ణమనగా నెట్టిదో, ఎరుకనగా నెట్టిదో, ఈ రెంటి సహజస్వభావంబులను గుర్తెరిగిన స్వచ్ఛందులు అచల సామ్రాట్టులైన సద్గురువుల వలన ప్రత్యక్ష ప్రమాణాలతో యున్నదియున్నట్లుగా, లేనిది లేనట్లుగా తెలియబడినప్పుడు ఎరుక సమూలముగా రహితపడి శాంతిచేకూరి ఇక యే భ్రాంతులు, ఏ కోరికలు పుట్టకపోవును. అట్లు దృఢము చేయగలిగిన బోధయే శ్రీ శివరామ దీక్షితులు తెలిపినబోధ యగును. ఆ బోధమర్మము ఎవరిబుద్ధిలో బాగుగా నిలబడుచున్నదో వారే ఈ బోధను పరిశుద్ధపు బోధయని తెలుసు కొనగలరు. లోకములో కొంతమంది గురువులు ఎరుకనుమ్రింగి (అనగా) ఎరుకను లేకుండాచేసుకొన్నాము. పరిపూర్ణము బయలై పోతామని నిజమునెరుగక తెలుపుచుందురు. ఎరుకకు మూలము కనబడక లేనిదగుట వలన ఆ లేని ఎరుక ఉన్న పరిపూర్ణము ఎట్లు కాగలదని ఆలోచన చేయక వారు చెడుటయేగాక ఇతరులనుగూడ చెడగొట్టుచు పరిపూర్ణ బోధను అప్రతిష్టపాలు చేయుచుందురు.

123 కం॥ బిందువు తనువున బుట్టును - బిందున తను వింద్రియముల బృందంబసువుల్ - అందముగ గలుగునివిదె నందున బుట్టినవా తెలియ - నజునికితరమా మూలములేని - వని తెలుసుకొనుమా అందూకె బయలున్న దరసి మూలములేని - బింద్వాది కంబూల పేరూదల్వకు తెలియ నజునికి తర మా - మూలము లేని - వని తెలుసుకొనుమా॥ 18

తా॥ శిష్యా! ఈ కనబడుచున్న దేహాదులు ఏ దానితో ఎట్లు పుట్టుచున్న వని విచారించిన యెడల దేహము వలన బిందువను శుక్లము పుట్టుచున్నది. తిరిగి ఆ శుక్లమువలన దేహాదులుపుట్టి ఆ దేహములను నంటుకొని ఇంద్రియాదులు ప్రాణము గలుగుచున్నది. ఇట్లు ఒకదానితో నొకటి కలుగుచున్న ఈ దేహ శుక్లములు రెండును ఏదాని ఆధారముతో కలుగుచున్నవో అది విచారించుదమనిన, ఆ రెంటికి ఆధారము మరి యొకటి కనబడక పోవుటవలన అది తెలుపుటకు బ్రహ్మాదులకుకూడ సాధ్యముగాక యుండును. అందువలన నీవు. యేదానిని పట్టించుకొనక సర్వకాలములయందును కనబడుచున్న బట్టబయలును స్పష్టముగా నెరిగి ఒకప్పుడు యుండి, ఒకప్పుడు లేకపోవుచుండు బిందు శరీరాదులను వాటి పేర్లనుగూడ బుద్ధిలోనికి రానివ్వక యుండుము.

వి॥ ఇచ్చట శరీరమునకు శుక్లము, శుక్లమునకు శరీరము, ఒకదానితో నొకటి ఆధారమేకాని ఇక వాటికి మూలము లేదని తెలిపియున్నది. నీటిలోను,

మట్టిలోను, పేడలోను, కొయ్యలోను, బియ్యములోను, పసుపులోను, కూరగాయలలోను, పండ్లలోను పురుగులు పుట్టుచున్నవి. ఈ పురుగుల శరీరాలకు ఏ శుక్లము ఆధారముగా యున్నదని విచారించిన పంచభూతముల కూడికయే అక్కడ శుక్లమగుచున్నది. ఆ శుక్లము ఏ భూతమునుండి కలిగినదని పరిశీలించిన మూలము శూన్యమగుచున్నది.

124. కం॥ జనులనిరి దేవుడెవరికి-కనరాడని నామరూప కర్మ జననముల్-గన నతనికి లేవనియా-జనవాక్యము బయలుకెపుడు సహజమౌ వినరా అనుమానము-చాలించి కనరా – కని నామరూపాదికములున్న యెరుకాను–విన బోక కనబోక విడిచిపెట్టర పోని –సహజమౌ వినరా – అనుమానాము చాలించి కనరా॥ 19

తా॥ శిష్యా! ఆదిలోనుంచి ఈ లోకములోయున్న జనులందరు సహజముగా దేవుడు ఒకడు యున్నాడనియు, అయన ఎవ్వరికి కనబడడనియు, ఆయనకు రూపము, నామము, కర్మము, జననము, మరణము లేవనియు ఏకపదంగా ఆ దేవుని ఎరుగకనే (చూడకనే) తెలుపుచుందురు. వారు తెలిపిన పలుకులకు సరిపోయిన దేవుడే-నేను-నీకు సూచించిన బట్టబయలు. అది నీవు సూక్ష్మమైన ఆలోచనతో పరిశీలించుకొనుచు, ముందు పెద్దలు తెలిపిన గుర్తులకు సరిపోయిన యెడల ఇక ఏ అనుమానము లేకుండ జేసుకొని ఇక ఎరుకతో గూడిన రూపనామాదులను నిజమని భ్రమించక ఇక ఆ భ్రాంతి మాటలను ఏనాడు తలంచక యుండవలయును.

వి॥ తనముఖము తనకు కనపడక పోయినంత మాత్రమున నాకు ముఖము లేదని చెప్పేదానికన్నా అద్దములో చూచుకొనునట్లు, తనకు పరిపూర్ణము గోచరించక పోయినంత మాత్రమున పరిపూర్ణములేదని అనుటకంటే గురువుద్వారా తెలుసుకోవలయును.

125, కం॥ అంతట గలదీ యెరుకని-యెంతో వాదింపుచుందు రెరుగని వారల్-అంతట నింతట గనుపడునంతటిదేకాని యెరుక-అంతట గలదా-అది నిజమైతే- అగుపడవలదా- అంతాట గలదొక్క అచలామె కానెరుక - నంతాట గలదాని యనరాదు–వినరాదు–అంతట గలదా–అది నిజమైతే–అగుపడవలదా॥

తా॥ శిష్యా! ఈ ఎరుక (ఆత్మ) అంతటా యున్నదని యెంతో మంది వాదించుచు "అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతం" ఆత్మ ప్రపంచము

నంతయు నిండి నాశనము లేక యున్నదని గీత 2-17 శ్లో॥ తెలుపుచున్నదని శాస్త్ర ప్రమాణాలు ఎన్నో తీసుకవచ్చి ముందు పెట్టుచుందురు. ఎన్ని ప్రమాణంబులు తెచ్చి చూపించినను, ఎంత వాదించినను దేహము ఉన్నదగ్గరే ఈ ఎరుక (ఆత్మ) యుండి ఎరుగుచుండునుగాని, దేహములేని దగ్గర ఈ యెరుక యుండడములేదు ఎరగడములేదు. ఇది తెలియక అంతటాయున్నదని తెలుపు వారిని మీరు చూపించగలరా? అని అడిగితే! ఎవరూ చూపించలేరు. ఏ సమాధానము చెప్పలేరు. అందువలన ఈ ఎరుక అచ్చటచ్చట ఉపాదులుయున్న దగ్గర ఉన్నదేగాని అంతటా యున్నదని మాత్రము చెప్పకూడదు. అంతటా నిండి సూదిమోపను సందులేక యుండినది. ఆ అచల పరిపూర్ణ మొకటేయగును గాని, ఒక దగ్గర కనబడుచు ఒక దగ్గర కనబడకయుండు ఎరుకను అంతటా యున్నదని అనగూడదు. ఆ మాటలు వినగూడదని నా అభిప్రాయము.

వి॥ శ్రుతులయందు "క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా తద్విద్ధి భరత వర్షభః గీత 3-27 యందును "ద్రష్ట దృశ్యయోః సంయోగో హేయ-హేతుః" పతంజలయోగ సూత్రము మొదలైన గ్రంథములలో ప్రకృతియగు దేహము పురుషుడైన ఆత్మయు ఈరెండు సంయోగముగా యెడబాటులేక ఒకటిగా యున్నందువలన ఈ ఆత్మను ప్రకృతి సంవేది అనియు, మాయామానుష విగ్రహ స్వరూపుడనియు నిలుపుచుందురు. అందువలన దేహమును విడచిపెట్టి ఆత్మ (ఎరుక) యుండలేదని అభిప్రాయము.

126. కం॥ బయ లాకసమని కొందరు-భయపెట్టెద రందువలన భయపడకు సుమీ-బయలందు శబ్దమున్నను -బయ లాకసమనుచు నమ్మ - బడని నీవాతా-శబ్దములేదీ-భ్రమయెందుచాతా - బయ లాకాశముగాదు పరిపూర్ణమని నమ్మి-నయమూగ యెరుకాను నమ్మాక విడిచి పో-బడని నీవాతా-శబ్దములేదీ-భ్రమయెందుచాతా॥ 21

తా॥ శిష్యా! కొంతమంది గురుకులములో మెలిగినవారు ఈ బట్టబయలైన అచలమును నీచేత బలవంతముగా తెలుసుకొని అది భూతాకాశమగును గాని, పరిపూర్ణముకాదని నిన్ను భయపెట్టి నీ మనసును వెడగొట్టుచుందురు. అందుకు నీవు సంశయించి నీ మనసును పాడుజేసుకొని పిరికివాడవు కాబోకుము. బయలందు శబ్దమున్నయెడల బయలును ఆకాశమని చెప్పవచ్చును. బయలందు శబ్దము లేనప్పుడు అది ఆకాశమని భ్రమబెట్టుకొనకుము. శబ్దము

యెచ్చటున్నదో అది ఆకాశమని తలంచుము. ఆకాశము - ఎరుక రెండును ఒకటే అగుటవలన. యెరుక ఎచ్చట యున్నదో, అచ్చట రూప నిర్మాణము అయ్యే యున్నదని భావింపుము. ఈ విషయము చక్కగా ఆలోచించితివేని ఆకాశము, బయలు రెండు ఒకటికాదని నీకు నీకే గోచరించి ఆకాశ మెరుకలను తీసివేసికొని బట్ట బయలును మాత్రమే స్థిరముగా నమ్మియుండుము.

127. కం॥ కలమేల్క లెరుక బయలుల - కిల సామ్యము జేసిచూడు మీ భ్రమ దొలగున్ - ఫలమేమి పెక్కు చదువుల - వలనను జపయాగయోగ వ్రతముల వలనన్ - శమ దమ ముఖ - శతమూల కలనన్ - తలక్రిందుగా బడ్డ తనువునె గానన్న - కలమేల్క -గని తానెక్కడ నిల్వనట్లౌనె - వ్రతముల వలనన్ - శమ దమ ముఖ - శతమూల కలనన్॥ 22

తా॥ శిష్యా! మనము నిత్యము అనుభవించుచున్న కల, మెలుకువలను కలను-అబద్ధమనియు,-మెలకువను సత్యమనియు భావించుచుందుము. అట్లనే ఈ యెరుక కలవంటిది గనుక అబద్ధమనియు, పరిపూర్ణము మెలుకువవంటిది కనుక సత్యమనియు ఈరెంటికి సామ్యముజేసి తెలుపుచున్నాను. కలను లేనిదని యెట్లు భావించెదమో ఎరుకనుగూడ లేనిదానిగా భావించవలయును. మెలుకువను ఎట్లు నిజమని తలంచెదమో అట్లనే పరిపూర్ణమునుగూడ నిజమని తలంచవలయును. అట్టి కుదిరిక - నీబుద్ధిలో నిజముగ ఎప్పుడు నిలబడునో ఇక అనేక శాస్త్రములు చదువుటచేతను, జపతపాదులు సలుపుట చేతను, యాగ యోగముల చేతను, వ్రతదానంబుల చేతను, శమదమాదులచేతను, చాంద్రాయణాది వ్రతముల చేతను, తలక్రిందుగా బెట్టి ఘోర తపస్సుల చేతను, నేను దేహము కాను ఆత్మ స్వరూపుడనై తినని అనుకొనుటచేతను యేమీ ప్రయోజనముండదు. ఇవి అన్నియు కలతో సమానమని తలంచి మెలకువ అను పరిపూర్ణమునందు చెదరక యుంటివేని మెలకువ వచ్చినవానికి కల లేకుండా పోయినట్లు నీకు ఎరుక లేకపోవును.

128. కం॥ నీ కలలో నినునన్నును-లోకుల లోకముల జూచి లోపలి భ్రమచే - నా కరుణ బడసి మేలుక - చేకొని కల కల్లజేసి - చేరెద వెటకో - సర్వము నీతో చేరీని యటకో - ప్రాకటముగ బట్టబయలెరుక లీరీతి - నీకు దెలిసినమీద నిలువాక వేవేగ-చేరెద వెటకో సర్వమునీతో చేరీనియటకో॥ 22

తా॥ శిష్యా! నీకు కల వచ్చినప్పుడు ఆకలలో నిన్నును, నన్నును. లోకులను, లోకంబులను నిజమని నమ్ముచుందువు. ఆ సమయములో నేను వచ్చి మెలుకువ పరచగా నీకు కనబడిన సకల దృశ్యములన్నియు అచ్చట యేమియు కనబడక, ఎచ్చటకు పోవుచున్నవో నీకు తెలియబడక యుండును. ఆ తీరుగనే జాగ్రత్తలోగూడ నీవు నిజమని నమ్ముచున్న లోకులు, లోకంబులన్నియు నా కరుణచేత పరిపూర్ణబోధ మెలుకువ కలుగగానే నీకు కనబడు సర్వసముదాయమంతయు కలతో సమానంగా మటుమాయమగును. ఈ విధముగా ఎరుక అనే కలను పరిపూర్ణమనే మెలుకువను యేమారక పరిశీలించుకొనుచు యుంటివేని, కలతో సమానమైన ఈ ఎరుక నీ బుద్ధిలోనుండి తొలగిపోవును.

129. కం॥ హరికర నఖముఖవిదళిత – కరిమస్తక గళితమైన ఘనమౌక్తికముల్ – దొరికిన నెరుకలు గురిజలె – ధరియింతురు రెంటి విలువ – తమ రెరుగకనెకా – అట్లనెబోధ – క్రమమెరుగకనెకా – పరిపూర్ణబోధాను యెరిగింపు చుండీన – యెరుకాకె – కొందారు మరిగేరీమర్మాము – తమ రెరుగకనెకా – అట్లనెబోధ – క్రమమెరుగకనెకా॥ 24

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధ సారవంతమై సులువైనదిగా యున్నప్పటికైనా దీని ప్రయోజనము ఎంత వారికి అర్థముగాక యుండును. అదియెట్లనగా సింహము తన పంజాగోళ్ళతో చీల్చబడిన ఏనుగు కుంభస్థలము నుండి నేలమీద జారిపడిన మెదడు మంచి ముత్యములై విలువైనవిగా యుండును. అవి అడవిలో తిరుగు ఎరుకలవాండ్లకు దొరికినప్పుడు వాటి విలువ తెలియక గురిగింజలు దండలలో కూర్చుకొని మామూలు పూసలుగా తలంచుచుందురు. యెందువల్లననగా అవి విలువ గలిగిన మంచి ముత్యములని వారికి తెలియదు. అటులనే జనన మరణ రహితమైన ఈ పరిపూర్ణబోధ ఆదిఖ్యాత యెంత వారికి తెలియక, ఎన్ని విధముల దెలిపినను గ్రహించక జనన మరణములతోగూడిన యెరుక భ్రాంతులకే ఈ జనులు పరుగులెత్తుచుందురుగాని ఈ పరిపూర్ణబోధ దగ్గరకు రాలేక పోవుచుందురు.

వి॥ పరిపూర్ణబోధ దృఢము కలుగునంతవరకు మనుజుడు సకల శాస్త్రములను, సకల కర్మలను పాటించుచుండును. ఆ పరిపూర్ణబోధ బాగుగా దృఢము కలిగినవెనుక ఏ శాస్త్రములతో, ఏ కర్మలతో పనిలేకయుండును.

130. కం॥ తనువో బహిరింద్రియములో – మనసో ప్రాణములో విషయ మమతో నేనం – చని నీవనియన నిదియని - యనుమానించెదవదేల – అది త్రోవగాదు - నీవెన్నాడు – యిది వినలేదూ – వినుమీ పరిపూర్ణాముగని లేని యా మీది - తనువాదికమును – లేందని గురునిచే దెలియు - మది త్రోవగాదూ – నీవెన్నాడు - యిది వినలేదూ॥ 25

తా॥ శిష్యా! నేను నీతో సారె సారెకు పరిపూర్ణము, పరిపూర్ణమని తెలుపుచు యుండగా ఆ పరిపూర్ణమును నీ మదిలో అది శరీరముగా యుండునేమో, చర్మముగా యుండునేమో, కన్నుగా ముక్కుగా చెవిగా నాలుకగా, యుండునేమో, నీమీద నాకు నామీద నీకు అభిమానములాగా యుండునేమో, నేను నేను అనేదిగా యుండునేమో, నీవు నేను అనేదిగా యుండునేమో అని అనుకొనుచుందువేమో. అవి ఏవియు నేను నీకు తెలుపబోవు పరిపూర్ణము కాజాలవు. నీ వెన్నడు అట్టి దానిని గురించి వినలేదు. చూడనూలేదు.ఇక ఆ పరిపూర్ణమును గురించి వినజేసెదను. ఆ నిరుపాదికమైన అచల పరిపూర్ణమునకు ఇంద్రియ సముదాయంబగు తనువుగాని, నేను నేననెడు ఎరుకగాని, ప్రాణముగాని, ఆత్మగాని అచ్చటలేవని దృఢవిశ్వాసముతో నమ్మియుండుము.

131. కం॥ నిను నను ప్రపంచమును జగ – మని యెరిగే యెరుకచాత నచలమును గనుంగొని–నిను నను జగమును జగ - మనియెరిగె యెరుకమాను మమలా వివేకా – చాలు నీవీక్రమ మెరిగి నాన్నా – నిను నన్ను పైరెండింటిని విశ్వమనక బయలనకుండె దు – న్నాదంచన గుర్తులేకుండు - మమలావివేకా చాలు నీవీ - క్రమమెరిగినాన్నా॥ 26

తా॥ శిష్యా! నీవని యెరిగేది ఎరుకే, నేనని ఎరిగేది యెరుకే, ఇదిప్రపంచమని యెరిగేది ఎరుకే. ఇట్లు నన్ను–నిన్ను ప్రపంచమును యే ఎరుక యెరుగుచున్నదో ఆ ఎరుకచేతనే నచల పరిపూర్ణమునుగూడ తెలుసుకొని పిదప నిన్ను నన్ను ప్రపంచమును - ఏ యెరుక యెరుగుచున్నదో, ఆ ఎరుకను లేకుండా జేసుకోవలయును. ఇదే ఈ పరిపూర్ణబోధ యెరిగిన దానికి క్రమమైన పద్ధతి యగును. ఆ పరిపూర్ణము మాత్రము నిన్నుగాని, నన్నుగాని, ప్రపంచమునుగాని ఎన్నడు ఎరుగకనే యుండును. ఇట్లు ఈ రెంటి విషయములు తెలుసుకొని ఇక మీదట నీవుగూడ నీవని, నేనని, ప్రపంచమని గుర్తులేక యుండవలయును.

అప్పుడే ఈ విమలమైన విచారణ పొందిన దానికి ప్రతిఫలము పొందగలవు.

132. కం॥ ప్రొద్దున నిద్దురమేల్కని - వద్దికి యేతెంచి గురుని వక్త్ర జనితమౌ - సుద్దులు మ్రొక్కి వినుము యే - ప్రొద్దిది బహుముద్దు సుమ్మి - పుట్టినందులకూ - గురు చరణాము - పట్టినందులకూ - నిద్దామౌ భక్తిచె నీవిట్లు జేసితె - దిద్దీ తీరిచి బోధతెరువూ జూపును నీవు - పుట్టినందులకూ గురు చరణాము పట్టినందులకూ॥ 27

తా॥ శిష్యా! పరిపూర్ణ బోధలోయున్న గూడార్థములు ఎరుగవలయుననిన పొద్దున్నే నిదుర మేల్కొని సద్గురు స్వాములవద్దకుపోయి సాష్టాంగ దండ ప్రణామంబులాచరించి ఆయన పాద సేవచేయుచు వారు తెలుపుచున్న అమృత వాఖ్యములను అత్యంతాశక్తితో వినుచు, భయ భక్తి విశ్వాసములు కలిగి ఆ గురుదేవుని ప్రత్యక్ష దైవముగా తలంచుచు, ప్రతి దినము ఆ గురు సన్నిధిలో మెలగుచుండిన ఎడల ఆయన నీయందు కరుణగలిగి పరిపూర్ణబోధను చక్కగా బోధించుచు, నిన్ను తీర్చిదిద్ది నీ సంశయముల నెల్లను బాపగలడు. అదియే మనుష్యజన్మ కలిగినదానికి, గురుపాదములు పట్టినదానికి సార్థకమని తలంచ వలయును. అట్టి నడవడిక యెవరియందు కలదో వారు చేయు పనులుగూడ ముద్దుగా కనబడుచుండును.

133 కం॥ గురుడు పరిపూర్ణమును జూ - పెరుకను లేందనుచు దెల్పి యిక దల్చకుమం - చెరిగించక విడిపోవునె - యెరుక నరుల్ సాధనములు - యెన్నీ జేసిననూ - లక్ష్యముద్ర - లెన్ని జూచిననూ - హర హరి బ్రహ్మ మరా సుర ముఖులైన - ధరణీ సురాద్యష్టదశజాత్యుద్భవులాను - యెన్ని జేసిననూ - లక్ష్యముద్ర - లెన్ని జూచిననూ॥ 28

తా॥ శిష్యా! గురువు పరిపూర్ణమును స్పష్టముగా జూపించి ఆ పరిపూర్ణ ములో ఎరుక లేక పోయినప్పటికైనా ఆ ఎరుక ఎట్లు వచ్చినదో, ఏమిగా వచ్చి నదో, అది వచ్చినప్పుడు ఏ స్వరూపముతో వచ్చి ఇంత జగత్తు నిర్మాణము చేసి నదో, ఆ ఎరుక సహజ లక్షణమునంతా శిష్యునకు యెరిగించి ఆ యెరుక లేని దని నిరూపణ చేయనిదే ఆ ఎరుక భ్రాంతి ఎంతవారికిగాని తొలగిపోదు. ఈ గురుకీలు నెరుగక కొంతమంది ఎరుక పోవుట కొరకు ఎన్నిసాధనలు చేసినను,

కొనియాడుచుందురు. అట్టి దక్షులైన శ్రీ శివరామదీక్షితుల వారిని నేనును మిక్కిలి ప్రీతితో భక్తినిజూపుచు నమస్కరించుచున్నాను.

క॥ ఆ దీక్షతుల కృపకు దా-పా దైయ్యప్పయ్య మంత్రి పరియించెను యీ
మేదిని తద్బోధ నతని- పాదములకు నుతులొనర్చి ప్రార్థింతు మదిన్॥17

తా॥ ఓజనులారా! శ్రీ శివరామ దీక్షితుల పాదపద్మములను సేవించి వారి యనుగ్రహమునకు పాత్రుడై జనన-మరణములులేని బోధను తెలిసికొని తాను జనన-మరణములకతీతుడై సర్వ సంశయములను బాపుకొని కృతార్థుడైన కంబాలూరి అప్పయ్య మంత్రి చరణార విందములను సదా స్మరించుచున్నాను.

క॥ నుతిజేసెద నప్పయ్యన్ - గతికై కొల్చితడు బోధ గనెనో నేనా
ప్రతిలేని పరశురామ-క్షితి సురవంశ మణియైన సీతాపతికిన్॥ 18

తా॥ సుజనులారా! పైన దెల్పిన పూజనీయులైన కంబాలూరి అప్పయ్యమంత్రికి శిష్యదాసుడై వారి పాదపద్మములను వేమారక సేవించుచు, వారివలన అఖండ బోధను గ్రహించగలిగి, తాను తరించి, సర్వులను తరింపజేయు ప్రజ్ఞ గలిగిన నా గురుదేవుడైన పరశురామ సీతారాములవారి ననుక్షణము నా బుద్ధిలో నిలుపుకొని నిత్యము వారికి ద్వాదశ వందనములర్పించు కొనుచున్నాను.

క॥ బుచ్చి వెంకమ్మతల్లిని - బెచ్చెరపెండ్లాడి కాశిసేతు వదాకన్
విచ్చలవిడి యెగజల్లెను - సచ్చరితుల కచలబోధ సాకల్యముగాన్॥ 19

తా॥ ఓజనులారా! నా సద్గురువర్యులైన శ్రీ పరశురామ సీతారామస్వాముల వారు బుచ్చి వెంకమ్మ అను సాధ్వీలలామను వివాహము జేసుకొని గృహస్థాశ్రమము నందుండి కాశీ మొదలు రామేశ్వరము వరకు సచ్చరిత్రులైన బుద్ధిమంతులకీ అచల బోధను సులభముగా దెలిపి కృతకృత్యులుగా జేసిన మహామహుడని తలంచవలయును.

క॥ ఆ సీతాపతి నతి వి - శ్వాసమునం గొల్చికొంటి సర్వేశ్వరుడం చీ
సద్బోధను తేటగ - జేసితి నివి సకలజనులు చెవియొగ్గివినన్॥ 20

తా॥ ఓసుజనులారా! అట్టి నా గురుదేవులైన శ్రీ సీతారామస్వాముల వారిని మిక్కిలి విశ్వాసముతో నా సర్వేశ్వరుడేయని మదిలో నిలుపుకొని షోడశోపచా

## -: 8. పరిపూర్ణబోధ 26 :-

135 కం॥ యీ వుత్త బట్టబయలును నీవిప్పుడు వుండ జూచి నిజముగ యెరుకన్ - నీవని నేనని జగమని - భావింపుము పిదప దీన్ని - బాయు మనిశమున్ - నిజముగ దీన్ని - బాయక నిశమున్ - శ్రీవనితేశ రాజీవసంభవ భవ - దేవేంద్రాదుల నింక సేవించు తలుపేల - పాయూమనిశమున్ -నిజ ముగ దీన్ని బాయకనిశమున్॥ 1

తా॥ శిష్యా! ఏ రూపములు లేనిదియు, ఏ నామములుగానిదియు, ఏ చిత్ర విచిత్రములైన సముదాయములతోగూడిన జీవులుగాని, అడవులుగాని, పర్వత ములుగాని, భూమిగాని, ఆకసముగాని, సముద్రముగాని, ఏ ఒక్కటియు అందు కనుపించని నిరామయమైన ఈ ఉత్త బట్టబయలును నీవు గుర్తించితివి గదా? అది యేనాడైనా పుట్టునదిగా కనుపించుటలేదు. ఒకనాడు లేకపోవునదిగా కను పించుటలేదు. అట్టిదైన ఆ బట్టబయలు ఏమని అనరాకయున్నది. అట్టిదానిలో ఈ ఎరుక ఏర్పడి నీవనియు, నేననియు, జగమనియు పేర్లు పెట్టుకొని వచ్చుచు పోవుచు ఏ కొంతసేపుకూడ నిలకడలేక యున్నది. ఈ నిలకడలేని ఎరుకను ఏనాడుగూడ సత్యమని నీమదిలో నిలుపుకొనక యుండవలయును. అట్టి నిశ్చ యము, నమ్మకము నీలో స్థిరపడి యుండెనేని ఈ ఎరుకతోగూడిన లక్ష్మి - పార్వతి -రాజరాజేశ్వరి - కాళికాదేవి మొదలగు క్షుద్రశక్తులనుగాని, దేవేం ద్రాది సర్వదేవతలనుగాని సేవించాలనియు వారిచే కోర్కెలను తీర్చుకోవాల నియు, ఆ బ్రాంతితోగూడిన తలంపులెల్లయు ఇక నీలో పుట్టకుండా పోవును.

వి॥ భూమండలమునందు సమస్త రాజులను జయించిన చక్రవర్తికి ఇక యే ఇతర శత్రువుల భయములేనట్లు పరిపూర్ణబోధ పొందిన వివేకవంతునకు ఏ గ్రహ దేవతా భయములు వుండవు.

136. కం॥ లేదనకు మున్నదదుగో - నేదెలసితి ననకు దీన్ని నీవెరి గేవా - కాదది నీవే దెలియను - యేపెర తన్మాత్రసమితి - యీ బట్టబైటా దీనికిసాటి - దేది యెచ్చోటా - వాదేల లే నెరుకతో దీన్ని గనిపెట్టి-పోదొట్టు మెరుక నిం - కేది బట్టను వాలు - యీ బట్టబైటా-దీనికి సాటి దేదీయెచ్చోటా.

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణము నీ కంటికి కనబడక యున్నంత మాత్ర మున అవి లేదని ఎన్నడూ అనబోకుము. ఆ పరబయలు ఎప్పుడూ స్థిరముగా

యుండునదియై నలుదిక్కుల వ్యాపించి సర్వకాలములయందు సర్వదేశముల యందును సూదికొనమోపను సందులేక ప్రత్యక్షముగా కనబడుచుండును. అట్టి దానిని నేను యెరిగితినని మాత్రము ఎన్నడు అనబోకుము. ఎరుగుటకు అం దులో పంచతన్మాత్రలు లేనందున నే ఇంద్రియాదులు ఆ పరబయలును ఎరుగ జాలవు. ఆ పరిపూర్ణమునందు చెవికి శబ్దము దొరకదు. కంటికి రూపము కన బడదు. చేతికి స్పర్శనివ్వదు. నాలుకకు రుచి కనబడదు. ముక్కునకు వాసన ఇవ్వదు. అట్టిదానిని ఈ ఇంద్రియాదులు యెరుగగలవని దెలుపుట హాస్యాస్ప దమై యుండును. దానితో సమానమైనది ఇంకొకటి ఏ లోకముల యందును కనబడకయుండును. ఇట్టి దీ గురురహస్యమగుటవలన ఇక ఏ మాటను మాట్లా డక, ఏ వాదములు చేయక ఈ లేని ఎరుకతోనే ఆ వున్న పరిపూర్ణమును గ్రహించుకొని లేనెరుకను లేకుండా జేసుకొంటివేని ఇక ఈ జగత్తులో ఏదానిని జూచిన అల్పముగానే నీకు కనబడుచుండును.

137. కం॥ కనవచ్చి యిట్టి దట్టిది - యని యనరాకుండు బయలు నదె కనుగొనుమీ - కనరాకపోతె శూన్యం - బను మిట్టిది యట్టిదనుచు — పలుక వచ్చిననూ – యెరుక దాంట్లో – పలికీ జొచ్చిననూ — వినుమా బయలును నీ వేమనినా వొప్పెదగా – నొప్పను నీ మాటనునే – జెప్పినరీతి గనవస్తె - పలుకవచ్చిననూ - యెరుక దాంట్లోపలికీ జొచ్చిననూ॥ 3

తా॥ శిష్యా! ఈ బట్టబయలు కనబడుచునే యున్నదికాని ఇట్టిది అట్టిది అని తెలుపుటకు మాత్రము సాధ్యపడక యున్నది. అట్లు ఉన్నదో, లేదో నీవే చూచి చెప్పుము. ఆ పరిపూర్ణము నీకు కనబడక యుండెనేని కనబడుట లేద నియు, శూన్యమనియు తెలుపవచ్చును. ఆ పరబయలు కనబడుచునే యున్నది. ఆ కనబడేదానిని ఈ ఎరుక తెలుపుటకు అందులో ఎరుపు–తెలుపు నలుపు - సునీలము - వెలుగు–పొట్టి-పొడవు–సన్నము - లావు మొదలగు పరిమితులు కలి గిన రూపాదులు అందులో తెలియబడక పోవుటవలన దాన్ని నిర్ణయించి చెప్పు టకు ఈ ఎరుకకు సాధ్యపడక పోవుచున్నదేకాని ఆ బట్టబయలు ఎప్పుడు లేక పోలేదు. ఈ ఎరుకే అందులోకివచ్చుచు, పోవుచు యుండికూడ ఆ పరిపూర్ణము యెట్లు యున్నదో ఈ ఎరుక చెప్పలేక పోవుచున్నది. ఈ ఎరుక చెప్పలేకపోయి నంత మాత్రమున ఆ పరిపూర్ణములేదని తెలుపుటకు నేను వప్పుకోను. ఆ పరి పూర్ణము యెప్పుడూ కనబడుచునే యున్నది. ఈ ఎరుకే ఒకప్పుడు లేకపోవు

మన్నందువలన ఎరుకనే శూన్యమనదగునుకాని పరిపూర్ణము ఎప్పుడు శూన్యము కాబోదని నా మాటయందు నమ్మకము కలిగియుండుము.

138. కం॥ కనవొచ్చు బయలులేదని - యనవచ్చునె యిట్టిదట్టి దన వచ్చునె ఛీ - యనరాదు యెరుక కెన్నడు – కనుకనె యీ బయలు - యెల్ల కాలాముంమందీ - దీనందెరుకే – కాలాములేందీ వినుమీ లేనెరుకాను వివ రించ శూన్యామౌ - అనుమానమే మెరుకగను - విశ్వమట్టిదే – కాలాముం మందీ – దీనందెరుకే – కాలాములేందీ॥ 4

తా॥ శిష్యా! సద్గురు దయతో కలిగిన గురుదృష్టియున్న వారలకు ఈ అచల పరిపూర్ణము పంచ ప్రళయముల యందుగూడ శాశ్వితముగా యుండు నట్లు కనబడుచున్నది· అట్టిదానినిలేదని తెలుపుట ఒక కాలములో కనబడుచూ ఒక కాలములో కనుపించని ఎరుకనుమాత్రము యున్నదని తెలుపుట అది అను భవములేని మాటలుగాయుండును· ఛీ–ఛీ ఆ మాటలు యెన్నడూ వినకూడదు. ఈ బయలు ఎల్లకాలములయందు కనబడుచునే యున్నది. అట్టిదానియందు ఈ ఎరుకగాని, ఈ యెరుకజేసిన ప్రపంచముగాని ఏ కాలమందును కనబడక పోవు చున్నదని గట్టిగా తెలియబడుచున్నది అట్లు తెలియబడుచున్న ఎరుకను లేదని చెప్పవచ్చుగాని, బట్టబయలును మాత్రము లేదని చెప్పకూడదు. ఇట్లు ప్రత్యక్ష ముగా తెలియబడుచున్న దానిని ఉన్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా తెలుప డానికి అనుమానించ పనిలేదు. ఉన్నది వున్నట్లుగానే, సంశయము లేకుండా నిర్భయముగా తెలుపుచుండుము.

139. కం॥ పరిపూర్ణమనిన యెట్టిదొ – యెరిగెదనని ఎరుక బైటికేగిన యెరుకె – యెరుకకు శూన్యంబయ్యేను – యెరుకను జన్మించినట్టి – యీ విశ్వ మంత – యెరుకవలెనె – యేమీలేదంతాయెరుకా వుండంగానె యెరుకా విశ్వ ములులే – వెరుకాకె యిదిజూడ యెంతో వింతైతోచె – యీ విశ్వమంతా – యెరుకవలెనె – యేమీలేదంతా॥ 5

తా॥ శిష్యా! ఈ ఎరుక వచ్చేటప్పుడు ఒక రూపమును తోడు జేసుకొని వచ్చి నాశనముగల రూపాదులను చూచి, చూచి ఒకనాడు రూపముగానిదియు, నాశనము లేనిదియు, ఆ పరిపూర్ణము ఎట్లుండునో అట్టిదానిని చూడవలయునని

ఈ యెరుకకు కోరిక గలిగి అందుకు తగిన ప్రయత్నముచేసి ఆ పరబయలును తీరా తాను జూచేటప్పటికి తానే లేకుండపోవును. తాను యెప్పుడు లేక పోయినదో, తనతోగూడ వచ్చిన ప్రపంచముగాని లేకుండా పోవును. అట్లు తానుజూస్తూ యుండగనే తానుగాని, తనతో వచ్చిన ప్రపంచముగాని లేకపోవడము ఈ ఎరుకజూచి ఈ ఎరుకకే విచిత్రమై ఆశ్చర్యముగా కనబడుచుండును.

వి॥ బురద నీటిలో చిల్లిగింజ, గంధముతీసి కలుపగా–బురదను–మంచి నీరును వేరు వేరుగా చేయును. తరువాత ఆ వేరుపరచిన బురదలో జూచిన ఆ చిల్లిగింజ గంధము కనబడదు. మంచినీటిలో జూచినా ఆ చిల్లిగింజ గంధము కనబడదు. అట్లనే ఈ ఎరుక పరిపూర్ణమును దర్శించేటప్పటికి తాను ఎక్కడను కనుపించక పోవును.

140 కం॥ గురుమూర్తి జూపకున్నను – పరిపూర్ణంబెట్లు తనకు ప్రత్యక్ష మగున్ – గురుమూర్తి జూపెనేనియు – పరిపూర్ణము తనకులెస్స – ప్రత్యక్ష మౌరా – చూస్తునె యెరుక– పారీపోవునురా యెరుకా బోయిన వెనుక యెవరా ప్రత్యక్షాన్ని – యెరిగిట్టిదట్టిదంచెరిగెవారటుమీద – ప్రత్యక్షమౌరా–చూస్తునె యెరుక పారిపోవునురా॥ 6

తా॥ శిష్యా! ఏ రూపము గానిదియు, ఏ నామము లేనిదియు, ఏ క్రియా కనుపడని ఆ పరిపూర్ణమును ఒకనాడు గురుమూర్తి ఏదో ఒక సౌంజ్ఞతో జూపనిదే ఎంతటి ప్రజ్ఞావంతులకైనను గుర్తుకురాజాలదు. ఆ సద్గురుస్వామి సౌంజ్ఞ అయ్యేనేని ఇక ఎక్కడ జూచినా ఆ పరబయలే ప్రత్యక్షముగా కనబడుచుండును. ఆ నిరామయమైన దానిని చూడగనే, ఈ ఎరుక తనంతటతానే లేకపోవును. అనగా (ఎరుకకు గుర్తించే స్వభావము కోల్పోవును) ఎరుక యెప్పుడు లేక పోయినదో ఆ పరిపూర్ణము వున్నదనికాని, లేదనికాని వాదోపవాదములు చేయుటకు అచ్చట యెవ్వరు కనబడక యుందురు. అనగా గుర్తించే ఎరుక అచ్చట లేనందున గుర్తించిన దానిని గురించి తెలుపుటకు అచ్చట ఎవరుండి తెలుపగలరని అభిప్రాయము.

141. కం॥ పరమపదమనిన బయలన – గురుగుహ్యమనంతమనిన గోప్యంబనినన్ – పరిపూర్ణమచలమనినను – తిరమనగా బట్టబయలు–తెలియు మాయపాప–యీ తెలిసిన తెలివి మానపాప–యెరుకానెరుగనిదన్న నెరుకమీరిన

దన్న – యెరుకామరుపులులేని పరవస్తువన బయలె - తెలియు మాయప్పా
యీా తెలిసిన తెలివి మానప్పా॥ 7

తా॥ శిష్యా! పరమపదమనినను, బయలనినను, గురుగుహ్యామనినను, గురు రహస్యమనినను. అచలమనినను, స్థిరమనినను, పరవస్తువనినను ఈ పరిపూర్ణమునకే ఇన్ని పర్యాయ నామములు తెలుపబడుచున్నవి. ఇన్ని పేరులతో ఈ పరిపూర్ణమున్నదని ఏ తెలివి తెలుసుకొనుచున్నదో, ఆ తెలివిని విడచిపెట్ట వలయును. ఏ దానికి ఎరుకలేదో, ఏది ఎరుకను యెరుగకున్నదో, ఏది ఎరుకకు మీారియున్నదో, ఏ దానికి ఎరుక మరుపులు లేకయున్నదో అదే పరబయలని తెలుసుకోవలయును. ఆ తెలుసుకొనే తెలివిని యెల్లవేళలయందును లేదని ముమ్మాటికి నమ్మవలయును. ఇదే ఈ బోధలో యున్న ప్రత్యేకత అని గ్రహించవలయును.

142. కం॥ బట్టబయలనుచు దీనికి – మొట్ట మొదల్ పేరులేదు ముదమున యెరుకే – పుట్టి పేర్పెట్టి దీనిని – పట్టుకలవ్వాడలేక – పారిపోవునురా కనరాదిందు – దూరానేరదురా – పుట్టి చచ్చుచు మళ్లి బుట్టి గిట్టుచు బుట్టు – నిట్టి తిప్పలనొందు యెరుకె బయలునుజూస్తె – పారిపోవునురా – కనరాదిందు దూరనేరదురా॥ 8

తా॥ శిష్యా! ఈ బట్టబయలైన అచల పరిపూర్ణమునకు మొట్టమొదట ఏ పేరులేక యున్నది. ఈ ఎరుక ఒకనాడు పుట్టి దానికి పరిపూర్ణమని, అచలమని తానే పేరు పెట్టి పరిపూర్ణము తాను కావలయునని ఆ పరిపూర్ణములో తాను యుండవలయునని యెంత ప్రయత్నము జేసినను తుదకు తానే కనబడక పోవుచుండును. ఈ ఎరుక ఆ పరిపూర్ణములోకి పోలేక ఆ పరిపూర్ణము కాలేక పుట్టుచు గిట్టుచు, గిట్టుచూ -పుట్టుచు అనేకతిప్పలు తనకు తానే పడుచుండును గాని, ఆ పరిపూర్ణమున్నట్లుగా ఈ ఎరుక యుండలేక పోవును. ఆ పరిపూర్ణమును చూడడముతోనే ఈ ఎరుక లేకుండా పోవును. ఇక ఆ పరిపూర్ణములోనికి ఈ యెరుక ఎట్లు పోగలదు. ఆ పరిపూర్ణమును ఈ ఎరుక యెట్లు ఎరుగగలదు. యెప్పుడూ కాలేదని యెప్పుడూ యెరుగలేదని తలంచవలయును.

143. కం॥ వినుము నేననుచు యెరిగే – తనువందున లేక బయలు తానిండినదౌ – కనుగొనుమది కనుగొని – యీా తనువును విడనాడుమింతె -తడు

వేలనోయీ – యీ పనికింక-గడువేలనోయీ-అనుమానముంటె నీవరయీము
శివరాము - లను దీక్షతులుజేసెనచలా గ్రంధమునంత - తడువేలనోయీ -
యీ పనికింక గడువేలనోయీ॥ 9

తా॥ శిష్యా! నేను నేను అని ఎరుగుచు ఏ తనువులో ఈ ఎరుక కనబడు చున్నదో, ఆ తనువుగాని ఆ తనవులోయున్న ఎరుకగాని ఈ పరబయలునందు కనబడక ఆ బయలే అన్ని తావులయందును సందులేక నిండియున్నది. ఈతను వెరుకలు రెండును యెంత భద్రముగా నిలకడ కలిగి యున్నవో, చూచెదమని విచారించిన యెడల జగత్తునందు చూచిన వీటికి నిలకడ లేక క్షణం, క్షణం మాయగ కనబడుచు, వస్తూ పోతూయున్నవి. పరిపూర్ణములోనైనా యున్నవా! అని పరిశీలించగలిగిన, అక్కడ అసలే కనుపించక యున్నవి. ఇక ఈ రెండు యెక్కడ స్థిమితముగా యున్నట్లు, యేమిగా యున్నట్లు అని తోచబడుచుండును అట్టి తను వెరుకలను యెప్పుడు లేనివిగానే భావించవలయును. దానికి ఒక గడువు, ఒక సమయముతో పనిలేదు. నీకు ఆవిషయములో అనుమానము కలుగునేని శివరామ దీక్షితులు తెలిపిన అచల గ్రంధమును ఓపికతో పరిశీలించుము. అందులో ఈతను వెరుకలు విషయం పూర్తిగా తెలియబడగలదు.

144. కం॥ దేహాకారము గానిది - యాహంభావంబు లేనిదఖిలజనులు
దా–సోహం సోహంబనినను మోహము జెందనిది బైలు – మొదలెరుగవలెరా
యెరిగిన యెరుక - తుదకరుగవలెరా–కోహం కస్త్వంబాని కూతాలు గూసేటి
దేహి దేహములాను తెలియాని యీ బైలు – మొదలెరుగవలెరా - యెరిగిన
యెరుక - తుదకరుగవలెరా॥ 10

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణము ఒక పరిమితి కలిగిన ఆకారములుగా యున్నదని భావింపకుము. పరిమితి కలిగిన స్థూలదేహము, సూక్ష్మ దేహము, కారణ దేహము, మహాకారణ దేహములగు జీవతనువులు నాలుగుగాని విరాట్ పురుషుడు, హిరణ్యగర్భుడు, అవ్యాకృతుడు, మూల ప్రకృతి అను ఈశ్వర తనువులు నాలుగు గాని, ఈ పరిపూర్ణమందు కనబడవు. ముందెప్పుడుకూడ ఈ దేహాదులతో ఈ పరిపూర్ణము యుండబోదు. ఆ దేహాదులు ఆ పరిపూర్ణములో లేనందువలన నేను-నేను అను అహంకారము ఆ పరిపూర్ణమునకు లేక యుండును. సకల జనులు సోహం-సోహంబని తారకాదులను జపించుచుండినను, స్తుతించు చుండినను, ఆ స్తుతులన్నియు ఆ పరిపూర్ణమునకు తెలియబడక

యుండును. స్తుతించేది ఎరుకే. స్తుతించేనని తృప్తిపడేదిగూడ యెరుకే. నేనని నీవని యెరుగుచు నీవువేరు, నేనువేరు అని తెలుపుచు ఈ ఎరుకకెరుకే అనుకొను చుండునుగాని ఆ పరిపూర్ణము యేది ఎరుగక తనకు తానుగానే, ఏ దేహాదుల సంబంధంలేక యుండును. ఇది దేహమని, ఇది ఎరుకని, ఏ ఎరుక యెరుగుచున్నదో, ఆ ఎరుకకు మూలములేదని దానిని మొదలంటూ తీసివేయ వలయును.

145. కం॥ యే వస్తువు బాతను దా - నావిర్భవమొందు దేహమను తరువరయన్ - ఆ వస్తువె దానికివి-త్తై వెలయును దాన్నె సాక్షి ద్రష్టానికనుమీా యెరుకయిదె స్పష్టాము వినుమీా - భావించి చూడుమీా బట్టాబయలను భూమి - యావిత్తు చెట్టున్న దరయాద విత్తూనే ద్రష్టానికనుమీా — యెరుక యిదె - స్పష్టాము వినుమీా॥ 11

తా॥ శిష్యా! చెట్టు మహావృక్షముగా కనబడుటకు కారణము. ముందు వి త్తనము ఆధారమై యున్నటుల ఈ దేహమను వృక్షమునకు గూడ యెరుకయే వి త్తనముగా యున్నది. ఈ ఎరుకనే వి త్తనమును సర్వ సాక్షియనియు, ద్రష్ట అనియు, శాస్త్రవేత్తలు తెలుపుచుందురు. ఈ సాక్షి, ద్రష్టలు ఎట్లున్న వనిన, సమస్తమునకు వేరుగాయుండి సమస్తమును చూచుచున్న వానిని సాక్షి అని తెలుపుచుందురు. సమస్త దృశ్యమునుజూచుచు ఆ దృశ్యమునకు వశపడి బంధములలో యున్నవాడై అదృశ్యములేని కాలములో ముక్తుడగు వానిని ద్రష్ట అని అందురు. ఇట్లు ద్రష్ట అనిన-సాక్షి అనిన యెరుకయే యని తెలియుము. ఈ ఎరుక దేహముల విషయములు యెట్లున్నవనిన విత్తువలన చెట్టు గలిగినా, చెట్టువలన విత్తుగలిగినా ఆ విత్తు చెట్టులను భూమి యెట్లు యెరుగకున్నదో అటులనే ఈ ఎరుకనుగాని ఈ యెరుకచే నేర్పడిన దేహాదులనుగాని, యెన్నడు ఈ పరిపూర్ణము యెరుగక యున్నదని నిశ్చయమైన భావముతో సంశయము లేక యుండవలయును.

146. కం॥ యే పరిపూర్ణము మేనికి - లోపల వెలి నిండియుండు లోపములేకన్ ఆ పరిపూర్ణమె జగతికి - లోపల వెలినుండు దానిలోనె వున్న విరా - పై రెండెవ్వి లేనివెన్నకురా - యీా పూర్ణబోధచె పై ప్రపంచ శరీర రూపము లెడబాపు మీా పట్లనే దానిలోనె వున్నవిరా - పై రెండెవ్వి - లేనివెన్నకురా॥ 12

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణమొక్కటియే సర్వత్రా నిండి యున్నందు వలన శరీరములో జూచిన ఆ పరిపూర్ణమే కనబడుచుండును. శరీరము వెలుపలజూచిన ఆ పరిపూర్ణమే కనబడుచుండును. ఇట్లు శరీరములోపల, శరీరము వెలుపల ఆ పరిపూర్ణము ఎట్లు కనబడుచున్నదో, అటులనే ప్రపంచము లోపలగాని, ప్రపంచము వెలుపలగాని, ఆ పరిపూర్ణమే కనిపించుచు, ఒక దగ్గరయున్నది, ఒక దగ్గర లేదనులోటును చూపించక, అంతా తానుగానే విరాజిల్లుచు, నర-మృగ పశు-పక్షి-క్రిమి-కీటక-స్థావర జంగమాదులన్నియు అందులోనే కనుపించు చుండును. ఈ శరీరజగత్తులు రెండును అందులో లేకనే యున్నటుల తోపించు చున్నవి. గనుక నేను, నీకు తెలుపుచుండిన అచల పరిపూర్ణ బోధవలన ఈ శరీర జగత్తులను లేకుండా జేసుకొని ఆ నిరుపాధికమైన పరిపూర్ణమునుమాత్రం ఏ సమయములోగూడ మరచిపోక యుండుము.

వి॥ ఎండమావులయందు జలము కనిపించుచున్నను, ఆ జలము లేనిదే అగుచున్నది. అద్దమునందు ముఖము కనిపించుచున్నను ఆ ముఖము లేనిదే అగుచున్నది. అట్లనే పరిపూర్ణమందు ఎరుక జగత్తులు కనుపించుచున్నను విచారించిన వారికి లేనివే అగుచున్నవి.

147. కం॥ యెరుకనగా యెరిగేటిది – మరుపనగా యెరుక తనను మరచుట మీా రెం – ట్నెరుగనిదె బయలివి నీ - వెరిగెరుకను మరుపు నిప్పు డెరుకావె విడరా వీడితె పై మా – టెరిగెదెవ్వడురా – యెరుకె పరిపూర్ణమం చెదిరించి వదిరేవు - పరిపూర్ణమైతె చూపర బయలందున దాన్ని – యెరుకావె విడరా – వీడితె పై మాటెరిగెదెవ్వడురా॥ 13

తా॥ శిష్యా! ఈ ఎరుకకు - యెరిగేపని - మరిచేపని ఈ రెండు పనులు స్వభావికముగా యున్నవి. అందువలన ఈ ఎరుక యెరిగే సమయములో తనను తాను యెరుగుచున్నది. ప్రపంచమునుగూడ యెరుగుచున్నది. తిరిగి ఆ యెరుకకు మరుపు కలిగినపుడు తనను తాను ఎరగడములేదు. ప్రపంచమునుగూడ యెరుగడములేదు. ఇక అచల పరిపూర్ణమును గురించి విచారించిన యెడల ఆ ఎరుకకున్న యెరుక మరుపులు రెండును ఈ బట్టబయలునందు కనబడకయుండును. యెరుకకు, పరిపూర్ణమునకుయున్న తేడాలను ఎరుకచేతనే నిర్ణయించుకొని ఎరుక మరుపులు కలిగియున్న ఎరుకను లేనిదనియు, అనిత్యమనియు,

ఆ ఎరుకను లేకుండా జేసుకోవలయును. ఆ ఎరుక లేకపోయిన వెనుక యిది యెరుక అని గాని, ఇది పరిపూర్ణమనిగాని ఎరిగేవారు అక్కడ యెవ్వరు యుండరు. అందువలన ఎరుక మరుపులతో గూడి ఒకప్పుడు కనబడుచు, ఒకప్పుడు కనుపించని ఈ ఎరుక, ఎరుక మరపులు లేక శాశ్వితముగా యుండునట్టి ఆ అచల పరిపూర్ణమగునని ఏనాడు తలంచకుము. మరి ఒకరితోగూడ తెలుపకుము. ఈ ఎరుక పరిపూర్ణమగునని తలంచితివేని ఆ పరిపూర్ణమందు ఈ ఎరుకను జూపించవలయును. అట్లు జూపలేకపోయిన ఇక ఎరుక పరిపూర్ణమగునని,-బయలగునని-యేనాడు పిచ్చి-పిచ్చి మాటలు పలికి పరిపూర్ణబోధకు కళంకము తెచ్చి పెట్టకుము.

వి॥ అద్వైత సిద్ధాంతమునందు ఎరుకనే పరిపూర్ణమని తెలుపుట ఆ సిద్ధాంతమునకు సరిపోవును. ఇది అచల సిద్ధాంతమగుటవలన ఈ సిద్ధాంతము ఎరుకను రహితపరుచు సిద్ధాంతమేగాని, ఎరుకను పరిపూర్ణమను సిద్ధాంతము కాదు. ఎరుకను పరిపూర్ణమని తెలిపిన యెడల అది అద్వైతబోధ అగునుగాని అచలబోధ కాజాలదు. అందువలన ఎరుకను నిలిపేటి గురుడు ఎందుకోయన్నా తద్బోధ నీకెందుకోయన్నా అని కృష్ణదాసు – 226 కందార్థములో తెలిపి యున్నది.

148. కం॥ లేదన్నను కనుపడుగద – నేదెలసితి ననిన బైటనే నిల్వగదా – నే దీనివెనుకగద నా – కేదో మూలంబుయిది గా –దిక లేదెచ్చోటా – కనుకనె వుళ్ళ – క్కీ నేనన్మాటా – యేది లేదిది దప్పనే దెలియనిది యని దా దెలుసుకొని యెరుకె – తనను వీడితెజాలు – యికలే దెచ్చోటా – కనుకనె వుళ్ళ – క్కీ నేనన్మాటా॥ 14

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణమును గురువులవలన తెలియనివారును, గురువు తెలిపినను దృష్టికిరానివారును మాకు కనుబడుటలేదు. మాకు కనబడుటలేదని తెలుపుచుండినను, ఆ పరిపూర్ణము యే చాటు మాటులేకుండ ప్రత్యక్షముగానే కనుపించుచున్నది. అట్టిదానిని జూడవలయునని ఈ ఎరుకకు తలంపు గలిగి ఆ బయలు దగ్గరకు పొయ్యేటప్పటికి యెరిగేదానికి ఎరుకే లేకపోవుచు ఇట్లు అనుకొనుచున్నది. ఈ పరిపూర్ణము నాకంటే ఎంతో ముందు నుంచి యున్నది. నాకు మూలముగాని, నేనురావడానికి కారణముగాని ఈ బట్టబయలుకు ఏనాడు సంబంధములేదు నాకు నేనే వచ్చుచూ, నాకు నేనే పోవుచున్నాను. ఈ పరి

పూర్ణము మాత్రము నిత్యమై, సత్యమై, శాశ్వతముగానున్నదని —ఎరుక కెరుకే తలంచుచు నేను యేకాలమందును లేనిదానినని నిశ్చయించుకొని తానే లేకుండా పోవును.

149. కం॥ సత్యమగు బట్టబయలు న — సత్యంబగు - యెరుక నెరిగి సద్గురు కృపచే - సత్యము గాదని యెరుకను — సత్యముగా నమ్మి వుంటె - చాలు చాలన్నా - వానితోటి — సాటెవ్వరెన్నా నిత్యా నిత్యములానె నిర్ణాయ మెరుగాక — నిత్యుడై యుండేటి నిజబోధ గలిగితె - చాలు చాలన్నా — వానితోటి సాటెవ్వరెన్నా॥

తా॥ శిష్యా! సకలశాస్త్రములలో సత్యము-సత్యమని స్థిరపరచేది ఈబట్ట బయలునేగాని దీనికి మినహా యేమి తెలిపినా అది యెరుకయేననియు, సత్యము గాదనియు తెలియుము. సద్గురు కటాక్షముచేత ఆ నిర్ణయము నీకు చెదరక కుదిరినట్లయిన లేని ఎరుకను లేనట్లుగా, ఉన్న బట్టబయలును ఉన్నట్లుగా గ్రహించ గలిగితే ఎరుకతో నేర్పడిన దేహి దేహములు సత్యముకావనియు. పరిపూర్ణము ఒక్కటియే సత్యమనియు ఆ నిశ్చయము నీలో గట్టిగా కలిగిన యెడల నీతో సమానమైనవారు ఈ లోకములో ఎవ్వరూ కనబడక యుందురు. అందువలన నిత్యమేదో—అనిత్యమేదో—నిజబోధచే నిర్ణయించుకొని ఇక అవును-కాదను-యే నిర్ణయములు లేక దృఢమైన భావముతో మెలగుచుంటివేని అంతే చాలును. అదియే చక్కటిబోధ మార్గమని తెలియుము.

150. కం॥ పరిపూర్ణములో దోచిన - యెరుకే కలలేని యెరుక నెరిగి మృషని యీ-మరుగెరుక కెరుక దెల్పిన — యెరుగుటమె — మేల్కనుమ్మి - యిది యేమారకుమీ - సద్గురువాజ్ఞ - కెదిరీ మీరకుమీ యెరుక యీరీతిగ యెగిరీ పోయిన వెనుక - పరిపూర్ణ మొకటుండు - పలుకారా దెట్లందు —నిది యేమారకుమీ - సద్గురువాజ్ఞ - కెదిరి మీరకుమీ॥ 16

తా॥ శిష్యా! సకల సృష్టికి ఆధారముగా నున్నది ఈ ఎరుకేననియు, సృష్టికి అతీతముగా యున్నది పరిపూర్ణమనియు నేను తెలుపుచున్న బోధలో స్పష్టమగుచున్నది ఈ సకల సృష్టికి ఆధారమైన ఎరుక యెట్టిదని విచారించిన యెడల లేకనే కలతోచినట్లుగా పరిపూర్ణములో ఈ ఎరుక కనబడి సకలసృష్టిని కలతో సమానముగా సృష్టించుచున్నది. తిరిగి కలతో సమానముగానే నాశన మొనర్చుచున్నది. ఈ ఎరుకెట్లు కలతో సమానంగా వచ్చినదో, ఈ ఎరుకచేయు

సృష్టికూడ కలతో సమానముగా కనబడుచు వస్తూ, పోతూ యున్నది. ఇట్లు కలతో సమానముగా వస్తూ పోతూయున్న ఎరుక తన నిజము తాను తెలుసుకో వలయునని ప్రయత్నించి చూచినపుడు తన విషయము—తనకే - కలవంటిదని యెప్పుడు తెలియబడునో అదే ఈ ఎరుకకు మెలకువ అగును. అట్లు తన విష యము తనకు తెలియక యున్నంత కాలము ఈ ఎరుక కలలోనే యుండును. ఈ ఎరుక మర్మము ఇట్టిదని సద్గురువుచేత తెలుసుకొని సద్గురువాజ్ఞతో నిలబడి ఈ యెరుకజేయు సృష్టినిజూచి ఆశ్చర్యపడక ఇది చాలా గొప్పదని తలంచక గడ్డిపోచతో సమానంగా తలంచితివేని ఇక సర్వత్రా పరిపూర్ణమే కనబడుచు ఇక యే మాటా ఈ నోటివెంట రాకయుండును.

151. కం॥ తిప్పలగు రాకపోకల – నెప్పుడు తానెరుగనట్టి యీ బయ లందున్ - తప్పక తనకై తానే – తప్పున గనవచ్చి యెరుక –తాగానరాదూ బయలున్నాది తనకెరుక లేదూ – యెప్పుడు బయలున్న దెరిగి తా లేనట్టి – చొప్పు సద్గురుబోధ – చొప్పున దెలసితే – తా గానరాదూ – బయలున్నది తన కెరుకలేదూ॥ 17

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణమునకు రాక పోకలులేవు. వృద్ధి క్షయములు లేవు. పరిణామ ప్రవృద్ధులులేవు. కాలమాన మార్పులులేవు. అవస్థాత్రయ భేద ములులేవు. ఒక పదార్థమును మరొక పదార్థముగాజేయు గుణములులేవు. ఎల్ల కాలములయందును తనస్థితికి ఏ కళంకము కలుగక నిష్కళంకముగానే యుం డును. అట్టిదానిలో అప్పటి కప్పుడు తనకుతానే ఈ యెరుక ఏర్పడి పడరాని తిప్పలుపడుచు, తిరుగా అప్పటికప్పుడే కనుపించక పోవుచుండును. తాను తిప్పలు పడినట్లు యే తిప్పలు పడని పరిపూర్ణము ఒకటున్నదని ఈ యెరుకకు యెన్నడు తెలియబడక యుండును. ఒకనాడు అచల గురుమూర్తి వలన ఈ పరిపూర్ణబోధ తనకు ప్రాప్తమై ఏ రాకపోకలు లేని పరబయలును సందర్శించి ఆ బయలందు తానులేనని తనకు తనకే గుర్తుకువచ్చిన యెడల తానే లేకుండా పోవును.

152. కం॥ అన్నముశుక్లంబగు రస – మున్నతిగా రక్తమగును నొకచో రెండున్ - పన్నుగ గలసిన మేనని – యెన్నబడున్ యెరుకగల్గి - యిదే మాయ సుమ్మీ – మూలము లేనిదిదె నీవునమ్మీ - యున్నావు పరిపూర్ణమున్నది గని

లేని - దెన్నడు లేదని యెరిగితె చాలు - గుర్తదె మాయ సుమ్మీ - మూలములేని - దిదెనీవునమ్మీ॥ 18

తా॥ శిష్యా! ఇంత పటాటోపములుగా కనబడుచున్న ఈ యెరుక పుట్టుపూర్వోత్తరాలు పరిశీలించబోయిన యెడల తల్లిదండ్రులు బోంచేయు అన్నము నీరములు వలన తండ్రినుంచి శుక్లముగాను, తల్లినుంచి శోణితముగాను ఏర్పడి ఈ రెండు కలసినచోట నేను మేనులతోగూడిన ఒక శరీరము యేర్పడి ఆ శరీరమునకు ఉప్పు-పులుసు-తీపు-కారము-చేదు-వగరు అను షడ్ రుచులవలన పుట్టడము, పెరగడము, బలవడము, సుష్కించడము, ముసలితనంరావడము, మరణించడము అను షడ్భావ వికారములు కలుగుచు కనబడినంత సేపు కనబడుచు అంతలోనే ఈ నేను, మేనులు కనబడక పోవుచున్నవి. ఇదే మాయయని తెలుసుకొనుము. ఇంతకు మించినమాయ మరొక్కటిలేదు. అంతేకాని ఈ నేను మేనులకు యేదో ఒక మూలముందని మాత్రము తలంచబోకుము. వాటి కవే ఒకదానికొకటి ఆధారమై మూలము లేకనే వస్తూయున్నవి. మూలము లేకనే పోతూయున్నవి. ఇట్లు మూలములేని దేహి, దేహములను నిజమనినమ్మి సర్వ దుఃఖములు తెచ్చి పెట్టుకొనక ఆ పరిపూర్ణమే సర్వకాల సర్వావస్థలయందును శాశ్వితముగా యున్నదనియు, ఈ దేహిదేహములు రెండు శాశ్వితముగాదనియు దృఢబావనగలిగి ఈ నేను మేనులమీద భ్రాంతిలేక యుంటివేని అంతేచాలును. పైన అభిప్రాయము విశదముగా 80వ కందార్థం అన్నము సూక్ష్మాంశము అను దానిలో యున్నది.

153. కం॥ కనకమన భూషణంబులు - యినుమన శస్త్రాదికంబులి త్తడియనినన్ - గనుగొన పాత్రలు గనుపడు - తనువన నవయవములన్ని తగ దొంతియని నా - కుండలు భూత - తతి జగత్తనినా - వినుమట్ల యెరుకన్న వివరించ తత్వాలు - మనుసందు గట్టీగ మరువాకు మీ మాట - తగ దొంతియని నా - కుండలు భూత - తతి జగత్తనినా॥

తా॥ శిష్యా! ఈ ఎరుక ఒక్కటే అయినను దీని సమర్థత యెంచశక్యము గాక యున్నది. బంగారము ఒక్కటే అయినను అనేక ఆభరణ రూపములు దాల్చినట్లుగను, ఇనుము ఒక్కటే అయినను అనేక ఆయుధాల రూపములు దాల్చినట్లుగను, ఇత్తడి ఒక్కటే అయినను అనేక పాత్రల రూపములు దాల్చినట్లు, ఈ యెరుక సృష్టి ఒక్కటే అయినను అష్ట చక్రములుగను, నవద్వార

ములుగను, 25 తత్వములుగను యేర్పడి అవి అన్నియు కలిసి ఒక కుండల చొంతిగా ఈ శరీరము కనబడుచు ఇందులో నేననియు, మేననియు తెలియబడు చున్నది. అట్లే ఈ యెరుక పంచభూతములై ఆ పంచభూతముల కూడికచేత సమ స్త జీవరాసులు, స్థావర జంగమాదులు, సూర్యచంద్ర నక్షత్రాదులు, కొం డలు, అడవులు, సముద్రము మొదలగు సర్వ ప్రపంచమంత ఒక్క యెరుక యొక్క కల్పితమని తెలుసుకొని ఆ యెరుకయే అన్నింటికి ఆధారమనే విషయం మరువకయుండిన వాలును.

154. కం॥ పొర లరటిదుంప యనినను - తరువులు వనమనినరవలు ధారుణి యనినన్ గిరియనినరాళ్లబట్టలు - ధరముళ్ళియనిన తత్వ – తతి యెరు కంచనినా – లేనిదెయెరుక స్థితిలెస్స కనినా యెరుకాజేసిన విశ్వమెరుక వంటిదె బయలు – నెరుకా గ ౖరెరిగి తానేగీతెసరి – తత్వతతి యెరు – కంచనినా లేనిదెయెరుక – స్థితి లెస్సకనినా॥ 20

తా॥ శిష్యా! అనేక పొరలు కలిసితే ఒక అరటిచెట్టు అనబడినట్లుగ, అనేక వృక్షములుకలిసితే ఒక అరణ్యము అనబడినట్లుగ, అనేక భూరేణువులు కలిసితే ఒక భూమి అనబడినట్లుగ, అనేక ఇండ్లుకలిసితే ఒక పట్టణమనబడినట్లుగ అనేక రాళ్లు కలిసితే ఒక పర్వతము అనబడినట్లుగ అనేక గుడ్డలు కలిసితే ఒకమూట అనబడినట్లుగా ఈ యెరుకగూడ పంచవింశతి 25 తత్వములుగూడితే యెరుక అనే పేరు వచ్చినది. ఈ తత్వములను ఒక్కొక్కటి తీసి వేయుచు పోయిన యెడల యెరుకమాటే లేకపోవును. యెరుక ఎప్పుడు లేకపోయినదో యెరుక జేసిన విశ్వముగూడ యెరుక పోయినట్లె పోవును. ఇకవున్నది పరిపూర్ణమే వున్న దని ఈ యెరుకకు తెలియబడిన వెంటనే నేను లేనిదానినని ఈ యెరుకే లేక పోవును.

155. కం॥ పెనుమాయెను జూడుము యిదె – జనకుని జఠరంబువలన జననీగర్భం – బునజొచ్చి మారురూపున – జనియించును నవయవములు - జనితామె భువినీ - వినుకనుతిను మూర్ఖొను వచ్చునుచనీ–దినదిన మభివృద్ధ్యా దీనిచే బయలును-గని యా మాయల మల్లికథ మాయించుముపోని - జనితామై భువినీ - వినుకనుతిను – మూర్ఖొనువచ్చునుచనీ॥ 21

తా॥ శిష్యా! ఈ యెరుకమీాద చూపుపెట్టి చూస్తూ యుండిన వారికి దీని యొక్క చేష్టలు మాయాజాలముకన్నను అద్భుతముగా కనుబడుచుండును. ఆ

అద్భుతము ఎట్లున్నదని గమనించిన యెడల మొదట తండ్రియొక్క జఠరాగ్ని గల హృదయమునుండి శుక్లరూపముగావచ్చి తల్లిగర్భములోచేరి అక్కడ ముందున్న శుక్లరూపముమారి బుద్బుత రూపముగా కనబడుచు అది మొదలు మార్పులతో మాయా శరీరము మొదలై శిరస్సు - కంఠము-కరచరణాదులతో ఈ బొమ్మ ఒక రూపము జేసుకొని తల్లిగర్భమునుండి బయటపడి క్రమ క్రమముగా వృద్ధిపొందుచు చూచువారలకు ముద్దుగా కనబడుచు నవ్వుచు, ఏడ్చుచు, మాటలాడుచు, తినుచు, సంచరించుచు ఈ దేహమనే మాయబొమ్మ కనబడుచుండును. ఈ బొమ్మ ఇంత వ్యవహారములు చేయుచున్నప్పుడే ఏ మాయాజాలములు లేనిదియు, యే మార్పులు జెందనిదియు, ఏ ఆకారాలు లేని బట్టబయలును ఈ యెరుకనే మాయలమల్లి జూచుకొని తాను జేయుచున్న మార్పులు చేర్పులనంతా విడచిపెట్టి వూరక యుండిపోయిన బాగుండును.

156. కం॥ పెట్టియలోపలి గారడి – చెట్టుపయిన్ గానవచ్చి చెట్టున జూడన్ – గట్టుపయి దోచునిది – కనకట్టుసుమీ- దీనివలెనే గనుపించు నెరుకా అంతలో యెచట గనుపించ దెరుకా – దిట్టామా బోధావేపట్టి – యెరుకను తిరిగి – పుట్టాకుండగ దాని - పుట్టీముంచుము లేందె – గనుపించు నెరుకా – అంతలో యెచట – గనిపించదెరుకా॥ 22

తా॥ శిష్యా! గారడీ విద్యను ప్రజలకుచూపు గారడివాడు తన పిల్లవానిని తన దగ్గరయున్న పెట్టెలో పెట్టి మూతవేసి అదే పిల్లవానిని చెట్టు పైన చూపించును. మరలా చెట్టు పై యున్నవానిని ఒక గట్టు పైన చూపించును. తిరిగి తన దగ్గరయున్న పెట్టెమూతనుతీసి ఆ పెట్టెలోనే ఆ పిల్లవానిని చూపించును. ఇది అంతయు కనుకట్టు విద్యగా భావించవలయును. అట్లనే ఈ ఎరుక బొమ్మగూడ మొదట తల్లిగర్భమను పెట్టెలో కనబడుచుండును. మరల శరీరమను చెట్టు పై కనబడుచుండును. ఆ తరువాత మరణమను గుట్టపై కనబడుచుండును. అంతేగాక సాధకునకు ఈ ఎరుక నాశికమను పెట్టెలో స్వాసరూపముగా కనబడుచుండును. తరువాత భ్రూమధ్యమను చెట్టుమీద కళారూపముగా కనబడు చుండును. ఆ తరువాత నిర్వికల్ప సమాధి అను గట్టు పై ఏ వికల్పములు లేనిదిగా కనబడుచుండును. ఈ యెరుక అట్లేయుండక మళ్ళీ వికల్పములు కలిగిన వ్యవహార దశలోనికి వచ్చుచుండును. ఇట్టి నిలకడలేని యెరుకయొక్క గారడీ మాయను పరిపూర్ణ గురుస్వాములుజూచి ఆశ్చర్యపడరు. ఆ గొప్ప తనమును

మనసులోనైనా నిలుపుకొనరు. అందువలన కుంఠితముగానిది యే భ్రాంతియు లేని అచలబోధ చేతనే ఈ యెరుకయొక్క గుట్టును తెలుసుకొని మళ్ళీ యెరుక పుట్టకుండా జేసుకొనవలయును.

157. కం॥ నేననేన బ్రహ్మలోపల- లేనిదె సంభవమునొంది లీల తన కుదా - మేను జగములై వెలసెను-నేనది మృగజలమురీతి-నిజముగాదనుచూ లోకులనేటి - గజిబిజి వినుచూ - మానాసమున వారి మాటకామోదించి - దానికీబోధాకు తగునంచు వినజేస్తి - నిజముగాదనుచూ - లోకులనేటి - గజిబిజివినుచూ॥ 23

తా॥ శిష్యా! నేను నేను అనేనే పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే ఒక లీలగా నేను నేను అనే బ్రహ్మము వకటి గలిగి మేను జగత్తులను జేయుచు సకల సృష్టికి మూలకారణమైయున్నది. ఈ సృష్టికాధారమైన బ్రహ్మమునే లోకులందరు సత్యమని నిలుపుచుండినను నేను మాత్రము అది ఎండమావుల వలె కనుపించుచున్నదేగాని విచారించితే నిజముకాదని నా మనస్సునందు తల పోయుచు వారి గజిబిజి మాటలకంతయు ఆమోదించినట్లుగా కనబడుచు వారికి తగువైనది ఈ బోధ అయితే సరిపోవునని ఈ ఉన్నతమైన సత్యమును కందార్థములుగా తెలుపుచున్నాను.

158. కం॥ కల నెడబాసిన మనుజులు - కల లోపలి పనులుచేయ కలవారిన నా - కలవారుగారు వారల - వలె యెరుకను గురునిచేత-వదలెరు కలోనా - గల పనిచేయ - వలదెరుకలోనా - కల వారంచని నోటపలుకూట మరయాక - పలికీన వారికి తొలగాదు పాపాము - వదలెరు కలోనా - గల పనిచేయ - వలదెరుకలోనా॥ 24

తా॥ శిష్యా! కలను గనేవారికి అందు గనపడు దృశ్యములన్నియు నిజముగా కనబడుచుండినను మెలుకువ గలిగిన తరువాత ఆ దృశ్యములన్నియు అబద్ధమేనని తలంపుకువచ్చును. అచల బోధలో మెలుకువపడిన అచల గురు పుత్రులు, యెరుకతో గూడిన ప్రపంచములో వారుమెలగుచుండినను ఆ ఎరుక ప్రపంచములకు సరిపోవు కార్యములు సమస్తము చేయుచున్నను అవి ఎన్నడు నిజముకావనియు, కలతో సమానమనియు బుద్ధిలో నిలుపుకొని లోకమునకు వేరుగాక లోకము పోవుచున్న మార్గములందే వారు పోవుచుందురు. అంత మాత్ర

మున వారి స్వచ్ఛంద స్థితిని పామరులు తెలుసుకొనలేక యేవేవో నిందలు చేయుచు వీరు గురుపుత్రులేగాని యే మాత్రము తాపత్రయాదులు వీడలేదని నోటికివచ్చినట్లు దూషించుచుందురు. అట్టి దూషణలు చేసినవారికి పాపమే సంభవించుచుండును.

వి॥ ఆకాశమునందు పక్షులుపోయిన జాడలుకాని, జలమునందు జలచరములు నడచిన గుర్తులుగాని ఎట్లు తెలియుటకు సాధ్యముకాక యుండునో, పరిపూర్ణ భావస్థుల నడకలుగూడ తెలియుటకు సాధ్యపడకయుండును.

159, కం॥ గుడమే మధురము మధురమె – గుడమాగుడ మధురముల గొనకొని తొలుతన్ – బొడమిన దేదన సరిగా – బొడమిందొకటేగ – రెండు పోయినట్టె కదరా – కనువెరుకా లి – ట్లైనట్టెకదరా – పొడజూచి బయలు నిప్పుడె మేనెరుకలజోలి – విడరాలేనివె రెండు – పెడచెవిబెట్టక విను – పోయి నట్టెకదరా – తనువెరుక – లిట్లైనట్టెకదరా॥ 25

తా॥ శిష్యా! బెల్లమును విడిచి తీపు యుండలేదు. తీపును విడచి బెల్లము యుండలేదు. ఈ బెల్లము తీపి రెండును ఒకదానిమీద ఒకటి ఆధారపడుచు ఒక దానిని విడచి ఒకటి యుండలేని విధముగ ఈతను వెరుకలు రెండు ఒక దానిమీద ఒకటి ఆధారపడి ఒకదానిని విడిచి ఒకటి యుండలేక పోవుచ్చువుంటే రెండూ యుంటూ యున్నవి. పోతే రెండూ పోవుచున్నవి. వీటికి ఒకదానితో ఒకటి పొత్తు యెప్పుడు వుండవలయును. ఏ పొత్తులేక తనకు తానుగా యున్న దియు, యేదాని మీద ఆధారపడక స్వతఃస్సిద్ధముగా యున్న పరిపూర్ణము యొకటి యున్నదని తెలుసుకొని లేని మే నెరుకలమీద ఎన్నడు ఇచ్ఛలేకుండా చేసుకొనిన చాలును. ఈ విషయమును పెడచెవిని పెట్టక ఆలోచన చేసితివేని ఇక ఏ బాధలు నిన్ను అంటకుండా పోవును.

160. కం॥ ఇది వున్నది యిది వున్నది-యిది వున్నది యనుచు బయలు నెరిగి యెరుకచే – యిది లేనిది యిది లేనిది – యిది లేనిది యనుచు నెరుక-నెరిగితే సరిరా-ఆపైనుండె దెట్లందు వినరా – వుదయాస్తమానాములుడుగాక యిది నీ నె – మ్మదిలోన నమ్ము నామాట నిశ్చయమిట్లు – యెరిగితే సరిరా-ఆపైనుండె – దెట్లందు వినరా॥ 26

తా॥ శిష్యా! ఇదే వున్నదనియు – ఇదే వున్నదనియు ముమ్మాటికి యే పరిపూర్ణమును దృఢముగా యెరుకచేత యెరిగితివో ఆ యెరుకచేతనే ఇదిలేనిది

ఇది లేనిదని దృఢముగా ఆ యెరుకను లేకుండా జేసుకోవలయును. ఇట్లు పరిపూర్ణమును ఉన్నదిగాను, యెరుకను లేనిదిగాను త్రికరణశుద్ధితో నిశ్చయించుకొని ఆ నిశ్చయమును మరువక ఉదయాస్తమానములు స్మరించుకొనుచుయున్న యెడల ధీరత్వమును దిగజార్చుకొనక దృఢత్వము గలిగి యుండగలవు. అట్లు నీవు వుంటివేని ఇక నేను నీకు తెలుపుటకు బోధకూడ లేకయుండును.

పరిపూర్ణబోధ ఎనిమిదవ అధ్యాయం సమాప్తము.



## -: 9. గురుమంత్ర ప్రతాపం. 27 :-

161. కం॥ యెరుగననేటిది యెరుకే – యెరుగుదునని తనను పరుల నెరిగేదెరుకే - యెరుగ నెరుంగుదునను దా – న్నెరుగుచు నుండేటి దెరుకే - నిరుపామబుద్ధీ – నీ వెరుగిది - నిగమ ప్రసిద్ధీ - గురుమంత్రమనియేటి గృద్దాలితోటి యీా – యెరుకా కూకుడువేరు – నెరిగి త్రవ్వితెచాలు - నిరుపామబుద్ధీ నీ వెరుగిది – నిగమ ప్రసిద్ధీ॥ 1

తా॥ శిష్యా! నేను ఈ ప్రపంచమును యెరుగుచున్నానని తెలిపేది ఈ యెరుకే. నేను ఈ ప్రపంచమును యెరగడము లేదని తెలిపేది ఈ యెరుకే. తనను తాను యెరుగు చున్నానని తెలిపేది ఈ యెరుకే. తనను తాను యెరగడము లేదని తెలిపేది ఈ యెరుకే. ఇట్లు ఈ యెరుక సర్వమును యెరుగుచు, సర్వము తానుగానే యున్నందువలన శాస్త్రకారులంతా ఈ ఎరుకనే వేదముల యందును, ఉపనిషత్తులయందును ప్రసిద్ధిగా తెలుపుచు సత్చిదానంద పరబ్రహ్మమనియు, అదిష్టాన బ్రహ్మమనియు, కూటస్థమనియు నిలబెట్టినారు. ఈ విధముగా నిలబెట్టిన యెరుకను స్వచ్ఛమైన పరిపూర్ణబోధచే విచారించుకొని షోడశాక్షరి అను గురుమంత్రమనే గొడ్డలిచేత కూకటివేళ్లతో తీసివేసిన యెడల ఇక ఈ యెరుక మరలా పుట్టకుండాపోవును. అట్లు చేయుటకు చాలా ప్రజ్ఞావంతుడవై దృఢచిత్తముగలవాడవై యుండవలెను.

వి॥ దీప ప్రకాశము ఘటపటాదులనుజూపి, దీపమునుజూపి దీపములోనే తాను పోయినట్లు ఈ యెరుకకూడ ఇంద్రియ సముదాయ మంతయు జూపి,

బాహ్యాంతర ప్రపంచమునుజూపి, ప్రత్యగాత్మను జూపి చైతన్యములోనే తాను లయమగుచుండును.

162. కం॥ యెరుకే చదువులజేసును – యెరుకేవిను చదువునెరుక నెరుకే తిరమం – బెరిగించును శంకించును – యెరుకే కొనకేమిలేక-యేగూనో యన్నా – బయలేచదువు - యెరుగాదోయన్నా - యెరుకే యెన్నటికైన పరిపూర్ణమున్నాదం -చెరిగీ తా లేనాని యెరిగితె నిలువాక - యేగునోయన్నా – బయలె చదువు – యెరుగాదోయన్నా॥ 2

తా॥ శిష్యా! నాలుగు వేదములను, నూటయెనిమిది ఉపనిషత్తులను, పదునెనిమిది పురాణములును, భారత, భాగవత, భగవద్గీత, రామాయణాది సమస్త గ్రంథములనెల్లయు ఈ ఎరుకయే సృష్టించినది- ఈ సృష్టించిన గ్రంథములను చదివేదిగూడ ఈ ఎరుకే. వినేదిగూడ ఈ ఎరుకే. అందులో యిది బాగుందని తెలిపేది ఈ ఎరుకే. ఇది బాగులేదని తెలిపేది ఈ ఎరుకే. ఇట్లు తెలుపుచు, తెలుపుచు ఒకనాడు లేకుండా పొయ్యేదిగూడ ఈ ఎరుకే. ఈ పరిపూర్ణము మాత్రము ఏ గ్రంథములను సృష్టించక, ఏ గ్రంథములను చదువక అందులో తెలుపుచుండిన ధర్మా ధర్మములను అవుననియనక, కాదనియనక తనకు తానుగానే కదలక స్థిరముగా యుండును. అట్టి పరిపూర్ణమును యెప్పుడైన, యే వయసులోనైన ఈ యెరుక జూచిన యెడల తనకు స్థిరత్వముగాని, నిలకడగాని ఎప్పుడులేదని తనకు తానే తెలుసుకొని తానే లేకుండాపోవును.

163. కం॥ చూపులలోగల వస్తువు – చూపులగను వస్తువులును చూపులుగూడన్ – తేపకు యెరుకని తెలియుము చూపులు – లేనట్టి బయలు చూచెదింకేమీ – యెరుకేలేదు – తోచెదింకేమీ – దీపామువలె కనుపాపాలో కల వస్తువె – పరమాత్మాని - చూపితే యెరుకాయ - చూచెదింకేమీ – ఎరుకెలేదు – తోచెదింకేమీ॥ 3

తా॥ శిష్యా! కంటికిముందు కనబడే వస్తువులను దృశ్యమనియు, కంటిని దృక్కు అనియు, కంటిలోయున్న ప్రకాశమును ద్రష్ట అనియు తెలుపుచుందురు. ఈ దృక్కు ద్రష్ట దర్శనములు వేరు వేరుగా యున్నవని తెలుపుచు చూడబడే దృశ్యముకంటే చూచే ద్రష్ట వేరుగాయుండి చూస్తూయున్నదని కొందరు నిరూపించు చుందురు. ఈ దృక్కు ద్రష్ట దర్శనము మూడును యెరుకేననియు

యెరుకచేతనే వచ్చినవని తెలియుము. ఈ పరిపూర్ణమునందు చూచుటకు దృశ్యములేదు. ఆ దృశ్యమును జూచె దృక్కు అనెడి నేత్రములేదు. ఆ నెత్ర మును ప్రకాశింపజేసే ద్రష్టయు లేనందున ఆ బట్టబయలు యెప్పుడు దేనిని చూచుటలేదు చూచేదంతా ఈ ఎరుకే. గావున ఈ యెరుకయే కన్నులయందు కళారూపముగాయుండి సమస్తమునుచూస్తూ యున్నందువలన ఆ కళనే ఆపో జ్యోతి అనియు, పరమాత్మ అనియు కన్నులలో చూపించి అదియే నీ ఆత్మ స్వరూపమని తెలుపుచుందురు. ఆ ఆపోజ్యోతి యెరుకదేననియు, యెరుక స్వరూ పమే ననియు తలంచవలయును.

164. కం॥ శతపత్రాప్తుని పొడగని – యతి రయమున తిమిరమణగి యగుపడదెట్ల – ట్లతులిత గురుకృప గలిగిన – మతిమంతులజూచి యెరుక – మరి నిల్వబోదూ – సంశయము నీ – మదినిల్పరాదూ – శృతులందు స్మృతు లందు యితిహాసములయందు– సతతాము శ్రమపడి వెతకీన యీా -యెరుక – మరి నిల్వబోదూ – సంశయము నీ – మదినిల్పరాదూ॥ 4

తా॥ శిష్యా! సూర్యునియొక్క ప్రకాశము కనబడిన వెంటనే అంధకార ముగా అలుముకొనియున్న కటిక చీకటి యెట్లు మటుమాయమగుచున్నదో అటు లనే సద్గురు కరుణాకటాక్షం గలిగిన బుద్ధిమంతులకు ఈ ఎరుకజాడ యెక్కడా కనుపించకపోవును. ఉపనిషత్తులను, వేదాంతగ్రంథములను ఎంతో పట్టుదలతో చదివి చదివి, బుద్ధితోగూడ ఎంతో ఆలోచించి ఆలోచించి చివరకు యేది సత్య మని నిలబడగలిగినదో అదిగూడ యెరుకేనని తెలిసినప్పుడు ఇక ఆ యెరుక ఎక్కడా నిలువకుండా పోవును ఇక ఈ విషయములో ఏ మాత్రము సంశ యములేదు.

వి॥ ఇత్తడిపాత్రలు శుద్ధిచేయుటకు చింతపండు, ఇసుక, ఇటుకరాయి పొడి కావలసియుండును. స్పటిక మణిని శుద్ధిచేయుటకు వట్టిజలము మాత్రమే చాలును. అట్లనే అంతఃకరణము శుద్ధియై సత్యాసత్యములు గోచరించుటకు ఒక పరిపూర్ణబోధయే చాలును. అంతఃకరణమునందు సంకల్పములు వుట్టకుండా శుద్ధిచేయుటకు యెన్నిసాధనలు జేసినను అది తాత్కాలికముగా పోయినట్లు యుండినను అవి మరలా, మరలా తలయెత్తుచునెయుండును. వానిని ఇక పుట్టకుండా రూపు మాపగలిగినది ఒక్క పరిపూర్ణబోధయే యగును.

165. కం॥ ఎరుకే కోశములై దెరు -గెరుకే భూతముల నెరుగు నెరుగును సర్వం - బెరుకే యెరుక నెరుంగును-యెరుకను గుర్తెరుగ వేరె-ఎరుకా వున్నాదా - వున్నదంటె - నరకామెకాదా - నిరతాము గురుసేవ పరతంత్రులగుచు త - త్కరుణాకు - పాత్రులై -యెరుక మాలినవారి - కెరుకావున్నాదా వున్నదంటె - నరకామెకాదా॥ 5

తా॥ శిష్యా! సమస్తమును యెరిగినట్లే ఈ ఎరుక పంచకోశములనుగూడ ఇట్లు ఎరుగుచుండును. అన్నమువలన బుట్టి అన్నమువలన వృద్ధి పొందుచున్న ఈ స్థూలశరీరమును అన్నమయకోశమని ఎరుగును. పంచప్రాణములు కర్మేంద్రియములుగూడి యున్నదానిని ప్రాణమయ కోశమని యెరుగును. మనస్సు-చిత్తము జ్ఞానేంద్రియములుగూడియున్న దానిని మనోమయ కోశమని యెరుగును. శబ్దాది విషయములైన పంచతన్మాత్రలు-బుద్ధియుగూడి యున్న దానిని విజ్ఞానమయకోశమని యెరుగును. ఈ కనబడుచున్న సర్వ ప్రపంచమునకు కారణమైన మాయను ఆనందమయ కోశమని యెరుగును. అట్లే పంచభూతములనుగూడ శబ్దముచేనున్న దానిని ఆకాశమని యెరుగును. కదలికతో నున్న దానిని వాయువని ఎరుగును. ప్రకాశముతోనున్న దానిని అగ్నియని ఎరుగును. రసముతోగూడి యున్నదానిని జలమని యెరుగును. గంధముతోగూడి యున్న దానిని భూమి అని యెరుగును. ఇట్లు సర్వమును ఈ యెరుకే ఎరుగుచు సర్వమునకు విశక్షణముగా సాక్షిగా యున్నానని తలంచుచుండును. సర్వమును యెరిగేది ఈ యొక్క యెరుకే అయి యుండగా ఈ యెరుకను ఎరిగేది ఇంకొక యెరుక యున్నదని కొంతమంది తెలుపుచుందురు. అట్టివారికి తీరని నరకమేనని తెలుపవలయును. నిరంతరము గురుసేవ చేయుచు గురు కరుణపాత్రులై ఎరుకను ఎరిగి ఆ ఎరుకను విడిచిన పుణ్యాత్ములకు ఎరుక లేకపోవునేగాని మరొక యెరుక యున్నదని తలంచరు.

166. కం॥ గురుమంత్రముచే నిలువని - ఎరుకను పరిపూర్ణమనుచు నెరిగినిరతమున్ - యెరుకై యుండినవారల - తెరువిక నీకేల - వట్టిదీజోలిమానూ - యెరుకలేని - యా జోలిబానూ - గురునిచె పరిపూర్ణమరసి యా తెలసీన - యెరుకనెన్నటికీనీవెరుగాకు మిదివట్టి -దీ జోలిమానూ - ఎరుకలేని యాజోలిబానూ॥ 6

తా॥ శిష్యా! గురుమంత్రము దగ్గర నిలువలేక పోవుచున్న ఎరుకను కొంత మంది గురువులు పరిపూర్ణమనియు, బయలనియు, అచలమనియు తెలుపు చుం దురు. అట్లు వారు వారి గురువులవలన ఏ బోధను తెలుసుకొని యున్నారో వారి శిష్యులకుగూడ ఆ ఎరుకబోధనే తెలుపుచు, ఆ ఎరుక బోధలోనే మునిగి యుందురు. అట్టి బోధలను నీవు చెవులోనైనా పెట్టబోకుము. వారి చెంతనైనా నిలువబోకుము. ఎవరు ఎన్నిచెప్పినా ఎరుకలేని పరిపూర్ణమును మాత్రము మరు వక యుండుము. అచల గురువుల వలన పరిపూర్ణమనగా నెట్టిదో, నెరుకనగా నెట్టిదో సంశయము లేకుండా పరిశీలించుకొని లేని ఎరుకను లేకుండా జేసుకొని ఇక ఆ ఎరుకజోలి పెట్టుకొనక ఆ ఎరుకను ఎన్నటికి దగ్గరకు రానివ్వకుండా యుండవలయును.

వి॥ చెరువుయొక్క గట్టు తెగిన యెడల దాని యందలి నీరు నలుదిక్కు లకు పారి ఆ ప్రాంతమంతయు అధోగతిపాలు చేసినట్లు, ఈ అచలబోధ రహ స్యము తెలుసుకొనక అచలబోధనుండి విడువబడినవానికి అనేక రూపములుగా బంధములు ప్రాప్తించుచుండును.

167. కం॥ లేనికల దోచినప్పుడు-లేని విచిత్రంబులన్ని లేకనెతోచున్ లేనికల మేలుకొన్నను-లేని విచిత్రములు తాను లేకాపోవుగదా-అనుమానాము లేదిందు వినరా – లేనెరుక యీ రీతిగానె బయలునుజూస్తె – తాను తనచిత్ర ములు – పూనెందు నిలచుండలేకా పోవుగదా – అనుమానాము – లేదిందు వినరా॥ 7

తా॥ శిష్యా! మానవునకు లేకనే కనిపించిన కలలో ఎన్నో చిత్ర విచిత్ర ములైన రూపాదులు కానవచ్చును. మేలుకొన్న పిదప ఆ చిత్ర విచిత్రములైన రూపాదులు యేమియు కనుపించక పోవుచున్నవి. ఆ విషయము యదార్థము గానే తెలియుచున్నది. ఇందులో అనుమానము లేదుగదా! అట్లనే ఈ యెరుక స్వప్నములాగున పరబయలులో కనబడుచు ఎన్నెన్నో విచిత్రములైన దేహ జగత్తులనుజేసి స్వప్నములాగున కనబడుచున్న ఈ యెరుక సద్గురు కరుణచేత మెలుకువగలిగి ఆ పరిపూర్ణమును దర్శించినప్పుడు ఈ ఎరుకగాని, ఈ ఎరుక జేసిన సమస్త దృశ్య ప్రపంచముగాని స్వప్నములాగునే కనబడక పోవుచున్నది. ఈ మాట సత్యమని తలంచి ఈ ఎరుకపైన యే మాత్రము మొగమాటము పెట్టుకొనక తీసివేసే పద్ధతిలోనే యుండవలయును.

168. కం॥ మరణ సుషుప్తుల జెందిన - పురుషుడు మేల్కనినవాడు భువితదితరుడౌ - పురుషుడు కలగను వాడని - యెరిగుండుము - మొదటి యతడెరుగాడీరెంట్నీ - రెండో పురుష -డెరుగూనీ రెంట్నీ - యిరువురొక్క టెసుమ్మి తిరిగీ పుడుదురు వీరె - గురునీచె మేల్కొంటె - తిరిగీ పుట్టనెపుట్ట డెరుగాడిరెంట్నీ - రెండో పురుషుడెరుగూ నీరెంట్నీ॥ 8

తా॥ శిష్యా! ఒకడు మరణించియున్నాడు. మరొకడు గాఢ నిద్రలో యున్నాడు, వీరిద్దరు చూచేదానికి సమానంగా కనబడుచుండినను, నిద్రబొయ్యే వానికి మాత్రము కలవస్తూ యున్నది. మెలుకువగూడ వస్తూయున్నది. మెలుకువ రాగానే తనను ఎరుగుచున్నాడు. మరణం చెందిన వానినిగూడ యెరుగుచున్నాడు. ఇక మరణించిన వానిని గురించి విచారించిన యెడల వానికి కల రావడములేదు, మెలుకువ రావడములేదు. తనను ఎరుగడములేదు. నిద్ర బోయే వానినిగూడ యెరుగలేడు. ఇట్టి తేడాలు ఈ యిద్దరికి కనబడుచుండినను, మరణ సుషుప్తులు రెండును, సమానమగుచు తెలియని దశ అయినందు వలన వీరిద్దరు భూమి మీద తిరిగి పుట్టుచుందురు. సద్గురు కరుణా కటాక్షమువలన గురుమెలుకువ కలిగినప్పుడు మరణించినవాడు యెక్కడ యున్నాడు? సుషుప్తిలో యున్నవాడు యెక్కడయున్నాడు, అనే వివరములు తనకు ఎప్పుడు తెలియబడునో అట్టివానికి ఇక ఏ భ్రాంతులు పుట్టక తిరిగి వాడు భూమిమీదకు వచ్చే పనిలేకుండా పోవును.

169. కం॥ యెరుకే ఎరుకకు కొడుకులు - ఎరుకే తలితండ్రి యెరుక కెరుకే యితరుల్ - యెరుకే యెరుకకు మూలము - యెరుకకు మూలంబు బయలం - బెట్లందునోయీా - యెరుకే యెరుక - కేమిలేదోయీా - ఎరుకలేని వృత్తపరిపూర్ణమునుజూచి - ఎరుకె తా లేనాని - ఎగిరిపోయితె పై - మాటెట్లందునోయీా యెరుకే యెరుక - కేమీాలేదోయీా॥ 9

తా॥ శిష్యా! సృష్టికంతా ఆధారము ఈ ఎరుకఒక్కటే అయి యుండినను స్త్రీలుగాను, పురుషులుగాను, తల్లిగాను, తండ్రిగాను, కూతుళ్లగాను, కొడుకులుగాను, ఇతరులుగాను బావించుచు, వారికంటే నేనువేరని తలంచుచు, తనకుతానే మూలమైయుండినను, తనకు మూలము ఆ బట్టబయలులో యుందని తలంచి తనను ఆ బట్టబయలులో చూడబోయిన యెడల తాను ఆ బట్టబయలులో లేనని

తెలుసుకొని ఆ ఎరుకలేని ఉత్త బట్టబయలునుజూచి తనకు ఏది మూలములేక నిరాధారముగా యున్నానని తానే తలపోసుకొనుచు, తన విషయము తానే మాటి మాటికి గుర్తు జేసుకొనుచు, తానే లేకుండాపోవును. తాను ఎప్పుడు లేక పోయినదో, ఇక మాట్లాడుటకు అచ్చట యేమి లేక పోవుటవలన యే మాటలు లేని పరిపూర్ణమే అంతటా కనబడుచుండును.

వి॥ బొమ్మలాడవాండ్లు ఒకే చర్మముతో రావణాసురుడు, రాముడు, సీత, మండోదరి బొమ్మలనుజేసి రామునకును, రావణాసురునకును తారతమ్యములు కల్పించి విరోదములను జూపించినటుల ఈ ఎరుక ఒక్కటే అయినను అనేక విధములైన రూప పరిణామములలో హెచ్చు తగ్గులతో వ్యవహరించుచున్నది.

170. కం॥ గురుతను కలలో నారీ –నరులూరికెవచ్చి పొంది నయముగ సుతులన్ - వరకన్నియలను గాంచియు - గురువరుచే మేలుకొంటె - గురు తుండదన్నా - ఆ పైమాట – నెరిగెదేదన్నా - యెరుకొక్కటుంటెనే ఏర్పాటు లుండును - యెరుకొక్కటేగీతె – ఏర్పాటుజేసేటి – గురుతుండదన్నా - ఆ పైమాట – నెరిగెదేదన్నా॥ 10

తా॥ శిష్యా! ఈ యెరుక ఒక కలతో సమానముగా కనబడుచు, ఈ ఎరుక ఉన్నదగ్గరంతా గుర్తులుగల రూపాదులను తగిలించుకొని కనబడుచున్నది. కాని గుర్తులుగల రూపాదులులేనిచోట ఈ ఎరుక కనిపించక యున్నది. ఆ గుర్తులు గల రూపాదులతోనే ఈ ఎరుకవచ్చుచు, స్త్రీ పురుష రూపములతో కనబడుచు, అచ్చట ఒకరిపై నొకరికి వ్యామోహములు పెంచుకొనుచు, వివాహములు చేసు కొనుచు, కొడుకులను, కూతుళ్ళనుగని ఎనలేని సుఖదుఃఖము లనుభవించుచు ఆ దుఃఖములకు అద్యాంతములు గనబడక అంధకారమై యెటుదోచని సమయ ములో సద్గురు కటాక్షమువలన యెరుకయొక్క విషయము తెలియబడి గురు మెలుకువ గలుగగానే ముందుయున్న కొడుకులు, కూతుళ్లు తదితరమైన సమూ హమునంతయు నా వారని, నీ వారని మమకారముకలిగి అభిమానింప బడు చున్నదో ఆ రూప గురుతులన్నియు గురుమెలుకువతో లేకుండాపోవును. ఎరుక యున్నప్పుడు మాత్రమె ఆ రూపగుర్తులన్నియు యుండునుగాని యెరుకపోయిన తరువాత యే గుర్తులు కనబడక ఆపైన యున్నదానిని యెరుగుటకు యెవ్వరూ కనబడకయుందురు.

171. కం॥ నిను నను నివుకలగాంతువు–నిను నను కలలోన -గాంతు నే నొకవేళ్లన్ - నిను నను నివు నే నను నివు- గనుగొనగాగలమె –మేలుకని నామీదటనూ – గుర్బబోధట్ల – విని నామీదటనూ-మునుపు గలిగిన ఎరుక మొదటికె నిలువాదు - నిను నన్ను నే నన్ను నిను నీవెరుగుట మెట్లు - కని నామీదటనూ – గురుబోధట్ల – విని నామీదటనూ॥ 11

తా॥ శిష్యా! నీకు సహజముగా వచ్చుచున్న కలలో నిన్నును, నన్నును నీవు చూచుచుందువు. అటులనే నాకు కనబడుచున్న కలలోగూడ నన్నును, నిన్నును నేను జూచుచుందును. అటుల నిన్ను జూచుచు నేను మేలుకొన్న తరువాత నీవు నాకు కనబడవు. నీవు మేలుకొన్న తర్వాతగూడ నేను నీకు కనబడను. అది నిజమేకదా? అటులనే అచల గురుమూర్తి సంప్రాప్తమై ఆ బోధను వినుచు, వినుచు ఒకనాడు ఆ పరిపూర్ణ సూచన గలిగిన వెంటనే ఎరుకనే కల అసలే నిలువకుండా పోవును. ఇక గురుబోధచే కలిగిన మెలుకువలో నిన్ను నేనును, నన్ను నీవును చూచుటకు అచ్చట రూపములుగాని, ఎరుగుటకు యెరుకగాని లేకుండాపోవును. ఎరుకలేక పోవడముతోడనే నీవు నన్నుజూచుట నేను నిన్నుజూచుట అనునవి లేక ఒకే చదరముగా గనిపించును. యెరిగేవారు యెరుగబడేవారు అచ్చట లేకయుందురు.

172. కం॥ నిను నీవు నన్ను నేనును – నసునివు నే నిన్ను ఎరిగినదె కల యిది తా – తననెరుగని దానినిగని - తనకలిమి మృషనుచుదెలసి – తా నేగనేని - అదిమేల్కవలి – దాన్నెవ్వాడెరిగీనీ - ననునీవు నేనిన్నుబోధ– విని పించు వినుమాని – యనుటా కిద్దరికిపుడు – మునుపున్న యెరుకేది-తా నేగ నేని – అది మేల్కవలి - దాన్నెవ్వడెరిగీనీ॥ 12

తా॥ శిష్యా! ఇచ్చట మనమిద్దరము గూడుకొని నిన్ను నేను ఎరగడము, నన్ను నీవు ఎరగడము జరుగుచున్నది. ఈ ఎరగడముకూడ ఒక కలగానే భావించుము. ఈ యెరగడము అనేదానిని గురించి ఆలోచించిన యెడల అది యెప్పుడు ఉండేదికాదు. ఈ అవస్తలోనే ఆ యెరగడము కనుపించుచున్నది. గాని రాబోవు అవస్తలో కనబడడములేదు. అందువలన ఈ ఎరిగేది స్థిమితముగా స్థిరముగాయుండక పోవుటవలన! తనను తాను ఎరుగనిది. మరొక దానిని ఎరుగనిది తనలోయున్న ప్రపంచమును యెరుగనిది ఏ పరిపూర్ణము కదలక

యున్నదో ఆ పరిపూర్ణమును ఈ యెరిగే యెరుక తెలుసుకొని తన విషయము గూడ ఆలోచించుకొని తననుగాని, తనతోయున్న సంపదగాని అంతా వ్యర్థమే నని ఈ ఎరుక ఎప్పుడు ఎరుగుచున్నదో అదే ఎరుకకు మెలుకువ కలిగినట్లు అగును. ఆ మీదట నీకు నేను బోధను తెలుపుటకుగాని, నీవు వినుటకుగాని అచ్చట మునుపుయున్న యెరుక లేకుండాపోవును.

173. కం॥ తిమిరారియందు లేనిదె – తిమిరము తనుదానె వచ్చితే జోనిధియో – తిమిరారి యునికి గనుగొని – తిమిరము తా నిలువనట్లు–తెలుసుకొరాదా – బయలెరుకాల-తెలసి యామీదా – భ్రమరూపమైనట్టి బ్రహ్మాండ మెరుకాల – భ్రమదీసి వేసీతె భ్రాంతి బుట్టదుమళ్లి – తెలుసూకోరాదా – బయలెరుకాల – తెలసీ యామీదా॥ 13

తా॥ శిష్యా! ప్రచండ మార్తాండుడైన సూర్యునియందు లేకనే తనకు తానుగావచ్చి పగటి కాలమందు యెచ్చటయున్నదో తెలియబడక రాత్రికాలము రాగానే అంతా అలముకొని గాడాంధకారముగా కనుపించుచున్న కటిక చీకటి సూర్యకిరణములు సోకగానే ఎటుల మటుమాయమగుచున్నదో అదే విధముగా ఈ యెరుకగూడ పరిపూర్ణమందు లేకనే తనకు తానుగావచ్చి భ్రమరూపముగ పిండ బ్రహ్మాండములనంత సృష్టించుకొని ఆ పిండ బ్రహ్మాండములలో తాను విచ్చలవిడిగా తిరుగుచు, స్థిమితములేక యుండుచు ఒకనాడు స్థిమితముగాయున్న పరిపూర్ణము దర్శనము కాగానే సూర్యునిముందు చీకటి నిలువలేక పోయినటుల ఈ యెరుక తన చేష్టలన్నియు భ్రాంతి రూపమేగాని నిజముకాదని తాను ఈ బట్టబయలునందు భ్రమ రూపముగా యున్నానని తెలుసుకొని ఆ భ్రమను తీసి వేయగలిగితే మరల ఆ భ్రమ యెప్పుడు పుట్టకపోవును.

174. కం॥ లేదు లేదనుచు యెందరు – వాదించిన లేక – పోదు పరిపూర్ణము దా – పోదు పోదనుచు నిల్చిన – పోదని యనుకోకు – యెరుక – పోనెపోచుందీ – గట్టిగలేచి – పోనెపోచుందీ – వాదభేదములేని వారిచె యెరుకాది – పాదూ పెకలించేటి పద్ధతి నెరిగితె – పోనెపోచుందీ – గట్టిగలేచి – పోనెపోచుందీ॥ 14

తా॥ శిష్యా! ఈ బట్టబయలు రూప నామాదులతో కనబడకపోవుటవలన ఈ బయలు లేదు, లేదు అని యెందరు వాదములు చేసినను అది యుండనే

యుండునుగాని లేకుండా యెప్పటికీ పోవునదికాదు. యెరుకను పోదూ, పోదూ అని యెందరు ఎన్నివిధంబుల నిలిపినను ఒకనాడు ముమ్మాటికి లేకుండా పోనే పోవునుగాని అది యెప్పటికి యుండనేయుండదు. ఆ నిర్ణయము గట్టిగా నీకు యెప్పుడు తెలియబడుననిన! వాద భేదములు లేక సత్యమును ప్రబోధించె సద్గురువు ప్రాప్తమువలన ఈ యెరుక మొదట యెట్లు కనబడినది, ఏ లక్షణ ముతో నున్నది, తరువాత యెట్లు పరిణామముజెంది ఈ సృష్టినంతా జేసినది మొదలగు పద్ధతులనంతా తేటతెల్లముగా తెలియపరచి ఆ యెరుక పాదును పెక లించే పద్ధతినంతా వినగలిగితే ఈ ఎరుక మచ్చుకైనా యెక్కడా లేకుండా తప్పకపోవును.

175. కం॥ మే నెరుకల రెంట్లో నొక—దానిని యెడబాసి చేయతరమా పనులన్ - మేనికి ఎరుకకు గావున మేనన ఎరుకెరుక యనిన మేనాని ఎరుగూ యీరెంట్నె-నివు నేనాని ఎరుగూ ఎరిగి వీట్లతో బయలు నెరిగీ మేనెరుకాల - తిరిగి చూడకు చూస్తె - గురుని పాదములాన - మేనాని యెరుగూ - యీ రెంట్నె — నివు నేనాని యెరుగూ॥ 15

తా॥ శిష్యా! యెరుకనగా మొదట నేవస్తువో తెలియక యెరుక వేరనియు, దేహము వేరనియు తెలుపుచుందురు. ఇవి రెండు వేరువేరుగా యున్న యెడల ఒక దానిని విడచి ఒకటి యుండవలయును. అట్లు ఎప్పుడు ఉండడములేదు. రెండూ కలసియే యుంటూ యున్నవి. రెండు కలిసియే ఏ పనినైవా చేస్తూ యున్నవి. ఈ రెంటిలో ఏ ఒక్క పనినైనా ఒక్కటిగా జేయడములేదు. అందు వలన ఈ తను వెరుకలు రెండు ఒక దేహమనియే భావించవలయును. వేరు వేరని మాత్రము యెప్పుడు తలంచగూడదు. ఇట్లు కలిసియుండు మే నెరుకలు పోకముందే శాశ్వితమై కదలకయున్న అచల పరిపూర్ణము నెరిగి, లేని మే నెరు రుకలను లేనేలేవని మరువక దృఢనిశ్చయముతో యుండవలయును. మళ్ళీ ఏ సమయములోనైనా ఈ మేనెరుకలు వేరువేరని తలంచి దిగజారిన ఎడల గురు పాదముల సాక్షిగా పెట్టుకొని తప్పిపోయిన వాడవు అగుదువు.

176. కం॥ మరుపు సుషుప్తియు మూర్ఛయు – మరణంబు సమాధి యనుచు మానవు లెరుకన్ – దొరిగిన నారుని శరీరము - నెరిగెదరానరుడు మేను నెరుగాడోయన్నా – తననైన తా - నెరుగాడోయున్నా- యెరుగాకుం

డితె యేమి తిరిగి పుట్టుచునుండు - తిరిగి పుట్టడు వాడె – గురుబోధ గలిగితె యెరుగడోయన్నా – తననైన తా - నెరుగాడోయన్నా॥ 16

తా॥ శిష్యా! మరుపు, మరణము, నిద్ర, సమాది, మూర్చలనియెడు అయిదు అవస్థలయందును ఇంద్రియాదులకు ఉపశమనము గలిగి వాటి వికారములన్నియు అణిగిపోవుటవలన అక్కడ ఈ యెరుక తనను యెరిగే పనిగాని, పరులను యెరిగే పనిగాని లేకపోవుచున్నది. మరలా ఇంద్రియాదులకు ప్రవృత్తులు కలుగగానే ఈ ఎరుకకు జన్మకలిగి తనను తాను యెరుగడముగాని, పరులను యెరగడముగాని జరుగుచున్నది. ఇట్లు ఇంద్రియాదులకు వికారములు గలుగగానే యెరుక పుట్టుచు, ఇంద్రియాదులు వికారములు అణిగిపోవడముతోనే ఎరుక గిట్టుచు ఉన్నదేకాని ఇంద్రియాదులతో నిమిత్తములేక స్వతంత్రముగా ఈ యెరుక యెక్కడా కనుపించకయున్నది. అట్టిదైన ఈ యెరుక మర్మము యెవరు పట్టభద్రులైన పరిపూర్ణ గురువుల బోధవలన వినగలుగుచున్నారో! అట్టివారికి ఈ యెరుక ఇంద్రియాదుల పనిలేని సమాధి స్థితిలో యున్నను, ఇంద్రియాదులపని కలిగియున్న రూపాదులతో గూడిన ప్రపంచములోనున్నను, ఈ ఎరుక ఏ తావులలోయున్నను, దానికున్న సహజ స్థితి ఇంతేనని ఆ యెరుకయందు బుద్ధిని నిలుపుకొనకయుందురు.

177. కం॥ పరిపూర్ణ మెరుక లివియని – యెరుగని బయలందు లేని యెరుక తనకు దా - నరుదెంచిట గురుశిష్యుల – తెరగున మాట్లాడి రెంట్ని-దెలసీ తా జనునూ – ఆ పైమాట – పలికెదేదికనూ - అరమరలేకనే నెరిగించినట్టి ఈ - గురుబోధ పాత్రూల నెరుగాక తెలిపేవు – తెలసీ తా జనునూ ఆ పైమాట పలికెదేదికనూ॥ 17

తా॥ శిష్యా! ఇది పరిపూర్ణమనియు, ఇది ఎరుకనియు నెరుగని బయలులో యెరుక అనేది ఒకటి యేతెంచి ఆ యెరుకే మన మిరువురముగా గనపడుచు, గురుశిష్యుల పద్ధతిగా పూర్ణబోధను విచారించుచు, పరిపూర్ణ లక్షణము ఇట్లుందని, యెరుక లక్షణము ఇట్లున్నదని ఈ రెంటి పద్ధతులను యే అనుమానము లేక యెరిగినతోడనే ఈ ఎరిగిన యెరుక నేను లేనిదానినని తెలుసుకొని తాను లేక పోవుచున్నది. ఆ యెరుక పోయిన తరువాత ఈ పరిపూర్ణబోధను గురించి తెలిపేవారు ఇచ్చట ఎవ్వరుయుండరు. ఇప్పటి వరకు మన మిద్దరము చేసిన సంభాషణలంతా కలలోని సంభాషణగానే యుండును. అట్టి బోధను నా వలన

నీవు వింటివి గనుక, ఈ బోధను భరించగలిగే ఉత్తములైన అధికారులకు మాత్రమే తెలుపవలయునుగాని త్రికరణ శుద్ధిలేనివారికి గురువాజ్ఞలో నిలువని వారికి ఈ బోధ తెలుపకూడదు. ఇది నా ఆజ్ఞగా పాటించవలయును.

వి॥ ధనము సంపాదనవలన దరిద్రమునకు మోక్షము కలుగును. సంతాన ప్రాప్తివలన వృద్ధాప్యమునకు మోక్షముకలుగును. సాధనలవలన జీవుని మనశ్శాంతికి మోక్షముకలుగును. శాస్త్ర శ్రవణాదులవలన దైవము ఇట్టివాడని యెరుగుటకు మోక్షము కలుగును. ఇవి అన్నియు భ్రాంతి రహిత మార్గములు కావు. జనన, మరణ రహితమార్గమే సరియైన మార్గమని తెలియవలెను.

178. కం॥ మరుపు సుషుప్తి మరణముల్-పరిపూర్ణంబునకు సాటిపరచి యెరుకకున్ – మరియాది మేల్కపుట్టువు ■ నిరుదెరగుల నెరిగి యెరుక – నెగరాజిమ్మోయీ – ఆ పైనుండె - దెరిగెదెట్లోయీ – గురుమంత్రమిదెసుమ్మీ మరువాక యేప్రొద్దు స్మరణ జేసితివేని –తిరిగి పుట్టవు నీవి – ట్లెగరజిమ్మోయీ ఆ పైనుండె – దెరిగెదెట్లోయీ॥

తా॥ శిష్యా! యెరుక పరిపూర్ణములో లేకనే ఎట్లు వచ్చినదని నీకు సందేహము కలుగవచ్చును. ఆ సందేహము తీరుటకు నీ అనుభవములో యున్న మరపు–సుషుప్తి-మరణములను ఉపమానముగా తీసుకొనుము. అప్పుడు యీ యెరుక యెట్లు వచ్చినదో నీకే అనుభవమునకు రాగలదు. మరుపులో తెలివి యుందని చెప్పలేవుగదా! యెరుక కలిగేటప్పటికి ఆ తెలివి ఎక్కడ యుండి వచ్చినదో తెలుపగలవా? సుషుప్తిలో ఎరుక యున్నదని చెప్పలేవుగదా! మెలకువ వచ్చేటప్పటికి ఆ యెరుక ఎక్కడ యుండి వచ్చినదో తెలుపగలవా? అట్లే అచల పరిపూర్ణములోగూడ ఈ యెరుక లేకనే తనకు తానుగా వచ్చినదని నమ్ముము. ఇట్లు రెండు వైపుల యెరుక పుట్టువును తెలుసుకొని ఇది లేకనే కలుగుచున్నదని దృఢము జేసుకొనుము. ఆ దృఢత్వము నీకు సడలిపోకుండ సదా గురువును, గురుమంత్రమును స్మరించుకొనుచు యుంటివేని ఇక ఏ సంశయములు కలుగక తిరిగి ఇక పుట్టకయుందువు.

179. కం॥ క్షితిలోన నరుడు పక్వా – న్నత తిని దిని కక్కి మరల నాకునె యతిసం - స్మృతి విడివి తిరిగి పూనునె – వితరణ శాలిచ్చినట్టి – విత్తామడిగీనె - సత్యవాది సత్యాముడిగీనె-ప్రతిలేని గురుబోధ స్థితిజెంది ఎరుకాని-

గతిసంగ్రహించాడు - కృతకృత్యుడిచ్చిన - విత్తామడిగినే - సత్యవాది - సత్యాముడిగినే॥ 19

తా॥ శిష్యా లోకములో యే మానవుడైనను షడ్రసోపేతములైన భోజనాదులుతిని వాంతి చేసుకొని తిరుగ ఆ వాంతి చేసుకొన్న పదార్థములను తినగలడా? సంసారము విడిచి సన్యాసము స్వీకరించిన యతీశ్వరుడు మరలా భార్యతో కాపురము చేయగలడా? ఉదార స్వభావముగల దాత తాను ఇచ్చిన దానమును తిరుగా యివ్వమని అడుగగలడా? సత్యవాదిగా యున్నవాడు సత్యమును తప్పి అసత్యమును పలుకగలడా? అట్లనే సాటిలేని పరిపూర్ణబోధను అచల గురువువలన తెలుసుకొని ఆ బోధలో ఈ యెరుకలేదని భ్రమరూపమైనదని గట్టిగా స్థిరపడిన నిజగురుపుత్రుడు మరలా ఏ సమయములోనైన ఈ యెరుక బయలు అగుననియు, అచలమగుననియు, పరిపూర్ణమగుననియు తెలుపగలడా? ఆ మాట అతని నోటినుండి రాగలదా? ఆ ఎరుకను మరలా తీసుకోగలడా? వదలివేసిన దానిని మరలా తీసుకోవడము యెంత దోషమో ఆలోచింపుము.

180. కం॥ మరుపన తొలిమేనులు మూ - డెరుకన నాలవశరీర మీరెండొకటే - పరిపూర్ణ మవలి దీవలి - యెరుకను గురువాక్కుచేత - యెగ రాజిమ్మిననూ - పోవును లేని - దెరిగె దేగిననూ - యెరిగేదె లేకుండు యేమొ ఆవలిజాడ -నెరిగేవారెవరింక - యింతె వాలెరుకాను - యెగరాజిమ్మిననూ - పోవును లేని - దెరిగేదేగిననూ॥ 20

తా॥ శిష్యా! ఈ యెరుక శరీరములు రెండు వేరు వేరు పద్ధతులతో కనబడుచున్నవి. ఇందులో శరీరము ఏ పద్ధతిలో యున్నదనిన స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము అను మూడు శరీరములతోగూడి జడ స్వరూపముగా కనబడుచు మరుపు లక్షణమున్నందువలన ఈ శరీరమును మరుపు అని తెలుపదగును. ఈ మూడు శరీరములకు వేరుగాయుండి, నాల్గవ శరీరముగ కనబడుచు నేను, నేను అని ఏది అనుచున్నదో, దానిని యెరుక అని తెలుపదగును. ఈ యెరుక మరుపులు రెండు పుష్పములో పరిమళములాగున ఒకటే గాని వేరువేరుగా యున్నవని తలంచకూడదు. మరుపుగాయున్న మూడు శరీరాలకుగాని, యెరుకగానున్న నాల్గవ శరీరానికిగాని యేది ఆవలయున్నదో,

అట్టి దానిని అచల పరిపూర్ణమని తెలుసుకొని గురువాక్కుచేత నాలుగు శరీరాలుగా కనబడుచున్న యెరుక మరుపులను లేకుండా ఎగరజిమ్మిన యెడల ఇక ఎరిగేది లేకుండా పోవును. అవలయున్న మాటను ఎరగడానికి యెవ్వరూ కనబడకయుందురు.

181. కం॥ నానావిధావయవములు – నానావిధ నామరూప నటనలు మాయల్ - నానావిధాల వూహాలు - నేనను యెరుకందె యిన్ని – నిబిడామై యుండూ – బయలునుగన తా – నిలువలేకుండూ – నేను మేనీ రెండునేనె నే లేకుంటె - మేనూలేదిది లేకనే నిల్చెదెట్లిన్ని - నిబిడామైయుండూ - బయలునుగన తా - నిలువాలేకుండూ॥ 21

తా॥ శిష్యా! ఈ దేహమునకు చిన్న చిన్నవి, పెద్ద పెద్దవి నా నా విధములైన అవయవములు యెన్నో యున్నవి. అటులనే ప్రతి దేహమునకుగూడ యున్నవి. ఆ అవయవములకు తగినట్లు అనేక పేర్లు యున్నవి, అనేక రూపములున్నవి, అనేక విధములైన పరివర్తనలున్నవి, అనేక సంకల్పములున్నవి, నీవు నేను అనెడి పలుకులున్నవి. అవి అన్నియు యెరుకలోనే ఇమిడి యున్నందున వీటినన్నిటిని యెరుక కదిలించుచున్నది. ఇట్లు అన్నిటిలో ఈ యెరుక వున్నందువలన ఈ యెరుక ఏ అవయవములులేని నిరవయముగయున్న బట్టబయలును యెప్పుడు దర్శించునో అప్పుడే ఈ యెరుక నిలువకుండా పోవును. యెరుక ఎప్పుడు నిలువకుండా పోయినదో, యెరుకచేత కదిలె అవయవములుగాని, వాటి పేర్లుగాని, రూపములుగాని, పరివర్తనలుగాని, సంకల్పాది గుణములుగాని, అందుకు తగువైన మాటలుగాని సర్వము వాటికవే కదలక అణిగిపోవుచున్నవి.

182. కం॥ జగము వలన సంకల్పము – జగ మా సంకల్పమునను జనియించును వే – రగుపడదు జన్మమందిర – మగుపడదెడబాసి నిల్వ – వారెండెన్నటికీ – బయలునుగని నీ – వీరెంట్నెన్నటికీ – యిక దల్చబోకూము ఇవి బుట్టుటుళ్ళక్కి - మృగజలమగుపడ్డ మిథ్యం బెరిగిన మాడ్కి - యారెండెన్నటికీ - బయలునుగని నీ వీ – రెంట్నెన్నటికీ॥ 22

తా॥ శిష్యా! సంకల్పము ఉన్నప్పుడే జగత్తు కనుపించుచుండును. జగత్తు యున్నప్పుడే సంకల్పము పుట్టుచుండును. సంకల్పము లేనిదగ్గర జగత్తు కను

పించడము లేదు! జగత్తును సంకల్పమున్న-సంకల్పమును జగత్తుయున్న - ఒకదానినొకటి పోషించు కొనుచున్నవేగాని ఈ సంకల్ప జగత్తులు పుట్టడానికి గాని, అవి రావడానికిగాని మరొక స్థానముందని తలంచరాదు. ఈ సంకల్ప జగత్తులు రెంటికి ఏ యెరుక ఆధారమైయున్నదో ఆ యెరుక ఒకనాడు నిస్సంకల్పముగా యున్న అచల పరిపూర్ణమును సంపూర్ణముగా జూచిన యెడల ఈ సంకల్ప జగత్తులు రెండు యెండమావులవలె భ్రాంతి రూపముగా కనిపించుచున్నవేగాని, నిజముకాదని ఈ యెరుకకే గోచరించుచుండును.

183. కం॥ పరిపూర్ణమనెటిపల్కె - యెరుకను బల్పాక్షరముల కెవ్వట గనినన్ - తిరమైయున్నది కనుగొని - యెరుకను బల్పాక్షరముల - నిక గట్టిపెట్టూ - యెవరికి దెలియ - దిది మూలగుట్టూ - గురుమూర్తి కరుణాచె ఎరిగి తెల్పితినేని॥ - పరిపూర్ణబోధాను - పరులు జెప్పినబోధ - నిక గట్టిపెట్టూ - యెవరికి దెలియ - దిది మూలగుట్టూ॥ 23

తా॥ శిష్యా! పలకమీద బలపముతో వ్రాయబడిన అక్షరములు యెన్ని మారులు వ్రాయుచుండినను అవి మాసిపోవు చుండునేగాని స్థిరముగా యుండ నేరవు. అటులనే పరిపూర్ణమనెడు పలకమీద బలపాక్షరములతో సమానమైన యెరుక ఎన్ని పర్యాయములు జగత్తును సృష్టించుచున్నను ఆ చిత్రించిన సృష్టి అంతయు నశించి పోవునేగాని స్థిరముగా యుండబోదు. పరిపూర్ణమనియెడు పలకే శాశ్వితమనియు, ఎరుకజేసెడు సృష్టి బలపాక్షరములతో సమానమనియు యెరిగి ఈ ఎరుకగాని, ఈ ఎరుకజేసిన సృష్టిగాని స్థిరముగా యుండునని యే నాడు నమ్మబోకుము. ఈ రహస్యము నా గురుమూర్తి కరుణచే, నేను యెరిగి నీకు చెప్పుచున్నాను. ఇతరులు ఈ మర్మమును తెలియక రక రకములైన బోధలు తెలుపుచు ఈ యెరుకనే నిలుపుచు, ఈ ఎరుకకే ప్రాధాన్యత నిచ్చుచుందురు. అట్టి మాటలకంతయు మనసిచ్చి భ్రాంతులలో మునిగి సంశయాదులచే బుద్ధిని పాడుచేసుకొనకయుండుము.

వి॥ ఎంతటి వేడినీరు చేతనైనా ఇంటికప్పు తగలబడనియట్లు అల్పబోధలగు యమ - నియమాది యోగ సాధనలవలన నవగ్రహోపాసనలు వలన "బ్రహ్మైవాహ, మస్మై" వాఖ్యముల వలన ఈ యెరుక రహితపడదు.

184. కం॥ చూపించ జూపరానిది - చూపించితి దాన్ని వుండజూచి నవుగదా - చూపించ జూచెనిది దీ - న్నే ప్రొద్దిక దల్చబోకు - మిదె గురు

బోధా - నిన్నంటాదు - నితరామెబాధా – నా పాప నా కూన –నా చిన్న – నా యన్న – నా పెన్నిధానామ – నా రత్నములకొండ – యిదె గురుబోధా నిన్నంటాదు – నితరమేబాధా॥ 24

తా॥ శిష్యా! ఈ అచల పరిపూర్ణమును నీకు చూపించవలయుననిదాని యందు ఏ గుర్తులు, ఏ రూపములు లేక పోవుటవలన చూపించుటకు సాధ్యము గాక యుండును. చూపించక పోయిన యెడల నీకు ఆ బట్టబయలు నిశ్చయ ముకు రాకయుండును. ఇట్లు చూపించుటకుగాని, చూపబడక యుండుటగాని సమస్యగా కనబడుచున్న ఈ బట్టబయలును ఎట్లో నీకు చూపించినాను. నీవు గూడ చూచినావు. ఆ చూచిన దానిని బాగుగా గుర్తించి ఆ గుర్తించిన యెరు కను లేక జేసుకొంటివేని ఇక ఇతరమైన బాధలెల్లయు నిన్ను అంటకుండా పోవును. గురుపుత్రుడవని పేరు తెచ్చుకొందువు. ఆ పేరును ఉద్ధరించు కొను టకు తగిన ప్రయోజకుడుగా నీవు నాకు కనబడుచున్నందువలన నిన్ను నేను మెచ్చుకొనుచు, నా పాప-నా కూన, నాయన్న-నా పెన్నిధానమా-నా రత్న ముల కొండా అని నా హృదయంబునకు హత్తు కొనుచున్నాను.

వి॥ ఈ అచల పరిపూర్ణము రూపనామ క్రియలు లేనిదగుట వలన, ఉత్తమమైన అధికారులకు మాత్రమే చూపించ దగినదిగా యున్నది. అంతటి ప్రజ్ఞలేని వారలకు ఈ పరిపూర్ణము చూపరానిదిగా యున్నది, అట్టిదానిని గురు సంజ్ఞతో పొందిన గురుపుత్రులు యే బాధలు బొందక భ్రాంతి రహితులై యుందురు.

185. కం॥ నామము రూపము నటన – స్తోమము బయలందు లేదు చూడుము నీవా – నామము రూపము నటన – స్తోమము యెరుకందు గలదు చూడుమి నిజమూ – బయలెరుకాల - చూచి చూడకుమూ – వేమారు నేనెంత వినజెప్పినా గాని – యీ మార్గమెతప్ప-యికలేదు రెండోది చూడూమి నిజమూ బయలెరుకాల – చూచి చూడకుమూ॥ 25

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణమునకు రూపముగాని, నామముగాని నటనలు గాని, మహత్తులుగాని, ఏ విధమైన కదలికలుగాని యెన్నడు లేకయున్నది. ఈ యెరుకకు మాత్రము రూపములును, నామములును, పరివర్తనలును. సర్వకార్య ములును, సకల పలుకులును అనేకములుగా యున్నవి. ఈ నిజమును నీవే

బయలెరుకలయందు పరిశీలించుకొనుము. ఇట్లు చూచిన తరువాత ఏది నిత్యమో, ఏది అనిత్యమో నీకే తెలియబడగలదు. ఆ విషయము నీకు తెలియబడుటకు గాను ఎన్నో విధములుగా ఇప్పటి వరకు ఎన్నో ఉపమానములు, ఉపమేయ ములు తెలుపుచు, ఈ అచలబోధను దృఢపరచినాను. ఈ బోధవలన సకల భ్రాంతులు నివారింపబడి, జనన మరణ ప్రవాహములో నుండి బయట పడ వలసినదేకాని ఇక యే ఇతర మార్గము లెల్లయు సంశయములను విస్తరింప జేయునేగాని సంశయములు పుట్టకయుండే నిజము దగ్గరకు తీసుక పోజాలవు.

186. కం॥ గురుడు గురుబోధ శిష్యుని – కెరిగించెటి వేళ్ల శిష్యుడెరిగేటి వేళ్లన్ – యిరువురు వైశ్వానర క – ర్పూరములవలె వెలిగి యవల – పొడ జూపరోయీ అట్లనె నీ - విక్కడ దెలియు మోయీ - పరిపూర్ణ మెరుకాలనెరిగి యా మీదట - యెరుకాను విడచూటె - గురుబోధంబెరుగూము – పొడజూప రోయీ - అట్లనె నీ విక్కడ దెలియుమోయీ॥ 26

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధను గురువు శిష్యునికి తెలిపే సమయంలో శిష్యుడు ఏకాగ్రతగా వినుచు ప్రతి మాటను అర్థము చేసుకొనకయుండిన ఎడల ఈ బోధ మర్మములు పట్టుబడవు. అందువలన ఆ విచారము గురువు తెలిపే సమయములో శిష్యుడు వినే సమయములో ఆ ఇద్దరి మనస్సులు అగ్ని కర్పూ రములు రెండు ఒకటిగా కలిసి వెలుగుచున్నటుల వారి అంతఃకరణములు రెండు ఒకటిగా ప్రకాశించుచుండును. ఆ అగ్ని కర్పూరములు వెలిగి, వెలిగి చివరకు రెండు ఎట్లు లేక పోవుచున్నవో ఆ గురు శిష్యులుగూడ విచారించి, విచారించి యెరుక లేక పొయ్యేటప్పటికి గురు శిష్యులుగూడ అగ్ని కర్పూరము వలె లేనివారే అగుదురు. అందువలన నీవుగూడ పరిపూర్ణము యొక్క సత్య మును, యెరుకయొక్క అసత్యమును రూఢీగా విచారించుకొని లేని యెరుకను లేకజేసుకొని యుండడమే ఈ బోధలోయున్న మర్మమని తెలియవలెను.

187. కం॥ సతికౌంగిట తత్పతి త - త్పతి కౌంగిట సతియుజేరి పవ శించి కలన్ – మృతిజెంది మేలుకని సు – స్థితులై యొకరొకరికట్టి - చేష్టా దెల్పుదురా - సిగ్గెడలి యా - చేష్టా నిల్పుదురా – ప్రతిలేని గురుబోధ స్థితి జెంద్యట్లనె సం - తత తిరిగి లేనెరుక - గతియిట్టిదని దాని చేష్టాదెల్పుదురా సిగ్గెడలి యా - చేష్టానిల్పుదురా॥ 27

తా॥ శిష్యా! భార్యాభర్తలిరువురు ఏ కాంత స్థానములోచేరి సంభోగచర్య లన్నియు జరుపుకొని, అలసటజెంది నిద్రబోయి మెలకువ వచ్చినతోడనే ఆ భార్యా, భర్తలిరువురు ఒక దగ్గర తీరికగా కూర్చొని ఆ జరుపుకొన్న సంభోగ విషయములు ఒకరితోనొకరు చెప్పుకొనుటకు సిగ్గుపడుచుందురు. ఆ విషయ ములు మరొకరితో చెప్పుకొనుటకు లజ్జపడుచుందురు. అటులనే గురు శిష్యు లిద్దరు పరిపూర్ణ మెరుకలను గురించి విశదముగా మాట్లాడుకొని ఆ బోధయందు సుస్థిరులై సంశయ రహితులైన ఉత్తమోత్తములగువారు మును పు-వారుజేసిన భ్రాంతి కార్యముల గురించిగాని, ఆ కోరికల గురించిగాని, ఆ సందేహముల గురించిగాని, గుర్తులోనికిరానియ్యక సిగ్గుపడుచుందురు. ఒక వేళ ముందుజేసినవి జ్ఞాపకమునకు వచ్చినను, అవి తలచుకొని లజ్జపడుచుందురు. మరొకరికి చెప్పు టకు గూడ ఇష్టపడక యుందురు.

గురుమంత్ర ప్రతాపం తొమ్మిదవ అధ్యాయం సమాప్తము.



## -; 10 బోధ దృఢీకరణం 5 ;-

188. కం॥ రానిది పోనిది బయలని – లేనిది యీ యెరుక యనుచు లెస్సగ దృఢమౌ - దానుక నీ వీ మంత్రము - మానక జపియింపుచుండు – మా నీతిశాలి – లేనిది లేదు - మరువకీజోలీ - లేనిది లేదాని పూని నిశ్చయ మైతె - తా నొక్కటుండునుగాని యట్లన విను – మా నీతిశాలీ – లేనిది లేదు మరువాకీజోలి॥ 1

తా॥ శిష్యా! రావడము పోవడము లేక యెప్పుడూ స్థిరముగ యుండునది ఆ బట్టబయలు వక్కటేనని తలంచుము. ఎప్పుడు వచ్చుచు, పోవుచు స్థిమితము లేక యుండునది ఈ ఎరుకయేనని నిర్ణయించుకొనుము. ఇట్లు యున్న ఈరెంటి విషయములు నీకు బాగుగా దృఢమయ్యే వరకు ఎప్పుడు మరువక పదహారు అక్షరములుగల మహా మంత్రమును జపించుచుండుము. అట్లు జపించుచూ యుండిన యెడల లేనిది యెప్పుడూ లేదనియు, యున్నది ఎప్పుడూ యున్నద నియు నీకు నిశ్చయమైనపో ఇక లేని యెరుక మాట తలంచక యుండుము.

ఇదే పరిపూర్ణబోధ కుదిరిన నీతి మంతునకు చక్కని ఉపదేశము. ఇట్లు ఎరుక యెప్పుడు నిలువకుండా పోయినదో ఇక పరిపూర్ణము ఒక్కటియే కనబడుచు ఇట్టిదని, అట్టిదని నిర్దేశించుటకు సాధ్యపడక యుండును.

189. కం॥ ఉన్నదిపరిపూర్ణము లేం - దెన్నటికీ యెరుక యనుచు నిది దృఢమౌ దా - కెన్నుము నే బోధించిన - తిన్నని యీ బోధ - శిష్యతిలకా మరువకుమీ - సుజనులమ్రోల - పలుకా వెరువకుమీ - నిన్ను కుమతులు వచ్చి నీ లోతడిగితె వారీ - కెన్ని విధముల నీ - వెరిగింప కిది శిష్యతిలకా మరువకుమీ - సుజనులమ్రోల - పలుకావెరువకుమీ॥ 2

తా॥ శిష్యా! ఎన్ని యుగములు గడచి పోవుచున్నను, ఎన్ని జగములు పుట్టి అంతరించి పోవుచున్నను, ఈ పరిపూర్ణము మాత్రము ఆ యుగజగము లతోగూడ రావడము, పోవడము లేక శాశ్వతముగా కదలక యున్నదనియు, ఈ ఎరుక మాత్రము యెప్పుడు స్థిరముగయుండక, నిలకడలేనిదై వస్తూపోతూ యున్నదనియు, ఈరెంటి స్థిర-అస్థిరములు నీ బుద్ధిలో బాగుగా నిలబడునంత వరకు నేను బోధించిన బోధను మరువక పదే పదే చింతన చేసుకొనుచు యుండవలయును. యెవరైన ఈ బోధ తెలిసిన సుజనులు, ఈ బోధ ధర్మ ములు దెలుపుమని అడిగిన ఎడల వారికి తెలుపుటకు సందేహించకుము. వారు మంచివారు గనుక యేదైనా నీలో లోపములున్నయెడల వారు నిన్ను సవరించి గట్టివానిగ జేతురు. మరియొక తెగవారుకూడ ఈ లోకములో నున్నారు. అట్టి కుచ్చితులు నిన్ను బలవంతముగా నీ గురురహస్యమును తెలుపుమని అడిగి నీ చేత చెప్పించుకొని అదికాదు అనియు, మరియొకటి యున్నదనియు తెలిపి నిన్ను సంశయగ్రస్తుని చేసి నీకున్న స్థిరత్వమును చెదరగొట్టెదరు. ఈ విషయములో జాగ్రత్తగా నడుచుకొనుచు ~~ఉన్నది~~ ఉన్నది వున్నట్లుగా, లేనిది లేనట్లుగా తెలుపుటకు యే మాత్రము భయపడక యే సందేహము లేక తెలుపుచుండుము.

190. కం॥ పరిపూర్ణము నెరుకను నే - నెరిగించితి నీవు రెంటి నెరిగి తివి గదా - యెరుకను గురుదక్షిణగా - మరి వేగిర మివ్వ వట్టి - మాటలేమి టికీ - ఎరుకతో ఇంక - కూటమేమిటికీ -పరులు నే ననియేటి భావము భావమై నిరతాము ఒకరీతి నిలచుండుమిక వట్టి మాటలేమిటికీ - యెరుకతో యింక కూటమేమిటికీ॥ 3

తా॥ శిష్యా! నీకు పరిపూర్ణమనగా నెట్టిదో, ఎరుకనగా నెట్టిదో ఈ రెంటి వివరమంతయు తెలిపితినికదా? ఈ వివరమంతయు ఏ యెరుక యెరిగినదో, ఆ యెరుకను నాకు గురుదక్షిణగా ఇవ్వవలయును. అట్లు ఇవ్వక, ఒట్టి ఒట్టి మాటలతో ఏమి ప్రయోజనములేదు. నీవు సంపూర్ణముగ యెరుకను నాకు ఇచ్చిన పిమ్మట ఇక నీ దగ్గర ఆ ఎరుక వుండకూడదు. ఎరుక సంబంధములేని నడత కలిగి యుండవలయును. మొదట నేను, నేను అను అహంకారమును విడువవలయును. వారు వీరను భేదభావములు విడువవలెను. మానాభిమానములను తీసివేయవలయును. దూషణ, భూషణలకు సమానత్వ మివ్వవలయును. నేను గొప్పవాడను అనే తలంపు నీలో లేక పోయినప్పుడే ఎరుకను గురుదక్షిణగ ఇచ్చినదానికి ప్రత్యేకత కలిగినవాడవుగా యుందువు. ఈ పద్ధతిలో నీవు వుంటివేని నలుగురిలో మంచివాడవని, గురుపుత్రుడవని గుర్తింపు పొందగలవు.

191. కం॥ పరిపూర్ణమెరుక – లివియని – గురువరుడెరిగించి యెరుక కూటమిమాన్పన్ – గురువుకు గురు – వెవరనుటకు మరి శిష్యునికింక నోట–మాటవెళ్ళేనా - పోయిన యెరుక మళ్ళి మళ్ళీ నా - గురుశిష్య లనియేటి గురు తెన్నడెరుగాక - నిరతాము యొకరీతి నిలచున్న బయలందు – మాట వెళ్ళేనా పోయిన యెరుక మళ్ళీ మళ్ళీనా॥ 4

తా॥ శిష్యా! సద్గురువుయొక్క కృపచేత నిత్యమైన పరిపూర్ణమును, అనిత్యమైన యెరుకను బాగుగావిచారించి తెలిసికొనిన పిమ్మట ఇక ఈ యెరుక లేనేలేదని నిశ్చయమైన వివేకవంతునకు ఈ యెరుక యే కోశములో కూడ లేకుండా పోవును. ఆ యెరుక లేక యున్నవారితో ఇతరులు నీ గురువు యెవ్వరని అడిగినయెడల నా గురువు అచలగురువనియు, పరిపూర్ణ గురువనియు, నిజ గురువనియు మాట్లాడుటకు తనకు మాట రాకయుండును. ఆయనలో యెరుక లేక యున్నందువలన యెరుకతోగూడిన మాటలుగాని యెరుకతో జేసెడి కర్మములుగాని ఏ మాత్రముతనలో కదలక యెరుకలేని పరిపూర్ణస్థితిలో పోయిన యెరుక తిరిగిరాక నిలకడగలిగియుండును. ఆ మహాత్మునకు నావారనియు, నీవారనియు వేరుపరచు వ్యక్తిత్వము మాసిపోయి పలుకులేని నిశ్చలస్థితిలో నుండిపోవును. ఆస్థితిలో ఆయన నోటవెంట మాటరాక నిర్ణయానిర్ణయములకు అతీతుడై గురుశిష్యులనే గుర్తునుగూడ మరచియుండును.

వి॥ సత్యమును నిలుపుకొని, అసత్యములైన రూపనామాదులపై అభిమానమును విడిచిన స్థితప్రజ్ఞులైన మహాత్ములు కొంతమంది వారి గురువుల పేరులను తెలుపక యుండినట్లు గ్రంథములలో చూచుచుందుము. తన గురువు యెంతటివాడై తనకు దేహములేని అఖండరూపాన్ని జూపగలిగినాడో, ఆ విషయము వారికి తెలిసినందువలన అట్టి గురువును మామూలు వ్యక్తిగా, దేహము గల వానిగా, ఒక పేరు వున్నవానిగా వారి నోటితో తెలుపుటకు వారి మనస్సు అంగీకరించక వారి గురువుల రూపనామములు తెలుపలేక పోయిరి. ఆ విషయము లోకమునకు తెలియక, ఆయన అవతార పురుషుడుగాబట్టి గురువుతో పనిలేకపోయినదనియు, ఆయన ముందుజన్మలో సర్వము పొందినవాడు గాబట్టి ఈ జన్మలో గురువుతో అవసరములేదని తెలుపుచుందురు. శ్రీరామచంద్రుడు అవతార పురుషుడైనను వశిష్ఠునకు శిష్యుడైనాడు. శ్రీకృష్ణ భగవానులు అవతారపురుషుడైనను సాంధీపునకు శిష్యుడైనాడు. ప్రతివారికి గురువు కావలసియేయుండును. తాళపుచెవిలేక తలుపు వీడదని వేమనార్యులు తెలిపియున్నాడు. అందు వలన ప్రతి మనుజునకు దేహాభిమానము రహితపడి, అఖండ దృష్టి ప్రాప్తించుటకు గురువు అవసరమనియే తెలుపవలయును.

192. కం॥ స్థిరమగు పరిపూర్ణము న – స్థిరమగు యీ యెరుక నెరుక
దెలియు జగములన్ – యెరిగిన దెరుకేకద స – ద్గురు కృపచే యెరుకబోతె
గురుశిష్యులేరీ - నోరెత్తాక - మరి వినరోరీ – గురుని పాదములాన గురుతు
లేనటువంటి – పరిపూర్ణ మొకటుండు పలుకరాదట్లుంటె – గురుశిష్యులేరీ -
నోరెత్తాక – మరి వినరోరీ॥ 5

తా॥ శిష్యా! స్థిరమైనది చలనములేనిది పరిపూర్ణమనియు, అస్థిరము చలనముతో గూడియున్నది యెరుక అనియు, ఈ క్షణములో రూపనామములుగా కనబడుచు మరుక్షణములో లేకపోవునది ప్రపంచమనియు, ఇట్లు యే ఎరుక ఎరుగుచున్నదో, ఆ యెరుక గురుబోధలో నిలువక దగ్ధమై కనబడక పోయిన యెడల ఇక గురువు అనియు, శిష్యుడనియు గుర్తించి పలుకుటకు, నోరు విప్పుటకు యెరుక లేకనే పోవుచున్నది. ఇక నీవుగూడ ఏ మాట మాట్లాడక, లేని దానిని మరలా యున్నదని భ్రమపడక గురుపాదములపై ప్రమాణముచేసి యెరుకను లేకుండా చేసుకొంటివేని ఇక ఏ గురుతులులేని పరిపూర్ణము యొక్కటియే కనబడుచు, ఈ పలుకుతో ఇట్టిదని చెప్పరాకయుండును.

వి॥ ఈ నాడు ఈ పరిపూర్ణబోధను బోధించు గురువులుగూడ ఈ యెరుకను లేదని తెలుపుచు, మరలా ఈ యెరుకను నిలుపుచు, ఇదే బయలు ఇదే పరిపూర్ణమని తెలుపుచుందురు. గురుపాదములపై ప్రమాణముచేసి ఏ ఎరుకను లేదని తెలిపినారో, మరలా ఆ యెరుకను నిలుపగూడదని పూర్ణబోధకుల నిశ్చయమైయున్నది.

బోధ దృఢీకరణం పదవ అధ్యాయం సమాప్తము.



## - 11 బోధస్థితి పురుషలక్షణం. 6 -

193. కం॥ గురుడచలచలములను తన - కెరిగించిన శిష్యుడెరిగి ఎరుకై యుండన్ - యెరుకను నిల్పకు మనినను - యెరుకను విడనాడి శిష్యు డెట్లుండునంటే - అట్లనె నే నిం కెట్లుండునంటే - పురుషుడు లేనట్టి పొలతి సౌందర్యాము - మరిమరి కలిగుండి - మరి లేనట్లనియుంటి - యెట్లుండునంటే అట్లనె నే నింకెట్లుండునంటే॥ 1

తా॥ శిష్యా! సద్గురువులైన మహాత్ములు తనను ఆశ్రయించిన శిష్యులకు ఏ రాకపోకలు లేక కదలకయుండు పరిపూర్ణమును జూపించి అనేక వికారములతో, అనేక చలనాదులతో గూడియున్న యెరుకను తెలియపరచిన తరువాత ఆ రెంటియందు అనుమానము లేకుండా జేసుకొని సుస్థిరుడైన బుద్ధిమంతుని గురువుజూచి ఆ లేని యెరుకను లేకుండా జేసుకొనుమని గురువు ఆజ్ఞాపించిన యెడల అది మొదలుకొని ఆ శిష్యుడు యెట్లుండుననిన భర్త మరణించి గర్భముతోనున్న స్త్రీకి ఆమెకు కావలసినవారు శ్రీమంతము జేయుచు, ఆ శ్రీమంతములో ఆమెకు గాజులు, బొట్టు, పూలు, ఆభరణాలు, సుగంధ ద్రవ్యములతో అలంకారముచేసి ముత్తైదువుగా జేసినను ఆమెలో నేను ముండమోపిననే భావన యుండునుగాని,ముత్తైదువునని తలంచదు. అటులనే యెరుకలేనిదని దృఢమైన సచ్ఛిష్యుడు తానుగాని, దేహముగాని లేనిదని భావములో నుంచుకొని సర్వులతో సకల కార్యములు చేయుచుండినను తనలో మాత్రము నేను వున్నానని, నాకు దేహముందని గుర్తులో నుంచుకొనక యుండును.

194. కం॥ యెరుకను విడనాడిన యా - పురుషునిస్థితి యెట్టిదనిన పొందుగ వినుమీ — సరిపడు సరిపడదనకన్ — సరిగా వర్తింపుచుండు సమరాసబుద్ధిన్ - కార్యములందు — సహజ ప్ర - వృద్ధిన్ - పరిపరివిధముల పరువులు బెట్టాడు - మరి వైరాగ్యముచేత మానుకొనుండాడు — సమరసబుద్ధిన్ కార్యములందు - సహజ ప్రవృద్ధిన్॥ 2

తా॥ శిష్యా! ఎరుకను విడిచిపెట్టిన మనుజుడు ఈ లోకములో యెట్లు వర్తించుచుండునో తెలిపెద వినుము. పరులు వారివారి ప్రీతి కొరకు ఏ కార్యములు చేయుచున్నను అవి మంచి కార్యములనిగాని, చెడు కార్యములనిగాని ఏదియు తెలుపక, వారిబుద్ధికి సరిగానే తానుగూడచేయుచు ఎదుటి వారిని సంతోష పెట్టుచుండును. అవి భ్రాంతికార్యములని ఒకరితోచెప్పడు. నాకు వాటితో పనిలేదని మానుకొనియుండడు. ఆ కార్యములు చేయలేదని ఇతరులను తొందరపెట్టడు. నేను చేయలేక పోతినని పరితపించడు. పదిమందికి ఏది సరిగా యున్నదో దానినే తానుగూడ చేయుచు, పదిమందికి అణుకువగా మెలగుచు, పదిమందిలో మంచివాడని గౌరవింప బడుచుండును.

195. కం॥ అనహంకారుం డనిమిషుడు - గనుకనె విశ్వంబనేటి కలగాన డహం — బనువాడు ననిమిషుడు గా - వున విశ్వంబనెటి స్వ— ప్నోద్యోగాము బూనీ - చేయుచు యా వుద్యోగాముమానీ – యను నీ స్వప్నోద్యోగము నకు నే కారణ - మని తా ననిమిషు డెన్నడనుకో డీమాట ను-ద్యోగాముబూనీ చేయుచు యా వు - ద్యోగాముమానీ॥ 3

తా॥ శిష్యా! అనిమిషుడనగా అశరీరియై నిద్రలేనివాడై యుండును. నిద్రలేనివానికి స్వప్నమురాకయుండును. ననిమిషుడనగా శరీరముగలిగి నిద్రబోవువాడుగా యుండును. నిద్రబోవువానికి స్వప్నమువచ్చుచుండును. గురుకరుణచే ఎవరికి యెరుక అనే అహంకారము పోవుచున్నదో, ఆ అనిమిషునకు దైవత్వం ప్రాప్తించి రెప్పలు వాల్చక (అనగా) అజ్ఞానమను నిద్రలోనుండక గురుమెలుకువతో యున్నవాడై, పరిపూర్ణ స్థితిలోనే యున్నందువలన ఆయనకు ప్రపంచమనే కలలేనివాడై సుఖ దుఃఖములు, జనన, మరణములనే ఉద్యోగములేక మెలుకువలోనే యుండిపోవును. గురు కరుణలేక యెరుక అనే నిద్రలో నేను, నేను అనుచున్న ననిమిషుడు ప్రపంచమనే భ్రాంతి కలను పొందుచు ఆ కలలో పుణ్య పాపములు, నరక స్వర్గములు, చావు పుట్టుకలు, సుఖ దుఃఖములుకలిగ్గ

అనేక చింతలతోగూడిన ఉద్యోగము చేయుచుండును. ఈ చింతలకంతా కారణము నేను, నేను అనేదిగానే యున్నది. ఆ నేను నేను అనే యెరుకపోతే, ఈ దుఃఖములు రానేరావని ఈ ననిమిషునకు తలంపురాక యుండును.

196. కం॥ కల మేలుకొన్న పురుషుడు – కలలోపలి బాము లెరుక గలిగుండగనే – తిలకింపలేపు గురుకృప – తెలివొందిన వానికింక – తిప్పాలున్నావే – తెల్వర కొద్ది గొప్పాలున్నావే – తలిదండ్రి దొర దాత కులదైవ మాప్తులు – కల బాంధవులు దేశికులని నమ్మితె యింక – తిప్పాలున్నావే – తెల్వర – కొద్ది గొప్పాలున్నావే॥ 4

తా॥ శిష్యా! కలలో నుండి మేలుకొన్న పురుషుడు ఆ కలలో తాను యెన్నో కష్టములు పడినట్లు యుండినను, ఎంతోమంది శత్రువులువచ్చి తనను బాధించినట్లు యుండినను, మహారణ్యములో క్రూర మృగములు తనను తరిమినట్లు యుండినను, ఆ కల విషయము నిజమని భీతిచెందక యుండినట్లు గురు కృపతో మేలుకొన్న పిదప ముందు ఎన్నో భ్రాంతులతో, ఎన్నో సంశయములతో, ఎన్నో కోరికలతో, అనేక దుఃఖములతో బాధపడినవాడై యున్నప్పటికైనా గడచిన రోజులలో తానుపడిన తెలివితక్కువ పనులను తలంపులోనికి రానివ్వక నిర్భయముగా యుండిపోవును. అట్టి మెలుకువను గలిగించిన గురు దేవుని తానెప్పుడు మరువక ఆయనే తల్లి – దండ్రి–దాత దైవముగా యెల్ల పొద్దుల బుద్ధిలో నిలుపుకొని ఆ గురుదేవుని కన్నను ఈ లోకములో మరి యొక దేవుడులేడని దృఢనిశ్చయము గలిగి ఆయనే కులదైవముగా, ఆప్తునిగా, బంధువుగా నమ్ముకొనినవారికి ఇక ఏ సంశయములు ఏ భ్రాంతులు ఏ తిప్పలు లేక సంశయ రహితులై శాంతితో నుండిపోదురు.

197. ఈరీతి స్థితిగలిగిన – నేరుపు శాలితర జనుల నిందాస్తుతులన్ తా రేగిచేయడెన్నడు – వారలు మరి చేసిరేని – వలదాని యనడూ–చెవియొగ్గి కావలెనాని వినడూ – వారు మీవారు మావారు వీరనుకొంచు – సారేకు వీదిలో పోరాడెవారీని – వలదాని యనడూ – చెవియొగ్గి – కావలెనాని వినడూ॥ 5

తా॥ శిష్యా! ఈ విధముగా పరిపూర్ణబోధను విచారించి ఆ పరిపూర్ణ బోధలోయున్న ధర్మములను చక్కగా తీసుకొన గలిగిన బుద్ధిశాలి పరులను నిందించడముగాని, స్తుతించడముగాని యేదియు పెట్టుకొనక యుండును. ఒక

సమయములో ఇతరులు తనను నిందించినను, గౌరవించినను ఏ దానికి మనసు ఇవ్వక మౌనముతో యుండిపోవును. తననుపెద్దగా, గొప్పగా శ్లాఘించుచుండి నను ఆ పొగడ్త మాటలను చెవియొగ్గి వినకయుండును. వీధులలో ఇతరులు పోట్లాడుకొనుచు, వకరితో నొకరు వాదించుకొనుచు, పరుష వాఖ్యములచే నిందించుకొనువారిని జూచి అవుననిగాని, కాదనిగాని, నీవారనియు, నావార నియు ఏదియు తెలుపక తనకు తానుగానే యుండును. ఏ మాటలు లేక యే దానిని పట్టించుకొనక చలనములేని నిశ్చల స్థితిలో నుండిపోవును.

198. కం॥ ధ్వని మొదలగు తన్మాత్రలు-గనుగొనగా లేశమైన గాన్పిం చని చో - టును - బట్టబయలుగా గని – ధ్వనిముఖ తన్మాత్రలున్న ~ దాన్నె యెరుగకనూ - గని యీ రెంట్లొ దేన్ని యెరుగకనూ - వునికి గలిగినయట్టి - ఘనుని సన్నుతిజేయ – జనులాకు శక్యమంచనరాదు – వినరాదు - దాన్నె యెరుగకనూ - గని యీ రెంట్లొ – దేన్ని యెరుగకనూ॥ 6

తా॥ శిష్యా! శబ్ద – స్పర్శ – రూప- రసగంధాదులైన పంచతన్మాత్రలు లేశమైనా యెచ్చట అగుపడకయున్నవో అదియే అచల పరిపూర్ణమని నిర్ణ యించుకొనుము. శబ్ద–స్పర్శ–రూప-రసగంధాదులైన పంచన్మాత్రలు ఎచ్చట అగుపడుచున్నవో దానినే యెరుకని భావింపుము. ఇట్లు పంచన్మాత్రలు ఎచ్చట యున్నవో, ఎచ్చట లేవో, సూక్ష్మబుద్ధితో పరిశీలించినప్పుడు పరిపూర్ణములో పంచతన్మాత్రలు లేనందువలన అచ్చట సృష్టి ప్రేరేపణ లేక యెరుకగాని, ఎరుక జేసే ప్రపంచముగాని, కనబడకయుండును. పంచతన్మాత్రలు ఎచ్చట నున్నవో అచ్చట సృష్టి ప్రేరేపణ జరుగుచు అచ్చట యెరుక ప్రపంచములు కనబడుచుండును. సృష్టికాధారమైనది పంచతన్మాత్రలు కలిగినది యెరుక అనియు, సృష్టికతీతమైనది పంచతన్మాత్రలు లేనిది పరిపూర్ణమనియు తెలుసు కొని ఆ తెలుసుకొనిన యెరుకను విడిచిపెట్టి ఇది వున్నది, ఇది లేదనే గుర్తులు ఏ మహాత్ముని దగ్గర లేకపోవుచున్నవో అట్టి ఘనుని శ్లాఘించుటకు నరులకు శఖ్యముగాకయుండును.

బోధ దృఢీకరణం పదకొండవ అధ్యాయం సమాప్తము.

  

# 12 బోధపఠనలక్షణం 14

199. కం॥ నామాట లెస్స వినుమా – సామాన్యంబనుచు జూడ జనదీ బోధన్ – ప్రేమాతిశయమునంగని - వేమా రిది గురునినోట - వినవలెనుమ్మా నిత్యము జదువు కొనవాలె నమ్మా - నామా రూప క్రియ నటనలు గలిగీన – దేమి వస్తువా దాన్ని – యెటు నిల్వనివ్వాకుమీ - వినవాలెనుమ్మా - నిత్యము జదువు - కొనవాలె నమ్మా॥ 1

తా॥ శిష్యా! నేను తెలుపు మాటలయందు నమ్మకముకలిగి శ్రద్ధగా వినుచుండవలయును. ఈ మాటలు సామాన్య మాటలని ఇతరులు బోధించే బోధ వంటిదని తలంచబోకుము. ఈ బోధను ఎంతో ఇష్టముతో దీనియందు అభిలాషగలిగి అతి శ్రద్ధతో శ్రీ సద్గురుస్వామి నోట నుండి యేమారక వినుచుండవలయును. లేదా అట్టి గ్రంథములనైనా పట్టుదలతో చదువుచుండవలయును, అప్పుడే ఈ అచలబోధయొక్క ప్రయోజనము నీకుతెలియబడి, సత్యాసత్యములు గోచర పడగలవు. ఆ పైన ఈ బోధ ప్రత్యేకతను తెలుసుకొని నామరూపాదులుగా కనబడుచు, అనేక నటనలతో యే యెరుక కనబడుచున్నదో ఆ ఎరుకను ఏ మాత్రము నీ దగ్గర నిలువకుండా జేసుకొనుము.

200. కం॥ నే మొదట నిన్ను గనుగొని – ఏ ముక్కలు నీదు చెవులో యిమిడిస్తినో నీ – వాముక్కల మూడింటిని – యే మాత్రము మరువకుండ యీ బోధనిస్తి – అంతకె యింత – గా బోధజేస్తి – ప్రేమతొ జదువుమిదే మార కెప్పుడు - కామితార్థమునిచ్చుపో మీ యింటికి దీపం – చీ బోధనిస్తి అంతకె యింత - గా బోధజేస్తి॥ 2

తా॥ శిష్యా! నీవు మొదట నా దగ్గరకువచ్చి నన్ను శరణని కోరినప్పుడు నేను నీకు పరిపూర్ణమొకటి, లేనెరుక ఒకటి, ఆ లేని యెరుకను విడిపించడము ఒకటి, ఈ మూడు ముక్కలను ఆదిలోనే నీ చెవిలో పొడిచినటుల 23వ కందార్థములో తెలిపియున్నాను. అది మొదలుకొని ఈ మూడు వాఖ్యములు నీ బుద్ధిలో స్థిరపడుటకుగాను, నీ అజ్ఞానము తొలగుటకుగాను యెన్నో ఉపమానములు, ఉపమేయములు దెలుపుచు ఇంతగా వివరించి దృఢపరచి యుంటిని. ఈ దృఢపరచిన అచలబోధను నీ మనసునందు నిలుపుకొని ఏమారక సదా స్మరించుకొనుచు మరువక యుంటివేని నన్ను నీవు ఆశ్రయించినందుకు జనన–

మరణ, దుఃఖ ప్రవాహమును తేలికగా దాటగలిగి యే భ్రాంతులు, ఏ శంఖలు లేక నిర్భయముగా యుండవలయునని దీవించుచు, ఇక నీ ఇంటికి నీవు సుఖముగా సంతోషముగా పోవచ్చునని అనుజ్ఞ నొసంగుచున్నాను.

201. కం॥ అన్నము దిన్నను ఆకలి –తిన్నగ నీరంబుద్రావ తృష్ణయు రోగం - బెన్నగ నౌషధసేవను - జన్నక్రియన్ యెరుకనిల్వ - జాలదోయన్నా యీ బోధ – నీ చౌలాతౌవిన్నా – కన్నూలతోజూచి కడముట్ట జదివీన - నిన్నెన్నటికి యెదుట నిలచుండి కనుగొన – జాలదోయన్నా - యీ బోధ నీ - చౌలతౌవిన్నా॥ 3

తా॥ శిష్యా! ఈ గ్రంథమును మొదటినుండి కడవరకు చక్కగా చదువుచు, ఈ బోధను పదే-పదే నీ చెవులతో వినుచు, ఇందులోయున్న సారాంశము నీ హృదయమందు గట్టిగా నిలబడిన ఎడల అన్నము తినినవానికి ఆకలి ఎట్లు తీరునో, నీళ్లు త్రాగినవానికి దాహశాంతి యెటుల కలుగునో, ఔషధము సేవించుట వలన రోగము ఎట్లు లేక పోవునో అటులనే నీలో నేను నేను అనుచు ఏ అహంకారము యెరుకతో గూడియున్నదో, ఆ అహంకారమను ఎరుక నీ దగ్గర యుండక నీ యెదుటను నిలబడక నీలో యున్నదనుటకు లేశమైన కనబడక మటుమాయమైపోవును.

వి॥ భయకంపాదులు కలిగించిన రజ్జువులోదోచిన సర్పభ్రాంతి రజ్జువును విమర్శించుటవలన ఆ భ్రాంతి తొలగిపోవునుగాని అనేక మారులు స్నానాదులు చేయుట వలనగాని, అనేక మంది మంత్రకారులచే విడువక మంత్రములు సలుపు చుండినగాని ఆ సర్ప భ్రాంతి తొలగదు.

202. కం॥ జనన మరణ ప్రవాహము – నణచును యీ బోధ పట్టుడని సాధువులిచ్చిన - నొల్లకుండి వారలు - జనినపు డా బోధమీద - జనియించి ప్రేమా –వెదకెదరట్టి –జనచేష్టలేమాయని తోచి నీకు నే వినజెప్పవలసె నీవును యీ బోధను వల్లననకు దొరుకదుమళ్ళి -జనియించి ప్రేమా – వెదకెదరట్టి – జనచేష్టలేమా॥ 4

తా॥ శిష్యా! బ్రహ్మవిద్య అనే పేరుతోనున్న విద్యలలో పరిపూర్ణ విద్యకు సమానమైన విద్యలేదు. తత్వ ప్రబోధనలను పేరుతోనున్న బోధలన్నిటిలో ఈ పరిపూర్ణ బోధకు సాటి అయినది మరి యొకటి లేక యుండును. అట్టిదైన

పరిపూర్ణబోధ జనన-మరణ ప్రవాహమునుండి దరికిజేర్చి జనన, మరణ రహిత మైన స్థానమును తెలియపరచి, సర్వ సంశయములను నివర్తింపజేసి, శాంతిని చేకూర్చునది ఈ పరిపూర్ణబోధ ఒక్కటే అగుటవలన ఇట్టి బోధను మహా మహులైన అచల గురువులు మనవద్దకువచ్చి ఈ అచలబోధను మీరు పొంద మని సర్వ దుఃఖముల నుండి బయట పడగలరని యెంతగానో తెలియ పరచి నను మూర్ఖత్వముతో, ఆ మాటలు చెవిలో పడక ఆ అవకాశము కాలదన్ని కొని కొంతకాలము నిరర్థక జన్ములై యుండుచు మరొక సమయములో ఆ బోధ మీద యిష్టము కలిగి ఆనాడు కావలయునని దేశదేశములు తిరుగుచు నేల మీద పడి, తల కొట్టుకొనుచు ఆ బోధకొరకు ఎంత పరితపించినను ఆ నిజము తెలిపే మహాత్ములు కనబడక యుందురు. తనకు తానుగావచ్చి ఈ బోధను సంప్రాప్తము చేసుకొనుమని తెలిపినను మూఢత్వముతో ఆ అవకాశము పోగొ ట్టుకొని తరువాత ఆరాటపడుటకంటే ఆ సమయము కలిసి వచ్చినప్పుడే తగు వైన ప్రయత్నముచేసి ఈ బోధను తెలుసుకోవలయునని నేను నీకు గట్టిగా తెలుపుచున్నాను. ఇట్టి బోధను నీవు నిరాకరించక శ్రద్ధతో వినుచుంటివేని మళ్ళీ ఈ భూమిమీద పుట్టక యుందువు.

203. కం॥ మరుపుకు తన్మాత్రలుగల – వెరుకకు తన్మాత్రలున్న నీ రెండొకటే - పరిపూర్ణమునకు లేవవి – పరిపూర్ణము యెరుకగాదు - మరుపూ గాదోయీ - వెతకిన దీని – సరిది లేదో యీ - పరిపూర్ణ మెరుకాల పరిశోధీం చీ గ్రంథము -రచించి నీకిస్తి మరువక చదు వెరుక - మరుపు గాదోయీ - వెతకిన దీని -సరిది లేదోయీ॥ 5

తా॥ శిష్యా! ఈ యెరుకకు తన్మాత్రలు యుండుటవలన ఈ యెరుకే సృష్టి-స్థితి–వినాశములకు కారణమైయున్నది. ఈ యెరుకకు తన్మాత్రలు లేక యున్న యెడల సృష్టి అనునది జరుగకయుండును. ఈ యెరుకకు తన్మాత్రలు యెరుకలోనూయున్నవి. మరుపులోగూడ యున్నవి. తన్మాత్రలతో గూడిన ఈ యెరుక సమిష్టిలో జూచిన యెడల సర్వజ్ఞాత్వాది గుణంబులు గలిగి సర్వ కర్తుత్వం, సర్వపాలకత్వం, సర్వసంహారకత్వం, సర్వనియంకృత్వం, సర్వ భోక్తృత్వము కలిగి సర్వేశ్వరాది గుణములతో వికసింపబడుచుండును. అదే యెరుక తన్మాత్రలతో గూడిన వ్యష్టి దేహములో యున్నప్పుడు సంకల్పించుట, నిశ్చయించుట, చింతనజేయుట, నేను, నేను అను ప్రేరేపణలతో అంతఃకరణ

మందు కలిగియుండును. ఈ ఎరుకకు తన్మాత్రలు మరుపులోగూడ యున్నందు వలన ఆ మరుపు సమిష్టిలో యున్నప్పుడు జ్ఞప్తిలేక యుండుట, తన్ను తాను మరచి తన విషయము తనకు తెలియకపోవుట, తనకు తానేగాని మరేమి లేక యుండుట గలిగి యుండును. అదే యెరుక తన్మాత్రలతోగూడి వ్యష్టి దేహములో మరుపునందు ఎట్లున్నదనిన అజ్ఞానము, అవిద్య, అవివేకము ఆరోపణ, ఆలోచనలేని ఆవేదన అభిమానములతో కూడియుండును. ఇట్లు ఈ యెరుక యెరుకలో యున్నప్పుడుగాని, మరుపులో యున్నప్పుడుగాని, తన్మాత్రలతో గూడి నిలకడలేక కదలికతో యుండుటవలన ఈ యెరుక, మరుపులు రెండు ఒకతీరుగా స్థిమితములేక యున్నవి. పరిపూర్ణములో తన్మాత్రలు లేనందువలన ఒకప్పుడు యెరుకగా యుండక ఒకప్పుడు మరుపుగా యుండక సర్వకాలముల యందును ఒక్క తీరుగానే యే కదలికలు లేక నిలకడ కలిగియుండును. ఇట్టి పరిపూర్ణమునకు సరియైనది మరియొకటి లేదని నేను బాగుగా విచారించి ఈ గ్రంథమును రచించి నీకు ఇస్తిని. గనుక దీనిని యెల్లవేళలయందును మరువక ఆసక్తితో జదువుచుంటివేని నిన్ను ఏ బంధములు అంటక సంకల్ప రహితుడవై నిర్మలస్థితిలో యుండిపోదువు.

204. కం॥ అందముగా సద్గ్రంథము - చందము వినిపింతుదాన్ని చదివిన వినినన్ - ముందుగ బయలెరుకై యే - సందున లే నెరుకలేక - జనవలె సుమ్మీ - అదె యిది - విని చదువుమీ నమ్మీ - యెందూకు నీకింక యితర శాస్త్రముల జోలం -దు గుర్తుండి పోదది గాన ఈ యెరుక - జనవలె సుమ్మీ - అదె యిది విని చదువుమీ నమ్మీ॥ 6

తా॥ శిష్యా! ఈ లోకములో ఎన్ని వేదాంత గ్రంథములున్నను ఆ గ్రంథములన్నియు భ్రాంతి రహితముచేయక సంశయములను కలుగ జేయుచుండును గాని సంశయములను రహితపరచక యుండును. ఈ గ్రంథము మాత్రము భ్రాంతులనెల్లా రహితపరచి సంశయములను లేకుండాజేసి వున్నది ఉన్నట్లుగా తెలుపును. అందు వలననే ఈ గ్రంథము సద్గ్రంథమని తెలియ పరచు చున్నాను. అట్టిదైన ఈ గ్రంథమును సాంగోపాంగముగా చదివిననూ లేదా వినినను సనాతనమైనది, ఉత్తమమైనది, సర్వ వ్యాపకముగా యున్న పరిపూర్ణమును తెలియపరచి ఆ తరువాత లేకనే యున్నట్లుగా కనబడుచున్న యెరుకను లేకుండాజేయును అట్టిదని ఈ గ్రంథముయొక్క విశేషత తెలుసుకొని అందు

తెలుపు ప్రతివాక్యమునందును నమ్మకము కలిగియుండిన యెడల ఈ గ్రంథమే చాలును. దీనియందు నమ్మకములేక యెన్ని గ్రంథములు చదువు చుండినను, అదేపనిగా వినుచుండినను యెరుక భ్రాంతి విస్తరించుచునే యుండునుగాని, భ్రాంతి రహితమైన మార్గము దగ్గరకు పోలేకయుండుదు. అందుకని ఈ సద్గ్రంథమును చదువుచు ఇందులో యున్న సారాంశమును బుద్ధికి తీసుకొనుచు యున్నయెడల సంశయములన్నియు తీరిపోయి నిలకడ కలిగిన వాడవై యుందువు.

205. కం॥ చక్కెర మెక్కక లోకులు – చక్కెర మాధుర్య మెరుగ – జాలరటువలెన్ – మక్కువతో విని చదువక – చక్కగ గ్రంథార్థ మెరుగ – జాలేర జనులూ – కావున నీవు – చాలించి పనూలూ – చొక్కా మీా గ్రంథా ము చూడూమి కొనవెళ్ళ –యిక్కాడితొ జన్మ మెత్తావుసరి – తెలియజాలేర జనులూ – కావున నీవు చాలించి పనులూ॥ 7

తా॥ శిష్యా! ఈ లోకంలో అభిమానము కలిగిన కొంతమంది పరిపూర్ణ భోధగురువును ఆశ్రయించకనే వారిని ప్రసన్నత జేసుకొని వారిముఖతా, బోధ ధర్మమర్మములు తెలియకనే పరిపూర్ణబోధ తెలిసినట్లుగా నటించుచు యెరుకే పరిపూర్ణము, పరిపూర్ణమే యెరుకయని చలోక్తిగా మాట్లాడుచుందురు. ఆ మాటలు అచలగురువులకుగాని, ఆ బోధ తెలిసిన పెద్దలకుగాని తీరని కళంక ముగా బాధించుచుండును. చెక్కరను ఎటులనో సంపాదించుకొని ఆ చెక్కరను తినకనే ఆ మాధుర్యమును తెలుపవలయుననిన ఆ తీపు తనకు తెలియక పోవుట వలన తడబడుచుండును. అటులనే ఈ గ్రంథమునుగూడ శ్రద్ధతో చదువకనే, ఆ బోధ రహస్యము తెలియబడకనే అందులోయున్న భావార్థములు తెలియ బడవు. అందుకని నీవు నిత్యముచేయు కర్తవ్య కర్మలలో ఎటులనో ఒక సమ యము కేటాయించుకొని ఈ గ్రంథము ఆఖరు వరకు మక్కువతో, శ్రద్ధతో, చదువు చుంటివేని అందులో రహస్యములు తెలియబడి అక్కడికి నీ జన్మ బీజ ములు సమూలముగా నశించిపోయి ఇక భూమిమీద పుట్టకుండా యుందువు.

206. కం॥ గూఢార్థ మెరిగి సతతా – రూఢుండై నతడు గ్రం-థరుచి గొనడు భువిన్ – గాఢతర జ్ఞానంబున – మూఢుండై యున్నవాడు –మొదటికె వినడూ – సుజనులపొడ – ముదమొప్ప గనడూ – వాడు వీడనరానివాడే గ్రంధము వినె – వాడు నిశ్చయ మిట్టి – వార్త లెరుగనివాడు – మొదటికె వినడూ – సుజనుల పొడ – ముదమొప్పగనడూ॥ 8

తా॥ శిష్యా! పరిపూర్ణ గురు సార్వభౌముని వలన ఈ అచల బోధలో యున్న గూఢార్థములను బాగుగా యెరిగి స్వానుభవముగా విచారించుకొని ఆ రూఢియైయున్న స్థిత ప్రజ్ఞుడు. ఏ విధమైన తొట్రుపాటులు కలుగక ఆచరణ విధానము కలవాడై జగత్తులో మెలగుచుండును. అట్టి అనుభవముతో నున్న వానికి ఈ గ్రంథము యొక్క ప్రయోజనము యుండదు. వితరణ లేనివాడై, అజ్ఞానముతోగూడుకొని ప్రపంచ భ్రాంతులలో మునిగియున్న మూఢునకు ఈ గ్రంథముయొక్క ప్రయోజనము ఏ మాత్రము యెరుగజాలకయుండును. అట్టి వాడు పెద్దలను చూడడానికిగాని వారిమాటలు వినడానికిగాని ఇష్టపడక విసుగు పుట్టుచు, రోసుకొనుచుండును. ఆ పాడుబుద్ధిని విడచిపెట్టి, వారు వీరు అను భేధ భావములుండక సత్పురుషులయందుగాని వారు తెలుపు సద్వాఖ్యముల యందు గాని, అసూయతను వదలిపెట్టి సర్వులయందున ప్రేమానురాగములు యెవరికి కలిగియుండునో వారికే ఈ గ్రంథము చూచుటకుగాని, ఈ గ్రంథములో యున్న రుచిని తెలుసుకొనుటకుగాని మనసు కలిగినవారలై యుందురు.

207. కం॥ తాబేటి తలపు చేతను - తాబేల్పిల్లల క్షుధార్తి తలగుట తెలియన్ - తాబేటి గర్భమందున - తాబేలై పుట్టకున్న - తరమా యితరు లకూ — సద్గురుబోధ ట్లరయ నితరులకూ — యే బాధ లెరుగాని యీ బోధ గలవారిచే బోధ బడయాక చేకొనదలచితె — తరమా యితరులకూ — సద్గురు బోధ ట్లరయా నితరులకూ॥ 9

తా॥ శిష్యా! దేవుడు సర్వాంతర్యామియై ఒక దగ్గరయుండి ఒక దగ్గర యుండక అంతా నిండియున్నాడని శ్రుతులు పెద్దలు తెలుపుచుందురు. అట్టి దేవుని దర్శించుటకు నానా విధములైన బాధలు పడేవారంతా యే బాధలు పడక సుఖముగా ఆ దేవుని దర్శించి శాంతులై యున్న పరిపూర్ణ బోధకులను జూచి మేము యెన్నో సాధనములు అనుష్టానములు నియమాలు ఆచరించు చున్నాము. మాకు అద్వైవ సాక్షాత్కారము కలుగలేదు. మీరు యేమియు చేయ కనే అప్రాప్తి ఎటుల కలుగునని ఆక్షేపణలు ఎగతాళి చేయుచుందురు. తాబేలు గ్రుడ్లు పెట్టే సమయము వచ్చినప్పుడు నీటికి కొంతదూరము పోయి ఎత్తు ప్రదే శములో లోతు గుంటను త్రవ్వి ఆ గుంటలో ఒక్కతూరి గ్రుడ్లు అన్నియు పెట్టి ఆ గుంటను మరలా పూడ్చివేసి తాను యథా ప్రకారము నీటిలోనికివచ్చి గ్రుడ్లు పగిలి పిల్లలకు ఆకలి తీరవలయునని, తన మనస్సులో సంకల్పించుకొను చుం

డును. ఆ సంకల్పమువలన పిల్లలకు ఆకలి తీరుచు ఆ పిల్లలు పెద్దవి కాగలిగి వాటికవే పైనయున్న మన్నును యెగతన్నుకొని తల్లియున్న నీటిలోనికి వచ్చి తల్లితో చేరిపోవును. తాబేలు నీటిలోయుండి సంకల్పించుకొన్నంత మాత్రమున యెక్కడోయున్న తాబేలు పిల్లలకు ఆకలితీరి సుఖముగా యెట్లు బైటకు వచ్చి యుండునని ఆశ్చర్యము, సందేహము కలిగిన యెడల ఆ సందేహము తీరుటకు తాబేలు గర్భవాసములో తాబేలై పుట్టిన ఎడల ఆ అనుమానము ఆ సందేహము తీరునేగాని ఇక యే ఆలోచనలకు ఆ సందేహముతీరదు. అటులనే ఏ బాధలు యే శ్రమలు లేక, ఆ దేవుని చూపగలిగే అచల గురువుల బిడ్డలు కాగలిగితే, ఆ బోధ ధర్మములు తెలియునేగాని అట్లుగాక యెంత కర్మ, భక్తి, యోగసాధనములు యెన్ని జేసినను ఈ అచల మార్గములోయున్న సూక్ష్మత స్థిరత్వము తెలియజాలదు.

వి॥ సాధనవలనను స్నాన, సంధ్యాధి, వ్రత కర్మల వలనను అంతఃకరణ శుద్ధియగును. గాని వితరణ జ్ఞానము కలుగనేరదు. విచారణ వలననే పరిశుద్ధ, జ్ఞానము కలుగవలయును. అట్టి జ్ఞానముచేతనే మనుజుడు జనన, మరణ, రహితమైన స్థానమును పొందగలడు. (శివగీత)

208. క॥ ఈతాపేక్షను మనుజులు – నూతి దరింజేరి నిల్చి నోట గొనిగినన్ - యీ తేలవచ్చువారికి - చేతులతో నీళ్ళమీద – చేరీ యీదకనూ మును నేర్చిన – వారీదించకనూ - యీ తీరుగనె దేశికేంద్రుడు దెల్పక – చాతుర్యమున బోధ సాధించ నయ్యీన - చేరి యీదకనూ - మునునేర్చిన – వారీదించకనూ॥ 10

తా॥ శిష్యా! ఈతను నేర్చుకొనవలయునని అభిలాష కలిగిన మనుజుడు నీటివడ్డున చేరి యెంతకాలము నాకు ఈత రావలయును. ఈత రావలయునని ఊరకే అనుకొన్న మాత్రమున ఆ ఈత తనకు ఏలాగున వచ్చును. అట్లుగాక యేమైనాకానీ అని నీళ్లలోకిదుమికి చేతులతో నీళ్లను పొట్టక్రిందకు లాగుకొనుచు మునుగుచు, తేలుచు ప్రయత్నము చేయుచుండవలయును లేదా! ఈత తెలిసిన వారు ఆ పడుచున్న శ్రమను చూచి ఆ ఉపాయమునైనా, చెప్పవలయును. అప్పుడే ఆ ఈత వచ్చునుగాని వూరకే ఒడ్డునచేరి, ఈత రావలయునని అనుకొన్నంత మాత్రమున ఆ ఈత రానేరదు. అటులనే ఈ పరిపూర్ణ విద్యను పొందదలచినవారు ఆ పరిపూర్ణ విద్య తెలిసిన గురుస్వామిని ఆశ్రయించకనే

వారిబోధలు వినకనే చాతుర్యముతో ఈ బోధను తెలియవలయుననిన ఎన్నటికి సాధ్యపడునదికాదు.

వి॥ బ్రహ్మ విద్యలో ప్రవేశముగలిగి యున్నవారుకూడ ఈ అచలవిద్య అనగానే, అతి కోపపడేవారు కొంతమందికలరు. అచలవిద్యపై అభిలాషకలిగి యుండి కూడ ఈ విద్యను అంది జీర్ణించుకోలేక నిరాశపడేవారు కొంతమంది కలరు. అటుల జరగడము ఎందుకనగా ఈ బోధ అన్నిబోధలకన్నను సులువైనది. శ్రేష్ఠమైనది. అయినను అంతటి గురువు ప్రాప్తించక పోవుటచేతను, తగువైన శ్రద్ధను తీసుకొనకపోవుట చేతను విఫలులై పోవుచున్నారు.

209. కం॥ ప్రవిమల చిత్తుడు శిష్యుడు - సవినయమున దేశికునకు శరణాగతుడై - త్రివిధ ప్రసాదములగొని - భవనాశస్థితులులేని - పద్ధాతి వినినన్ - తిరిగిరాని - పద్ధాతి గనినన్ - భువిలోవాని సాటిబోల్ప నెవ్వరు లేరు - అవిరాళభక్తి నీ వారీతినుండే వీ పద్ధాతి వినినన్ - తిరిగిరాని - పద్ధాతి గనినన్॥ 11

తా॥ శిష్యా! మనోవాక్కాయములను ఒకటిగా జేసుకొని పరిశుద్ధమైన మనసు కలిగిన శిష్యుడు గురుదేవుని వలన త్రివిధ ప్రసాదములు పొందనిదే తనలో పాదుకొని యున్న అహంకారము రహితపడి భ్రాంతిభావములు సమూలముగా నాశనము కాజాలవు. ఈ త్రివిధ ప్రసాదములను కొంతమంది త్రివిధ దీక్షలను త్రివిధ ప్రసాదములని తెలుపుచుందురు. కొంత మంది ద్వాదశీ-శోడశీ-పంచదశీ అను మంత్రత్రయమునే త్రివిధ ప్రసాదములని తెలుపు చుందురు. కొంతమంది పరిపూర్ణ దర్శనము, యెరుక నిర్ణయము, యెరుకను పిడిచే విధానము ఈ మూటిని త్రివిధప్రసాదములని తెలుపుచుందురు. అవి ఏవియు ప్రసాదములు అనేమాటకు వర్తించుటలేదు. ప్రసాదములు ప్రసాదములుగానే యుండవలయునుగాని దీక్షలు మంత్రాలుగా యుండగూడదు. గురువు భోంచేయుసమయములో శిష్యుడు వచ్చి ప్రసాదమిమ్మని కోరుట, గురువు ఇచ్చుట, గురు సాంప్రదాయములో నున్నది. గురువును ప్రసాదమిమ్మని శిష్యుడు ప్రాధేయపడినప్పుడు తాను భోంచేయుచున్న పిడికిలిలోవున్న భోజనము ప్రసాదంగా ఇచ్చును. దానిని శిష్యుడు స్వీకరించుట, అది అక్కడికి ప్రసాదమని తెలియుచున్నది. అట్టి ప్రసాదములు గురువువలన మూడు విధములుగా పొందవల

యును. అప్పుడే శిష్యుడు అహంకార రహితుడై ప్రవిమలమైన పరిశుద్ధ జ్ఞానం కలిగి జన్మబీజములు కాల్చివేయుట వలన పుట్టుక, చావులులేని నిస్సంశయ స్థితిలో ఉండిపోవును. అట్టి సంపూర్ణమైన గురుభక్తి గలవానికి సమానమైన వారు మరొకరు కానబడక యుండును. అట్టి భక్తుడు కర్తృత్వ రహితుడై అచంచలమైన స్థితిలోయున్న వాడగుటవలన బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు వారి యోగ ఫలముచే సత్యలోకము, వైకుంఠము, కైలాసము వరకేపోయి అవతల పోలేకపోయిరో, సనకసనందనాదులు జ్ఞానపద్ధతి నవలంబించి అదిష్టాన చైతన్య బ్రహ్మమను యెరుక వరకేపోయి అవతలయున్న పరబయలు దగ్గరకు పోలేక పోయిరో అట్టి స్వచ్ఛంద స్థానము పొందుటకు త్రివిధ ప్రసాదములు పరిశుద్ధ చిత్తునిగాజేసి యెడతెగని గురుభక్తి గలవానిగా జేయును.

210. కం॥ ఉపనయనము గానిదె తా - నుపనయనము మీదిచదువు నూహను గొనినన్ – విపరీతమగును దానను – చపలుడు బ్రాహ్మణుడుగాడు చర్చించిచూడా - శూద్రుడు వాన్ని యర్చించరేడా - ఉపమాచె బోదట్ల ఊహించి నిక్కేటి - కపటా చిత్తుడు సాధుగణమూతొ సమమౌనె - చర్చించి చూడా - శూద్రుడు వాన్ని - యర్చించరేడా॥ 12

తా॥ శిష్యా! బ్రాహ్మణ కులములో పుట్టినవాడు వడుగు జేసుకొనుట సాంప్రదాయ పద్ధతిగా యుండుటవలన వడుగు జేసుకొనక, యజ్ఞోపవీతము ధరించక యున్నవానిని బ్రాహ్మణులు కార్యములపట్ల జరుగు బంతి భోజనము దగ్గర పదిమందిలో కూర్చొనుటకు ఒప్పుకొనరు. వడుగు జేసుకొన్నవాడే వేదములు జదువుటకు అర్హతగలవాడై యుండును. అట్టివానికే ఆ కుల పెద్దలు వేదములు చదివే తీరును తెలుపుదురు. అప్పుడు అతను అర్థము పోకుండా స్వరయుక్తముగా చెప్పగలుగును. అట్లు వడుగు జేసుకొనక తెలిసిన వారిచేత తెలుసుకొనక వేదములు చదివే పద్ధతిని యెరుగక తన ఊహా కల్పనలచేత వేదములు చదివిన యెడల అవి స్వరయుక్తముగా యుండక విపరీత శబ్దములు పలుకుచుండును. అట్టివాడు శూద్రుడే యగునుగాని బ్రాహ్మణుడు కాజాలడు. వానిని లోకములో గౌరవించరు, పూజించరు. అటులనే పరిపూర్ణ గురువును ఆశ్రయించి వారిచేత వస్తు నిశ్చయముగా పరిపూర్ణబోధను తెలుసు కొనకనే యెరుకను విడిచే పద్ధతి గ్రహించకనే, కుచ్చితమతులై, కపట నాటకములు చేయుచు పరిపూర్ణబోధ నాకు తెలుసుననియు, ఆ బోధ నేను తెలిపెదననియు,

పరులను ప్రతిమాలుచు ఉపదేశములు మావద్ద తీసుకొనుమని సారె సారెకు ప్రాధేయపడుచు ఒకప్పుడు యెరుక పరిపూర్ణముకాదని తెలుపుచు మరొకప్పుడు యెరుకే పరిపూర్ణమని తెలుపుచు స్వాధీనములేని చపల చిత్తముతో గూడిన మాటలు తెలుపుచు తప్పటడుగులు వేయుచుందురు. అట్టివారు పరిపూర్ణబోధ నెరిగిన అచల గురువులవలె ఉన్నది వున్నట్లుగా తెలిపే స్వానుభవము వారికి లేక పోవుటవలన నిజమెరిగిన పరిపూర్ణ గురువులతో సమానము యెన్నటికిని కాజాలరు.

211. కం॥ మంత్రముచే సంతెల్లగు – తంత్రములేకున్న కాదు తంత్రము చేతన్ - మంత్రములేకను వడుగిల – మంత్రము తంత్రంబు రెండు – మరి గూడుకొనీ – కార్యములన్ని – జరిగించు పూనీ – మంత్ర తంత్రములాలొ మర్మాము గురుడెరుగ - మంత్ర తంత్రములాలొ మరుగెరుగు గురునీచే-మరి గూడుకొనీ కార్యములన్ని - జరిగించు పూనీ॥ 13

తా॥ శిష్యా! లోకములో సప్తకోటి మహామంత్రములు ఉన్నవని ప్రతీతిగా తెలుపుచుందురు. అవసరమొచ్చినప్పుడు ఈ మంత్రములను ఒక్కొక్క దగ్గర ఒక్కొక్క పద్ధతిగా ఉపయోగపెట్టి ఆ మంత్రములవలన ఆ దోషము నివారణ కలిగినదని నమ్మకము కలిగించుచుందురు. ఈ మంత్రములన్నియు తంత్రము లేకుండా ఏ పని చేయజాలవు. సంతానము కావలయునని మంత్రములు ప్రయోగించినంత మాత్రమున సంతానము యెన్నటికిని కలుగజాలదు. దానికి తోడు క్రమ పద్ధతిగా సంపర్క పద్దతిని ఉపక్రియలనబడు తంత్రమును గూడ బలపరచిన యెడల సంతానము తప్పక కలుగగలదు. అటులనే ఈ జగత్తులో జరుగు సకల కార్యములన్నియు మంత్ర తంత్రములతో గూడుకొని జరుగు చున్నవి. ఈ మంత్ర తంత్రములలోయున్న మర్మములెల్లయు పరిపూర్ణ గురువులకే తెలుసునుగాని మరి ఎవ్వరికి తెలియబడక యుండును. అట్టి గురువులను ఆశ్రయించి వారిచేత, మంత్ర తంత్రములలో యున్న మరుగును యెరిగిన యెడల సంశయము లెల్లయు నిర్మూలమైవున్న పరిపూర్ణము వక్కటియే తెలియ బడుచుండును.

వి॥ పశువులదృష్టి కొన్ని అడుగుల వరకు మాత్రమే పోవును. మానవుని దృష్టి కొన్నిమైళ్లు వరకు పోవును. కర్మాచరణగల వారి దృష్టి వారుచేయు కర్మలవరకే పోవును. అచల గురువుల దృష్టి కనుపించని చోటువరకు పోవును.

212. కం॥ సంకల్పాదిక గుణముల - సంకులమీ యెరుక - యందు సమకూడుండున్ - సంకల్పాదిక గుణముల – సంకుల మచలమున జాడ – జాడాలేదన్నా-యీ రెంటికి–యీడుగాదన్నా - కొంకాక యీ రెంట్ని – గూర్చి గ్రంథముజేస్తి - సంకోచింపక జదువు – శంకబుట్టదు శంక - జాడ లేదన్నా యీ రెంటికి - యీడుగాదన్నా॥ 14

తా॥ శిష్యా! సకల భ్రాంతులు, సకల సంశయములు, సకల కోరికలు, సకల వ్యాకులములన్నియు ఈ యెరుకయందే పుట్టుచు, యెరుకతోనే గూడి యున్నవి. పరిపూర్ణమునందు మాత్రము ఏ సంకల్పములు, యే పుట్టుకలు యే కదలికలు లేక నిర్మలముగ పరిశుద్ధముగా చలించకయున్నది. ఈ ఎరుక పరిపూర్ణముల రెంటిలో దాని గుణము దీనిలో, దీని గుణము దానిలో ఏ మాత్రము కనబడక ఈ రెంటికి సంబందము యేనాడు కలుగకయున్నది. ఈ సంబంధము లేని యెరుక - పరిపూర్ణములకు –సంబందము కలిపి రెండు ఒకటేనని సంబందము కలుపుకొందురు. అట్లు తెలుపుటకు కారణమేమనగా పరిపూర్ణ గురువును ఆశ్రయించక పోవుట చేతను, ఆ పరిపూర్ణ బోధలోయున్న తీర్పులు తెలియక పోవుటచేతను, ఆ అనుభవము కలుగక పోవుటచేతను ఈ రెంటికి పొత్తును కలుపుచు లేని దానిని వున్నదని ఉన్నదానిని లేనిదని ఆరోపించుచుందురు. ఆ అనుభవము కలిగిన అచల గురువులు మాత్రము బయలెరుకలు ఒకటేనని వారి నోటితో యేనాడుచెప్పరు, ఎవరైనా ఒక్కటేనని తెలుపుచుండినను, ఆ మాటలు వినలేక చెవులు మూసుకొను చుందురు. ఈ రెంటికి జత కుదరదని వస్తుధర్మము తెలియక జత కుదురునని తెలుపుట అవివేకము, అజ్ఞానముగా యుండును. ఈ అజ్ఞానము తుడిచివేయుటకై ఈ గ్రంధమును వ్రాసితిని ఇక సంశయబుద్దిని విడచిపెట్టి ఆసాంతము ఈ గ్రంధమును చదువుచుంటివేని, ఇందులో సారాంశము తెలియబడి ఉన్న సత్యము తెలిసినవాడవై యెరుక పరిపూర్ణమగునని బయలెరుకలొక్కటేనని యెవరితోను తెలుపక అట్టిమాటలుకూడ నీవు వినక యే శంఖలు నీలో పుట్టనివ్వక, నిర్మలమతితో బ్రాంతిలేని వాడవై యుండవలయును.

బోధ పఠన లక్షణం పంద్రెండవ అధ్యాయం సమాప్తము.

  

-: 13 భద్రాద్యంకితం. 8 :-

213. కం॥ అల భద్రాచలమనిన బ - యలుగా గుర్తెరుగవలయు యెరుకను విష్ణ్వం - దుల దోచి గురుని కృపచే - నిలువక విష్ణ్వేగిరిపోతె - నిశ్చాయ మదెరా - కృష్ణదాసు - నిశ్చాయమిదెరా - యిలమీద యెవరైన యీ కందార్థముల లోపలి గూడార్థము దెలియ - భ్రమను జెందరువారు - నిశ్చాయ మదెరా - కృష్ణదాసు - నిశ్చాయమిదెరా॥ 1

తా॥ శిష్యా! జగత్తను పేరుతో కనబడుచున్న సకలరూప సముదాయ మంతయు ఒకనాడు యే ఒక్కటియు మిగలక తుడిచినట్లుగా నశించిపోయినను యేది నశించక శాశ్వితముగా యున్నది యున్నట్లుగా ఏ చలనములేక భద్రముగా కనిపించుచున్నదో, దానినే భద్రాచలమని యెరుగుము. ఆ భద్రాచలమనెడి పరిపూర్ణములో యే యెరుకయుండి సృష్టి-స్థితి-లయములు జరుపుచున్నదో, ఆ యెరుకనే, విష్ణువనియు లేక రాముడనియు భావింపుము. శ్రీ సద్గురుమూర్తి కరుణ కలిగినప్పుడు ఆ విష్ణువనే యెరుక అచ్చట ఏ మాత్రము కనుపించక పోవును. ఇదే నిశ్చయమని భాగవతుల క్రిష్ణదాసు తెలిపెడి బోధలోనున్న చివరి సారాంశమని దృఢముగా నమ్ముము. ఈ లోకములో యెవరైనా ఈ కందార్థములలో యున్న గూఢమైన భావరహస్యములను ఉన్నది యున్నట్లుగా అచల గురువులవలన యెరుగబడిన యెడల ఇక ఏ భ్రాంతులకు తావునియ్యక స్థిమితములు గలవారై యుందురు.

214. కం॥ భాగవతులనారాయణ - యోగికి జానకి యనేటి యువిదా మణికిన్ - బాగుగ పుత్రుడనై భూ - భాగమునన్ కృష్ణననుచు - ప్రభవించి నామా - అనంతికి - ప్రభువునై నానూ - నా గురువుకృపచేత నయమైన యీ బోధ - నేగంటి కన్నంత నీకు దెల్పుట కిట్లు - ప్రభవించినామా - అనంతికి ప్రభువూనై నానూ॥ 2

తా॥ శిష్యా! నా ప్రాప్తము కొలది నాకు జన్మనిచ్చిన భాగవతుల నారాయణయోగికిని ఆయన సతీమని అయిన జానకమ్మ అనుదంపతులకు పుత్రుడుగా జన్మించి ఈ ప్రపంచములో క్రిష్ణయ్య అనే పేరు కలిగి అనంతమ్మ అనెడు సాధ్వీలలామకు భర్తగానై తిని. నా పూర్వ పుణ్యమువలన అచల గురువు సంప్రాప్తమై వారి కరుణా కటాక్షముచేత ఈ పరిపూర్ణబోధను ఏ కొరతలు గలు

గక విశదముగా తెలుసుకొని కృతార్థుడనైతిని గనుక ఏ గురుదేవుని కృపవలన ఈ మహత్తరమైన బోధను నేను పొందితినో ఆ బోధనంతయు నీకు ఏ సంశయములు లేకుండా బోధించుటకు నీ కొరకుగా ఈ భూమిమీద నవతరించినా నని తెలియుము.

215. కం॥ దేశాటనంబు జేసితి - వ్రాసితి గ్రంథములు కొన్ని వరగురు శిష్యుల్ - జేసేటి చర్చవింటిని - రోసితి మోక్షాద్యపేక్ష - రూఢీగ వినుమీ నీ విట్టి యా - రూఢాత గనుమీ - దేశికుదయ బుట్టజేశి శిశ్రూషోప-దేశాము గొని యుపదేశా మిచ్చితి మెచ్చి - రూఢీగ వినుమీ - నీ విట్టి యా - రూఢాత గనుమీ॥ 3

తా॥ శిష్యా! ఈ సత్యమైన అచలబోధ కొరకు దేశ దేశములన్నియు తిరిగితిని· అనేకచోట్ల గురుపుత్రులు ఒకరితోనొకరు వాదించుకొను వాదోపవాదములన్నియు వింటిని, గ్రంథములు కొన్ని వ్రాసితిని "మోహక్షయే మోక్షః" అని ఒకరు "తన్నివృత్తో మోక్షః" అని యొకరు శ్రుతులలో తెలుపుట విని, నాకు కలిగిన అనుభవముతో ఆ మోక్షముపైగూడ ఆశను వదలిపెట్టి నిర్భయముగా నిబ్బరముగా కదలకయుంటిని. అటులనే నీవుగూడ అట్టి నిబ్బరముగా గలవాడవై యుండుము. నీవు నాకు చతుర్విద శిశ్రూషలుజేసి నీమీద నాకు దయ పుట్టులాగున మెలిగినందుకు నిన్ను నేను మెచ్చుకొని నీమీద కరుణచే ఈ అచల బోధలోయున్న ధర్మ మర్మము లెల్లయు తెలియపరచితిని గనుక నీవునూ, నా వలనే ఈ బోధయందు అనుభవము కలవాడవై ఆ రూఢతలో యుండవలయునని కోరుచున్నాను.

వి॥ "నమోక్షోనభసః నపాతాలేన, నబసః భూతలే, అజ్ఞాన హృదయ గ్రంథే, ర్నాశో మోక్ష ఇతిస్మృతః"

తా॥ ఆకాశమందు మోక్షములేదు, పాతాళమందు మోక్షము లేదు, భూతలమందు మోక్షములేదు. అజ్ఞానహృదయ గ్రంధి యొక్క నాశనమే మోక్షము అనబడును.

216. కం॥ హటమున కుటిలాత్మునిజం - పుటకై భటకోటి కాజ్ఞ - భూపతి యిడినన్ - భటులటువలె జేసెటి లో - పట కుటిలుడు బడినపాట్లు పాటించి కనునా - అట్లనె గురుని - నోట తా వినెనా - యిటువంటి బోధాను

యెటువంటి నరుడైన - అటు వెనుక తనచేష్ట లెటువంటివో వాట్ని - పాటించి కనునా - అట్లనె గురుని నోట తావినెనా॥ 4

తా॥ శిష్యా! పాపకార్యములు చేయుచున్నవానిని రాజు తెలుసుకొని వాని వలన తన ప్రజలకు అపకారము కలుగుననితలంచి తన భటులను పిలిచి వీనికి శిరచ్ఛేదన చేయుడని ఆజ్ఞాపించగా అతనికి శిరచ్ఛేదన చేసే సమయములోపల తాను చేసిన దుష్ట కార్యములన్నియు గుర్తుకురాక ఇప్పుడు జరగబోవు తన ప్రాణముప్పును గురించే ఆలోచించుచుండును· అటులనే జగత్తులో ఏ మానవుడైనను ముందు తాను యెంతో మంది వేల్పులకు మ్రొక్కి యుండవచ్చును. ఆ వేల్పులను కోరిన వరములిమ్మని అడిగి యుండవచ్చును. యెన్నో క్షేత్రములు తిరుగుటవలన తనకు సిరిసంపదలు కలుగునని ఆ క్షేత్రములకు పోయి వుండ వచ్చును· ఎన్నో నదులలో మునుగుటవలన తనకు పుణ్యమొచ్చునని ఆ నదులలో మునిగి యుండవచ్చును. ఇటుల భ్రాంతితోగూడిన కార్యములు, కర్మలు యెన్ని జేసినవాడై యున్నప్పటికైనా అచల గురుమూర్తి వలన పరిపూర్ణ బోధను యెరిగి అందులో సత్యా సత్యములు తెలిసిన పిమ్మట ముందు తాను జేసియున్న కర్మకాండములన్నియు తలంపుకుగూడ రాక యుండును.

217. కం॥ సకల జనుల సమ్మతిగా - నొకరైనను నడువలేరు-నుర్వీ స్థలిపై - మకరాంక జననిజనకా - ద్య కళంకులలోను నే నీ వననేమి గణనా బోధందితర - జనులేమి గణనా - వికలా మానసుడావై వెతనొందబోకు నీ - వకుటిల భక్తుడవని తెల్పితీబోధ - ననేమి గణనా - బోధందితర - జను లేమి గణనా॥ 5

తా॥ శిష్యా! ఈ లోకములో సకల జనులకు సమ్మతిగా మంచి వాడుగా మెలగవలయుననిన అది ఎవ్వరికి సాధ్యపడే విషయముకాదు· తన నడువడిక ఒకరికి ఇష్టముగా యుండును, మరొకరికి కష్టముగా యుండును. మన్మధుని తల్లియగు లక్ష్మిదేవినిగూడ ఒకరు పూజించుచుందురు, మరియొకరు దూషించు చుందురు మన్మధుని తండ్రియగు విష్ణుదేవునిగూడ ఒకరు స్తుతించుచుందురు, మరొకరు నిందించుచుందురు· అట్టివారినే ఈ మానవులు నిందాస్తుతులు చేయు చుండగా ఇక నీ మాట, నా మాట ఈ లోకమునకు గొప్పగా, మెప్పుగా ఎట్లు కనబడగలదు· అట్లగుటవలన ఈ పరిపూర్ణబోధనుగూడ సుకృతజన్మ పుణ్య

విశేషము గలవారే అర్థము జేసుకొని మెచ్చుకొనుచుందురుగాని, తదితరులకు మాత్రము ఈ బోధ ఇష్టముగా యుండక బాధను కలిగించు చుండును. అంత మాత్రమున నీవు వికలముగల మనసుగలవాడవై, ఈ బోధను జారవిడచుకొని తరువాత కష్టములలో పడబోకుము. అట్టి మాటలకెల్లా మనసివ్వని దృఢప్రజ్ఞ గలవాడవని నీమీద నమ్మకముతో ఈ బోధను నీకు తెలిపితిని గావున దీన్ని నీవు భద్రముగా దాచుకొని బోధలోయున్న గొప్ప తనమును గ్రహించుకొని యుందువేకాని, అల్పుల మాటలకు బలహీనుడవై బంగారము లాంటి ఈ బోధను పాడు చేసుకొనకుము.

వి॥ దారిన పోవుచున్నవానికి సుందరమైన బంగారు వస్తువు కనబడినచో ఆ వస్తువునుజూచి దీనిని ఎంత నేర్పరియైన పనివాడు చేసియుండునో, అతనిని చూచిన బాగుండునని తలంపుగలుగును. అట్లే పరిశుద్ధమైన అచల బోధకులను దర్శించవలయునని సత్యప్రబోధకులు అభిలాష పడుచుందురు.

218. కం॥ బల ధన విద్యలు దుష్టుల -కిల గ్గిన నొరుల నొంతురీర్ష్య మునన్ – బల ధన విద్యలు శిష్టుల – కిల గలిగిన నొరుల బ్రోతు - రెంతో మోదమునా - నీ వీ రెంటి – నెరిగి మోదమునా - కలలోననైన దుష్టులచెంత జేరాకు – మెలమి శిష్టులచెంత – కలనైన వదలాకు – యెంతో మోదమునా నీ వీ రెంటి నెరిగీ మోదమునా॥ 6

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో దుర్జనులుగా యున్నవారికి బలము - ధనము-విద్యయు కలిగిన యెడల ఇతరుల బల ధన విద్యలుజూచి ఓర్వజాలక వారిపై అసూయ, ద్వేషభావము గలవారలై, వారలను ఏ విధముగానైనా, మరలా పైకి లేవనీయక సర్వనాశనము చేయవలయునని ఆలోచించుచుందురు. అదే బలము - ధనము – విద్యయు సజ్జనులకు కలిగెనేని ప్రజలయందు దయ గలిగినవారలై వారికి తగిన మేలును చేయుచు సమయ మొచ్చినపుడు వారికి చేతనైన సహాయము చేయుచుందురు. ఈ రెండు విధముల వారిని నీవు తెలుసు కొని వారిమన స్తత్వములనుగ్రహించుకొని కలలోనైనా దుష్టులచెంత చేరకుము. సజ్జనులను మరచిపోక యుండుము. అటులనే భ్రాంతులతో బాధింపబడే బోధ లను వినబోకుము. ఉన్నది వున్నట్లుగా తెలిపి సంశయములను రహిత పరచి శాంతిని కలుగజేయు పరిపూర్ణబోధను మాత్రము విడువబోకుము.

219. కం॥ అందమగు స్వాతివర్షపు - బిందువు లెందెందు బడునో పృథివిని త - ద్బిందువు లుపాధివశమున - జెందును తగు నామరూప - చేష్టాదికమునూ - అట్లనే నీవు - జెందెదవిన్నియునూ - మందీతో జతగూడి మాట్లాడి నంతాలో - అందూకె సహవాస మరయూము తగుదాన్ని - చేష్టాది కమునూ - అట్లనె నీవు - జెందెదవిన్నియునూ॥ 7

తా॥ శిష్యా! స్వాతికార్తిలో పడిన వర్షపు బిందువులు ఆ యా ఉపాదులను బట్టి రూపనామములు దాల్చుచున్నవి. అది ఎట్లనగా పంట పొలములలో పడిన వర్షబిందువులు ధాన్య రూపములగుచున్నవి. ముత్యపు చిప్పలో బడిన వర్ష బిందువులు మంచి ముత్యములగుచున్నవి. అడవులలోయున్న యేడాకుల అరటి మొగ్గలో పడిన వర్ష బిందువులు పచ్చ కర్పూరమగుచున్నది. చవటినేల మీద పడిన వర్ష బిందువులు ఉప్పు నీరు అగుచున్నది. రేగడి నేలయందు పడిన వర్ష బిందువులు మంచినీరు అగుచున్నది. నీరు ఒక్కటైనను, ఆ యా ఉపాదులనుబట్టి రూప-నామములు దాల్చుచున్నవి. అటులనే నీవుగూడ ఎవరి సహవాసము చేయుదువో "సహవాస దోషే గుణాభవంతు" అన్నట్లు ఆ గుణములు నీకు గలుగును. దుష్టుల సహవాసమున -దుష్ట గుణంబులు కలుగును. సజ్జనుల సహవాసంబున మంచి గుణంబులు కలిగి పది మందిలో నీవు మంచి వాడవని గౌరవించుచుందువు. అందుకని చెడ్డవారి సహవాసము కలలోనైనా చేయక, మంచివారితో సహవాసము చేయుటకు నేర్చుకొనుము. అటులనే బోధలోగూడ తగువైన బోధయేదో తగనిబోధ యేదో నిశ్చయించుకొని తగువైన సహవాసము చేయుచుండుము.

220. కం॥ జారులకు లోకులందరు - జారులవలె తోచబడుట సహజ గుణంబౌ - చోరులకు సకల జనములు - చోరకులని మదికి దోచుచునికీ సహజమురా - అట్లనె - దుష్టాత్మునికీ సహజమురా - సారాములేని సం-సారాబ్ధి దాటించు వారీని తమవంటి వారీగ గనుటట్టి - వునికీ సహజమురా అట్లనె దుష్టాత్మునికి సహజమురా॥ 8

తా॥ శిష్యా! ఈ లోకములో జారులుగా యున్నవారు ఇతరులను గూడ తమవంటి జారులుగానే భావింపుచుందురు. చోరులుగా యున్నవారు యెదుటి వారినిగూడ చోరులుగానే తలంచుచుందురు. దుర్మార్గులుగా యున్నవారు సర్వులను దుర్మార్గులనియే బుద్ధికి తీసుకొనుచుందురు. వారి వారి స్వభావముల

కొలది మంచివారినిగూడ చెడ్డవారుగానే చూచుచుందురు. అటులనే ఏ దాని చేతను దాట సాధ్యముకాని భవ దుఃఖసాగరమును దాటించి నిర్మల చిత్తునిగా జేసి స్వస్థతను చేకూర్చెడి మహానుభావులైన పెద్దలనుగూడ ఈ పాపిష్టి మానవులు తమవంటి వారుగానే భావించి వారిపై అనేక విధములైన అపనిందలు వేయుచు నోటికొచ్చినట్లు దూషించుచుందురు.

భద్రాద్ర్యంకితం పదమూడవ అధ్యాయం సమాప్తము.



## - 14 గురుని లక్షణం 11 -

221. కం॥ బయలెరుకలు శిష్యునకున్ – దయతో గురుడెరుక జేసి తరువాతను సం– దియ మేమిలేక యెరుకన్ నయమున విడిపించు గురుడు – నయశాలిగాదా – నీ మదికిది – నాటెనలేదా – భయభక్తి గురుసార్వభౌమూని సేవ – నిశ్చయమూగ జేసితె – జయమందెదో గురుడు – నయశాలిగాదా – నీమదికిది – నాటెనలేదా॥ 1

తా॥ శిష్యా! అనేక భ్రాంతులలో అనేక సంశయాలలో నిజమనేది తెలియక దేవుడెవరో కానక కనబడిన, ప్రతిమలనెల్లయు దైవమని నమ్మి చీకాకు పడుచున్న శిష్యుని, గురువు దగ్గరకు తీసుకొని వానిలోయున్న శంఖలెల్లయు మొదలంటూ లేక పెకలించివేసి తదుపరి సత్యమైన పరిపూర్ణదేవుని స్పష్టముగ నెరిగించి యెరుకతోగూడిన మాయా జాలములనెల్లయు విశదముగా లేనివని రూఢీపరచి యే సంశయములు కలుగక ఉపమాన ఉపమేయములతో ఆ యెరుకను లేనిదిగా చేయడమేగాక మరలా యేనాడైనా ఆ యెరుకను పుట్టకుండా జేసిన సద్గురుమూర్తి యెంతటివాడై యుండునో ఆయనలో యున్న సుగుణ మెంతటిదో, నీకు బాగా తెలిసిందికదా! ఆ విషయము నీ మనసుకు కూడ వచ్చిందికదా! అట్టి దేశిక చక్రవర్తిని యేనాడు మరువక అతనియందు ప్రేమ, భక్తి, విశ్వాసము కలిగి అనవరతము గురుసేవలు సలుపుచు కాలము గడిపితి వేని ఇక నీ కెప్పుడు జయముకలిగి మునుపటి యెరుక భ్రాంతులలో మునగక యుందువని తెలుపుచున్నాను.

222. కం॥ పదిరెండక్షరములుగల—సదమల మంత్రార్థమెరిగి సద్గురు కృపచే – పదియారక్షరములుగల – యది యెట్టిదో తెలిసెనేని - యతడె సద్గురుడూ – యివి రెండెరుగ – నతడేడి గురుడూ-మొదటిది పరిపూర్ణమును దెల్పు నెరుకాను - తదనంతరపుది బోధనుజేయునివి దెలిసి – నతడె సద్గురుడూ – యివి రెండెరుగనతడేడి గురుడూ॥ 2

తా॥ శిష్యా! ఈ అచలబోధకు మంత్రత్రయమనేది ముఖ్యముగా పెద్దలచే పాటించబడి సాంప్రదాయ పద్ధతిగా యున్నది. ఈ మంత్రత్రయములో పదిరెండు అక్షరములుగల ద్వాదశాక్షరి మహా మంత్రముయొక్క స్వష్టతను తెలియపరచి తరువాత పది ఆరు అక్షరములుగల షోఢశాక్షరి మహా మంత్రము యొక్క లేమిని స్థిరపరచినవారే సద్గురువులు పూర్ణగురువులని తెలుపబడును. ఈ రెండు మంత్రములయొక్క రహస్యములను తెలియనివారు అచల గురువు కాజాలరు. మొదటిదైన ద్వాదశాక్షరి మహా మంత్రము అచల పరిపూర్ణమును జూపించి దృఢముచేయును. రెండవదియైన షోఢశాక్షరి మహామంత్రము ఎరుక యొక్క ఉనికిని తెలిపి యెరుకను లేకుండాచేయును. ఈ రెంటి ధర్మములను యెరిగించి వున్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా శిష్యునకు దృఢముచేసి సంశయము గలుగక జేసినవాడే నిజగురువు-సద్గురువని తెలుపబడును.

223. కం॥ ఆమంత్ర యుగముదెల్పెద - నేమముతోదలపు ముత్తదీ బట్టబయల్ – యేమీలేదని పల్కిన - యీ మంత్రమె ద్వాదశాక్ష – రింకోటి వినుమీ – యెప్పుడు నోట - యివి మరువకనుమీ – ఈ మూలంలేని గుర్తెరిగె శరీరాము యేమీలేదని యంటె – యిదె షోఢశాక్షరి-యింకోట వినుమీ యెప్పుడు నోట – యివి మరువకనుమీ॥ 3

తా॥ శిష్యా! ఈ రెండు మంత్రములయొక్క అభిప్రాయము నీకు విశదముగా తెలియపరిచెదను శ్రద్ధతో ఆలకించుము. ఈ బట్టబయలుతప్ప మరేమి లేదని గట్టిగా స్థిరపరచునది మొదటిదైన ద్వాదశాక్షరి మహామంత్రముయొక్క అభిప్రాయమని తెలియుము. మూలములేని ఈ గుర్తెరిగే శరీరమేమి లేదని తెలుపునది. రెండవదియైన షోఢశాక్షరి మహామంత్రముయొక్క అభిప్రాయమని తెలుయుము. ఈ మంత్రములను నీ వెప్పుడు మరువక, నీ నోటినుండి స్మరింపు చుండవలయును. యెందుకనగా ఈ యెరుక లేకనే యుండినట్లుగా కనబడుచు

అనేక భ్రాంతులకు కారణమైయున్నది. దీనిని విచారించిన ఎడల దీనికి మొదలు అనునది యెక్కడను ఆధారము కనబడక యుండినందువలన ఈ లేని యెరుక కల్పనలపై యే మాత్రము భ్రాంతిలేక యుండవలయుననియు, పరిపూర్ణము మాత్రము అన్ని కాలములయందు కనబడుచు, శాశ్వతముగ యున్నదనియు, అట్టి దానిలో ఈ యెరుక యెన్నడూ కనబడుటలేదని దృఢ నిశ్చయము గలిగి యుండుట కొరకు, ఈ యెరుక చేష్టలుజూచి మోసపోక యుండుట కొరకు ఈ మంత్రముల రెండును యేమారక సదా జపించుచుండవలెను.

224. కం॥ తొలుమంత్రపర్థమెక్కడ – కలదోయని వెతుకనేల కలదంతట యావ-లి మంత్రపర్థమెక్కడ – గలదోయని చూడనేల – కాదా చూచేదీ వినేది యనేది తినేది – అలతో ల్తదాన్ని నీ వవలోకనముజేసి – కలకాల మెరు కాలుగల దాన్నివిడు వెరుక – గాదా చూచేదీ - వినేది యనేది తినేది॥ 4

తా॥ శిష్యా! తొలి మంత్రమగు ద్వాదశాక్షరి మహా మంత్రముయొక్క అర్థముగాని, ఆ నిరూపణగాని యెక్కడనో యే లోకములోనో యున్నదని యెతుకవలసిన పనిలేదు. అయ్యది నీ ముందు నీ వెనుక దశదిశలయందు నిండి సూదికొన మోపను సందులేక సర్వత్రా వ్యాపించి శాశ్వతముగా ఉన్నదని తెలుసుకొనుము. రెండవ మంత్రమైన షోఢశాక్షరి మహా మంత్రము అర్థముగాని, ఆ నిరూపణగాని యెచ్చట యున్నదో అని ఆలోచించ పనిలేదు. అది యేదనగా చూస్తూ యుండేది అదే, చేస్తూ యుండేది అదే, వింటూ యుండేది అదే, తింటూ యుండేది అదే, ఆనందపడేది అదే, దుఃఖపడేది అదే. ఇట్లు అన్ని చేయుచు ఈ స్థూల శరీరమునందుయుండి సమస్తమును గుర్తించుచు నేను, నేను అని యేది అనుచున్నదో, ఆ యెరుకయేనని తెలియుము. ఇట్లు ఈ రెంటిని గుర్తించుకొని మొదటి మంత్రార్థమైన బట్టబయలును నిలుపుకొని లేకనే కనపడుచు అనేక అనర్థాలకు కారణమైన ఈ గుర్తెరిగే శరీరమను షోఢశాక్షరిపై యే భ్రాంతి లేక యుండుమని తెలుపడమే ఈ మంత్రములలోగల అభిప్రాయమని తెలియవలయును.

225. కం॥ ఇదిదప్ప యేమిలేదని – మొదటిది మొరబెట్టుచుండు ముదమున వినుమా – యిది యేమిలేదు-పొమ్మని – వదలక రెండోది లెస్స వదరూచుండునురా – బయలెరుకాల నిది నిశ్చయమురా – అదిగాన నీరెంటి

నరసి నీ విప్పాడు – విదితాముగా రెంట్ని – విడరా మంత్రములిట్లు-వదరూ చుండునురా – బయలెరుకాల – నిది నిశ్చయమురా॥ 5

తా॥ శిష్యా! ఈ రెండు మంత్రములలోవున్న అభిప్రాయమును బాగుగా ఆలోచించుచుండిన యెడల యెన్ని శాస్త్రములు అధ్యయనము చేసినా, యెన్ని యోగాలు సల్పినా, యెన్ని సాధనలు చేసినా చివరకు సత్యముగా నిలబడేది ఆ బట్టబయలేననియు, అంతకు మినహా యేమి లేదనియు మొదటి మంత్రమైన ద్వాదశాక్షరి యెలుగెత్తి పలుకుచున్నది. ఈ యెరుకగాని, యెరుకచేసిన కల్పనలుగాని, ఆ కల్పనలమీద యున్న నమ్మకముగాని అంతా భ్రాంతియే తప్ప, యేమి లేదని స్పష్టముగా రెండవ మంత్రమైన షోడశాక్షరి పదే పదే నిలుపుచు అలుపులేక గట్టిగా తెలుపుచున్న ఇట్లు ఈ మంత్రములు తెలుపు అభిప్రాయములు శ్రద్ధతో ఆలకించి అచల పరిపూర్ణ పరబయలునందు మూలము లేకనే కనబడుచున్న యెరుకయొక్క వస్తు నిర్ణయము, పరిపూర్ణముయొక్క సత్య నిర్ణయము ఈ రెంటిని యే యెరుక యెరుగుచున్నదో ఆ యెరుకను విడచి పెట్టవలయునని, ఇదియే సరియైన మార్గమని ఈ మంత్రములు తెలుపుచుందురు.

226. కం॥ పరిపూర్ణమిదుగో యిదుగో – యెరుకని చూపించి లేని – యెరుకను లేందం – చెరిగించిన గురుడేసరి – యెరుకను నిర్వేటిగురుడు – యెందూకోయన్నా – తద్బోధ – నీకెందుకోయన్నా – శరణన్నవారి మస్తకమందు చెయిబెట్టి – తిరమూగ యెరుకాను తీసివెయ్యనివాడు - ఎందూకోయన్నా తద్బోధ నీ – కెందుకోయన్నా॥ 6

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధ ఇతర బోధలవలె నుండక ప్రత్యక్ష ప్రమాణములతో గూడి యుండును. అట్టి పూర్ణబోధను కోరి వచ్చిన శిష్యుని గురుమూర్తి దగ్గరకు తీసుకొని ఆదరముతో పరిపూర్ణము ఇదిగో ఇదిగోనని స్పష్టముగా చేయి సంజ్ఞతో చూపించి ఏ కొరతలు గలుగక అతనికి రూఢి పరచి ఆ తరువాత యెరుకయొక్క మూల రహస్యమునెల్ల తేట తెల్లముగా తెలియపరచి లేని యెరుకను లేకుండా జేసినవాడే సద్గురువని తెలుపవలయును. ఎరుకను పరిపూర్ణమని తెలుపుచున్న గురువు యెన్నటికిని గురువు కాజాలడు. అట్టివారు తెలిపే బోధలు నిలకడలేని చీకాకు బోధలేగాని, తరింపజేసే బోధలు కాజాలవు. యెరుక భ్రాంతులలో స్థిమితములేక నలిగిపోతూ నీవే శరణ్యమని

ఆశ్రయించిన శిష్యుని శిరముపై తనచేయి యుంచి ముమ్మాటికి ఈ యెరుకలేనే లేదని గట్టిగా దృఢపరచి ఆ యెరుకను తీసి వేసినవారే అచల గురువులుగాని, యెరుకను నిలుపుచు నీవే పరిపూర్ణమగుదువని తెలిపే గురువులను గురువులని అనగూడదు. అట్టివారి దగ్గరకు కూడ చేరక ఆ బోధలను వినకుండా యుండ వలయును.

227. కం॥ పరిపూర్ణబోధ నెరిగిన - గురువరుచే బోధగొన్న గొప్ప ఫలంబౌ - పరిపూర్ణబోధ నెరుగని - గురువరుచే బోధగొన్న - గొప్పాఫల మౌనా - అదియెట్లన్న కూడిరతిలోనా-పురుషూనిచే సంతు పొలతి బడయును బడయ - తరమౌన వారికె - తమవంటి వారిచె - గొప్పాఫలమౌనా - అది యెట్లన్న - కూడిరతిలోనా॥ 7

తా॥ శిష్యా! స్వచ్ఛందమైన ఈ పరిపూర్ణ బోధను పొందవలయునని అపేక్ష గలిగినవారు ఆ బోధ తెలిసిన గురుస్వామిని స్థిమితముగా విచారించి వారిచేత ఏ సంశయము లేక ఈ అచలబోధను గట్టిగా ప్రాప్తింప జేసుకొన్న యెడల ఏ భ్రాంతులు, ఏ కొరతలు పుట్టని సుస్థిరమైన శాంతితో గూడిన గొప్ప ఫలము లభించునేగాని ఆ బోధ ధర్మములు తెలియక యెరుక భ్రాంతులుగల అల్ప గురువులను ఆశ్రయించిననూ వారి బోధలు వినిననూ ఉపాది గతమగు భ్రాంతులు, శంఖలు తీరక యెరుక అనే రక్కసి కోరలలో నలిగి చూర్ణమగు చుండవలయునుగాని నిబ్బరమైన సుఖ జీవితము అనుభవ ప్రాప్తి కలుగక యుండును. అది యెట్లనిన స్త్రీకి సంతాన ప్రాప్తి కలగుటకు తగువైన పురుషు నితో రతి సల్పిన యెడల తాను కోరిన సంతానప్రాప్తి కలుగునుగాని, అట్లుగాక తనతో సమానమైన స్త్రీతో యెంత కాలము యుండినను సంతానము కలుగక యుండునట్లు జనన మరణములు లేని పరిపూర్ణ బావస్తుల సాంగత్యము వలన తాను జనన మరణములు లేని వాడగునుగాని, జనన మరణములు కలిగిన "అయమాత్మ" బ్రహ్మమను ఎరుక భ్రాంతిగలవారి సాంగత్యము చేసిన ఎడల తానును జనన మరణములు కగిలిన వాడనియే తలంచవలయును.

వి॥ లోకములో కొంతమంది వ్యాపార పద్ధతిగా మేము అచల గురువు లము, పరిపూర్ణ గురువులమని తెలుపుచు మావలన ఉపదేశములు పొందమని కనబడిన మనిషినంతా ప్రాధేయబడుచుందురు. కొన్ని ఆశ్రమములయందును

మఠములయందును, ముఖద్వారములపైన పూర్ణాశ్రమమని, అచలాశ్రమమని బోర్డులు వ్రాసి పెట్టుకొని యుందురు. అట్టివారి బోధలలో అద్వైతబోధవరకే చోటు జేసుకొని యుండునుగాని పరిపూర్ణబోధ వారి దగ్గర లేశమైనా కనబడక యుండును.

228. కం॥ పరిపూర్ణబోధ నెరుగని - గురుశిష్యులు బోధ కొరకు కోర పనిబడున్ - గురువర్యు నొకని మరలను - హరువరమున బుట్టినట్టి - యా శిఖండకినీ - భార్యైనట్టి - యబల తండ్రికినీ - వరుల నిద్దరిని దేవలె నీ - యల్లుడు నేను - వరియింతుమని చెప్ప -వనిత సంపినయట్ల - యా శిఖండి కినీ - భార్యైనట్టి - యబలా తంౖడికినీ॥ 8

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో యేమి తెలియనివారుగూడ అచల గురువులమని పేరు పెట్టుకొని, వారికి తగిన శిష్యులనుగూడ సంపాదించుకొని పది మందిలో గురుశిష్యులుగా చలామణి అగుచుందురు. ఈ ఇద్దరికి అచలబోధలో యున్న గూఢార్థములు తెలియక పోవుటవలన వారికి భ్రాంతిరహితముగాక, వస్తు నిరూపణలేక, సంశయములు తీరక సతమతమగుచు అడిగిన వారికిగూడ సమాధానము చెప్పలేక, లోలోన ఆలోచించుచు ఇక ఏ గత్యంతరములేక ఒక నాడు ఈ గురుశిష్యులు ఇద్దరూ కలసి మరియొక పరిపూర్ణబోధ గురువును వెతుకవలసినపని ఏర్పడును. అది ఎట్లున్నదనిన ఈశ్వరుని వరముచేత పుట్టిన నపుంసకుడైన శిఖండికి కాశీరాజు కుమార్తెను ఇచ్చి వివాహముచేయగా అమె తన భర్తయొక్క విషయము తెలుసుకొని తన తండ్రికి వుత్తరములో నాకు వక మగడు, నీ అల్లునికి వక మగడు ఇద్దరు మగళ్ళను చూచి పెట్టమని దాసి మనిషిచేత జాబు వ్రాసి పంపించినట్లుగ పరిపూర్ణబోధ నెరుగని గురు శిష్యులిద్దరికి మరలా ఒక అచలబోధ గురువు కావలసియుండును.

229. కం॥ దృష్టాంత మెరుక కేదని - యోష్టము గదిలించగానె యొరులు కలనుచున్ - దార్ష్టాంత మడుగ బోధకు - స్పష్టముగా - కర్పూరము - దీపము జూపవోయీ -యీ యుక్తి లో -పము జేయకోయీ తుష్టినొందెదరిట్లు తోచి చెప్పితివేని - శ్రేష్ఠామౌ యీబోధ చేకొన్నవారు - దీపము జూపవోయీ యీ యుక్తి లోపము జేయకోయీ॥ 9

తా॥ శిష్యా! ఈ యెరుక పరిపూర్ణముల రెండు విషయములలో యెరుక లేనిదనియు, ఉన్నది పరిపూర్ణమేననియు నీకు దృఢముగా తెలియపరచినాను.

నీవుగూడ అటులనే ఎరిగియుంటివి. ఒకనాడు ఈ బోధను ఇతరులకు తెలియ పరచే సమయములో బ్రహ్మాండ భాండములుగా ప్రత్యక్షముగా కనబడుచున్న యెరుకను లేనిదని తెలుపుము. నీవు అటుల తెలుపుచుండిన యెడల ఈ కన బడుచున్న జగత్తు లేనిదనుటకు ఆధారమేమని వారు నిన్ను అడుగుదురు. ఇది అంతా స్వప్నముతో సమానమని దెలుపుము. దీనికి దృష్టాంతమేమని మరలా నిన్ను అడుగుదురు. అప్పుడు కర్పూరదీపము నంటించి అచ్చట కర్పూర దీప ములు రెండూ వెలుగుచున్న విధానము, మరలా అవి రెండు రహితపడు విధా నము విమర్శచేయుచు ఈ యుక్తి వారికి బాగుగా దృఢపడేటట్లు విశదముగా తెలియపరచిన యెడల వారు సంతోషపడి నిన్నును, నీ విద్యను గౌరవింతురు. ఇంతటి నిస్సంశయమైన పరిపూర్ణబోధను పొందుటకు అపేక్షగలిగిన శిష్యులకు దృష్టాంత, ద్రాష్టాంతకముల జూపించి పరిపూర్ణ ఎరుకను బుద్ధికి వచ్చేటట్లుగా విడదీసి, ఆశ్రయించిన వారిని సంతృప్తులనుజేసి పంపుచుండవలయును,

230 కం॥ యెరుక భ్రమగల్గు శిష్యుని - పరితాపము మాన్పినట్టి పండితు డెతడో - గురుడతడె కాని గురువులె - గురువులమని - పొట్టకొరకు గొలిగెవారెల్లా - వారికీబోధ - తెలియూట కల్లా - పరిపూర్ణమునులేని యెరుకా నేర్పడ దెల్పి - యెరుకాను విడిపించ నెరుగాక - గురువులై గొలిగెవారెల్లా- వారికీబోధ - తెలియూట కల్లా॥ 10

తా॥ శిష్యా! అనేక యెరుక భ్రాంతులలో చిక్కుకొని పడరాని బాధలు పడుచు స్థిమితములేక పరితపించుచున్న శిష్యుని పరితాపముజూచి, ఆ పరితాపము నంతయుమాన్పి సంతోషమును కలుగజేయు సద్గురువే సమర్థవంతమైన సద్గురు వని తెలుపవచ్చునుగాని, పొట్టకూటికై ఈ విద్య భద్రత తెలియక గురువుల మని చెప్పుకొనుచు, కనబడినవారికెల్ల ఉపదేశాలిచ్చెదమని భంగపడుచు, కాసుల కొరకై ఇల్లు ఇల్లు తిరుగుచు ధనపీడితులైన గురువులు గురువులు కాజాలరు. అట్టివారు ఈ పవిత్రమైన అచలబోధ ధర్మములెన్నడు వినగలిగి యుండరు. పరిపూర్ణమనగా నెట్టిదో, యెరుకనగా నెట్టిదో ఈ రెంటిని వేరు వేరుగా విమ ర్శించి పరిపూర్ణమును నిలిపి యెరుకను తీసివేసే పద్ధతిని యెవరు యెరిగి యుం దురో వారే పరిపూర్ణబోధ గురువులని చెప్పవచ్చునుగాని, యెరుకను పోగొట్టు టకు చేతగాక యెరుకను నిలిపే గురువులు యెన్నటికిని గురువులు కాజాలరు. వారికీబోధ మర్మముగూడ తెలియక యుండును.

231. కం॥ గురు శుశ్రూష నొనర్చుట - మెరిగించెద నెట్లననిన యేర్పడ వినుమా - నరులిష్టదైవములకున్ - పరిచర్య యొనర్చు నట్లు భ - క్తీతోడు తనూ గురుమూర్తి క - త్యు క్తితోడుతనూ - నిరతా మరమరలేక నీవు సల్పితివేని - గురుబోధ మరుగు సద్గురునీ - చె దెలిసేవు - భక్తితోడుతనూ గురుమూర్తి క - త్యు క్తితోడుతనూ॥ 11

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణ బోధలోయున్న గుహ్యాతి గుహ్యమైన గూఢార్థములు తెలుయుటకుగాను గురుదేవుడు తనహృదయమును శిష్యునకు నివ్వనిదే ఆ ధర్మ మర్మములు విప్పబడవు. ఆ హృదయము శిష్యునకివ్వుటకు గురువును ప్రసన్నహృదయునిగా చేసుకోవలయును. ఆ దయ నీమీద కలుగుటకు లోకములో జనులు తమ ఇష్టదైవములను యేలాగున భక్తి శ్రద్ధలతో పూజలు చేయుచుందురో అటులనే సద్గురుమూర్తికిగూడ చతుర్విధ షోఢశోపచార పూజలు చేయుచు, నిరంతరము భక్తి శ్రద్ధలతో గురుధ్యాన పరుడవై యుండ వలయును. ప్రపంచములో శైవ మతస్థులుగాయున్న శివభక్తులు వారి ఇష్టదైవమైన శివుని భక్తిశ్రద్ధలతో ఉపాసించుచుందురు. వైష్ణవమతస్థులు, వారి ఇష్టదైవమైన విష్ణువును భక్తిశ్రద్ధలతో ధ్యానించు చుందురు. అదే విధముగ గురుభక్తులుగూడ తమ ఇష్ట దైవమైన గురుదేవునియందు భక్తి శ్రద్ధలు గలిగి గురునిష్ట, గురుసేవ, గురుభక్తిని యెదలో నిలుపుకొని అనుక్షణము ఆచరణ పద్ధతిగా మెలగుచుండిన ఎడల ఆ గురువుకు నీమీద కరుణకలిగి తాను హృదయములో దాచుకొనియున్న పరిపూర్ణబోధ కలిగిన హృదయ సంచిని నీ ముందరబెట్టి నీకు యే కొరతలు కలుగక బోధజేయుచు కృతార్థునిజేసిపంపును.

గురుని లక్షణం పదునాలుగవ అధ్యాయం సమాప్తము.



## - 15 శిష్యుని లక్షణం 16 -

232. కం॥ తను మన ధనములు గురునకు - వినయంబున ధారబోసి వేడ్క గురునిచే - అనువైన బోధబడసిన - ఘన మతిమంతునకు సాటి - గలదా యీ భువినీ - లోకులు మ్రొక్క - వలదాచౌల వినీ - తన నితరులనె

తా ననక యేమాటను - వినక పరిపూర్ణతదనరు వానికి సాటిగలదా యీ భువినీ - లోకులు మ్రొక్క - వలదా చొలవినీ॥ 1

తా॥ శిష్యా! మానవునకు ఏ తను మన ధనములపైయున్న వ్యామోహము చేత అనేక దుఃఖములలోబడి కుమిలిపోవుచు ఒక కనురెప్పపాటైన శాంతి లేక కర్మపాశములలోబడి చితికి పోవుచున్నాడో, ఆ తనువుపైనున్న అపేక్షను, ఆ మనసుపైయున్న అపేక్షను, ఆ ధనముపైనున్న అపేక్షను ఈ మూడు అపేక్షలను త్రికరణశుద్ధితో గురుమూర్తికి సమర్పించి ఆ మూడు తనవద్ద లేకుండా జేసుకొనిన యెడల వానిలోయున్న మనోవికారములైన పరితాపములెల్లయు చల్లబడి నిర్మలత్వము ప్రాప్తించి గురువు దెలుపు జనన - మరణ రహితమగు పరిపూర్ణబోధమీద నిలకడ కలుగుచు, ఇక ఉన్న సత్యమును విమర్శించుకొను ప్రజ్ఞగలవాడై యుండును. అట్టివానికి తన ఇంద్రియాదులెల్లయు మునుపటివలె పరుగులెత్తక స్వాధీనపడియుండును. అతనిలో నీవని—నేనని, పరులని, భేద భావములుండక నిశ్చల స్థితిలో నిరహంకారుడై యుండుటవలన పదుగురు వానిలోయున్న సుగుణములనుజూచి ఉత్తముడని చేతులెత్తి మ్రొక్కుచుందురు. అట్టివానితో సమానమైనవారు ఈ భూమిమీద ఎవ్వరు యుండబోరని తలంచ వలయును.

233. కం॥ జలము నెడబాయ నోల్లని - జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై - నిలిపి తరము మాని - గురువునే కొల్చుసుమ్మా - తదుక్తూల - నే తల్చునమ్మా - కలకాల మీరీతిగడుపూచు న్రెప్పొద్దు తలిదండ్రి దొరదాత దైవమనుచు గురువు - నే కొల్చుసుమ్మా - తదుక్తూల నేతల్చునమ్మా 2

తా॥ శిష్యా! జలమును వదలిపెట్టి జలచరములు యెట్లు యుండలేవో, ఆ తీరుగనే, సచ్ఛిష్యుడుగా యున్నవాడు తనగురువును వదలిపెట్టి తానుగూడ యుండలేక యుండును. యెందువల్లననిన యెంతోకాలము మొదలుకొని తాత ముత్తాతల నుండి ఒకరినుండి వకరికి వెంటాడుచు వచ్చుచున్న యే భ్రాంతి జ్ఞానమున్నదో, ఆ భ్రాంతి జ్ఞానమును సమూలముగా నిర్మూలముజేసి సత్యమైన జ్ఞానము ప్రతిష్ఠంపజేసి యే భాదలు లేకుండ జ్ఞానోదయము కలిగించిన ఆ సద్గురుమూర్తిని ఒక క్షణమైనను విడిచిపెట్టియుండుటకు ఆ శిష్యునికి మనసు సమ్మతించక ఆ యెడబాటుకు ఓర్చుకోలేక అన్నివేళల ఆ గురుదేవుని తన

హృదయపీఠమున నిలుపుకొని సదా ధ్యానించుచు, యే ఆలోచనలులేక సర్వ చింతలుమాని తనకు గురువు ముందు తెలిపియుండిన యుక్తులను, ధర్మములను, మర్మములను, మాటి మాటికి తలంచుకొనుచు ఆ బోధలో ఆరూఢతగలిగి సంతసించుచు ఆ సద్గురువును తల్లిగాను, తండ్రిగాను, ప్రభువుగాను, దైవము గాను భావించుచు తాను బ్రతికినన్ని దినాలు ఆ గురుదేవుని గాఢమైన భక్తిచే తనయెదలో నిలుపుకొనియుండును.

234. కం॥ సతి పొరుగూరికి బోయిన - పతి రాకడ కోరినట్లు భావము లోనన్ మతిమంతుడు సచ్ఛిష్యుడు - సతతము గురురాకగోరు - సత్యము వినరా వానితోటి – సాటెవ్వరనరా -- హితుని రాకడను స్నేహితుడు గోరినయట్లు – అతి దరిద్రుడు ద్రవ్యతతి రాగోరినయట్లు – సత్యాము వినరా - వానితోటి – సాటెవ్వరనరా॥ 3

తా॥ శిష్యా! పొరుగూరికి పోయిన తనభర్త యెప్పుడు వచ్చునాయని ఉత్తమమైన ఇల్లాలు దారి కాచుకొని చూస్తూ యుండినట్లుగను, తన మేలును గోరు స్నేహితుడు యెప్పుడు వచ్చునాయని హితుడు స్నేహితునికొరకు ఎదురు చూస్తూ యుండినట్లుగనూ, అతి కష్టములతో దరిద్రబాధను అనుభవించువాడు ఆ దరిద్రముపోయి ధనము యెప్పుడు వచ్చునాయని ఆ ధనముకొరకు ఎదురు చూచినట్లుగను, బుద్ధిమంతుడైన శిష్యుడుగూడ తనగురువు ఎప్పుడు కనపడునా యెప్పుడు వచ్చునాయని వారికొరకు ఎదురుచూచుచు, దారికాచుకొని యుండును. ఇట్లు చూచుట నిజమైన భక్తునిలోగలిగే ఆరాటమని తెలియవలెను. అట్లు గురు భక్తి గలిగినవారితో సాటియైనవారు మరి యెవ్వరు ఈ లోకమున యుండ బోరని తలంచుము.

235. కం॥ అతివల రతి చతురతలా - యతివలచే వారితండ్రులరయ రనుచు త - త్పతులరయరె రతి నట్లనె – మతిమంతుడు గురుడుబోధ - మానీనగాని - తద్బోధ తా – మానాడు పూనీ అతి దరిద్రునిచె విద్యార్జించిన నతగాడు – చతురుడై విత్తామార్జనజేయు పంతూలు – మానీనగానీ - తద్బోధ తా - మానాడుపూనీ॥ 4

తా॥ శిష్యా! అతివలు తలిదండ్రులకు వయసుమీరి ముసలివారై, రతి యందు వారికి ఇచ్ఛతగ్గి సంభోగ విషయం మానుకొనియున్నను, ఆ అతివలు

వయసు గలిగిన వారగుటవలన వారు సంభోగమును మానుకొనక, వారి భర్త లతో ఆనందపడుచు ఆ సంతోషము మాటి మాటికి తలంచుకొనుచుందురు. మరియు అతి దరిద్రుడైన బడిపంతులు దగ్గర విద్య నేర్చుకొనిన విద్యార్థి తన చాతుర్యముచేత విద్యను పెంచుకొని ధనవంతుడైనను, తనకు విద్య దెలిపిన బడిపంతులు ముసలివాడై విద్యను తెలుపలేక యెచ్చటనో దూరదేశములో యున్నను, ఆ విద్యార్థి తనకు విద్య తెలిపిన ముసలి బడిపంతులను మరువక మాటి మాటికి తలంచు కొనుచుండును. అటులనె నీతిశాలియైన గురుపుత్రుడు తన గురువు పరిపూర్ణబోధను తెలిపి ముసలివాడై యిక బోధను తెలుపలేక మరియొక వూరికిపోయి దూరస్తుడుగాయున్నను ఆయన దెలిపిన బోధను అతడు మరి యొకరికి బోధించుచు, ఆ తృప్తిని పొందుచు, ఆ విద్యను పెంచు కొనుచు మాటి మాటికి తన గురువును తలంచుకొనుచుండును.

236. కం॥ పరిపూర్ణబోధ దెల్పే – పరియంతము సేవజేసి బహు నమ్మికగా – గురుమూర్తికి తరువాతను – మరి కన్నుల గననివాని మార్గాముఛీఛీ- తలచరాదామాట ఛీఛీఛీ – గురువాజ్ఞ యివనీదె గురువై శిష్యుని గూర్చి – గురుబొధ దెల్పెటి గురువంచకునియొక్క – మార్గాముఛీఛీ – తలుచరా దామాట ఛీఛీఛీ॥ 5

తా॥ శిష్యా! పరిపూర్ణము అనగా నెట్టిదో దానిని గురువు వలన యెరుగ వలయునని ఆ గురువునకు ఎంతో భక్తి యున్నవానివలె పరిచర్యలు చేయుచు, నక్క వినయములతో వర్తించుచు, తన సర్వస్వము గురువుకు అర్పించినటుల మెప్పించుచు, ఒకనాడు ఆ గురుదేవుని వలన పరిపూర్ణ సూచనను పొంది తరువాత ఆ గురువు యెక్కడ యున్నాడో, ఆ గురుస్థానమెక్కడ యున్నదో, అని కూడ తలంచక, ఒకవేళ ఆ గురువు తనకు కనుపించినను నమస్కారమైనా చేయక మొగము త్రిప్పుకొని దూరముగా పోవు వంచకుని యొక్క ప్రవర్తన మంచిదికాదు. ఛీ-ఛీ అట్టివాని ప్రక్కనగూడ యుండకూడదు. అదీగాక గురువు తృప్తితో ఇక నీవు శిష్యులను చేసుకొనవచ్చునని అనుమతి ఇవ్వనిదే, వారివలన తాను ఆ అధికారము పొందనిదే గురువుకు తెలియకనే శిష్యులను చేసుకొనుచు, ఉపదేశాలిచ్చుచు నేను గురువునైతినని తెలిపేవాని దుర్బుద్ధి ఎంతటిదో ఆలోచించి ఆ పరమ నీచుని మొగము చూచుటగూడ మహాదోషమని వానిని చూపులోనికిగూడ రానివ్వక యుండడము మంచిదిగా యుండును.

237. కం॥ తనశిష్యులు విని తన నతి – వినయంబున గొల్చుకొరకు వినుతి యొనర్చు – తన గురువును గురుడింటికి – జనుదెంచిన జూచి – శిశ్రూష నొనర్చకుండా – లేమినిదెల్పి – చనుమనుచుండా – వినుము కుచ్ఛిత శిష్యాగ్రణి వీడు వీడెట్లు – ఘనబోధో క్త స్థితిగనునా గురునకు – శిశ్రూష నొనర్చకుండా – లేమినిదెల్పి – చనుమనుచుండా॥ 6

తా॥ శిష్యా! కొంతమంది గురువులు తమశిష్యులకు బోధను తెలుపుచు గురుధర్మములను దెలుపుసమయ మొచ్చినప్పుడు తాను ముందు గురువుపట్ల జూపినభ క్తిని వివరించుచు నేను, గురువును సర్వస్వముగా భావించినాననియు, సర్వదేవతలను ఆయనలో చూచినాననియు, తను మనధనములర్పించి చతుర్విధ శుశ్రూషలు చేసినాననియు, ఆయన నాదగ్గర యెంతకాలముండినను యేలోటు చేయక అన్ని జరిపినాననియు, ఆయనను విడిచియుండుటకు మనసు ఇష్టపడేది కాదనియు, అట్లు నాగురువుకు సేవలుచేసి ఈ విద్యను పొందినానని శిష్యులకు తెలుపుచుండును. ఒకనాడు ఆయన గురువు ఆయన ఇంటికి వచ్చినప్పుడు ఆ గురువుతో మనసిచ్చియైన మాట్లాడక, నమస్కారమైనా చేయక, నీవు భోజనము చేసి వచ్చితివా అని అడుగక, భోజనానికిరమ్మని పిలువక, తనకష్టాలు మాత్రము తెలుపుచు భార్యాబిడ్డలు లోటుపాటులను వివరించుచు, ఆయనకు బాధకలుగు నటుల కుటుంబకష్టములు తెలుపుచు ఆయనకు విసుగు కలిగించి బైటకుసాగ నంపును. ఇట్టి గురువులు లోకములో యుండి తాను గురుధర్మములు ఆచరించకనే తన శిష్యులకు మాత్రము తెలుపుచుందురు. ఇట్టి కుచ్ఛిత గురువులు ఈ ఘనమైన పూర్ణబోధలో యున్నబావార్థములు తెలియక ధనమునకు దాసులై ఈ అచలబోధకు మాయనిమచ్చలుతెచ్చి పెట్టుచుందురు.

238. కం॥ కుటిలాత్ముడైన శిష్యుడు – యిటువలె తా బలుకుచుండు యింటికివస్తే – యెటుబోవుచుండి వస్తిరో – యిటకిక దర్శనము మళ్లి యెప్పుడయ్యానో – యెవరికి దెలుసు – యెప్పుడేమౌనో – యెటుదోచదే మైన యిత్తామంచనుకుంటె –తుటుకూన వక రాగిదుడ్డయిన లేదిప్పు – డెప్పుడయ్యానో యెవరికి దెలుసు – నెప్పుడేమౌనో॥ 7

తా॥ శిష్యా! గురువు ఒకానొకనాడు వెతుకు కొనుచు శిష్యుని ఇంటికి వచ్చినయెడల ఆ వచ్చిన గురువును లోభబుద్దిగల శిష్యుడుచూచి స్వామి

యెక్కడికో పొరుగూరికి పోవుచు మార్గమధ్యమున నేను ఉండుటవలన నన్ను జూచిపోదామని ఇచ్చటకు దయజేసితిరి. మిమ్ము చూడగనే నాకుచాలా సంతోషమైనది. మరలా మీదర్శనభాగ్యమెప్పుడు లభించునో, ఏ నాటికి యేమి జరుగునో, జరిగిపోవును. ఇంతదూరము నన్ను వెతకుకొనుచు వచ్చినదానికి యేమైనా మీకు సమర్పించి సంతోషపెట్టి పంపుదామనిన మీరువచ్చిన వేళా విశేషము యెట్టిపోకాని నాదగ్గర రాగిరూక అయినా లేకుండాపోయినది. చాలా చిక్కులలో కుటుంబరక్షణ జేసుకుంటూ కాలముగడుపుచున్నాను. యెట్లుమిమ్ము వృత్తచేతులతో పంపుదుమూ అని యెన్నెన్నో ఆలోచించుచున్నాను. ఎన్ని ఆలోచనలు జేసిన చేతులలో రూకలులేని ఆలోచనలు వృత్త ఆలోచనలే అగునని యెంతో దీనత్వముగా తెలుపుచు ఆ ప్రాప్తము నాకువుంటే మరొకసమయములోనైనా సమర్పించుకోగలనని యుక్తితోగూడిన చమత్కారమాటలతో గురువుగారినివాకిలి దాటించును.

239. కం॥ జపములు తపములు సలుపును – విపరీత స్మరణజేయు వేదాంతార్థం – బపరిమితంబుగ జెప్పును – కపటాత్ముడు శిష్యకోటి – గని మెచ్చుకొరకూ – మెచ్చి ద్రవ్య – మును యిచ్చుకొరకూ – అపకీర్తి వేతాల కదరినట్లగుపడి – ఉపమాచెబ్రతుకూచు నుండు లోకులు తనను – గని మెచ్చు కొరకూ – మెచ్చి ద్రవ్యమును యిచ్చుకొరకూ॥ 6

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో కొంతమంది ఒక గురువును ఆశ్రయించకనే ఆ గురుగోప్యములు తెలుసుకొనకనే నేను గురువునని తెలుపుచు లోకులు తననుమెచ్చుకొందురని జపములు, తపములు, అనుష్టానములు, శివకేశవాది నామధ్యానములు సలుపుచు కపటముగా వర్తించుచు వేదాంతగ్రంథములు చదివి వానిలో కొన్ని కంఠస్తముజేసుకొని వేదికలపై తెలిసినవానివలె బాహాటముగా మాట్లాడుచు ప్రజలలోమెప్పులు పొందుచుందురు. ఇతరులు తనను అనుమానించక యుండుటకు తనకు, అపకీర్తిరాక యుండుటకు ఉపాయముగా మెలగుచు యెదో ఒక నెపముజూపి ధనము నార్జించుచుందురు. అట్టి ధనార్జన గురువులకు ధనమే ప్రధానముగా యుండునుగాని శిష్యులకున్న పరితాపముదీర్చి కృతకృత్యుని జేసే విద్య వారిలో యేమాత్రము యుండదు. వెలిగేదీపమయిన యెడల వెలగని వత్తిని వెలిగించగలదు. అట్లనే వారిలోయున్న కపటవిద్య యెవ్వరిని ఉద్ధరించ లేక యుండును.

240. కం॥ గురుమూ ర్తికె దురహంకృతి – దొరకన్నను దొంగత్రోవ త్రొక్కిన చెవులన్ – గురునింద వినిన చేసిన - నరునకు పరిపూర్ణబోధ -నలవీయె తెలియా – కూడదు వాన్ని - తెలియాక కలియా – గురుడు దెల్పని పు స్తక రీతిచే పూర్ణ – మరసితినని యెంతో మురసిన యీ బోధ - నలవీయె తెలియా - కూడదువాన్ని తెలియాక కలియా॥ 9

తా॥ శిష్యా! ఈ అచలవిద్య గురుభ క్తి యున్నవారికి మాత్రమే సాధ్యపడునుగాని, జపములకు, తపములకు, ధ్యానములకు, లక్ష్యములకు సాధ్యపడునదికాదు. ఒక గురు సంజ్ఞచేత పొందగలుగుటకు అనువుగా యున్నందు వలన అట్టి గురుదేవునిపై ఎవరికి గాఢమైన భ క్తి విశ్వాసములుండునో, అట్టి వారే ఈ బోధకు సమర్థులు, అధికారులు కాగలరు. అట్టి భ క్తి గురుదేవునిపై నిలుపక గురువును దుర్భాషలాడిన, మరియొకడు దుర్భాషలాడుచుండిన తన చెవులతో విన్నను ఆ గురువు తెలిపిన మార్గముకాదని మరియొక మార్గములకు పోయినను కొన్ని శా స్త్రములు చదివి నాకు పూర్ణబోధంతా తెలుసునని మురిసి పోవుచూ, గురువుకన్నా నేను గొప్పవాడినని అహంకారముతోయున్న దుర్మార్గులకు ఈ బోధలోయున్న మెలకువలు తెలియబడక యుండును. అట్టి వారితో, కలుసుకొని తిరగడముగాని, ఆ మాటలు వినడముకాని మహా పాపమనియే తలంచవలయును.

241. కం॥ నాలుగు శిశ్రూషణములు –లోలత గావించుకొనుచు లోకాతీతం – బాలోకించి గురునిచే – ఈ లోకముజోలి విడువు - మింతె బాలన్నా నీతోగూడ - యిది మరువకన్నా – కీలుదెలియని చదువు బాలా జదివెందూకు బాలించి నీవిట్టి కీలూ దెలిసితివేని - యింతే బాలన్నా - నీతోగూడ – యిది మరువకన్నా॥ 10

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధ బాగుగ స్థిరపడుటకుగాను గురుదేవునకు స్థానశిశ్రూష, అంగశిశ్రూష, భావశిశ్రూష, ఆత్మశిశ్రూష అను నాలుగు శిశ్రూషలు జేయుచు వారి హృదయమును ప్రసన్నత చేసుకొనుచు వారిచ్చు వాఖ్యామృతము గ్రోలుచు వారిచే పొందబడినది. ఏది లోకా లోకములకు అతీతమై, సత్యమై శేషించియున్నదో, ఆ పరిపూర్ణమును సర్వకాలముల యందును మరచిపోక అవలోకనము జేసుకొనుచు భ్రాంతిమయమైన ఈ లోకము యొక్క ప్రస క్తిని అణుమాత్రమైనను తలంచక యుంటివేని అంతేబాలును. అటుల

యున్న వారితో సమానము మరి యెవ్వరూ యుండరు. వారి జీవితము బరువు లేని జీవితమై తేలికగా కాలము గడిచిపోవు చుండును. అంత సులువుగా ఈ బోధ యున్నను ఆ యదార్థమును సద్గురువు వలన పొందజాలక బ్రతికినన్ని దినాలు సార్థకములేని చదువులు యెన్ని చదివినను వాటివలన కొంచమైనను, ప్రయోజనము యుండదు.

242. కం॥ దేశికుని చరణతీర్థము–కాశీగంగయని గురుని గనుగొన్నను వి-శ్వేశుడని యతడు తన – కుపదేశంబొనరించి నట్టిదే - తారకమనీ మను సందు తా - నీతీరున గనీ – యేసీమయందున్న కాశి ప్రయాగ – రామేశని పురమై – ప్రకాశించు నా సీమ – దే తారకమనీ – మనసందు తా –నీతీరున గనీ॥ 11

తా॥ శిష్యా! "నగురోరధికం-నగురోరధికం" గురుదేవుని కన్నను అధిక మైన దేవుడు ముల్లోకములయందును లేడు. లేడని గురుగీత తెలుపుచున్నది. అట్టి గురుదేవునియందు భక్తి విశ్వాసములు కలిగి ఆ గురుదేవుని పాదతీర్థమే, కాశీ–గంగా జలమనియు ఆ గురుదేవుడే కాశీ విశ్వేశ్వరుడనియు ఆయన ఇచ్చు ఉపదేశమే తనను తరింపజేయు తారక మహామంత్రమనియు, ఆయన కాపుర మున్న గ్రామమే కాశి, కంచి, ప్రయాగ, రామేశ్వరము మొదలైన పుణ్యక్షేత్ర ములనియు ఆ నమ్మకము కలిగి ఆయన దర్శనమునకును ఆయన ఇచ్చు తీర్థ ప్రసాదములకు ఎదురు చూచుచు, ఆయనకు మినహా వేరే దైవములేడని ఎవ రికి దృఢమైన భక్తి భావన ఆ గురుదేవుని యందు యున్నదో, వారే నిజమైన గురుభక్తి గలిగినవారై యుందురు.

243. కం॥ గురు చరణజలము గోదా – వరియని గురుమూర్తి రామ భద్రుండని త - త్పురమును భద్రాచలమని – గురుమంత్రమె తారకమని – గురిగలిగినట్టీ – తిరిగిరాని - మరుగెరిగినట్టీ – నరుడున్నచోటె – సుందర శేషగిరి భద్ర – గిరి రంగనాయాక పురమానదగియుండు – గురిగ్గలినట్టీ - తిరిగిరాని - మరుగెరిగినట్టీ॥ 12

తా॥ శిష్యా! లోకములో మానవులకు తమ ఇష్ట దైవములపైన యెంత భక్తియుండునో, గురుపుత్రునకుగూడ అంతభక్తి తనగురువుపై నుండుటవలన ఆయన యందే సర్వదేవతలు అంతర్భూతులై యున్నారని తలంచుచు, ఆ సద్గు

రుమూర్తి పాదజలమే గోదావరి యనియు, ఆ సద్గురు స్వామియే శ్రీరామ చంద్రుడనియు, ఆ గురుదేవుడు నివసించే పల్లెయే భద్రాచలమనియు, ఆ గురు మంత్రమే తన నిజస్వరూపమైన తారకమంత్రమనియు, ఆయన కృపాకటాక్షమే మరలా జన్మకురాని పరిపూర్ణసూచననియు, ఆయన కాపురము చేయుచున్న కుటీరమే శేషపాన్పుతోగూడిన శ్రీరంగనాయకుల శ్రీరంగపట్టణమనియు ఈ విధముగా యెవరిహృదయములో ఆ గురువుపైన విశ్వాసము గలిగియుండునో అట్టివారే గురుమహిమను తెలిసినవారై ఆ గురుస్వామిని యే మాత్రము మరు వక సదాగురుభక్తియందే నిలకడగలిగియుందురు.

244 కం॥ గురుడు నరుడనుచు దలచిన – గురుమంత్రము మరచి యున్న గురుపుత్రుల నా – దరణ యొనర్చక యుండిన – గురువును విడ నాడి రెండో – గురునీ జేరిననూ – సద్గురుబోధ – నెరిగీ దూరిననూ – యెరుక మహత్యాము నెరిగీన యిటువంటి నరునాకుదప్పాదు నరకాము నిజ మింకో – గురునీ జేరిననూ – సద్గురుబోధ – నెరిగీ దూరినానూ॥ 13

తా॥ శిష్యా! గురుదేవుని సామాన్య మానవునిగ దలచినను, గురువుదెల్పిన మంత్రమును మరచియున్నను, గురుపుత్రులు ఎవరైన కనబడిన ఎడల వారిని ఆదరాభిమానములతో గౌరవించక యున్నను, పరిపూర్ణబోధ గురువును విడచి ఆ బోధవలన సిరిసంపదలు కలుగలేదని క్షుద్రదేవతల నుపాసించు మరియొక గురువు దగ్గర చేరినను, అచలబోధ నిస్సారమైనదని పరిహాసముగా మాట్లాడి నను, ఎరుక భ్రాంతి ఇట్టిదని ఎరిగిగూడ ఆ భ్రాంతులలో మునుగుచున్న వార లకు నరకమే ప్రాప్తించునుగాని శాంతి లేక యుండును.

245. కం॥ జ్ఞానవైరాగ్య భక్త్య – సమాన నదీస్నాన దేవమంత్ర పఠన – తధ్యాన మఖతంత్రములు పర – మాని నిరతి గోరునట్టి – మనుజా సంఘముకూ – బోధనుదెల్పు – మనిన వారలకూ – తానుబోధించూట తగదు బోధించితే – తాను నేనను భ్రాంతి తొలగెదేలాగట్టి – మనుజా సంఘముకూ- బోధనుదెల్పు – మనిన వారలకూ॥ 14

తా॥ శిష్యా! ఈ పరిశుద్ధమైన అచలబోధ యే భ్రాంతులు లేని వారికి మాత్రమే సాధ్యపడునుగాని, జ్ఞానమే దైవ స్వరూపమని తలచే వారలకుగాని, వైరాగ్యమే దొడ్డదని నమ్మేవారలకుగాని, దేవతాభక్తియే శ్రేష్ఠమనువారికిగాని,

తీర్థయాత్రలకుపోయి నదులలో స్నానము చేయుటయే పుణ్యమను వారికిగాని, దేవతామంత్రములను జపించుచుండు వారలకుగాని, యజ్ఞయాగాది క్రతువులే మోక్షమని నమ్ము వారలకుగాని ఈ పరిపూర్ణబోధ పొందుటకు కష్టతరమైనదిగా యుండును. అట్టి భ్రాంతులలో యున్నవారు ఎవరైనా ఈ బోధను తెలుపుమని యెంత ప్రాధేయపడినను వారికి ఈ నిర్మలమైన బోధను బోధించ గూడదు. ఒకవేళ బోధించినను వారికి మునుపటి భ్రాంతి వాసనలు నశించక నేను-నేను అను అహము తలయెత్తుచునే యుండును. ఆ అహము యుండినవారు. ఈ అచలబోధలోయున్న గోప్యమును గ్రహించలేక పూర్ణబోధకు కళంకము ఆపాదించుచుందురు.

246. కం॥ ఇంగితము నెరిగి సద్గురు – పుంగవుచే నరుడు భుక్తిము క్తి క్రియలన్ - సంగాసంగము లెడలిన – శృంగారమె వానిచేష్ట - చూచెవారలకూ - వాడున్నట్లు – తోచెవారలకూ – మంగాళసూత్ర మేభంగి శృంగారామొ - శృంగారవతికి – య శృంగారవతికట్లు చూచెవారలకూ – వాడున్నట్లు – తోచెవారలకూ॥ 15

తా॥ శిష్యా! యే దానిని తెలియ గలిగిన జన్మరహస్యము తెలయగలదో, యే బోధను వినగలిగిన ఉన్నసత్యము బైట పడగలదో అట్టిదానిని గురుదేవుని దయవలన తెలుసుకొనిన పిమ్మట అతడు ఉదరపోషణార్థము సర్వకర్మములు ప్రాపంచీకులతోపాటు చేయుచున్నను, వారితో సమానముగా నాది నేను అని వ్యవహారదశలో మాట్లాడుచున్నను, హృదయములో మాత్రము ఏ ఆరాటము ఏ పరితాపము కలిగియుండక అంటి అంటనివాడై నేను నేను అను అహంకారమును విడివి ప్రవర్తించు చుండును. ఆ మహాత్ముని మాటలుగాని ఆయన నడకగాని చూచేవారలకు మిగుల శృంగారముగా కనబడు చుండును. అది ఎట్లుండుననగా ముత్తైదువకు ఉండవలసిన ఆభరణములన్నియు లేక పోయి నను ఒక్క మంగళసూత్రము వున్న యెడల ఆమె యెంత సౌందర్యముగా శోభించుచుండునో, అలాగుననే ఈ పరిపూర్ణబోధను పొందిన మానవుడు సకల జనులలో సమస్త కార్యములు చేయుచున్నను, ఆ గురు పుత్రుని నడకగాని, వాని మాటలుగాని విచిత్రంగా కనబడుచు పదుగురికి సంతోషము కలిగించుచు ప్రియమైనవాడుగా వర్తించుచుండును.

247. కం॥ జనులందరు గురుబోధను – గనిరా జనులందు నేను గలియక యున్నన్ – నను మన్నింతురె వారని – మనసున దలపోసై బోధ-మర్మామబ్బినా - అబ్బినవారి – ధర్మామబ్బినా – జనన మరణములేని ఘనమైన త్రోవనే – గననైతినని బోధగనకున్న యీ బోధ – మర్మామబ్బినా-అబ్బినవారి - ధర్మామబ్బినా॥ 16

తా॥ శిష్యా! ఈ లోకములో యున్న ప్రజలు గురువును జూచిన, గురు పుత్రులనుజూచిన వారిపై భక్తితో నమస్కారములు చేయుట సహజముగా యున్నది. ఒక్కొక్కప్పుడు గురువునకు పాద నమస్కారములుగూడా జరుగు చుండును. ఇంకా గురువుపై భక్తి ప్రవృత్తులు కలిగినవారు గురువును యింటికి తీసుకొనిపోయి పాదపూజలుచేసి వారిచేతితో తీర్థప్రసాదములు తీసుకొను చుం దురు. అట్టి పూజనీయులైన గురువులనుజూచి పామరుడైనవాడు నేను గురువు నైతే ఆ నమస్కారములు, ఆ పాదపూజలు, నాకు జరుగునని కోరిక కలిగి శాస్త్రములను చదివి ఆ విద్యను సులభముగా పొంది ఆ గురువులతో సమాన ముగా పదిమందిలో గుర్తింపబడి, కీర్తిసంపాదించవలెనని ఎంత తపనపడినను అచల విద్యలోయున్న మెలకువలు తెలియబడవు. అట్టి స్వార్థముతో కూడిన కుయుక్తులను విడిచిపెట్టి జనన మరణములులేని పరిపూర్ణ విద్యను పొంది కృతార్థుడు కావలయుననే ఆరాటము యెవరిలో కలిగి ఒక సద్గురువును ఆశ్ర యింతునో, అట్టివారే ఈ విద్యలో దాగియున్న గూఢమైన రహస్యములు తెలుసుకొనుటకు తగినవారై యుందురు. అట్లుగాక గౌరవములకు, పేరు ప్రతిష్ఠలకు ఈ బోధను కోరువారికి ఈ బోధలోయున్న గోప్యము తెలియబడక విఫలులై యుందురు.

శిష్యుని లక్షణం పదునైదవ అధ్యాయం సమాప్తము.



## - 16 గురుశిష్యోభయ లక్షణం 12 -

248. కం॥ హృదయగ్రంధి విడుటకై - సదయత యీ బోధదెల్ప జనదా గురుడై – వదలక చిత్తములో గురు – పదయుగళము దలుప వలదే

భక్తుడైనపుడూ - భ్రాంతిరహిత - సక్తుడైనపుడూ - కుదురాదు యివి రెండు గురుశిష్యులకు లేక - కదిలికె లేనట్టి ఘనబోధోక్త స్థితి - భక్తుడైనపుడూ - భ్రాంతిరహిత - సక్తుడైనపుడూ॥ 1

తా॥ శిష్యా! సకల భ్రాంతులకు, సకల కోరికలకు, సకల దుఃఖములకు బీజమైనదియు, నిమిషమాత్రమైనను నిలకడలేకయున్న హృదయ గ్రంథియను విషవృక్షము సర్వ మానవులలో పాదుకొని యున్నది. ఆ హృదయగ్రంథిని సమూలముగా పెకలించి తిరిగి ఏ భ్రాంతులు, ఏ భయములు లేక చేసినవాడే సద్గురుండనబడును. గురువుయందు భక్తి విశ్వాసములు కలిగి తన సర్వ సంశయములు తీరు వరకు యెంతో ఆసక్తితో పూర్ణబోధను వినుచు గురువు అండ దండనలోయుండి కృతార్థుడైనవాడే శిష్యుడనబడును. ఇట్లు యే శంఖలు పుట్టక శిష్యుని పరితాపము తీర్చవలయుననే సదుద్దేశము సద్గురువు లోనూ, గురువువలన సర్వమూ తెలుసుకొని స్థిమితముగా యుండవలయుననే పట్టుదల శిష్యునిలోనూ ఇట్లు వారిద్దరిలో ఆ తలంపు లేక యున్న యెడల ఈ ఘనమైన అచలబోధ పొందుటకు సాధ్యపడక యుండును.

వి॥ హృదయ గ్రంథి అనగా జ్ఞానేంద్రియ పంచకము, ప్రాణేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, మనోబుద్ధులు కలిసి 17 తత్వములతో నిర్మితమగు సూక్ష్మశరీర మును హృదయగ్రంథి అని పెద్దలచే వినుచుందుము.

249. కం॥ గురుడాసవదలకుండిన - మరి శిష్యుడు ద్రవ్యలోభ మగ్నుండైనన్ - మరియాద దక్క దిరవుర - కెరిగుండుము వీర - లతివిహీనులోయన్నా - గట్టిగ దురభి - మానూలోయన్నా - గురుడు శ్యిషుని కన్న కొడుకూగ గనకున్న - గురునీపై శిష్యాడా గురినిల్పకుండీన - హీనులో యన్నా - గట్టి గదురభి - మానులోయన్నా॥ 2

తా॥ శిష్యా! గురువు ధనముమీద ఆపేక్ష కలవాడై మాటి మాటికి శిష్యుని పీడించుచు, యెంత యిచ్చినను తృప్తి పడక చిరాకు చూపించుచు, శిష్యుని మనసు నొప్పి పరచుచుండు గురువు గురువు కాజాలడు. శిష్యుడుకూడ తనకున్న దానిలో అంతో, ఇంతో గురువుకు ఇచ్చి గురువును సంతృప్తి పరచే దానిలో వెనుకాడుచున్న శిష్యుడు శిష్యుడు కాజాలడు. వీరిద్దరు కుచ్ఛితమతులై ధనముకొరకు దాసులై దురభిమానము కలిగినవారలై యుందురు. అట్టి సంకు

చిత స్వభావములు లేక గురువు తనను ఆశ్రయించిన శిష్యునిపట్ల ప్రేమ కలిగిన వాడై తనకన్నకొడుకుగా దయగలిగి యుండవలయును. శిష్యుడుగూడ గురువు పట్ల భక్తి విశ్వాసములు గలిగి ఆయనకు యే కొరతలు కలుగనివ్వక తనను కన్నతండ్రిగా భావింపవలయును. అట్లు ఆ గురుశిష్యులలో ఆ దయ లేక యుండిన యెడల వారిని పరమ నీచులనియు విద్యా గౌరవము, నిలపని లోభు లనియు తలంచవలయును.

250. కం॥ గురు గురుబోధల చేతను – పరిపూర్ణము నెరిగి యెరుక బాసిన యతనిన్ – గురుతెరుగ నొరుల శక్యమె – యెరిగిన నరులిట్టిబోధ – నెరిగే రోయన్నా – వారెరుగాని – మరుగుండదన్నా – చిరుత పాపనిరీతి మరి పైశాచముభాతి – తిరుగూచునుండు వెక్కురుమాడ్కి గురుడెట్లు – యెరిగే రోయన్నా వారెరుగాని – మరుగుండదన్నా॥ 3

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధ యెంతో కాలమునుండి ఒకరితో ఒకరు చెప్పుకొనుచు గురు సాంప్రదాయముగ వచ్చుచున్నది. అట్టి బోధను గురువు వలన విశదముగ యెరిగినవారికి మాత్రమే ఉన్న పరిపూర్ణము తెలియబడి లేని యెరుక తనలో యెక్కడా లేక పోవును. ఆ యెరుక లేక యున్నవారిని గాని, వారు తెలుసుకొనిన బోధనుగాని లోకులు యెరుగజాలరు. ఆ మహాత్మునికి తెలియని మరుగేమియు యుండదు. ఆయన ఒకప్పుడు బాలునివలెను, ఒకప్పుడు ఉన్మాదునివలెను, ఒకప్పుడు పిశాచమువలెను, ఒకప్పుడు జడునివలెను కను పించుచుండును వారికి నిర్దయా నిర్దయాలు లేక సర్వమునకు అతీతులై యుం డుట వలన ఎప్పుడు ఏ స్థితిలో యుందురో ఎవరికి గోచరముకాక యుండును.

251. కం॥ మలయాద్రిచెంత చెంచుల – కిల చందన – భూరుహములె యింధనమట మి – క్కలి గలుగబట్టి యట్లనె చులుకన సుమి యింట గలుగు సూరిభూషణుడూ – బహుమాన్యుడు – దూరస్థుడెపుడూ – తెలయాని వారికి తెలిసేది కఠినాము – తెలివిచె దెలసితె తెలియజేసును బోధ – సూరిభూషణుడూ బహుమాన్యుడూ – దూరస్థుడెపుడూ॥ 4

తా॥ శిష్యా! హిమాలయ పర్వతముల దగ్గరయుండు పల్లెలలో కాపురము చేయు కోయవాళ్ళు, యెరుకలవాళ్లు, చెంచువాళ్ళు, మొదలగు కొండ జాతుల వారు ఆ అరణ్యములలో మంచిగంధము చెట్లు విశేషముగా యుండుట వలన,

వాటివిలువ తెలియక వంటకట్టెలుగా వాడుచుందురు. అటులనే స్వచ్ఛందమైన పరిపూర్ణబోధ కలిగిన గురువు తన ఇంటనే యున్నను, లేదా తన గ్రామమందే యున్నను అతని దగ్గరయున్న విద్యవిలువ తెలుసుకొనలేక వానిని చులకనగా యేమి తెలియనీ వానిగా భావించుచుందురు. కాషాయ వస్త్రములు ధరించి కమండలము చేత పట్టుకొని యెక్కడో దూరముగా నుండి వచ్చిన వానిని మాత్రం యెంతో స్తుతించి గౌరవించి పూజించుచుందురు. గురువు అనగా ఎట్టి వాడో, ఆయన తెలిపెడి బోధ అనగా నెట్టిదో తెలియని వారికి గురువు గొప్ప తనము తెలియబడక, ఆ బోధ యెట్టిదో గోచరించక యుండును. అట్లు గాక విచక్షణము కలిగిన తెలివితో తాను తరించెడిబోధ యేదిగా యున్నదో తెలుసు కొని అట్టి గురువుకు సేవలుజేసి వారి కరుణకు పాత్రులై ఈ పరిపూర్ణబోధను పొందగలిగిన యెడల తనజన్మ సార్థకమగునని తలంచవలయును.

252. కం॥ దూరముననుండి విన్నను – చేరును సజ్జనుడు గురుని చెంతకు బోధం – గోరి దుర్జనుడు గోరడు దూరస్థుడు గాక గురుని – తో గూడియుండీ – యెట్లనియన్న – దూరాననుండీ – కోరి తుమ్మెద తమ్మిజేరి తేనియగ్రోలు – నారీతి నెరుగావు చేరికప్పలు తమ్మి – తో గూడియుండీ – యెట్లనియన్న దూరాననుండీ॥ 5

తా॥ శిష్యా! తనజన్మ సాఫల్యము కావలయునని ఆరాటన గలిగిన సజ్జనుడు ఆ గురువు యెంత దూరములో యున్నను వెతుకు కొనుచు, ఆయన దగ్గరకు పోయి ఆయన తెలుపు బోధను వినుచు, తనకున్న సంశయములను తీర్చు కొనుచు కృతార్థుడనైతినని సంతోష పడుచుండును. దుర్జనునకు సమీపంలో గురువుయున్నను ఆయన తెలిపేబోధ యెట్టిదో తెలియక, ఆ బోధలోయున్న గొప్ప తనము గమనించక తనతో సమానమైనవానిగా తలంచుచుండును. అది యెట్లనిన తుమ్మెద మధురమైన తేనెపై అపేక్షగలిగి యెంతో దూరములో సరస్సులుయున్న ప్రాంతములకుపోయి అందు యుండెడు తామర పుష్పముల యొక్క మధువును (తేనెను) తృప్తిగా త్రాగి తన స్థానమునకు చేరుచుండును. కప్పలు మాత్రము ఆ తామరకొలనులో యుండియు ఆ తేనెను యెరుగ లేక బురదనే త్రాగుచుండును. అటులనే సజ్జనునకు, దుర్జనునకుగల బుద్ధి కుశలత యీలాగుండునని తలంచవలయును.

253. కం॥ చూసి మదిదెలసి శిష్యుని – యాశయమును తగినబోధ నతనికి దెలియన్ – జేసి ముదమొంద జేసెటి – దేశికుడే ముఖ్యుడనుచు – తెలుసుకోవోయీ – కని యతగాణ్ని – కలుసుకోవోయీ – చేసిన దయతో నీ యాశ సంపూర్తిగ్గు వ్రాసైతె వేసుకొ చూచేవు తార్థాణ-తెలుసుకోవోయీ – కని యతగాణ్ని – కలుసుకోవోయీ॥ 6

తా॥ శిష్యా! సద్గురువు అనిన తరువాత వారి దగ్గరకు యెంతో మంది వచ్చుచు వారి వారి సందేహములను అడుగుచుందురు. ఆ అడుగుచున్నవారి అభిలాషలు గమనించి వారికి సరిపోవు సమాధానములు చెప్పుచుండును. కర్మ మీద అభిలాష కలిగినవారికి కర్మమే ఎక్కువని చెప్పును. భక్తిమీద అభిలాష యున్నవారికి భక్తియే అధికమని తెలుపును. ధ్యానముపై అభిలాష యున్నవారికి ధ్యానమే మంచిదని తెలుపును. జ్ఞానముపై అభిలాష కలిగిన వారికి జ్ఞానమే దొడ్డదని తెలుపును. అచలబోధపై అభిలాష కలిగిన వారికి ఆ బోధ రహస్యములుతెలిపి దీనిపై అధికము యేదిలేదని తెలుపుచు అందరిని సంతోషపెట్టి పంపుచుండును. వారికున్న అనుభవము తెలియక కర్మ-భక్తి-జ్ఞాన-వైరాగ్యములు అధికమని తెలిపే గురువు పరిపూర్ణ బోధనుకూడ దృఢ పరచగలడా? అని నీకు సందేహము కలుగవచ్చును. వారు సర్వము సాధించి చూచినవారు గనుక యెవ్వరు యే దానిని గురించి అడిగినా అన్నిటికి సమర్థులై యుండును. అది నిజమో కాదో అని తెలియ గోరితివేని ముందు నీ సందేహ మును నీ బుద్ధి పలకపై వ్రాసుకొని తరువాత ఆయనను ఆశ్రయించి వారివలన ఆ బోధను నీ చెవులతో నీవే వినినప్పుడు, ఆ ఆరూఢత నీకు కలిగినప్పుడు ఆ గురువు పరిపూర్ణ బోధనుగూడా తెలిపేవాడా? కాదా? అని నీకు నీకే తెలియ బడును. అప్పుడు నీ బుద్ధి పలకపై వ్రాసుకొన్న సందేహము తీరిపోవును. అక్కడికి నీ అనుమానము తొలగిపోవును.

254. కం॥ మంతనమున గురుబోధన – యెంతో వింతనుచు నమ్మి తింతేకద – యే వింతలు గనరావని ధా –వంతము నొందేటివాని – బ్రతు కెంత కంతే – చింతలులేని – గతిగానడింతే – అంతకంతకువాని కతిచాద స్త మెకాని – సంతాకూటముతోటి సంభాషించేడు వాని – బ్రతు కెంతకంతే – చింతలులేని – గతిగాన డింతే॥ 7

తా॥ శిష్యా! పరిపూర్ణబోధ యెంతటిదో అందులో యేమున్నదో అని తలంచి ఈ బోధ ఎరిగిన తరువాత ఇంతేనా! అందులో ఏ వింతలు ఏ మహత్తులు అగుపడుటలేదని నిరాశకలిగి నిస్పృహతో నీరసపడువానికి ఈ బోధలో యున్న గొప్పతనము. ప్రత్యేకత తెలియబడక యుండును. ఆ మూర్ఖునికి కావలసినది మనసును భ్రమగొలిపే చిత్ర విచిత్రములైన ఎరుకతో గూడిన సిద్దులు మహత్తులేగాని స్థిమితముతో కూడిన ఈ బోధ స్థితిని కనుగొనలేనివాడై యుండును. అట్టివాని బ్రతుకు అడుగడుగునా అనేక చింతలతో గూడుకొని మతి స్థిరములేనివాడుగా యుండునేగాని, శాంతితోగూడిన ఈ పరిపూర్ణబోధ సుఖము ను యేనాడు యెరుగజాలక యుండును.

255. కం॥ తన గురుబోధను తా - జదివిన విను జనవితతి మదికి వింతై యీ బో - ధను నేర్వకున్న వ్యర్థము — జననంబని తోచి శరణు శరణానెటట్లూ - వెంటనె వాండ్లు - దరిజేరెటట్లూ - ఘనమైన యుక్తిజేసిన వాడె శిష్యుడు - అనుమానమే మిందుగనరాదు వినవోయి - శరణానెటట్లూ వెంటనె వాండ్లు - దరిజేరెటట్లూ॥ 8

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధను చక్కగా గురుస్వాముల దగ్గర తెలుసుకొని తాను సంతోషపడి, ఇతరులను గూడ సంతోష పరచవలయునని, ఈ బోధను తగిన దృష్టాంతములతో సమర్థవంతముగా తెలుపుచున్న యెడల ఈ బోధను వినేవారికి యెంతో ఉత్సాహము ప్రీతిగలిగి ఈ విద్య తెలియని జన్మ నిరర్థక జన్మమని వారికి వారికే తెలియబడి వెంటనే సద్గురువు దగ్గరకు పోయి ఆ విద్యను మాకు తెలుపుమని శరణు-శరణు అనేటట్లు చేయవలయును. అట్లు చేసినవాడే పదుగురికి మేలు చేసిన గురుపుత్రుడనబడును. ఇందుకు అనుమానములేదు.

256. కం॥ తనభార్య రూపురేఖలు — తనపుత్రుల సద్గుణములు తన సంపదయున్ - తన పెరటిమందు చెట్లులు - తన గ్రామపు సాధుజనులు - తనకూ మెప్పౌనా యీ యిలలో యెం - తటి వానికైనా -వినలేదె నీ వాహల్యనుజూచి మోహించె - ఘన వాహనుండు చక్కని భార్యగలిగుండి — తనకూ మెప్పౌనా - యీ యిలలో యెం - తటివానికైనా॥ 9

తా॥ శిష్యా! ఈ లోకములో తన భార్య యెంత సౌందర్యవతియైనను మరొకనిభార్య సౌందర్యవతిగా కనబడుచుండును. తన పుత్రుడు యెంత సద్గుణ

వంతుడైనను మరొకరి పుత్రుడు సద్గుణ వంతుడుగా కనబడుచుండును. తనకు ఎంత సంపదయున్నను మరొకరి సంపద గొప్పదిగా కనబడు చుండును, తన పెరటిలో మంచి ఔషదపు చెట్టు యున్నను, అడవిలోయున్న ఔషదపు చెట్టు అధికముగా కనబడుచుండును. తన ఊరినందు సర్వమునెరిగిన సద్గురుస్వాము లున్నను, ఇతర గ్రామములలోయున్న గురువు గొప్పవాడుగ కనబడుచుండును. దేవేంద్రుని భార్య శచీదేవి యెంత చక్కని రూపవంతురాలైనను, గౌతమఋషి భార్య జడదారియై రుద్రాక్షలు, కాషాయంబరాలు ధరించియున్న అహల్యను, ఇంద్రుడు రూపవతిగా భ్రమించి తీరని శాపగ్రస్తుడయ్యెను. ఈ లోకములో యెంతటి వారికైనను, ఈ మతి భ్రాంతి గలుగుచునే యుండును.

257. కం॥ జతనముగదాచి – చదువుము – రతనమ్ముల హారమి దియు రసికుల గళమూ – యతనము దీనికి నే బహు – యతనముగావించితెచ్చి యి స్తిరనేడూ బోధకు బందో - బస్తొర చూడూ – రతనాలెట్లొరాళ్ళు రతనా లంచని యంటె - రతనాలి పద్యాలే రసికులెరిగెద రివినీ - కి స్తిరనేడూ - బోధకు బందో – బస్తొర చూడూ॥ 10

తా॥ శిష్యా! ఈ కందార్థములను విపరీతార్థములు చేయక భద్రముగా, శ్రద్ధగా ఉన్నది ఉన్నట్లుగా చదువు చుండిన వారికి ఇందులో యున్న భావ ములు రత్నములని తలంచవలయును. ఈ గ్రంథములో లేని రహస్యములు యే గ్రంథములలో జూచినా కనబడక యుండును. సర్వ శాస్త్రములన్నియు బహు ప్రయత్నముతో తరచి తీసిన సారాంశమును ఈ గ్రంథములో పొందు పరచి యున్నందువలన పరిపూర్ణబోధను పొందిన బుద్ధిమంతులైన సత్పురుషు లకు ఈ పద్యములు వినుచుండిన శృంగారముగ ఆనందము నిచ్చుచుండును. ఈ పద్యములను కంఠస్తముజేసిన సుగుణవంతులకు కంఠమునందు ధరించిన రత్నాల హారమువలె ప్రకాశించుచూ, చూచేవారలకుగాని, వినేవారలకుగాని యెంతో తృప్తిని ఉత్సాహము కలుగజేయు చుండును. ఇందులోయున్న అభి ప్రాయములు అచలవేత్తలకు కట్టుదిట్టములై పరిపూర్ణ బోధకు కళంకము రాని వ్వక హెచ్చరిక చేయుచుండును. ఈ పద్యములు చక్కగా అర్థము చేసుకొన్న వారికి ఇక యే ఇతర గ్రంథములు జూచినా రత్నముల ముందు రాళ్ళవలె కన బడుచుండును. ఈ రత్నాలతో సమానమైన రచనలో యున్న భావార్థములు మేధావులైన పరిపూర్ణ భావస్తులకే తెలియుచుండును గాని ఇక యే ఇతర బావ

స్తులకు గోచరముగాక యుండును. అట్టి విలువ గలిగిన పద్యములు నీకు ఇచ్చు చున్నాను.

258. కం॥ విననేర్చి చెప్పనేర్చిన - మనుజులకే దీనిలోని మర్మము దెలుసున్ - విన(జెప్ప నేరకుండిన - మనుజులు యీ బోధలోని - మర్మా మెరిగేరా - దీనందుండే - ధర్మామెరిగేరా - జనులె కొబ్బరికాయ తిన నేర్పుగలవారు - తిననేర్చున్నా కోతి - తనకా కాయబ్బీన - మర్మమెరిగేరా- దీనందుండే - ధర్మామెరిగేరా॥ 11

తా॥ శిష్యా! అచలబోధ నిరాధారమైన బోధ అగుట వలన ఈ బోధను గురించి పెద్దలు తెలుపుతున్న సమయములో మనసును అటు ఇటు పోనివ్వక ఏకాగ్రతగా శ్రద్ధగా వినే నేర్పును కలిగి యుండవలయును. అట్లు వినగలిగిన వారు మాత్రమె గురువుదెలిపే దానిని అర్ధము చేసుకొని దానిని బాగుగా ఆలో చించి మరి యొకరికిగూడ తెలిపేదానికి నేర్పరులై యుందురు. ఈ విధముగా శ్రద్ధగా వినుచు వినినదానిని మరువక మరి యొకరికి చెప్పు సమర్ధత యెవరికి కలిగియుండునో వారే ఈ సాటిలేని పరిపూర్ణ బోధలో యున్న ధర్మ మర్మ ములు యెరిగి సంతోషించగలరు. వినడానికి, చెప్పడానికి చేతగాని మందమతు లకు ఈ బోధలోయున్న గోప్యము తెలియబడక దుష్ప్రచారములు చేయుచుం దురు. అది ఎటులనిన మనుజులైనవారే కొబ్బెరకాయను భద్రతగా తినుటకు నేర్పరులై యుందురు. ఆ కొబ్బెరకాయ కోతిచేతికి చిక్కిన యెడల ఆ కాయ తినుటకు అలవికాక చిన్నాభిన్నము చేసినట్లు ఈ బోధనుగూడ అల్పమతులు చిన్నాభిన్నములు చేయుచుందురు.

259. కం॥ నేనెంత చెప్ప జదివిన - దీనిని దెలియంగ గలరె దేశిక వర్యున్ - పూని సేవించకుండిన - మానవులది యెట్లనన్న - మరి వినవోయీ నామాటందు మనసుంచవోయీ -వానకాలములోని వర్షామునొకబిందు - వై నమిట్టను నిల్వదది నిశ్చయమెకద - మరి వినవోయీ - నామాటందు - మనసుంచవోయీ॥ 12

తా॥ శిష్యా! నేను ఈ పూర్ణబోధను గ్రంథముద్వారా యెంత వివరించి తెలుపుచున్నను అది గ్రంథముగానే యుండునుగాని అందులో దెలుపు గూడా ర్థములు విడబడక బుద్ధికి అగమ్యముగ జారిపోవుచుండును. అట్లు గాక గ్రంథ

ధోరణిని వదలిపెట్టి ఈ బోధ కొరకు ఒక సద్గురువును ఆశ్రయించి భయ భక్తులతో, వినయ విధేయతలు కలిగి నాల్గు శుశ్రూషలుజేయుచు వారిఆజ్ఞను మీరక నడుచుకొనుచు యే ఇతర ఆలోచనలులేని నమ్రతమైన హృదయము గలవాడై గురువు సన్నిధిలో వారి ముఖతా ఈ బోధను వినగలిగినప్పుడే ఈ బోధలో దాగియున్న అతి రహస్యమైన మెలకువలు గూఢమైన సమస్యలు గ్రహించేబుద్ధి బలము కలుగగలదు. అది యెట్లనిన వర్షాకాలములో యెడతెగక వర్షము పడుచుండినను ఒక నీటిబొట్టు అయినా మిట్టగాయున్న భూమిపై నిలువక పోయినట్లు గ్రంథములు ఎన్ని చదివినా గురువు నోటిద్వారా విని అనుభవమునకు వచ్చిన దానితో సమానముగా యుండదు. మిట్టమీద పడిన నీరుతో సమానముగానే యుండును.

గురుశిష్యోభయ లక్షణం పదహారవ అధ్యాయం సమాప్తము.



## - 17 గురుదత్తాభయదానం. 11 -

260. కం॥ నన్నాశ్రయించినావని – యన్నాయీ బోధనీకు అతుకుట కొరకై – యెన్నో యుక్తుల జెప్పితి - విన్నావా దీన్ని నీవు – విడువ కెప్పటికీ నా యాజ్ఞను – గడువా కెప్పటికీ - నన్ను నీవు నిన్ను నేగన్నా వేళ్ళెట్టిదో - నన్ను నీవు విడలేవు నిన్ను నేవిడలేను – విడువకెప్పటికీ – నా యాజ్ఞాను - గడువకెప్పటికీ॥ 1

తా॥ శిష్యా! ఘోరమైన దుఃఖాంబుధిని దాటుటకు నన్ను నీవు ఆశ్రయించితివని నీమీద నాకు కరుణగలిగి ఈ బోధ నీకు బాగుగ ధృఢపడుటకు గాను, యెన్నో యుక్తులు, యెన్నో ఉపమానములు తెలయపరచి యెరుక, పరిపూర్ణముల లక్షణములను నిరూపణజేసి నీకుయున్న శంఖలన్నియు మరల పుట్టకుండ నిర్మూలముజేసితిని. అది నిజమేనని నీకు అర్థమయ్యే యున్నది. ఇక యెన్నడు ఈ పరిపూర్ణబోధను మాత్రము మరచియుండకుము. నా ఆజ్ఞనుమీరి నడచుకొనకుము. ఇది నా మాటగా జ్ఞాపకము యుంచుకొనవలయును. యే సుముహూర్తములో నన్ను నీవు కలుసుకొనినావో నేను నిన్ను కలసినానో, ఇక

నీవు నన్ను మరచియుండలేవు. నేను నిన్ను మరచియుండలేను. ఇది మనమిరువురికి ఒకరిపై నొకరికియున్న అనుబంధము, అభిమానమని తెలిసి యుండవలయును.

261. కం॥ పతియైనను సతియైనను - సతి సాహసపరులుగాక యాంతర్యమునన్ - రతివేళ్ళ లజ్జపడ సం - తతి గలుగదు చూడుమట్ల - తగదు లజ్జింబా - గురుశిష్యూలు - తగులజ్జనొంబా - మతిని నీవిట్లు సమ్మతిజేసియేయె - సంగతి నన్నడుగుము బోధ - స్థితి నీకు దృఢపరతు - తగదూ లజ్జింబా - గురుశిష్యూలు - తగులజ్జనొంబా॥ 2

తా॥ శిష్యా! లోకములో సహజముగా భార్యభర్తలు సంభోగించు సమయమునందు యెవరైనా ఒకరు ముందుకుపోయి, కార్యరూపము దాల్చక, ఇద్దరు సిగ్గు, లజ్జ, భయములతో కూడియుండిన యెడల, సంతానము కలుగదు. వంశముపేరునిలువదు. అటులనే గురుశిష్యుల విషయములో గూడ శిష్యుడు తనకుకలిగెడు సందేహములను గురువును అడిగి తెలుసుకొనక భయము, సిగ్గు, అభిమానములు పెట్టుకొనియుండిన యెడల గురువుగూడ తెలుపక యుండిన యెడల సంశయములు రహితపడవు. ఈ బోధమర్మములు వీడబడవు. అందువలన శిష్యుడు అభిమానము, సిగ్గు వదలిపెట్టి తాను గురువుదగ్గర యెరుగవలసిన సమస్యలను నిర్భయముగా అడిగితెలుసుకొను చుండవలయును. అట్లు అడుగుచున్న శిష్యునిజూచి గురువు ఆనందపడుచు, ఆ సమస్య లెంత సమస్యలైనను, సులభముగా సందేహములేక చేయుచు వస్తునిరూపణగా తెలియచేసి తృప్తినికలించుచుండును.

262. కం॥ రతికొరకుగాదె సతిపతి - కతిహితమతి సేవజేయునటువలె బోధ - స్థితి నీకు కుదురుటకు స - మ్మతితో గురుసేవజేయుమా - నీతివంతా - అభిమానాము - పోనినీదంతా - అతనికి దయవస్తె అరనిముషమున బోధ - స్థితి నీకు కుదిరించు సిగ్గు - విడచి కొల్వుమా - నీతివంతా - అభిమానము - పోనినీదంతా॥ 3

తా॥ శిష్యా! ప్రకృతి ధర్మముగ సంతానము కొఱకు సంభోగమునందు యిచ్చగలిగిన భార్య తనభర్తకు ఇష్టమైనకోరిక లెల్లయు సమకూర్చుచు అయన తృప్తిపడేలాగున ఉపచర్యలుచేసి ఆనందింపచేయుచుండును. అటులనే

ఈ పరిపూర్ణబోధ పొందుటకుగాను ఆ రహస్యములు తెలియుటకుగాను శిష్యుడు గూడ గురుదేవునకు మనసిచ్చి యే సంశయములు కలుగక అభిమానమును విడిచిపెట్టి నమ్రతకలిగిన భావముతో సేవలు చేయుచుండిన యెడల ఆయనకు దయగలిగి అరనిమిషములో అచలబోధలోయున్న అనుభవమంతయు స్థిరపడునట్లు చేయగలుగును. అందులకు యే అనుమానములేదు. అటుల యే సంకోచములుగాని, యే అభిమానములుగాని లేకుండా జేసుకొని గురుసేవలో యెవరు మగ్నతగలవారై యుందురో, అట్టి ఉత్తమమైన సుగుణవంతులకు, కరతలామలకమువలె, సర్వవిషయములు అప్పటి కప్పుడే గురువు తెలియజేయుచుండును.

263. కం॥ నీ మానసమున సంశయ – మేమాత్రము నిల్పబోకు మిక నాతోడే - నామాట నిశ్చయము నే - నేమాత్రము దాచలేదు నీతోడుసుమ్మీ యింతకు మిక్కి - లిక లేదులెమ్మీ నా మీద తలపుంచు నను మరువకిక నేను నీ మీద దయవుంతు నిజమిందుకిదెవొట్టు - నీతోడుసుమ్మీ – యింతకుమిక్కి –లిక లేదులెమ్మీ॥ 4

తా॥ శిష్యా! ఈ లోకములోయున్న భ్రాంతిబోధలు తెలిపినట్లు ఈ బోధతెలుపలేదని అనుమానించి నీ మనసును యేమాత్రము సంశయములలో పెట్టుకొనకుము. నా గురుదేవుడు నాకు య్యే బోధతెలిపి నాలోయున్న సంశయాదులనెల్లయు నిర్మూలము జేయగలిగెనో ఆ బోధనే నీకు తెలిపితిని గాని అందులో నేనేమి దాచుకొనిచెప్పలేదు. ఈ మాటనిశ్చయమని నీమీద ఒట్టువేసుకొని చెప్పుచున్నాను. ఇంతకుమించిన విద్య యెచ్చటనైన యుండునేమోనని యే శాస్త్రములు వెదికినా యెవరు తెలిపిన ఏ బోధలువినిన దానివలన యే ప్రయోజనము ఉండబోదని దృఢముగ దెలుపుచున్నాను. అందువలన ఈ బోధను యేసమయములోనైనా మరచిపోక యుంటివేని నన్ను నీవు యెన్నడు మరచియుండలేవు. నిన్ను నేను యెన్నడు మరచియుండలేను. ఈమాట నిజమని గట్టిగా తెలుపుచున్నాను.

264. కం॥ నీ గురుబోధను నీచే - బాగుగవిని నిందసేయు భ్రష్టుల మాటల్ – లోగాని విడిచేవిది నీ - కేగురు డీలాటి బోధ నెరిగించడోయీ - యెరుకలోదె - యెరిగించునోయీ – ఆ గురుబోధల నన్నీ నేదెలసుండి – నా గురుబోధ నే నయముగ నీకిస్తి – యెరిగించడోయీ - యెరుకలోదె – యెరిగించునోయీ॥ 5

తా॥ శిష్యా! కొంతమంది పాడు బుద్ధి కలిగిన గురువులైనవారు, గురు పుత్రుల దగ్గరకుపోయి మీరు పొందిన రహస్యాన్ని దెలుపుమని అందులో యే దైనా లోపములున్న యెడల సరిగా తెలిపెదనని బలవంతముగా వారి నోటి గుండా ఆ రహస్యమును చెప్పించుకొని అబ్బెబ్బే మీకు నిజమైన దానిని మీ గురువు తెలుపలేదని, నా దగ్గరచేరి నాకు శిష్యుడవైతే ఆ నిజమైన దానిని నేను తెలుపగలనని అమాయక ప్రజలకు మాయమాటలు జెప్పి వారికి ముందున్న నమ్మకమును చెడగొట్టుచుందురు. అట్టి లోభి గురువుల కంటికి ఒకనాడు నీవు కనబడినప్పుడు వారి అలవాటు ప్రకారము నిన్నుగూడ నీ గురు రహస్యమును తెలుపుమని నీచేత చెప్పించుకొని అది మంచిదికాదని హేళన చేయుచుందురు. యెంతో కష్టపడి చేత చిక్కించుకొనిన ఈ మహత్తరమైన బోధను ఆ భ్రష్టుల మాటలువిని వృధాగా జారవిడుచుకొనకుము. నీకు నేను దెలిపిన పరిపూర్ణ బోధ యే గురువులు దెలుపక యెరుక బోధలనే చెప్పుచుందురుగాని, ఈ అచల బోధ మర్మములు వారికి తెలియబడకయుండును. ఆ బోధలన్నిటిని నేను బాగుగాయెరిగి, నీ మేలుకొరకు ఇంతగా తెలుపుచున్నాను. ఈ మాటను మరచి పోక మదిలో నిలుపుకొని, ఆ మోసగాళ్ళకు నీ గురు రహస్యమును యెన్నడూ తెలుపక యుండవలయును.

265. కం॥ నిక్కముగ బీరపీచుల - చిక్కు సుమీ విచ్చరాదు ఛీ యీ యెరుకన్ మక్కువ నే బోధించిన - చక్కని బోధాగ్నిచేత-సాధించుపోరా విచ్చేచింత చాలించుకోరా - చొక్కమౌ యీ బోధ కెక్కాడ యీడౌను - తక్కిన బోధాల దిక్కుచూడకదీన - సాధించుపోరా - విచ్చేచింత చాలించు కోరా॥ 6

తా॥ శిష్యా! ఈ యెరుకను గురించి విచారించుచున్నయెడల ఏ నిర్ణయ ములకు సాధ్యముగాక, బీరకాయ చిక్కులాగున చిక్కు చిక్కులుగా కనబడు చుండును. దీని సృష్టి విధానము చూచుచున్న కొలది యెంతో విచిత్రముగా కనుపించుచు, ఇది చేయు ప్రతిరూపము ఆశ్చర్యము కలిగించుచు, యెంతో గొప్పదిగా కనబడుచుండును. ఇట్లు చేయుచున్న యెరుక సత్తా యెంతటిదో చూడవలయునని ముందుకుపోయి చూచిన యెడల అచ్చట సారములేని నిస్సా రముగా కనబడుచుండును. దీని విధానము పరిశీలించుకొలది యెన్నో అల్లికలు గలదియై, బుద్ధిని చీకాకు పరచుచుండును. అట్టి యెరుకను ఛీ-ఛీ అని దాని

మాటే తలంచుకొనక నేను నీకు దెలిపిన చక్కని బోధాగ్నిచేత సాధించు కొన వలయునేగాని ఆ యెరుకను నిజమని మాత్రము నమ్మకూడదు. అట్లు సాధించి యెరిగిన మీాదట ఆ ఎరుక ఎంతటిదో, ఎట్లున్నదో అనే తలంపును పూర్తిగా విడిచిపెట్టి, నేను నీకు సాటిలేనిది మేటియైన యే పరిపూర్ణబోధను తెలిపి యుంటినో ఆ బోధకు సరియైనబోధ యే బోధ లేదని గట్టిగా నమ్మకము గలిగి ఇక యే బోధల దగ్గరకు పోవలయుననే కోరికను విడిచిపెట్టి యుండవలయును.

266. కం॥ అడివి వుశిరికెయు జలనిధి – బొడమిన లవణం బటించు బొగడిన రీతిన్ పుడమిని యీా స్థలమందున – కడు వేడుక నీవు నేను గల సూట వినరా – నీ నా ప్రేమ – గలసె కన్గొనరా – విడలేవు నీవు నన్ను విడలేను నే నిన్ను – పొడజూచి నీవు నే నెక్కడబోక – నిలచిట్లు గలసూట వినరా – నీ నా ప్రేమ – గలసె కన్గొనరా॥ 7

తా॥ శిష్యా! అడవిలో పుట్టిన వుసిరిక కాయకున్ను, సముద్రంలోపుట్టిన ఉప్పురాయికున్ను ఈ రెంటికి ఒక సంబంధ మేర్పడి, ఆ సంబంధములో ఒక ప్రత్యేకత కలిగిన రుచి పుట్టి నాలుకకు ఎంతో తృప్తి నిచ్చినట్లు మన మిద్దరము ఈ స్థానములో ఒక సంబంధ మేర్పరుచుకొని యెంతోపట్టుదలతో, విశాలమైన అభిలాషతో ఈ పరిపూర్ణ బోధను నేను నీకు సమగ్రముగా తెలుపుటలోగాని, అట్టిదానిని నీవు ఉత్తేజమైన మనసుతో వినుటయందుగాని మనమిద్దరము శ్రద్ధ తీసుకొనగలిగితిమి. ఈ అవకాశము మన ఇద్దరికి యెంతో తీరని సంతోషము ఆనందము నిచ్చుచున్నది. ఈ సంతోషానందములు యెక్కడ నుండి వచ్చినవనిన మన మిద్దరముకలిసి యే పరిపూర్ణబోధను గురించి విచారించుకొనుచుంటిమో ఆ పరిపూర్ణబోధ విచారణలో కలిగినతృప్తి, ఆనందమే ఈ సంతోషమునకు కారణముగ యున్నది. ఈ సంతోషము మన యిరువురికి ప్రాప్తించి నందువలన ఇక నీవు నన్ను మరచి ఒక్క క్షణమైనను వుండలేవు. నేను నిన్ను మరచి ఒక్క క్షణమైనను వుండలేను ఇట్లు మన ఇద్దరి ప్రేమ, ఏక స్వరూపముగా నిలచిపోయినదని తలంచుము.

267. కం॥ పెద్దల నిందయొనర్చకు – పెద్దల సేవించుకొరకు పిరిదివియకు మే – పెద్దలతో వాదించకు – పెద్దలుజెప్పేటి సుద్ది – పెడచెవి నకూ – పెద్దలు నడిచె – నడక నేమనకూ – పెద్దలకన్న నే పెద్దనంచను

కోకు - పెద్దలగనుగొన్న ప్రియముతో మ్రొక్కుము పెడచెవులవినకూ పెద్దలు నడిచె - నడకా నేమనకూ॥ 8

తా॥ శిష్యా! ఉత్తమమైన ఈ పరిపూర్ణ బోధను తెలుసుకొని అహంకారములేని వాడవై యుంటివి గనుక, ఇక యెప్పుడు పెద్దలను నిందించక వారిని భక్తి విశ్వాసములతో సేవించుటకుగాని, పూజించుటకుగాని వెనుకాడక యుండుము. పెద్దలతో యెప్పుడు కుయుక్తులతో కూడిన వితండవాదములు చేయబోకుము. గురువులైనవారు వారికి తెలిసిన ధర్మములు తెలుపుచుండగా పెడచెవులతో వినబోకుము. వారు తెలుపు మాటలనుగాని, వారు నడచే నడకలుగాని తప్పుగా తలంచి వారిపై కోపముతో తూలనాడకుము. పెద్దల కన్నను నేను పెద్దనని గర్వముతో మాట్లాడకుము. యెవరైనా పెద్దలు నీకు కనబడిన యెడల వారిని ప్రేమతో, భక్తితో నమస్కరించి, వారి అభిమానమును పొందు చుండిన యెడల నీకు క్షేమమే జరుగుచుండును.

268, కం॥ పెత్తనమున యేనుంగిల - చెత్తను దినవలసె చీమ చిన్నతనమునే - హత్తుకొని తినును చక్కెర - యిత్తరి యీ రెంట్లోనీకు యిష్టామేదైతె - చేకొను మదె - స్పష్టామిదైతే - పెత్తనమున చేటె పెంపొందు చుండూను - చిత్తాములోదెలయ - చిన్నతనమె మేలు - యిష్టామేదైతే - చేకొను మదె - స్పష్టామిదైతే॥ 9

తా॥ శిష్యా! సకల జీవులలో పెద్ద ఉపాది కలిగిన ఏనుగు, నేను పెద్ద దానినని అనుకొనుచు, ఆకులు కొమ్మలు చెత్త చెదారములు తిని తన ఆకలి బాధను తీర్చుకొను చుండును. చీమ సకల జీవులకన్నను చిన్నదైనను మృధు మధురమైన చెక్కెరను మాత్రమే తనకు కావలసినంతవరకు కొద్దిగా తీసుకొనుచు తన ఆకలిబాధను తీర్చుకొనుచుండును. అటులనే నీవుగూడ పదిమందికి పెద్దగా, గురువుగా యుండవలయుననే కోరిక యుండెనేని రాత్రింబవళ్లు అనేక శాస్త్రములుచదివి, వానినంత కంఠస్తముచేసుకొని, అడిగెడువారికెల్ల సమాధానములు చెప్పచు, అందులో కలిగెడు నిందాస్తుతులను భరించుచు వ్యాకుల చిత్తముతో ఉండడము మంచిదని అనుకుందువో! లేక చిన్నతనముగానేయుండి గురు వాఖ్యములమీద ఆధారపడి యే ఇతర ఆలోచనలుగాని, యే బాదరు బందీలు గాని లేకుండ స్థిమితముగా నీ వరకు నీవు వుండాలని అనుకుందువో, ఈ రెండు

పద్ధతులలో యే పద్ధతి నీకు మంచిదిగా, ఇష్టముగా యుండునో ఆ పద్ధతినే తీసుకొని నడుచుకొనుచుండుము. అది నీ మనసుమీదనే ఆధారపడియుండును.

వి॥ దుర్యోధనుడు పెద్దతనము తలమీదవేసుకొని పాండవులను తిరస్కరించి తానును, తనవంశమును సర్వనాశనము చేసుకొనినాడు. శ్రీకృష్ణుడు చిన్నతనము బుద్ధిలోనిలుపుకొని అర్జుననకు సారథియై లోకమున కంతయు పూజనీయుడైనాడు.

269. కం॥ తనకు శరణన్న వారల - మనసెట్టిదొ తరచిజూచి మరి తెల్పదగున్ - వినువారికి తగినట్టిది - యనిరిట్లు మహానుభావు లతిచాతుర్య మునా - వినికని నీ మను – సతిచాతుర్యమునా - ఘనమైన యీ బోధ కరుణిస్తి దీన్ని – వచ్చినదాక - నిదురా వచ్చినదాక – మరువాకు – మతిచాతుర్య మునా - విని కని నీ – మనుసతిచాతుర్యమునా॥ 10

తా॥ శిష్యా! సర్వశాస్త్రసంగ్రహమైన ఈ అచలబోధను తెలుపమని యెవరైన నిన్నుఆశ్రయించి ప్రాధేయపడిన యెడల వారిమనసును చక్కగా పరిశీలించి ఈ బోధను తెలుపవలయునేగాని కోరినంతమాత్రమున అన్నవారి కంత తెలుపకూడదు. ఈ బోధ అన్నిబోధలువలె సాధారణమైన బోధకాదు. ఈ బోధనిరాధారమైన బోధఅగుటవలన ఈబోధనుఅందుటకుగాని, ఈబోధలో నిలుచుటకుగాని, యెంతవారికి హృదయ బలముచాలక జారిపోవుచుందురు. అది గుర్తులోపెట్టుకొని తొందరపడక బాగుగ పరిశీలించుచు, వారివారి అభిలాషలకు తగిన బోధలనే దెలుపుచు వారిమనసును తృప్తిపరచి పంపుచుండవలయునని మహామహులైన పెద్దలెల్లరు చాలా అనుభవముతో ఆలోచించి తెలుపుచున్నారు. గురువు దగ్గరకు వచ్చేవారిలో చాలామంది కోర్కెలు పెట్టుకొని వచ్చుచుందురు. ఆ కోర్కెలకు తగినవిధముగానే బోధను బోధించుచుండవలయును. నేనుగూడ ఆ పద్ధతిగానే నిన్నుబాగుగ పరిశీలించి ఈ ఘనమైన బోధను అనుగ్రహించితిని గనుక అట్టి దానిని నీవు నిదురవచ్చేవరకు, మరణము కలిగేవరకు మరువక యుండినయెడల కృతార్థుడవు కాగలవని తెలుపుచున్నాను.

270. కం॥ చెప్పదగు గురుడు బోధను – చెప్పిన పనిజేసెనేని శిష్యాగ్రణికిన్ చెప్పదగదు చెప్పినపని – తప్పని వాదించేనేని - దయదల్చి బోధా- యిద్దరికుండ - దగునిట్టి మేధా – చెప్పి ముందుగ బోధ చెప్పండి పనులన్న

చెప్పాగూడదు వాన్ని తిప్పాలబెట్టాక - దయదల్చి బోధా - యిద్దరికుండదగు నిట్టిమేధా॥ 11

తా॥ శిష్యా! యెవరు గురువునందు విశ్వాసముతో భయభక్తులు కలిగి గురువాజ్ఞను మీరక, గురువు చెప్పిన మాటలను తిరస్కరించక గురువాక్యము లను శిరసావహించి నడచు కొనుచుందురో అట్టి వారికే ఈ అచల బోధను బోధించవలయును. అట్లుగాక గురువు దెలుపు హితవైన ధర్మములను చెవులో యే మాత్రము పెట్టుకొనక ఆ మాటలను తిరస్కరించుచు, పైన అట్లు తెలుప డము తప్పుగా భావించి అహంభావముతో గురువును తూలనాడుచు వాదించే వారలకు దయదలచి ఈ బోధ యెంత మాత్రము తెలుపకూడదు. వారిలో అహంకారము విడిచి పోవువరకు ముప్పతిప్పలుపెట్టి దాసాను దాసుడైనప్పుడే ఈ బోధను తెలుపవలయునుగాని, పొరపాటుతోనైనా అట్టివారికి ఈ మార్గము తెలిపిన ఎడల ఈ బోధలోయున్న అతి గోప్యములు వారి బుద్ధికి పట్టక నిస్సా రముగా కనబడుచు అందులో సుఖము తెలియలేని మూఢులై పోవుదురు. శిష్యు నకు గురువుయందు భయభక్తులును, గురువు శిష్యునియందు గాఢమైనప్రేమయు వీరిద్దరిలో ఆ ఐక్యత కుదిరిక కలిగినప్పుడే ఈ బోధ సులువుగా చేత చిక్కును గాని అట్లు గాకయున్న అందుబాటులో యుండడు.

గురుదత్తాభయదానం పదియేడవ అధ్యాయం సమాప్తము.



## - 18 సుజనలక్షణం. 6 -

271. కం॥ ఇవి వినుమనినను సుజనులు – చెవియొగ్గద రివియు సృష్టి జేసి కృతికి బలో - చవిబుట్టింతు రదెట్లన – శివుడు కళానిధిని చక్క – జేసేన లేదా - నీమది శంక – బాసేనలేదా – అవనిలో శ్రీ రాముడవగుణి నాహల్యా నెవరేమీ యన – కుండ – సవరించి సుగుణీగ – జేసేనలేదా - నీమదిశంక బాసేనలేదా॥ 1

తా॥ శిష్యా! ఉత్తమ లక్షణములు గలిగి సుజనులుగా యున్న వారిని ఈ పద్యములను చక్కగా చదువవలయుననియు, ఇందులోనున్న భావములను

శ్రద్ధతో చూడవలయుననియు నేను ప్రాధేయ పడవలసిన పనిలేదు. ఈకృతి నిర్మాణము మిగుల భావార్థములు కలిగి రసవంతముగ ఆనందముగా చెవులకు రుచి పుట్టుచున్న యెడల ఈ పద్యములను మీకు మీరే మనోహరముగా యున్నవని తలంచి ప్రీతితో చదువగలరు. పైన తప్పులున్న యెడల సవరించ గలరు. అది యెట్లనిన బృహస్పతి వలన శాపగ్రస్తుడైన చంద్రుని పరమేశ్వరుడు దయదలచి గురువు భార్యను పొందిన దోషమును రహితపరచి తన శిరమున ధరియించెను. మరియు భర్త శాపమునకు రాయిగా పడియున్న అహల్యను యెవరు కోరకనే శ్రీరామచంద్రుడు ఆ రాతిని నాతిగాజేసెను. అదే విధముగా సుగుణవంతులైన వారిని ఈ పద్యములను చక్కగా మాధుర్యవంతములైనవిగా చేయుమని నేను కోరవలసిన పనిలేదు, ఈ పద్యములలో నిజముగా ఆ మాధుర్యమే అణిగి యుండిన యెడల మీరు ఆనందించుచుందురు. మరి యొకరిని ఆనందింప జేయుదురని తలంచెదను.

272. కం॥ గురుసూచనైన నరులను – మరిమరి వినుమనుచు జదువుమా పద్యములన్ – గురుసూచన యెరుగని - యా - నరులను వినుమనుచు జదువ నగుబాటౌ గదరా – అధియట్లన్న - యిదిగో నే దెల్పెదరా -- పురుషా సంగతిలేని పొలతి కొక్కకశాస్త్ర - మరసి మెచ్చునె దాన్ని – యతి ప్రౌఢసతి వాలె – నగుబాటౌగదరా - అదియెట్లన్న – యిదిగో నే దెల్పెదరా॥ 2

తా॥ శిష్యా! నేను ఈ అచలబోధను కంధార్థములుగా రచించి, ఉపమాన ఉపమేయములుగా యెంతవివరించి తెలుపుచున్నను గురు శిక్షణ పొంది గురుదేవుని సౌజ్ఞను పొందినవారికి మాత్రమే ఈ పద్యములు వినుటయందు గాని, చదువుటయందుగాని, అభిలాషగలిగి మరి మరి వినవలయునని కుతూహలపడుచుందురు. అట్లు గురుశిక్షణపడక, గురుసౌజ్ఞలేని వారలకు ఈ పద్యములు వినుటకుగాని, చదువుటకుగాని, మనసు అంగీకరించక, యెంతోబాధతో గూడినవారై యెగతాళి, హేళన చేయుచుందురు. అదియెట్లనగా పురుషసంగతి నెరుగని స్త్రీని ఇదివినుమని అమెముందు కొక్కోకమను కామశాస్త్రము వినిపించిన యెడల అది ఆమెకు మెప్పుగసంతోషము కలిగించదు. అదే కొక్కోకశాస్త్రము పురుషసంగతి నెరిగిన ప్రౌఢవతికి వినిపించిన యెడల ఆమె యెంతో ఉత్సాహముతో ఆనందపడుచుండును. అటులనే ఈ కందార్థములు అచల గురుపుత్రులకే ఆనందము తృప్తిని ఇచ్చుచుండునుగాని, గురుపుత్రులు గానివారికి చదువుటకుగాని, వినుటకుగాని ఇష్టపడలేనివారై యుందురు.

273. కం॥ యెవరుంటె యేమిభయమురా - సవరింతురు తప్పులుంటె సాధులు విన్నన్ - సవరించనివ్వు మిదివిని యవనీతులు నిందజేస్తె -అయ్యే దేమోయీ - అందులో మనది - పొయ్యేదేమోయీ - భవనాశస్థితిలేని వర్గాతి యీ బోధ చౌరంగవినిపించు పాటేల మాటేల - అయ్యేదేమోయీ - అందులో మనది - పొయ్యేదేమోయీ॥ 3

తా॥ శిష్యా! ఈ కందార్థములను యెవరిముందునైనా చదువుటకుగాని, అందులోయున్నతీర్పులు వినుపించుటకుగాని, వారుయెంత తత్వవేత్తలుగాను, పెద్దలుగాను, కనిపించుచున్నను వారియెదుట తెలుపుటకు యే మాత్రము సంకోసించక, బాహాటముగా పలుకుచుండుము. వారు నిజముగా తత్వవేత్తలు. పెద్దలే అయియుండిన యెడల నిన్ను, నీ ప్రజ్ఞనుచూచి యెంతోసంతోషించి, ఆలింగనముచేసుకొనుచు నీవు తెలుపుదానిలో యేదైనా తప్పులున్నయెడల ఆ తప్పులను సవరించి ఈ విద్యను నిరూపణజేసి నిన్ను సంతోషింప జేయుదురు. అట్లు పూర్ణవేత్తలుగాక, అచలబోధలో ప్రవేశమే లేకయున్న పామరులైన వారు నీ మాటవిని నీవే చపలచిత్తుడవని పరిహాసము చేయుచుందురు. ఆ పరిహాసమువలన నీకు అయ్యేదిగాని, అందులో పొయ్యేది గాని, యేమి లేదు. గనుక పుట్టుకచావులులేని పరిపూర్ణబోధ రహస్యము పుట్టుక, చావులు కలిగిన బ్రహ్మవేత్తలకుగాని, పండితులకుగాని, యెన్నడు తెలిసియుండదని తలంచి వారు చేయు పరిహాసములకు తలవగ్గక యుండుము.

274. కం॥ పుట్టింట బిడ్డ బహుగా - దిట్టయి యుండినను యెవరు - దిట్టరు భువిలో - పుట్టింటివారు కోడలు - దిట్టయినను అత్తవారు - దిట్టేరు సుమ్మీ - చేతులకొద్ది - గొట్టేరుసుమ్మీ - అట్టుంబలెనె బహుదిట్టయిన శిష్యుని - తిట్టాడు గురుమూర్తి - వట్టివారుజూస్తె తిట్టేరుసుమ్మీ - చేతుల కొద్ది - గొట్టేరుసుమ్మీ॥ 4

తా॥ శిష్యా! ప్రపంచములో పుట్టింట ఆడబిడ్డ యెంత పెంకి తనముగాను, గడుసు తనముగాను, మిగుల మితిమీరి నడుచుకొను చుండినను, ఆమె తలిదండ్రులు, అన్నదమ్ములు గారాభముగా కొట్టక, తిట్టక సుకుమారముగా పోషించుకొనుచుందురు. ఆ ఇంటి కోడలు పెళుసుతనము, బిరుసుతనము లేక యెంత జాగ్రత్తగా, అనుకూలవతిగా వర్తించుచున్నను ఆమె అత్తమామలు మాటిమాటికి నోటికి వచ్చినట్లు తిట్టుచు, చేతులతో కొట్టు చుందురు. అటులనే ఈ పరిపూర్ణ

రుమూర్తి పాదజలమే గోదావరి యనియు, ఆ సద్గురు స్వామియే శ్రీరామ చంద్రుడనియు, ఆ గురుదేవుడు నివసించే పల్లెయే భద్రాచలమనియు, ఆ గురు మంత్రమే తన నిజస్వరూపమైన తారకమంత్రమనియు, ఆయన కృపాకటాక్షమే మరలా జన్మకురాని పరిపూర్ణసూచననియు, ఆయన కాపురము చేయుచున్న కుటీరమే శేషపాన్పుతోగూడిన శ్రీరంగనాయకుల శ్రీరంగపట్టణమనియు ఈ విధముగా యెవరిహృదయములో ఆ గురువుపైన విశ్వాసము గలిగియుండునో అట్టివారే గురుమహిమను తెలిసినవారై ఆ గురుస్వామిని యే మాత్రము మరు వక సదాగురుభక్తియందే నిలకడగలిగియుందురు.

244 కం॥ గురుడు నరుడనుచు దలచిన – గురుమంత్రము మరచి యున్న గురుపుత్రుల నా – దరణ యొనర్చక యుండిన – గురువును విడ నాడి రెండో – గురునీ జేరిననూ – సద్గురుబోధ – నెరిగీ దూరిననూ – యెరుక మహత్యాము నెరిగీన యిటువంటి నరునాకుదప్పాదు నరకాము నిజ మింకొ – గురునీ జేరిననూ – సద్గురుబోధ – నెరిగీ దూరినానూ॥ 13

తా॥ శిష్యా! గురుదేవుని సామాన్య మానవునిగ దలచినను, గురువుదెల్పిన మంత్రమును మరచియున్నను, గురుపుత్రులు ఎవరైన కనబడిన ఎడల వారిని ఆదరాభిమానములతో గౌరవించక యున్నను, పరిపూర్ణబోధ గురువును విడచి ఆ బోధవలన సిరిసంపదలు కలుగలేదని క్షుద్రదేవతల నుపాసించు మరియొక గురువు దగ్గర చేరినను, అచలబోధ నిస్సారమైనదని పరిహాసముగా మాట్లాడి నను, ఎరుక భ్రాంతి ఇట్టిదని ఎరిగిగూడ ఆ భ్రాంతులలో మునుగుచున్న వార లకు నరకమే ప్రాప్తించునుగాని శాంతి లేక యుండును.

245. కం॥ జ్ఞానవైరాగ్య భక్త్య – సమాన నదీస్నాన దేవమంత్ర పఠన – తధ్యాన మఖతంత్రములు పర – మాని నిరతి గోరునట్టి – మనుజా సంఘముకూ – బోధనుదెల్పు – మనిన వారలకూ – తానుబోధించూట తగదు బోధించితె – తాను నేనను భ్రాంతి తొలగెదేలాగట్టి – మనుజా సంఘముకూ- బోధనుదెల్పు – మనిన వారలకూ॥ 14

తా॥ శిష్యా! ఈ పరిశుద్ధమైన అచలబోధ యే భ్రాంతులు లేని వారికి మాత్రమే సాధ్యపడునుగాని, జ్ఞానమే దైవ స్వరూపమని తలచే వారలకుగాని, వైరాగ్యమే దొడ్డదని నమ్మేవారలకుగాని, దేవతాభక్తియే శ్రేష్ఠమనువారికిగాని,

276. కం॥ కాకంబులు సంపూర్ణాతటాకస్థ జలంబులెట్లు త్రాగక తృషచే – గై కొనునో కుంభజలము – ట్లీ కలియుగమందు – దుష్టు లింపు మీరగనూ – నిల్వరు బోధ - కంపూబారిననూ – మాకు దీనికె లంకె మాకేల యిట్టి-వికాకు కొక్కకమైతె గై కొందు మందూరు– యింపూమీరగనూ నిల్వరు బోధ - కంపూబారిననూ। 6

తా॥ శిష్యా! పరిశుద్ధమైన జలము ఏరులుగాను కాలువలుగాను, ఈ భూమి మీద ప్రవాహములుగా పారుచున్నను కాకులు మాత్రము ఆ శుద్ధజలము పానముజేసి దాహము తీర్చుకోలేక, కుళ్లు దుర్గంధవాసన కలిగి మురిగి పోయి యున్న కుండలయందును, తొట్లయందునుగల జలమును మాత్రమే వెతుకుచు పోయి ఆ కంపునీరును త్రాగినట్లుగా ఈ కలియుగములో యున్న మూఢ మానవులుగూడ నిష్కళంకము, నిర్మలము, సుఖకరమైన పరిపూర్ణబోధ దగ్గరకు పోయి శాంతిని, తృప్తిని పొందలేక అనేక కష్టములు ప్రయాసలతో గూడిన శాస్త్ర వాసనలయందు జిక్కుకొని యెరుకతోగూడిన భ్రాంతులకే తృప్తిపడుచు ఆ వింతలకే యెగబ్రాకుచుందురుగాని ఈ అచలబోధ మాత్రము వారికి సారములేనిదిగా అసంతృప్తిగా కనబడుచుండును. ఒకానొకప్పుడు వారితో ఈ పూర్ణబోధను పొందమని యెవరైనను చెప్పిన యెడల ఆ బోధను నిందించుచు, మాకు ఆ బోధకు సరిబోవునేగాని, మాకు కామ కలాపాలతో గూడిన శృంగార శాస్త్రములవంటి శాస్త్రములు అయితే మా మనసును యెంతో రంజింపజేసి తృప్తిపరచునని తెలుపుచుందురు.

సుజన లక్షణం పదునెనిమిదవ అధ్యాయం సమాప్తము.



## : 19 కుజన లక్షణం 4 :

277. కం॥ కుచ్చితమతియగు పురుషుని - చెచ్చెర వినుమనుచు జదువ శిష్టులవలె తా - ముచ్చటపాటుగ విన డివి – కుచ్చుల కుళ్ళాయి కుక్క – కూనాకెందుకురా - పిడుదుకు దుగ్ధ–పానామెందుకురా – హెచ్చైన ముత్యాలు పచ్చాలపతకాము– గుచ్చి పేరుగజేసి తెచ్చీవేసితె కోతి - కూనాకెందుకురా - పిడుదుకు దుగ్ధ పానామెందుకురా॥ 1

తా॥ శిష్యా! ఒక గురువునాశ్రయించి పరిపూర్ణబోధ పొందబడక తనకు తెలిసినట్లుగా నటించు కుచ్చిత స్వభావముగలవాని యెదుట ఈ కందార్థములను వినుమని చదువుచుండిన యెడల గురుపుత్రులు సంతోషపడినట్లు తాను సంతోష పడక, అందులో యేముంటే ఆ పనిగా చదువుచున్నారని గమనించక మూతి విరుచుకొనుచు, చిరాకుచూపుచు, తూలనాడుచుందురు. అది ఎట్లున్నదనిన పట్టు కుచ్చులతో అందముగా కుట్టిన చొక్కాను కుక్కపిల్లకు తొడిగిన యెడల ఆ చొక్కా నాణ్యతను గమనించక పీలిక, పీలికలుగా చింపిపారవేసి నట్లుగను, పొదుగు అంటుకొనియున్న పిడుదు పొదుగులోయున్న పాలురుచిని తెలుసుకోలేక రక్తమునే త్రాగినట్లుగను, యెక్కువ ఖరీదుకలిగి మంచిముత్యములతో గూర్చిన పచ్చలపతకమును ఒక రవ్వలహారములో గ్రుచ్చి కోతిమెడలో వేసిన యెడల ఆ అలంకారమును ఆ కోతి ఎరుగలేక ముక్కముక్కలుగా త్రెంపి చిన్నాభిన్నము వేసినట్లుగను అల్పమతులైన ఈ దుష్టమానవులు ఆ సమానబోధ గలిగిన ఈ కందార్థములలోయున్న భావములు తెలిసికొనలేక చులకనగా చూచుచుందురు.

278. కం॥ అక్షయ బోధ స్థితిగల - లక్షణవేత్తలకు మెప్పులైన కృతులలో - కక్షకు తప్పులు కుమతి - పరిక్షింపుచునుండు నెన్నొ - రీతూల వినుమీ - తద్భావ మీ రీతీది కనుమీ - మక్షీక మెప్పూడుమాని సుగంధాదు లీక్షించు వ్రణము - ప్రత్యక్షమెకద - యెన్నొరీతూల విను మీ - తద్భావ- మీరీతి గనుమీ॥ 2

తా॥ శిష్యా! ఈ అక్షయమైన పరిపూర్ణబోధను అందరికి తెలియులాగున కృతిరూపముగా చెప్పదలచి చందోబద్ధమైన వ్యాకరణాది లక్షణములతో చాలా శ్రమపడి పండితవేత్తలకు మెప్పుకలుగునటుల ఈ గ్రంథమును రచించితిని. ఇట్టి గ్రంథముపై పాడుబుద్ధిగలిగిన దుష్టమానవులు యెక్కడ తప్పులుండునా, యేచోట తప్పులు దొరుకునా యని పనిగట్టుకొని అనేకరీతులుగా పరీక్షించు చుందురు. అట్టివారి దుర్బుద్ధి యెట్లుండుననిన ఈగలు సుగంధద్రవ్యములపై యెన్నడు వాలక దుర్గంధముతో గూడి చీమునెత్తురు కలిగిన చండాలమైన కురుపులనే వెతుకుకొనుచుండును. అటులనే కుట్రస్వభావము కలిగిన కుచ్చిత మతులు మంచిని యే మాత్రము తీసికొనక చెడ్డనుమాత్రమే వెతికి వెతికి తప్పులు పట్టుచుందురు. ఇదివారి సంస్కారముగ భావించవలయును.

279. కం॥ రమ్మని పిలువనిదే ప - ద్యమ్ములు జదువంగవచ్చి యతినిందించున్ సమ్మతిగాక కుమతి విని - యిమ్మహి యదియెట్లనన్న - నిట్లానే వినుమిా - వానిబుధ్యదట్లానె కనుమిా - బొమ్మలాటలో దిచ్చబొమ్మ తా నొకటి ఛీ - పొమ్మానియని నాహాస్యమ్మెనర్చదె పోక - నిట్లానె వినుమిా వానిబుధ్య - దట్లానె కనుమిా॥ 3

తా॥ శిష్యా! ఈ మనోహరమైన కందార్థములను ఇతర జనుల దగ్గరకాని, వేదాంత సభలలోగాని వివరించుచున్న సందర్భములలో వారిని రమ్మని పిలువ కనే మూర్ఖులు వారికి వారే వచ్చి వారికేదో తెలిసినట్లుగా అడ్డమాటలు మాట్లా డుచు, పరిహాసముతో కూడిన ప్రసంగములు చేయుచు, కోతి యెగురులు యెగు రుచు నిందలతో గూడిన వాఖ్యములు విసరుచుందురు. అది యెట్లుండుననిన, బొమ్మలాటలలో ఆ కథకు పాత్రధారికాకనే ఒక జుట్టుపోలిగాడు వకడు వచ్చి మధ్య మధ్యన కనబడుచు ఆ కథకు అంతరాయం కలిగించుచు, యెగతాళితో గూడిన హాస్యపు మాటలు మాట్లాడుచు ప్రజలను నవ్వించుచుండును. అతనిని ఛీ-ఛీ-పో-పో అని తిరస్కరించుచుండినను ఆ మాటలు అతను చెవిని పట్టించు కొనక తన వేంగ్యపు మాటల ధోరణిలోనే వాగుచుండును. అటులనే దుర్జను లైనవారు ఈ కందార్థములలోయున్న గూడార్థములు ఎన్నడు విని, కని, ఎరు గక యుండినను వారికేదో తెలిసినట్లుగా మూర్ఖపు ప్రసంగములు చేయుచు, తన గొప్పలను తెలియపరచుట కొరకు వినేవారినిగూడ వినకుండ చెడగొట్టుట వారికి పుట్టుకతో వచ్చిన పాపిష్టి బుద్ధియె యుండును.

280. కం॥ వటియించిన చన్నులుగల - కుటిలాలకి నిందజేయు గుత్తపు రవికెన్ - యెటువలె తన తప్పెరుగక - నటువలె గంధమును మెచ్చ డతి దుర్జనుండూ - లేనిదె తప్పు - వెతుకూచునుండూ యిటువంటి బోధనే నెరిగెదట్లనుకోక - కటువాక్యములుబల్కి ఘనులగా సిలజేయు - నతి దుర్జ నుండూ - లేనిదె తప్పు వెతుకూచునుండూ॥ 4

తా॥ శిష్యా! శరీరము శుష్కించి స్థనములలోయున్న మాంసము తరుగు పడిన ఆడమనిషి తాను మామూలుగ రవికను తొడుగుకొని తనకు ముందు మాదిరిగా బిర్రుగా యుండక వదులొదులుగా యున్నదని ఈ పాడురవిక బాగుగలేదని రవికను నిందించుచుండును. గానీ తన శరీరబలము, స్థనముల బలము, తగ్గిపోవుటవలన ఈ రవికవదులు అయినదని అలోచించదు. అటులనే

క్రూరబుద్ధి గలిగిన దుర్మార్గులు అంతో, ఇంతో బ్రహ్మవిద్యలో ప్రవేశము కలిగియుండిగూడ వారు పొందిన విద్య అల్ప విద్య అనియు, ఆ విద్య అచల విద్యముందు నిలువబోదని తెలియక వారు పొందియున్న విద్యనే గొప్పగా తలంచుచు అంతకు మినహా యే విద్యాలేదని పరిపూర్ణ విద్యను తూలనాడుచు ఈ కందార్థములలో తప్పులున్నవని ఆ తప్పులను వెదుకుచు అచల బోధను దూషించే పనిలోనే యుందురుగాని యేనాడైన ఇటువంటి పరిపూర్ణబోధను మనము పొందలేక పోతిమె, ఆ ప్రాప్తము కలుగక పోయెనే అనే జిజ్ఞాసగాని, ఆ పరితాపముగాని ఆ దుర్జనులకు కలలోనైనా ఆ తలంపు పుట్టనే పుట్టదు. అది వారిలోయున్న అహంభావమే. నిజము దగ్గరకు పోనివ్వక చేయుచున్నదని తలంచుము.

కుజన లక్షణం పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము.



: 20 శిష్య విజ్ఞాపన 8 :

281. కం॥ గురువర మీ నా సందున – యెరుకను తెరగలిగి – యుండె యిన్నాళ్ళగొలెన్ – కరుణార సేక్షణములన్ – తెరదీసితి రెరుకమాట- దీరె నిక్కడికీ – వాలు బోధ – దూరే డెక్కడికీ – పరిపూర్ణమునులేని యెరు కాను జూపించి – యెరుక లేదనియంత్రి యెరుకె లేదాయాను – తీరెనిక్కడికీ వాలు బోధ – దూరేదెక్కడికీ॥ 1

తా॥ మహాత్మా, గురుదేవా ఇప్పటివరకు మీ నోటి ద్వారా వెలువడిన ఈ పరిపూర్ణబోధ రహస్యమును బాగుగ, తృప్తిగ నేను వినిన మీదట నా కిట్లు తోస్తూయున్నది. ఇంతకుముందు మన యిద్దరిమద్య సంశయమనే యెరుకనేతెర ఒకటియుండి సత్యా సత్యములను తెలియనీయక జేస్తూయుండి నది. ఇప్పుడు మీ కరుణాకటాక్షము వలన ఆ భ్రాంతి అనేతెర తొలగిపోయి నది. ఆ తెర యెప్పుడు తొలగిపోయినదో యెరుకమాటగూడ నాలో సమూల ముగ నాశనమైనది. ఆ యెరుక యెప్పుడు నాశనమైనదో యెరుకతో గూడిన సకల భ్రాంతులు, సకల సంశయములన్నియు నిలువునా దగ్ధమై పోయినవి.

ఇప్పటికి నా మనోవికారములన్నియు నశించి నిర్భయముగాయుండుస్థితి నాకు ప్రాప్తమైనది. ఇక ఈ బోధ చాలును యేదో యున్నదనియు, దానిని చూడ వలయుననియు. దానిని గురించి వినవలయుననియు, ఆ కోరిక నాలో తుడిచి వేసినట్లు పోయినది. ఏనాడు మీరు నాకు వున్న పరిపూర్ణమును తెలియపరచి ఆ పరిపూర్ణములో ఈ ఎరుక లేకనే వచ్చిన మర్మమును స్పష్టముగా ప్రత్యక్ష ముగా నిరూపణజేసి చూపించినందువలన ఈ యెరుక లేనిదేనని నాకు బాగుగా దృఢమై ఎండమావులవలె కనుపించుచు, విచారించిన లేనిదేనని నిస్సంశయ ముగా తేలినది. ఇట్టి లేని ఎరుకను పరిపూర్ణమగుననియు, బయలు అగుననియు తెలుపు బోధగురువుల మాటలుగూడా దబ్బర మాటలేనని నాకు నాకే స్పష్ట ముగా తెలియుచున్నది. అందువలన ఈ నాటికి నా శంకలన్నియుతీరి వున్నది వున్నట్లుగ, లేనిది లేనట్లుగ గ్రహించే నేర్పు మీ పాదసేవ వలన గలిగిన భాగ్యమని తలంచి సంతోషించుచున్నాను.

282. కం॥ ధారుణి కొంత జరించి వి – చారించితి గాని యీ విచార ము నే నె - వ్వారలు జెప్పగ వినలే - దారయ మీనోట విన్న - దయ్యా గురుమూర్తీ - నాతరమా నుతి – జెయ్యా మీకీర్తి - నారాసనయన పురారి నీరజ బృం - దారాక ముఖులై నేరాను మిముదెలియనయ్యా గురుమూర్తి – నాతరమా నుతి – జెయ్యా మీకీర్తి॥ 2

తా॥ గురుదేవా! మీ వద్దకు రాకమునుపు నా హృదయ తాపా గ్నిని చల్లార్చు మహాత్ములు యెచ్చట యున్నారో, యెవరై యున్నారో అని ఆరాటపడుచు అనేక దేశములెల్లను తిరిగి చూచితిని. అనేక మంది గురువులతో గురుపుత్రులతో కలసి మెలగితిని. వారుచేయు సంభాషణ లెల్లయు యెంతో ఓపికగా శ్రద్ధగా వినుచుంటిని. ఈ విధముగా పరిపూర్ణ బోధను విశదముగా రూఢిపరచి మరల సంశయములు పుట్టకుండ తెలుపుచున్న గురువు నాకు ఎక్క డను, యెవ్వరును కనుపించలేదు. అట్టివారినిగూడ నేను చూడలేదు. ఒకానొ కప్పుడు గురువులు కనబడినను నేను ఒకటి అడిగితే వారు ఒకటి తెలుపుచు వున్నమతినిగూడ చెడగొట్టువారేగాని మీవలె అడిగిన దానిని అర్థము చేసుకొని సూటిగా సమాధానము చెప్పేవారు యెచ్చటను కనబడలేదు. మీరు ఒకరు మాత్రమే నా కంటికి కనబడుచు, మీ నోటినుండి వచ్చు అమృత వాక్యములు ఈ చక్కని అచలబోధను వినగలుగుచు, నేనెంతో సంతృప్తుడనై ఆనందపడుచు

నా భాగ్యమేమని నాకు నేనే తలంచుచున్నాను. ఇట్టి తృప్తిని నాకు కలుగజేసిన మీ గొప్ప తనమును మీ కీర్తిని, మీ విశాలమైన ప్రతిభను వర్ణించుటకు ఆ బ్రహ్మాది దేవతలకుకూడ సాధ్యము కానప్పుడు నేనెంతటి వాడనని మీ చరణ కమలములకు ప్రణమిల్లుచున్నాను.

283. కం॥ ఘట మెదుటబెట్టి చూపిన – యెటువలె బయలుండజూపి యతి మాయలచే – నటియింపుచున్న యెరుకను – తృటిలో విడిపిస్తిరిపుడు – దీరె మచ్ఛంకా – యిక బుట్టాదు – యేరీతి శంకా – యెటుదోచకిలువెళ్ళి యిట మిమ్ము జూచిన – ప్పటినుంచి దయజేసిప్పటిదాక బోధిస్తె – తీరె మచ్ఛంకా – యిక బుట్టాదు యేరీతి శంకా॥ 3

తా॥ అయ్యా గురుదేవా! యే రూపముగాని, యే నామముగాని, యే క్రియతోగూడిన ఉపాదిదోషములుగాని అ పరిపూర్ణమునందు లేక యున్నను. అట్టి నిరూపాదికమైన పూర్ణబయలును నాకు తెలియజేయుటలో కుండను ఎదుట బెట్టి చూపినటుల యెంతో సమర్థవంతముగా, సులువుగా తెలియజేసితిరి. ఆ మీదట యెన్నోరూపములతో, యెన్నోనామములతో, యెన్నోనటనలతో నటించుచున్న ఈ మాయయెరుకను ఒకక్షణములో నిలువునాలేకుండ జేసితిరి. ఇప్పటికి నా సందేహము లెల్లయు పూర్తిగా నిర్మూలమై మరలా ఆ యెరుక మాట పుట్టకుండాపోయెను. ముందు నాలోయున్న పరితాపములు, నాలోయున్న అలసట లెల్లయు తీర్చువారు యెవరు గలరాయని యెతుకుచు యెటుతోచక నాయింటినుండి మీయింటికి వచ్చిననాటినుండి ఈనాటివరకు నాయందు ఎంతోదయతో ఈ బోధనుగురించి యెన్నో ఉపమానములు ఉపమేయములతో విసుగులేక బోధించినందువలన ఇప్పటకి నా సర్వదుఃఖములన్నియు తీరిపోయి నిర్మలస్థితి ప్రాప్తించినందువలన ఇక యే శంకలుగాని, యే కొఱతలుగాని, యే భ్రాంతులుగాని పుట్టబోవని గట్టిగా మీ పాదములుతాకి చెప్పుచున్నాను.

284. కం॥ ఒరులు నేననక నిండిన – దెరిగింపు మదేమొ బయలు యేనొరులనుచున్ – యెరుగు నీవెవరు యీ – లేనెరుకను వున్నావు వుంటె – యిది లేనంచనుకో – నేనానిను నీ – మదినీ లేననుకో యెరిగి యీ లేనెరుక యిట్లా లేకుండీతె – పరిపూర్ణమో – దాన్నె పగిదీ గుర్తెరిగేము – యిది లేనంచనుకో – నేనానిను నీ – మదిని లేననుకో॥ 4

తా॥ శిష్యా! ఈ అచల పరిపూర్ణమునందు యెరుక అనునది లేకపోవుట వలన నీవని-నేనని-పరులని ప్రపంచమని యేదానిని యెరుగక తనకు తాను గానె ఆ బట్టబయలు వున్నదని, యెవరితోనైనా నిర్భయముగా తెలుపు చుండుము. నీవనియు, పరులనియు, ప్రపంచమనియు సర్వమును యెరుగు చుండునది ఈ యెరుకేనని దృఢముగా దెలుపుచుండుము. నీ మదిలోగూడ ఆ నమ్మకము చెదరక స్థిరపడియుండుము. ఒకవేళ నీ భావనలో నేను వుండుట చేతనేగదా ఆ పరిపూర్ణ మెరుకలను నెరిగినదని అందువేమో, అట్లు అనినను నీవులేనివాడవుగనుక లేనివాడవు లేనివాడుగానే నీ బుద్ధిలోనిలుపుకొని నీవు లేక పోయినవెనుక ఆ బట్టబయలు మాత్రమే శాశ్వతమై స్థిరముగా యుండును. ఆ తరువాత ఇది పూర్ణమనిగాని, ఇది అచలమనిగాని, ఇది బయలనిగాని యెరిగి తెలుపుటకు యెరుక లేకుండాపోవును. ఆ విషయము స్వానుభవముతో విచా రించుకొని నిన్నునీవు విడిచి యుండవలయును.

285. కం॥ నాబుద్ధికి సరిపడ్డది - నీబుద్దేకాని యన్ని నేర్పుల గనినన్ ఛీ బద్ధులయా బుద్ధులు - నా బుద్ధికి మెప్పురావు నా తండ్రి వినరా - శాబాసు ని న్నే – తండ్రి గనెరా – యీ బుద్ధినిక మానకే బుద్ధి బూనాకు - యే బుద్ధి బూనీన నీ – బుద్ధి చెడిపోవు – నా తండ్రి వినరా శాబాసు నిన్నే - తండ్రి గనెరా॥ 5

తా॥ శిష్యా! యెంతవారికి భ్రమను గలిగించు అష్టాంగ యోగములు అణి మాది అష్టసిద్ధులు లోకములో యెన్నో విద్యలు వుండగా ఆ విద్యలవంకకు నీ బుద్ధిని పోనివ్వక ఈ పరిపూర్ణ విద్యకొరకు నా వద్దకువచ్చి ఆ విద్యను సాంగోపాంగముగ గ్రహించి సకల సంశయములెల్ల తీర్చుకొని సంతోషపడు చున్న నిన్నుజూచి నేను సంతోషపడుచు నిన్ను యే తండ్రిగనినాడో, నీ పూర్వ పుణ్య మెంతటిదోనని నీ మీద నాకు యెంతో ప్రేమ ప్రీతి గలిగి నీ అంతటి వాడు లేడని శబాష్ అని మెచ్చుకొనుచున్నాను. లోకులందరు అసత్యమైన- యెరుక భ్రాంతులకు వశపడి, ఉపవాసాది నియమ కర్మలకు బద్ధులై వాటి వలన వారికేదో మూట వచ్చునను భ్రాంతులతో జీవితమంతా వ్యర్థము చేసు కొనుచున్న వారి బుద్ధులను చూచి ఛీ–ఛీ–అని నేనెంతో నొచ్చుకొనుచున్నాను. నీవు అట్టి నిరర్థకమైన పనులుచేయక నీకిప్పుడుయున్న మంచి బుద్ధిని విడువక

చెడ్డవారి సాంగత్యము కోరక యెల్లప్పుడు భద్రతగా యుండవలయునని నీ మంచిగోరి తెలుపుచున్నాను.

286. కం॥ కొట్టితి తిట్టితి శ్రమలన్ - బెట్టితి నీమనవి చెవునం బెట్టక పెడచౌ - బెట్టితి మొట్టితి వెడలన్ - గొట్టితి నీమనసు దెలియ-కోపాములేకా సరె తెలిసె నీ - వోపికపోకా పట్టుమిచ్చెద యింక నట్టేమియని దయ - బుట్టి యిచ్చితి బోధ - గట్టివాడవురోరి కోపాములేకా - సరె తెలిసె నీ వోపిక పోకా॥ 6

తా॥ శిష్యా! యెంతకాలము నుండియో నిన్ను ఆవరించి ఏ కర్మలచేతను వదలిపోక పాదుకొనియున్న భ్రాంతి, జ్ఞానము నేను దెలుపు పూర్ణబోధ వలన నిన్ను విడచి పోవలయుననియు, నీలోయున్న వికారములన్నియు తొలగి ఆ బోధ స్థిరపడవలయుననియు, నిన్ను యెన్నో విధముల మందలించుచు, మాటి మాటికి తిట్టుచు, కారణము లేకనే కొట్టుచు నీవు ఈ విద్యకు తగిన వాడవు కాదని మెడబట్టి నెట్టుచు, ఎన్నో విధముల నీమీద దయా దాక్షిణ్యములు లేక పెట్టరాని శ్రమలన్నియు బెట్టితిని. ఇన్ని బాధలకెల్లయు భరించి యెంతో ఓపికతో నొప్పిబడకయున్నందుకు నీవు గట్టివాడవని, ఈ విద్యకు తగినవాడ వని నీమీద దయదలచి ఈ అచలబోధను దెలిపి నీలోనున్న అజ్ఞాన గ్రంధు లన్నియు నిర్మూలము జేసితిని. నిన్ను ఎంతో ప్రయోజకుడను చేయవలయునని దృఢమైన ప్రేమతో అంత కఠినముగా ప్రవర్తించితినిగాని నీమీద నాకు యెన్నడూ కోపములేదని మనసిచ్చి తెలుపుచున్నాను.

287. కం॥ నీ వెంత కొట్టి తిట్టిన - నే విడిచేవాడగాను నీ చరణం బుల్ - చావైన పెండ్లియైనను - నే విడువనటంటి వట్టి నిజభక్తుడవెరా నే గనుగొంటి - నీ నిష్ట నౌరా - కావున నీకిట్టి ఘనమైన యీ బోధ - నే వేగ దయజేస్తి నీ విది విడువాకు - నిజభక్తుడవెరా - నే గనుగొంటి - నీ నిష్ట నౌరా॥ 7

తా॥ శిష్యా! నా యందు నీకు గల దృఢమైన భక్తికినీ, ఈ అచల బోధ యందు నీకు గల నమ్మకమునకు, ఈ బోధ నీకు పట్టుటకు నిన్ను నేను యే మాత్రము దయదలచక కొట్టుచున్నను, తిట్టుచున్నను, మెడబట్టి నెట్టుచున్నను, ఆ బాధలన్నిటికి ఓర్చుకొనుచు నీతో అవసరమైన నీ ఇంటి యందు పెండ్లి

జరుగుచున్నను, చావు కలిగియున్నను నీ పాదములు విడచి ఒక క్షణమైనను ఉండలేనని, ఆ యెడబాటుకు సహించలేనని గట్టి పట్టుతో నిలబడిన వాడవు గనుక నీలో స్థిరపడియున్న గురుదీక్షను, గురుభక్తిని, గురునిష్టను మెచ్చు కొనుచు సర్వ బోధలకు శ్రేష్ఠమైనది, సదసత్తుల కతీతమైనది, సారాసార విల క్షణమైన ఈ అచల పరిపూర్ణ విద్యను నీమీద కరుణచేత బోధించితిని గనుక అట్టి విద్యను సర్వకాల సర్వావస్థలయందును మరువక దాచుకొని యుండ వల యునని నా మాటగా దెలుపుచున్నాను.

288. కం॥ నా నోటిమాట వెంబడి – తా నెప్పుడు సంచరించె తగనీ చిత్తం – బే నడిగని యీ బోధ – నిధానము నీకి స్తిదిన్ని– దాచూకొనుమ్మీ – నిత్యము నీవు – చూచుకొనమ్మీ – యే నరుడైన నిన్నీబోధ – నడిగితె – వాని మనుసరయాక వానికి జూపేవు – దాచుకొనుమ్మీ – నిత్యమునీవు – చూచుకొనమ్మీ॥ 8

తా॥ శిష్యా! నా మాట కొరకు యెదురు చూచుచు నేను తెలుపక యుండి నను నాకు అవసరమైన పనులుజేయుచు నాకు అనువైన పద్ధతిలో నీవు వున్నావో, లేవో నని నిన్ను నిదానముగా పరిశీలించి ఈ బోధను నీకు అనుగ్ర హించితిని. అట్టి బోధను నీవు యెంతో భద్రతగా దాచుకొనుచు, నిత్యము చూచు కొనుచు యుండవలయును. యెవరైన ఈ బోధను తెలుపుమని ప్రాధేయపడిన ఎడల వారి మనసును తరచి తెలుసుకోనిదే ఈ బోధను యే మాత్రము తెలుప గూడదు, ఈ పరిపూర్ణమును జూపకూడదు. తొందరపడి చూపిన యెడల అం దులోయున్న ఉన్నతస్థితిని తెలుసుకొనలేక తాను చెడుటయేగాక పరిపూర్ణ విద్యను చెడగొట్టి అపనిందలపాలు చేయుచుండును. ఈ పరిపూర్ణ బోధలో యున్న సుఖమును పొందుటకు అంతటి అర్హత గలిగినవారే ఆ సుఖమును అనుభవించగలరుగాని, సామాన్యులకు ఈ బోధ పట్టుబడని బోధయని నీవు బాగుగా ఆలోచించుకొని తగినవారలకే తెలుపవలయును. శిష్యుల కొఱకు కొఱగాని వారికంతా తెలిపిన ఎడల అపురూపమైన ఈ అచలవిద్య బజారుపాలు అగునని గుర్తులో పెట్టుకొని యుండవలయును.

శిష్య విజ్ఞాపన యిరవయవ అధ్యాయం సమాప్తము.



- 21 గ్రంథ పూర్తి. 3 -

289. కం॥ కూడి గురుశిష్యు లిద్దరు - వేడుకతో బయలువున్న విధ మెరిగెరుకన్ వీడిరిది లేనిదని – మాటాడుట కిక యేమి దోచ – దదియేమొ కానీ - వింటిరె మీరలిది - యిందులోని - జాడ మీ కెరుకాని వేడీతి విను మంచు – యీడికి సరి ము – చ్చటాడూట కిక వోచ – దదియేమొ కానీ – వింటిరె మీర – లిది యిందులోనీ॥ 1

తా॥ ఓజనులారా! బుద్ధికి అగ్రాహ్యమైన ఈ అచలబోధనుగురించి గురుశిష్యులిద్దరు ఒక చోటచేరి సంతోషముతో పరిపూర్ణయెరుకలను గుఱించి విచారించుకొని ఉన్న పరిపూర్ణమును ఉన్నదిగా నిలుపుకొని, లేని యెరుకను లేనిదిగా యెరిగిన మీదట ఇక యెరుకమాటే లేకుండాపోవును. యెరుక యెప్పుడు లేకపోయినదో ఇది వున్నదనిగాని. లేనిదనిగానిచెప్పువారు అచ్చట యెవరు లేక పోవుటవలన ఇక మాట్లాడుటకు మాటేరాకపోవుచున్నది. ఇదియెంత విచిత్రమో, అక్కడ యెరుక యేమైనదో నాకు యేమిదోచక యున్నందువలన ఈ రహస్యము తెలుపుకొరకు ఈ గ్రంథమును రచించి మీ ముందరబెట్టితిని. దీనిని ఆసాంతము చదివి ఈ యెరుక మూలగుట్టును దెలియుమని ప్రార్థిస్తూయున్నాను.

290. కం॥ శరశాస్త్రస్వర హిమకర (1765) పరిమితమైనట్టి శాలి వాహన శకమం – దరయగ శోభకృదను వ – త్సర మార్గశిరంబు కృష్ణ – చవితి నాటికి నీ – పద్యాల్పది దక్కువ – మున్నూటికినీ మురయూచు జేస్తి నెవ్వరు విన్న చదివీన - పరిపూర్ణమెరుకై - లేనెరుక లేకుండూనె – చవితీ నాటికి నీ – పద్యాల్పది దక్కువ – మున్నూటికినీ॥ 2

తా॥ సుజనులారా! పరమపవిత్రమైన అచలబోధను కందార్థముల రూపముగా వివరించి ముగింపు కందార్థమునందు "శరశాస్త్రస్వరహిమకర" అని తెలిపియున్నది. ఒకచంద్రుడు, యేడుస్వరములు, ఆరుశాస్త్రములు,ఐదుమన్మథ బాణంబులు అని తెలిపిన ఈ నాలుగు అంకెలను వరుసగా ఒకదగ్గర పెట్టిన యెడల 1765 అని చూపబడును. ఈ లెక్కకు పరిమితిగాయున్న శాలివాహన శకమునకు సరియగు శోభకృతు నామసంవత్సర మార్గశిర బహుళ చవితినాటికి పదితక్కువ మూడువందలు కందార్థములను నే నెంతో సంతోషముతో క్రీ.శ. 1843వ సంవత్సరమున వ్రాసితిని. ఈ పద్యములను యెవరైనను స్వయముగా

చదివినను లేదా ఇతరులవలన విన్నను అకళంకమైన పరిపూర్ణబయలును దర్శించగలిగి ఆపైన లేనియెరుకను లేకుండాజేయుచు జనన మరణములని యెడు భవసాగరమును దాటింపజేయునని తెలియపరచుచున్నాను.

291. కం॥ ఏ పురుషుడు గురువర్యుని - శ్రీపాదము బట్టలేదో సేలుగ నాతం - డీ పుస్తకమును జూచిన – యేపట్టున నిలువ కేగునిది - నిజమయ్యా నరులార మీ - మది దెలియరయ్యా యీ పరమ గోప్యాము యెవరెరుగ రోయయ్య – నాపల్కు మదిలోన నాటీనవారికె యిది నిజమయ్యా - నరులార మీ మది దెలియరయ్యా॥ 3

తా॥ సుగుణవంతులారా! ఈ లోకములో యెంతటివారు అయినను శ్రీ అచల సద్గురు స్వాములవారి పాద పంకజములపై శిరస్సు మోపలేదో, వారి అమృత వాక్యములనైనా వినలేదో అట్టివారు ఈ కందార్థములలోయున్న మాధుర్య మును తెలియజాలక ఈ గ్రంథమును చదువుటకుగాని, వినుటకుగాని ఇష్ట పడక, ఆ ప్రక్కనైనా నిలబడుటకు అంగీకరింపబడక దూర దూరముగా పోవు చుందురు. అట్లు పోవువారిని గూడమీరు ప్రత్యక్షముగా జూచుచుందురు· ఈ పరమగోప్యమైన అచలబోధ యెంతవారు యెరుగజాలక, పొందుటకు సాధ్యము గాక యుండును. నా మాటలపై యెవరికి నమ్మకము యుండునో వారే ఈ గ్రంథములోయున్న రుచిని అనుభవించుకోగలరని. వారికే ఈ బోధ తగియున్న దని నేను విశ్వసించుచు నా అభిప్రాయము తెలుపుచున్నాను.

గ్రంథపూర్తి యిరువది ఒకటవ అధ్యాయం సమాప్తము.



## : 22 గ్రంథ సమాప్తి. 1 :

292· కం॥ ఎరుక నెరుంగని బయలులో - గురుడును శిష్యుండు వారి గొడవయునే మీ - కెరిగించిన వన్నియు -- మీ రెరిగినవన్నియును మీర - లేను నుళ్ళక్కి – వుళ్ళక్కి తా - నెప్పూడుళ్ళక్కి మరి యింక మాటాడ మాటె లే - దాయాను సరిపాయ సరిపోతె సరిపాయ సరి మీర – లేను నుళ్ళక్కి - ఉళ్ళక్కి తా - నెప్పుడుళ్ళక్కి॥ 1

తా॥ సుజనులారా! యెరుక యెటువంటిదో తెలియని పరిపూర్ణములో గురు శిష్యులిద్దరు లేకనే రావడముగాని, వారిద్దరు సంభాషించు కోవడముగాని, ఆ సంభాషణలో ఇద్దరు సంతోషపడడముగాని ఇది అంతా ఉత్తదేనని లేనెరుక గొడవలేనని భావించవలయును. యెరుకతో గూడిన నేనుగాని, మీరుగాని యెచ్చట నుండి వచ్చినామో, యెచ్చటికి పోవుచున్నామో విచారించిన యెడల స్వప్నములో రావడము, పోవడము యెంతమాత్రముగా యుండునో, అంత మాత్రముగానే యుండును. ఇప్పటి వరకు నేను బోధించిన బోధగాని, అందు తెలుసుకొన్న సర్వ విషయములుగాని కలలో ముచ్చటలేనని తెలిసిన యెడల అంతా లేనిదిగానే గోచరించుచు, ఇక మాట్లాడుటకు నేనుగాని, వినేదానికి మీరుగాని ఇద్దరము మూలములేని వారమని తెలిసికొని ఇక ఇక్కడికి యెరుకమాట సరిపుచ్చుకొన్న యెడల ఇక యే కలవరములు కలుగక కలలో కనబడిన సంపదను గురించి ఆలోచించినట్లుగా యుండును.

గ్రంథ సమాప్తి యిరవయి రెండవ అధ్యాయము సమాప్తము.

   

ఇతి॥ శ్రీ మద్రాజాధి రాజ – మహారాజ - రాజ యోగీంద్ర చంద్రులగు శ్రీ మద్భాగవతుల కృష్ణదేశిక ప్రభువర్యులచే విరచితంబగు శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణతత్వ కందార్థ దరువులకు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయకులును, శ్రీ ఫీల్ఖాన శంకరరావు శిష్య ప్రశిష్యులైన శ్రీ ఉడుతా వెంకటదాసార్య సద్గురుస్వాములవారి చరణదాసుండగు అచల ఋషి దువ్వూరు రమణయ్యస్వాముల వారిచే వ్రాయబడిన తాత్పర్య భావార్థ గురుశిష్య సంవాదంబను పరిపూర్ణసుధా ప్రబోధము సమాప్తము.

 

# కందార్థము.

కనుమూసిన – కనుదెరచిన కనుమరుగింతయును లేక కానంబడుచున్ కనుగొన శక్యముగాకను - ననిశము ఒకరీతినున్న నతడే నిర్గుణుడూ విని కని యెతల తా నొందడెపుడూ - వెన్నెలలోపల – వెలగకాయలురీతి – ఉన్నా ప్రపంచము– నెన్నాడెరుంగాని–నతడే నిర్గుణుడు విని కని యెతల తా నొందడెపుడూ॥

తా॥ కనుమూసినను, కనుదెరచినను అన్ని కాలములయందును ఏ దానికి మరుగుపడక ఆ పరిపూర్ణమే తనచుట్టు కనబడుచున్నది. అట్లు ఆ పరిపూర్ణముండినను, అట్టి దానిని కనుగొనుటకు, అందునున్న ప్రత్యేకతను పొందుటకు యెంతవారికి శక్యముగాక యున్నది. సద్గురు కరుణా కటాక్షమువలన ఆ స్వచ్ఛందమైన అచల పరిపూర్ణమును గ్రహించుకొని అందులో యే ఆకారాలు గాని, వికారాలుగాని లేకుండుట గమనిస్తూ తనలోగూడ ఆ ఆకార వికార దోషములు లేకుండా జేసుకొనినవాడే నిర్గుణుడు అనబడును. అట్టి అనుభవము గలిగిన బుద్ధిమంతుడు వెన్నెలలో వెలగకాయలు యున్నట్లుగా ఈ ప్రపంచమును పరిపూర్ణములో జూచుచు ఆ ప్రపంచము యున్నను, పోయినను దాని జోలి ఏ మాత్రము పట్టించుకొనక ఏ భ్రాంతులు, ఏ సంశయములు లేక కదలని హృదయము కలవాడై యుండును.



శ్రీ సద్గురుభ్యో నమః

# ఓం

# క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత
# పరమతత్వ కంద పద్యములు

క॥ ఈ కలకందములను విను-డో కలనరులార మీకు వొప్పిదమైనన్
నే కలగనుక రచించితి-యా కల మోక్షమును జెందనగు నివి వినినన్॥ 1

తా॥ ఓజనులారా! నామరూపములతో గూడిన సర్వ ప్రపంచమంతయు మాయామాత్రమని, కలతో సమానమని శ్రుతులుతెలుపుటవలన ఈ కలలో నేనులేకనే ప్రవేశమై కలలో తెలుపుకొనినట్లు ఈ కందములను రచించితిని. కలలోవచ్చిన మీరుగూడా ఈ కందములపై ఇష్టమున్నయెడల మొదటనుండి కడవరకు శ్రద్ధతో జదివిన యెడల కలతో సమానమైన మోక్షమును పొంద గలుగుదురు.

క॥ మాటలేనట్టి బయలున - మాటగలిగె ననుట వినుట మాయగదయ్యా
మాట మాయైతె మానెను-మాటను మాట్లాడి మనము మానుదమవలన్ 2

తా॥ ఓజనులారా! ఏకాలములయందును నిశ్శబ్దముగా కనుబడుచు శబ్దమే లేని అచల పరిపూర్ణమునందు శబ్దముతోగూడిన ఒకమాట గలిగినదని దెల్పిన యెడల అది మాయయనియే దెల్పవలయును. ఆ మాట మాయయే అయినను (లేనిదే అయినను) ఆ మాట యెట్లుగలిగినదో, యెట్లు వచ్చినదో గురువుల ద్వారా విచారించుకొని తరువాత ఆ మాటను మానుకొందాము.

క॥ ఏ కందముకాకందమె - మా కంద ఫలరస రుచిని మరిపించు రుచిన్
మీకందములైనను విను-డీ కందములన్ని సత్కవీంద్రుల్లారా॥ 3

తా॥ సత్కవులారా! నేను దెలుపబోవు కందపద్యములు ఏ కందము కా కందమే మనసును మరిపించే రుచిని కలుగజేయుచుండును. ఒకదానిలోరుచి

ఒకదానిలో యుండక, ఒకదానికిమించిన రుచి ఒకదానిలో కనబడుచు, మిక్కిలి ఆనందమును కలుగజేయుచుండును. అట్టి కందపద్యములను ఓపికతో ఏకాగ్రత గలిగి వినవలయునని కోరుచున్నాను.

క॥ నే ఛందము జదివెరుగను – నా చందంబిదియు గురుని నమ్మి రవి స్తిన్
యీ చందపు పద్యములను - చూచందరు నగక దిద్దరుడీ సుకవుల్॥ 4

తా॥ సుజనులారా! నేను ఛందోబద్ధమైన వ్యాకరణాది సులక్షణ శాస్త్రములను జదువలేదు. నా జన్మసందేహమును తీర్చుకొనుటకై నా సద్గురుదేవుని నమ్ముకొని, వారి కరుణాకటాక్షంబున నా జన్మరహస్యమును దెలుసుకొని వారి దయవలన ఈ కందములు వ్రాయదలచితిని. ఈ పద్యములు ఛందోబద్ధముగ, క్రమముగా లేవని యెగతాళిచేయుచు నవ్వుకొనక ఇందులో దోషములు యున్నయెడల చక్కగా సరిదిద్దగలరని ప్రార్థించుచున్నాను.

క॥ కథగాదు జనన మర–ణ వ్యథ మానుటకై రవి స్తి వరకవులారా!
మథియించి చూచి దిద్దుడి - పథమేమాత్రంబుదప్పి పారక యుండన్॥ 5

తా॥ సుకవులారా! నేను మీకు తెలుపబోవునది రామాయణ, భారత, భాగవత, అష్టాదశ పురాణములలో దెలుపుకథల వంటిదికాదు. జననమరణములలో పరితపించుచున్న మానవుల వ్యథనుమాన్పుటకై నేనీ పద్యములను వ్రాయదలచితిని. ఈ పద్యములను బాగుగాతరచి ఇందులో పదదోషములున్న యెడల తప్పిపోకుండా సంతోషముతో సవరించవలయునని మనవి జేయుచున్నాను.

క॥ తక్కువ పాండిత్యముచే నిక్కె – పండితులు మెచ్చనేరరు వీటిన్
యెక్కువ పాండిత్యముగల - చక్కని పండితులు మెచ్చి సరెనన్నట్లన్॥ 6

తా॥ వరకవులారా! తక్కువ పాండిత్యముగలిగి నేను యెక్కువయని చెప్పుకొనుచున్న అల్పబుద్ధిగలవారు ఈ పద్యములను ఆక్షేపణజేయుచు మెచ్చుకొనక పోయినను మిక్కిలి పాండిత్యముగలిగి దొడ్డబుద్ధిగలిగిన పండితోత్తములైనను ఈ పద్యములనుజూచి ఆనందపడుచుండిన ఎడల నాకు అంతేచాలును

క॥ సూరిజనులె యీగ్రంథపు – సారము గనువారుగాని సంసార మహా
ఘోరవారాసిజేరిన - వారలు విని దీన్ని జూచి వచియింపుదురే॥ 7

తా॥ ఓజనులారా! సారాసారావివేకముగలిగిన బుద్ధిమంతులగువారు ఈ గ్రంథములోనున్న సారమును గ్రహించి సంతోషపడగలరుకాని, ఘోర మైన సంసార తపనలలోబడి స్థిమితములేక, బుద్ధిచపలులై యున్నివారి కీ గ్రంథము చూచుటయందుగాని, వినుటయందుగాని ఇష్టము చూపకుందురు.

వి॥ మనసుకు రూపనామాదులను జూచే ప్రజ్ఞయుందికాని, రూపనామాదులులేనిదానిని జూచేప్రజ్ఞలేదు. బయటచూపు పశువుల లక్షణమని శంకరాచార్యులంటారు.

క॥ గొప్పప్రతిష్టకు మిక్కిలి – తిప్పలుబడు నృతతి కెపుడు దీరదు విన నీ
యొప్పులకుప్పగు బోధను - తప్పక నామాట నమ్మ-దగు తప్పనకన్॥ 8

తా॥ సుజనులారా! గొప్పలకోసము, మెప్పులకోసము, ప్రతిష్టలకోసము ఆరాటపడెడు మనుజులకు ఈ గొప్పవైన పద్యములలో నున్న భావార్థములు తీసుకొనుటకు వారికి యెప్పుడు తీరికదొరకక పోయినను మెప్పులకు, గొప్పలకు తలదూర్చక యహంభావనలేని సుగుణవంతులైన బుద్ధిమంతులకు ఈ పద్యములలో తప్పులున్నవని తలంచక నేనుదెల్పెడి బోధపై శ్రద్ధను చూపుచుందురు.

క॥ మెప్పైన బోధగల మా-యప్పలు తప్పంటె దిద్దుడదినాకిష్టం
బిప్పగిది కందముల నే-జెప్పితి యీ కవితజూచి-శిడిముడిపడకన్॥ 9

తా॥ ఓ జనులారా! జనన మరణ ప్రవాహము నుండి దరికిజేర్చి శాంతిని గలుగజేయునట్టి గొప్పదైన అచలబోధను ఏ మహాత్ములందగలిగి యున్నారో, అట్టి మహాత్ములు ఈ పద్యములలో తప్పులున్నవని దిద్దుచుండిన యెడల అది నాకు ఇష్టముగానే యుండును. నేను ఈ పద్యములు వ్రాసినది అకళంకమైన పరిపూర్ణబోధను వివరించుటకేగాని, వ్యాకరణాది పాండిత్య ప్రకర్షణను జూపుటకు కాదని తలంచవలయును.

క॥ ఒకసారియైన వినకన్ - వికవిక నవ్వేటి కుకవివేత్తల్లారా!
ప్రకటించక మీశౌర్యం-బిక దాచుటె మీకు మాకుహితవై యొప్పన్॥ 10

తా॥ ఓ జనులారా! అపరూపమైన అచలబోధను ఒక్కసారియైనా గురుదేవుని నోటి దగ్గరయుండి వినలేక ఆ స్థిమితము తన బుద్ధిలో కుదరక ఈ

బోధలోయున్న సుగుణ సంపదను తెలియకనే ఈ గ్రంథముపై కుచ్చిత భావముతో తూలనాడుచు, నిదియేమి గ్రంథమని పకపక నవ్వుచు హేళన చేయుచుండుట అది వారి గొప్ప తనముగా నెంచుచుందురు. ఆ గొప్ప తనములను ప్రకటించక ఇక నైనా పూరకున్న యెడల యిరువురికి మంచిదని తలంచెదను.

క॥ స్వచ్ఛాన్వయ గుచ్ఛములని- పృచ్ఛయొనర్చెదరు కవులు పృథుయశులారా
యిచ్ఛ జనించిన జదువుడి-యచ్ఛా పద్యంబులివ్వి యాసాంతముగాన్॥ 11

తా॥ ఓసుజనులారా! స్వచ్ఛమై, సువాసనలతో గూడిన పుష్పములు గ్రుచ్చిన పూలహారముతో సమానముగా ఈ పద్యములున్నవని. సద్భావముతో గూడిన మహాకవులంతా యెంతో మెచ్చుకొనుచు పొగడుచుందురు. అట్టి పద్యములను చదువవలయుననెడి ఇచ్ఛజనించిన మానవులందరు ఆ మూలాగ్రముగ శ్రద్ధతోచదివి● వారికి గలిగిన వాంఛను తీర్చుకొనవలయునని కోరుచున్నాను.

వి॥ గొప్పవారిని గొప్పవారే గుర్తించగలరు, జ్ఞానిని జ్ఞానేగుర్తించగలడు. రత్నమువిలువ రత్నకారుడికే తెలుసును, చెప్పులుకుట్టెవానికి తెలియదు.

క॥ తక్కిన బోధలవలె నిది-చిక్కులుగల బోధగాదు చేపట్టదగున్
మక్కువతో మీ మునుపటి-చిక్కుల బోధలను చూర్ణజెక్కి ముదముననన్॥ 12

తా॥ ఓజనులారా! ఈ పద్యములలో నేను తెలుపబోవు బోధ అన్ని బోధలవలె చిక్కులుగలిగిన బోధకాదు. లోకములోయున్న బోధలన్నియు అనేకచిక్కులతో, అనేకబాధలతో గూడియుండును. ఈ అచలబోధ మాత్రము ఏ చిక్కులు, ఏ కష్టములు పడకుండ సులభముగ సర్వ వ్యాపకమైయున్న దైవమును కంటికిముందు జూపించును. అందువలన మక్కువతో ఈ పద్యములను మీరు వినగలిన యెడల మీలోయున్న చిక్కులన్నియు తొలగిపోయి చక్కని సుఖము చేకూరునని దృఢముగా దెల్పుచున్నాను.

క॥ సకలకార్య ప్రయత్న - జనకమగు వస్తువునుబట్టి నలవివైచు దీ
న్నొకసారి వినిన చదివిన - నిక నింతకు యెక్కువైనవే బోధలయా॥ 13

తా॥ ఓజనులారా! సకల కోరికలు పుట్టుటకుగాని, సకల కార్యములు జేయుటకుగాని, సకల దుఃఖములు గలుగుటకుగాని యే మనసు (యే ఎరుక)

కారణమైయున్నదో అట్టి ఎరుకను నిర్మూలము చేయునది ఈ అచల బోధ యొక్కటే యగుటవలన అట్టి బోధను ఒక్కసారి చదివిన యెడల సమస్తదుఃఖ ములన్నియు దీరిపోవుచుండగా నిక యే బోధలు కావలయునని లోకములో వెతుకవలసినపనిలేక పోవును.

క॥ కేరుచు మిము వినుమని నే-సారెకు మీ చుట్టుదిరిగి సన్నుతిజేసె
తోరపు బోధకు మూలం-బై రెవ్వరో వార్నిదలచి వరుస నుతింతున్॥ 14

తా॥ ఓసుజనులారా! నే నెంతో సంతోషముతో మాటిమాటికి మిమ్ము లను ఈ పరమ పవిత్రమైన బోధను వినండి వినండి మీలో పాదుకొనియున్న సర్వచింత లెల్లయు తొలగిపోయి సుఖముగా నుండగలరని ఏ బోధను నేను తెలుసుకొని మిమ్ము కోరుచున్నానో ఆ బోధదెల్పిన మూలపురుషులైన గురు దేవులెవ్వరో వారిని ముందుగా నా మనసునందు స్మరించుకొని వరుసగా వారి పేరులను దెలుపుచున్నాను.

వి॥ పెద్దల సాంగత్యము మహాగొప్పది. అది అందరికి సాధ్యపడేదికాదు. రామ అని అనలేనివాడు రామాయణం వ్రాసినాడనిన అది ఎవరిగొప్పతనము. నిప్పుసుతాకి జొన్నగింజ తెల్లగామారును. మూఢుడుగూడ పెద్దల సాంగ త్యముచే పరిశుద్ధుడుకాగలుగును.

క॥ ఈక్షితి శివరామాహ్వయ - దీక్షితులకు బోధజేసి దిద్దిన సామ్యా
దక్షుని శ్రీధరమూర్తిని - నిక్షేపముగా దలంచి నే వినుతింతున్॥ 15

తా॥ ఓజనులారా! ఈ జగతిలో శివరామదీక్షితులను పేరుబడసి. దేశదేశ ములలో కీర్తిఘటించి, అనేకమంది పండితోత్తముల మన్ననలను పొంది గొప్ప వాడనిపించుకొనిన ఆమహాత్మునిలో స్థిరపడియున్న అద్వైతదోషములను రూపు మాపి క్షరాక్షరోపాధి దోషరహితమైన అచలబొధను మరలా వానిలో ప్రతి ష్ఠింపజేసిన శ్రీధరస్వాములవారిని ముందుగా స్తుతించుచున్నాను.

క॥ దక్షిణామూర్తి యనదగు – నీక్షితి శివరామనామ దీక్షితు లనుచున్
వీక్షింతు రార్యులతని క-పేక్షను దండములుబెట్టి ప్రేమ నుతింతున్॥ 16

తా॥ ఓజనులారా! ఈ జగత్తులో పూజ్యులైన పెద్దలెల్లరు శ్రీ శివరామ దీక్షితులవారిని, ఆ పరమేశ్వరుడైన దక్షిణామూర్తికి సమముగా భావించి

కొనియాడుచుందురు. అట్టి దక్షులైన శ్రీ శివరామదీక్షితుల వారిని నేనును మిక్కలి ప్రీతితో భక్తినిజూపుచు నమస్కరించుచున్నాను.

క॥ ఆ దీక్షతుల కృపకు దా-పా దైయ్యప్పయ్య మంత్రి పరియించెను యీ
మేదిని తద్బోధ నతని- పాదములకు నుతులొనర్చి ప్రార్థింతు మదిన్॥17

తా॥ ఓజనులారా! శ్రీ శివరామ దీక్షితుల పాదపద్మములను సేవించి వారి యనుగ్రహమునకు పాత్రుడై జనన-మరణములులేని బోధను తెలిసికొని తాను జనన-మరణములకతీతుడై సర్వ సంశయములను బాపుకొని కృతార్థుడైన కంబాలూరి అప్పయ్య మంత్రి చరణార విందములను సదా స్మరించుచున్నాను.

క॥ నుతిజేసెద నప్పయ్యన్ - గతికై కొల్చితడు బోధ గనెనో నేనా
ప్రతిలేని పరశురామ-క్షితి సురవంశ మణియైన సీతాపతికిన్॥ 18

తా॥ సుజనులారా! పైన దెల్పిన పూజనీయులైన కంబాలూరి అప్పయ్యమంత్రికి శిష్యదాసుడై వారి పాదపద్మములను వేమారక సేవించుచు, వారివలన అఖండ బోధను గ్రహించగలిగి, తాను తరించి, సర్వులను తరింపజేయు ప్రజ్ఞ గలిగిన నా గురుదేవుడైన పరశురామ సీతారాములవారి ననుక్షణము నా బుద్ధిలో నిలుపుకొని నిత్యము వారికి ద్వాదశ వందనములర్పించు కొనుచున్నాను.

క॥ బుచ్చి వెంకమ్మతల్లిని - చెచ్చెరపెండ్లాడి కాశిసేతు వదాకన్
విచ్చలవిడి యొగజల్లెను - సచ్చరితుల కచలబోధ సాకల్యముగాన్॥ 19

తా॥ ఓజనులారా! నా సద్గురువర్యులైన శ్రీ పరశురామ సీతారామస్వాముల వారు బుచ్చి వెంకమ్మ అను సాధ్వీలలామను వివాహము జేసుకొని గృహస్థాశ్రమము నందుండి కాశీ మొదలు రామేశ్వరము వరకు సచ్చరిత్రులైన బుద్ధిమంతులకీ అచల బోధను సులభముగా దెలిపి కృతకృత్యులుగా జేసిన మహామహుడని తలంచవలయును.

క॥ ఆ సీతాపతి నతి వి - శ్వాసమునం గొల్చికొంటి సర్వేశ్వరుడం చీ
సద్బోధను తేటగ - జేసితి నివి సకలజనులు చెవియొగ్గివినన్॥ 20

తా॥ ఓసుజనులారా! అట్టి నా గురుదేవులైన శ్రీ సీతారామస్వాముల వారిని మిక్కలి విశ్వాసముతో నా సర్వేశ్వరుడేయని మదిలో నిలుపుకొని షోడశోపచా

రములు జేయుచూ వారి హృదయమును ప్రసన్నత జేసుకొనుటవలన ఈ జనన మరణ రహితమగు పరిపూర్ణబోధ నాకు సంప్రాప్తమై సంతోషపడుచు, ఆ బోధనే మీకు తేట తెల్లముగా తెలుపవలయునని కుతూహలము కలుగుటచేత ఈ అచలబోధను మీరు వినుమని తెలుపుచున్నాను.

క॥ భాగవతవంశ భవుడను-భాగవతోత్తముల పాదపద్మంబులకున్
సాగిలి మ్రొక్కెడువాడను-బాగుగ నను జనులు కృష్ణభట్లందురిలన్॥ 21

తా॥ ఓ జనులారా! నేను భాగవతవంశమునందు జన్మించినవాడను పరమ భాగవతులనియెడు భక్తులపాదములను నెల్లవేళలందు సేవించువాడను. ఈ లోకములోయున్న జనులు నన్ను కృష్ణభట్టని పిలుచుచుందురు.

క॥ ధారుణ్యత్ర్యనసూయలు - వీరేయని జనులుబొగడ వెలసినవారల్
నారాయణజానకియను - వారిరువురుగన్నయట్టి వాడనుసుమ్మీ॥ 22

తా॥ ఓ జనులారా! శాస్త్రములలో దెల్పబడియున్న అత్రిమహాముని అనసూయలనే దంపతులు వీరేనా? అని ప్రజలలో పొగడబడుచున్న భాగవత నారాయణయోగికి వారి ధర్మపత్ని జానికమ్మ అను వనితామణికి కలిగిన పుత్రుడను నేనని తెలియబరచుచున్నాను.

క॥ ఆనేనొనర్చినాడను-యీ నిజకందముల గ్రంథమెప్పుడు దీనన్
వీనులవిని కన్నులగని-రే నట్టిజనంబుబల్కు నేనే-ననుచున్॥ 23

తా॥ ఓ జనులారా! అట్లు జనించిన వాడనగుటవలన నేను రచించిన కంద పద్యములతోగూడిన గ్రంథమును ఎవరు చెవులతో వినుచు వున్న విషయము వస్తు నిశ్చయముగా కన్నులతో జూచినట్లు జూచెదరో యట్టివారు బ్రహ్మము నేనని, అచలము నేనని వారి నోటితో జెప్పజాలరు.

వి॥ భ్రాంతి రూపముగ దోచు యెండమావుల జలము తీపు నీరుగాదు, ఉప్పు నీరుగాదు. దారువునందుదోచు మనిషి స్త్రీగాదు, పురుషుడుగాదు లేకనే కనిపించు యెరుక విషయంగూడ యేదిగాదని తలంచవలయును.

క॥ విల్లరబోధలన్నిటి-నొల్లరు నిజబోధ దెలసి యొప్పెటి పెద్దల్
పొల్లనియందుకె నేనవి - వల్లక యీబోధయందె వర్తిస్తిజుమీ॥ 24

తా॥ ఓ జనులార! ఎక్కువ ఆలోచనగలిగి దూరదృష్టి గలిగిన వివేక వంతులు చిల్లర, చిల్లర బోధలను యెన్నటికి నమ్మక, గొప్పదైన అచల బోధను మాత్రమె నమ్ముచుందురు. నేనుగూడా ఆ చిల్లరబోధలయందు నమ్మకమిడచి, ఈ బోధనే అభిమానించి ఈ బోధకే మనసిచ్చియున్నాను.

వి॥ మానవుడు అన్ని లోకాలను గురించి, నెల్ల దేవతలను గురించి విచారించుతాడుగాని, తనలోకము యెక్కడ యున్నదో? తాను యెవ్వరోయని విచారించడు॥

క॥ గురుశిష్యుల మాటలవలె - పరిపూర్ణబోధ కందపద్య ఫణితిచే
విరచిస్తి వినుడి ముందర-జరిగే-ముచ్చట్లు మీకు సహ్యంబైనన్॥ 25

తా॥ ఓ సుజనులారా! ఈ అచలబోధను మీకు యెరిగించుటకై గురు శిష్యులను కల్పనజేసి వారిద్దరు సంభాషించు కొనునటుల కందపద్యములు వ్రాసి మీముందర పెట్టితిని అది మీరు వినుటకు ఇష్టముగాయున్న యెడల తప్పకవిని సంతోషించెదరని మిమ్ము ప్రార్థించుచున్నాను,

క॥ సకలనిగమాగమాది-ప్రకరమహానారికేళ ఫలసారము దీ - సొక
గ్రంథముజేసితి లో - కిక జనులొకవేళగొన్న కీడుదొలంగున్॥ 26

తా॥ ఓ జనులారా! వేదములు ఉపనిషత్తులు, ప్రస్థానత్రయములు, బ్రహ్మసూత్రములు, రామాయణ, భారత, భాగవత, భగవద్గీత, పురాణములైన ఇతిహాసము లెల్లయు తరచి తీసినసారాంశమును ద్రాక్షాపాకము, నారికేళ పాకముగ ఒక గ్రంథముజేసి మీముందర పెట్టుచున్నాను. ఒకసారి మనసుంచి వినిసను చదివినను భవసాగరములోబడి తపించు వారినందరిని ఒకదరికిచేర్చి స్వస్థతను జేకూర్చును.

వి॥ చదవగనే అర్థమగు కవిత్వమును ద్రాక్షాపాకమని దెల్పుదురు. ఈ ద్రాక్షాపాకము నోటిలోవేసుకొని చప్పరించకమునుపే తీపునిచ్చుచుండును. చదివి కొంత ఆలోచించిన పిదప అర్థమయ్యే కవిత్వమును నారికేళపాకమని దెల్పుదురు. ఈ నారికేళపాకము నోటిలో వేసుకొని కొంతకు కొంతచప్పరించిన పిదప తీపునిచ్చుచుండును.

క॥ తనకు దావచ్చి సద్బో-దను దెల్పుమటంచు మ్రొక్కు తన శిష్యునకున్
విననెప్పదొణగె నొక గురు-డనుమానించకను వాని కతిదయతోడన్॥ 27

తా॥ ఓ జనులారా! ఘోరమైన భయ భ్రాంతులలో జిక్కి మనసు నిలకడలేక వీకాకు పడుచున్న ఒక మానవుడు యెవరి ప్రోద్బలము లేకనే తనకు తానుగా నొక సద్గురు దగ్గరకుపోయి నా పరితాపములన్నియు తొలగిపోయి సుఖమును కలుగజేయు సద్బోధను దెలుపమని పాదములమీద పడి ప్రాదేయపడుచుండగ గురువుకు దయగలిగి వానిని అనుమానించక మనసిచ్చి ఇట్లు చెప్పదొడంగెను.

క॥ పరమ పురుషుడును లేనిది-యెరుకయుగల దరసిలేని యెరుకను విడుమం
చెరిగించిన శిష్యుడు గురు-వరునడిగెను మ్రొక్కి రెంటివర్తనలపుడున్॥28

తా॥ ఓజనులారా! పరమపురుషుడనబడు పరిపూర్ణమొకటి సర్వకాలముల యందును శాశ్వితముగా కదలక తనకు తానుగా నేయున్నది. అందులో లేని యెరుక యొకటి వచ్చుచు పోవుచు యున్నది. ఆ లేనిఎరుకను లేకుండాజేసికొనిన యెడల నీలోగలిగిన పరితాపములన్నియు అణగిపోగలవని గురుమూర్తిదెలుపగ శిష్యుడు అయ్యా! పరమపురుషుడనబడు పరిపూర్ణమెట్టిదో? ఎరుకనగా నెట్టిదో? ఈ రెంటివర్తనలను విశదముగా తెలియపరచమని సద్గురుమూర్తిని శిష్యుడిట్లు అడుగుచున్నాడు.

క॥ పరమపురుషుడన నెవ్వడొ-యెరుకెట్టిదొ దెల్పి యవల యెరుకనువిడిచే
తెరువెట్టిదొ యిన్నియు నా-కెరుగించు మటంచుబల్క నిట్లనె గురుడున్।29

తా॥ సద్గురుదేవా! పరమపురుషుడనగా యెటువంటివాడో? యెచ్చట యున్నాడో? యెరుకనగా యెటువంటిదో? ఆ యెరుకను నేను విడిచేమార్గము యెటులనో? ఈ పద్ధతులన్నియు నాకేమి తెలియదుగనుక వీటినన్నియు విశదముగానెరిగించి నాలోకలిగిన దుఃఖమెల్లను చల్లార్చుమని శిష్యుడుప్రార్థించగా కనికరముగలిగిన సద్గురుదేవుడీరీతిగా తెల్పుచున్నాడు.

క॥ నే పెద్దలచే విన్నది-నీపై దయబుట్టి చెప్పనే బూనితి నీ
కా పద్ధతినంతయు విని-యేపద్ధతి కాశపడకు మిది విడువకుమీ॥ 30

తా॥ శిష్యా! అతి దుర్లభమైన ఈ అచలబోధను యే మహనీయులవలన నేను వినగలిగి, నా సంశయములన్నియు దీర్చుకొని ఆనందపడుచున్నానో అట్టి పరిపూర్ణబోధ దెలుపవలయునని నీమీద నాకు దయ గలుగుట వలన ఈ బోధను నీకు తెలియపరచి నీ కొరతలన్నియు తీర్చి నీకు సంతోషము గలుగునటుల జేసెదను. ఇక యే యితరమైన బోధల దగ్గరకు నీ బుద్ధిని పోనివ్వక నేను తెలుపబోవుచున్న అఖండ బోధయందే స్థిర చిత్తుడవై యుండవలయును.

వి॥ ప్రపంచము మానవుని అనేక భ్రాంతులలో బెట్టి పశువుగ చేయాలంటది. గురువులు మానవునికి సత్యాన్ని దెలిపి, వానికి జ్ఞానోదయము కలిగించి కృతకృత్యుని చేయాలంటారు. ఇదే భ్రాంతిమయమైన ప్రపంచమునకు, భ్రాంతి కతీతులై యున్న గురువులకు జరిగే పోరాటము. ఈ పోరాటములో విజయ ధ్వజాన్ని ఎగురవేసేవాడు నూటికో, కోటికో ఒక్కడే యుండును.

క॥ కదలడట పరమపురుషుడు–కదిలిక మాయయట యిట్టి కదిలిక కేవో
మొదలన పెద్దలుబల్కిరి–కదలనిదే కలదు లేదు కదిలిక యనుచున్॥ 31

తా॥ శిష్యా! పరమ పురుషుడనబడు అచల పరిపూర్ణము సనాతనమునై, ఏ కాలములందును శాశ్వతమునై కదలకవున్నది. మాయయనే ఎరుకమాత్రము అనేక నటనలుజూపుచు, సృష్టి స్థితిలయములొనర్చుచు అనేకరూపములతోగూడి కదలిక గలిగియున్నది. ఈ కదిలే కదలికలకంతయు నేదో యొక సత్తా పదార్థము మొదటనే యుండి కదలించుచున్నదని పెద్దలు తెలుపు చుందురు. ఆ సత్తా పదార్థముగూడా ఎరుకేనని తెలుసుకొనిన యెడల కదలనిదెప్పుడు శాశ్వతముగా యున్నదనియు, కదలిక గలిగిన మాయ (ఎరుక) లేనిదనియు దృఢము గలిగి యుండుము.

వి॥ అచలము స్త్రీ పురుష భేదములతో నుండక పోయినను ఈ పరిపూర్ణమును గ్రంథకర్త పరమ పురుషుడని వర్ణించుట యందు ఇట్లు తోచుచున్నది. కనబడు రూపనామాదులన్నియు ప్రకృతి అనియు, ఆ రూపనామాదులను గలుగజేయు సత్తాను పురుషుడనియు ఈ పకృతి పురుషులకు అతీతముగా యున్నదానిని పరమ పురుషుడనియు తెలిపినటుల గనబడుచున్నది.

క॥ పురుగుకుక్క స్తంభంబును–కొరికినదన వీతిహోత్రుగొని మ్రింగెచదల్
ధరననినను మాయాసతి–హరినీ చికాకుగ యొనర్చెనన వినదగునే॥ 32

తా॥ శిష్యా! ఉక్కుస్తంబంభును పురుగుతొలిచిరంధ్రము చేసినదని చెప్పుట అది యెట్లు నిజముకాదో, ఈ భూమియందు అగ్నికి చెదలుపట్టినదని చెప్పుట అది యెట్లు నిజముకాదో, అటులనే ఈ ఎరుకయు అచలపరిపూర్ణము యొక్క సత్తానుదీసికొని సృష్టి స్థితిలయములను జరుపుచున్నదని చెప్పుటగూడ నిజముగాదని తలంచవలయును.

వి॥ ఆటవెలది: కారణంబు శివుడు-కార్యంబుజీవుండు కార్యకారణంబుగాని బయలు-గానలేరు జనులు ఘనగురుకృపలేక అఖిలజీవసంఘ ఆత్మలింగ.

క॥ హరియందు దోచు విశ్వము-నర స్వప్నమువంటిదనిరి నానాజనముల్
సుర స్వప్నమువంటిది యనె-స్థిరమతి శివరామ నామదీక్షితులు ధరన్। 33

తా॥ శిష్యా! బ్రహ్మసృష్టించుచు, విష్ణుపోషించుచు' ఈశ్వరుడులయము జేయుచు నేప్రపంచముగనుబడుచున్నదో ఆ ప్రపంచమును నరుని స్వప్నముతో సమానముగాయున్నదని నానామతములు, నానాశాస్త్రములు దెలుపుచున్నవి. అచల బోధకులుమాత్రము ఆ పరమపురుషుడైన బట్టబయలునందు ప్రపంచము అసలేకనబడుటలేదు. కనబడని ప్రపంచమును స్వప్నముతో సమానముగ యున్నదని దెలుపుట సరిగాలేదనియు, నదిసురస్వప్నమని శ్రీ శివరామ దీక్షితుల వారిచే తెలుపబడుచున్నది.

వి॥ నరులకు నిద్రయున్నందువలన ఆ నిద్రలోస్వప్నము వచ్చుచుండును. సురులకు నిద్రలేనందున స్వప్నమురాక యుండును. అటులనే నిద్రబొయ్యే ప్రబోధకులకెల్లను ఈ ప్రపంచము స్వప్నముగా కనుపించుచుండును. మెలుకువలోయున్న అచలబోధకులైన సురులకు మాత్రము ఈ ప్రపంచమను స్వప్నము లేకయుండును.

క॥ సురలందుదోచు స్వప్నము-హరియందునదోచు విశ్వమాసురల హరిన్
ఎరిగినకల విశ్వము తా-మరుగవె తమలేమినెరిగి యతి బిడియమునన్। 34

తా॥ శిష్యా! అశరీరులైన సురులకు నిద్ర లేక పోవుటవలన స్వప్నము యెట్లు లేక యున్నదో, పరిపూర్ణమందును ఎరుక లేకపోవుటవలన ప్రపంచము లేక యున్నది. ఈ స్వప్న ప్రపంచములు రెండు వాటి నిజము వాటికి తెలసెనేని వాటికవే సిగ్గుపడి లేక పోవుచుండును.

క॥ కదలనిది కదలదెన్నడు-కదిలిక గలదనిన దాని కగుపడదు మొదల్
కదిలిక లేదది గావున-యిది పరమ రహస్య మెవ్వరెరుగరు దీనిన్॥ 35

తా॥ శిష్యా: కదలకనున్నది యెన్నడు కదలకనే స్థిరమునై కదిలికలు లేక యున్నది. కదిలిక గలిగినది యెప్పుడు కదులుచు స్థిరము లేక యున్నది. ఈ కదిలిక గలిగిన ఎరుకే యున్నట్లుగా తోచుచున్నను, దానికి మూలములేదు గనుక దానిని నిజమని ఎన్నడు నమ్మబోకుము. ఈ రహస్యము అచల గురువులైన కొందరికిమాత్రమె తప్ప అందరికి తెలియబడక యుండును.

క॥ కదలనిది కదిలెనన్నను - ముదమున వినదగదు వారిముచ్చట నెపుడున్
కదిలిన కదలనిదెట్లగు-నదిగావున కదలదనుచు నమ్మదగుజుమీ॥ 36

తా॥ శిష్యా! కదలని అచల పరిపూర్ణము కదిలి గుణధర్మములుగలిగి సృష్టినిర్మాణము జేసినదని దెల్పుచుందురు, కదిలిక గలిగిన ఎరుక కదిలిక లేనిదై, అచలమై పోవునని దెలుపుచుందురు. ఈ మాటలన్నియు వినదగిన మాటలు, నమ్మదగిన మాటలుకావు. కదిలే ఎరుక కదలని పరిపూర్ణమగునని దెలుపగూడదు. కదలని పరిపూర్ణము. కదిలే యెరుక యగునని దెలుప గూడదు. ఈ రెండు రెండుగనే యుండునుగాని ఈ రెంటికిపొత్తు యేనాడు కుదరకయుండును.

వి॥ మానవునకు బయట రూపము బాగనే యున్నది. కాని లోపల మతి చెడి యున్నందువలన యెంతటి వారుగూడ నిజము దగ్గరకు పోలేక, యున్నది లేనట్లుగ, లేనిది యున్నట్లుగ ఆరోపణలు చేయుచుందురు.

క॥ నిను మేనును ప్రకృతిద్వయ-మని నిను నీ మేను మృషని మానిరి నీజో
లిని పెద్దలు నీవెరుగక-నిను నీ వొక కొండనటె నిజమామాట॥ 37

తా॥ శిష్యా! నేను నేను అను నీవును, నీ దేహము రెండు కలసి ప్రకృతి ద్వయమగుట వలన ఈ నేను మేనుల రెంటిని ఒకటిగానే దలంచి యివి లేని వస్తువులని మహాత్ములైన పెద్దలు దెల్పుచు వీటి మాటే పట్టించుకొనక యుందురు. అట్టు యున్న ఈ రెంటి యథార్థమును ఎరుగలేక దేహము నశించుననియు దేహినశించక శాశ్వతముగా యుండుననియు గొప్పగా దెలుపుచుందురు. ఆ మాటలన్నియు సత్యమైన మాటలుగావని నమ్మవలెను.

వి॥ శ్లో॥"విద్యా విద్యద్వయం నాస్తి నిత్య సత్యం పునః పునః" అనగా! ఆత్మానాత్మలను రెండు వస్తువులు ముమ్మాటికి లేవనియు, పరి పూర్ణము మాత్రము నిత్యమై సత్యమై యున్నదనియు ఆ మాట మరలామరలా దెలుపమని శ్రుతులలో కనుబడుచున్నది. భగవద్గీత 2-16 నందు శ్లో॥ "నాసతో విద్యతే భావో, నభావో విద్యతే సతః" అనగా! దేహము వుండునదికాదు. దేహి నశించునదికాదని తెల్పుచున్నది. ఈ రెంటిలో కనబడుచున్న నిజా నిజాలు తన నుద్ధరించు సద్గురువుపై అధారపడి యుండును. అట్లు గాక హరి హరాదులకు కూడ సాధ్యపడక యుండును.

క॥ పేరచలమనుచు బయలని-పేరెప్పుడు లేనిమనము బెట్టుట చేతన్
పేరాయ బయలుకిప్పుడు-పోరా నివు నేను మృషని పోతేజాలున్॥ 38

తా॥ శిష్యా! అచలమనియు, పరిపూర్ణమనియు, బయలనియు ఈ పేరులన్నియు మనము పెట్టుకొనిన పేరులేకాని మనము పుట్టకముందు ఆ అచలమునకు యే పేరులునులేవు. అట్టి అచలమునకు పేరుపెట్టిన నీవు నేను ఆ అచలమందు నున్నామా? లేమా? అని తెలుసుకొని లేని నీవు నేను లేక పోయిన యెడల ఇక అన్నియు సరిపోవును.

క॥ పరమపురుషుడీ బయలని-గురుడెరిగించినను జూచి గొప్ప కురుచలై
యెరిగెటి నిను నే మృషనని-యెరిగరుగుము నీవెమాయ వికబుట్టవిలన్।39

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణము ప్రకృతి పురుషులకతీతముగా యుండుట వలన పరమ పురుషుడని పేరు పెట్టవలసి వచ్చినది. అట్టి పరమ పురుషుని సద్గురువుయొక్క దయతో తెలసికొనిన యెడల ఆ తెలుసుకొనిన పరమ పురుషుడు యెంత గొప్పవాడో! ఆ యెరిగిన నీవు యెంత అల్పమైనవాడవో! పరిశీలించుకొని ఆ అధికత్వములో నీ అల్పత్వము నిలువబోదని నీకు నీకే అర్థమైన యెడల నీవే లేకుండ పోవుదు ఇక భూమిమీద పుట్టక యుందువు.

క॥ అయమాత్మయనిన రీతిగ-నయముగ యీ బట్టబయలు నదుగో యనుటల్
అయమియమని యనుటుళ్ళ-క్కి యయిన ననవలసె నీదు కీడుడుగుటకై 40

తా॥ శిష్యా! చతుర్వేద మహావాక్యములయందు "అయమాత్మ బ్రహ్మ" మను చెల్పిన వాక్యము నీవే బ్రహ్మమనియు, నీ కంటే నితర మేదియు లేదని

తెలిపినటుల ఈ పరిపూర్ణబోధయందుగూడా ఆ పరిపూర్ణమే సత్యమనియు, ఆ పరిపూర్ణముతప్ప మరేమి లేదనియు తెలుపబడు చుండును. " అయమాత్మ బ్రహ్మ" జనన మరణాదులకు కారణ మగుటవలన జనన మరణాదులులేని పరిపూర్ణమును తెలుసుకొని జనన మరణాదులతో గూడిన "అయమాత్మ బ్రహ్మ మును" హుళక్కిజేసికొంటివేని జనన మరణాదులనే కీడు నీకు తొలగిపోవును.

క॥ లేనినేనీవులేని-స్థానంబును కారణంబుసర్వమున కధి
స్థానంబు సాక్షి సత్య-జ్ఞానానందంబులని నసత్యములగునే॥ 41

తా॥ శిష్యా! నీవుగాని నేనుగాని లేకయున్న నే పరిపూర్ణ స్థానమున్నదో? నా పరిపూర్ణ స్థానమును సకల జీవులకు పుట్టుక స్థానమనియు సర్వసృష్టికి అది ష్టానమనియు, నదియే సత్యజ్ఞానానంద స్వరూపమనియు, సచ్చిదానంద స్వరూప మనియు, సాక్షియనియు తెలుపుచుందురు. ఆ మాటలు నిజమెరిగిన పెద్దలకు సత్యములు కాజాలవు.

క॥ అట్టిది యిట్టిది యనరా-నట్టిది బయలనుచు దెలసి యా మీదట నీ
వట్టిది యిట్టిది యనరా-నట్టిది బయలనిన దాని నరయకు మెపుడున్॥ 42

తా॥ శిష్యా! దేహమువలె నున్నది. ప్రపంచమువలె నున్నది, జీవునివలె నున్నది, ఈశ్వరునివలె నున్నది, బ్రహ్మమువలె నున్నది అని తెలుపుటకు సాధ్యముకాని ఏ అచల పరిపూర్ణమున్నదో, ఆ అచల పరిపూర్ణమును తెలిసి కొనిన మీదట ఆ పరిపూర్ణము దేహ ప్రపంచములవలె లేదు, జీవేశ్వరులవలె లేదు బ్రహ్మమువలె లేదు, అని ఏ యెరుక స్థిరపరచుకొనుచున్నదో ఆ ఎరుక లేనిదని యెరుకకు తెలియబడి యెరుకమాటే యెరుకకు లేకుండా పోవును.

క॥ అది యిది యంచని యనరా-నిది బయలని తెలిసి నీవు యిది యదియనరా
నిది బయలని తెలసిన నిను-వదిలుండుము లేనటంచు వరగుణవంతా॥ 43

తా॥ సుగుణవంతుడా! ఎరుపుగాని, తెలుపుగాని, నలుపుగాని, కర్రిదిగాని, పొట్టిగాని, పొడవుగాని, లావుగాని, సన్నముగాని. నాదబిందు కళలుగాని స్థూల సూక్ష్మములుగాని, ఆపోజ్యోతిగాని, ఏ విధమైన రూపములు అందులో కన బడక ఏ బట్టబయలు సర్వత్రా నిండియున్నదో ఆ బట్టబయలును దర్శించి ఆ తరువాత ఎరుపు, తెలుపు, నలుపు, పొట్టి పొడవు, లావు సన్నము, నాద

బింధుకళలు, ఆపోజ్యోతి మొదలైన రూపములన్నియు యెరుక స్వరూపములే యని తలంచి ఏ యెరుకచేత పరిపూర్ణ శుద్ధత్వమును, యెరుక యొక్క నామ రూపాది గుణములను యెరిగితివో ఆ యెరుక లేనిదని ఆ యెరుకను లేకుండా జేసుకొనవలయును.

క॥ కల నీకు జగముకంతట-గల బయలుకు గలిగియున్న ఘనమగు తిప్పల్
కలయగని మేలుకని యా-కలవలె మేలుకనుజూచి కదులుముళ్ళక్కీ॥ 44

తా॥ శిష్యా! కలలో కనుపించుచుండు కష్ట సుఖములు, సిరి సంపదలు, ఏనుగులు, గుఱ్ఱాలు మొదలగు వస్తు సముదాయమంతయు మెలుకువ గలిగిన వెంటనే కనుపించక యెటుల పోవుచుండునో, ఆ తీరుగనే గురు మెలుకువ గలిగిన యెడల నా మెలుకువతో ఏ చలనములేని అచల పరిపూర్ణమును దర్శించి ఆ దృష్టితోనే ఈ ప్రపంచమును చూచిన ఎడల ఈ ప్రపంచమంతయు కలతో సమానముగా కనుపించుచుండును.

క॥ కలనేస్గ సింహమును క-న్నులగన మృతిజెందినట్లు యుళ్ళక్కగు నీ
వల గురుకృపచే బయలున్-దెలసూరికెయుంటివేని తీరును మాటా॥ 45

తా॥ శిష్యా! ఏనుగు స్వప్నములో సింహమును తన కన్నులతో జూచి, మరణించినట్లు సర్వము తానుగాయున్న ఈ ఎరుక సద్గురుమూర్తిచే బట్టబయలును దర్శించ గలిగిన యెడల తనచేష్టలన్నియు ఉత్తవిగానే తలంచి తానే లేక పోవును. ఇట్లు ఈ యెరుకకు తానులేని సంగతి యెప్పుడు తెలిసినదో, ప్రపంచ సంబంధమగు దేహభ్రాంతులు పొందక యే సంకల్పాదులు గలుగక నిమిత్త మాత్రంగా నుండి పోవును.

క॥ ఎప్పటికి యొక్కరీతిగ-తప్పక నిలచున్న దాన్ని దయతో గురుడున్
చెప్పినగని యగణితమగు - తిప్పలుగల నిన్ను నీవు దీసితె సరిరా। 46

తా॥ శిష్యా! సర్వదేశముల యందును, సకల కాలముల యందును, సమస్త వస్తువుల యందును నిండి ఒక్క తీరుగా యున్న పరిపూర్ణ పరబాహ్యమును శ్రీ సద్గురుమూర్తికి కరుణగలిగి చూపించిన తరువాత శిష్యుడట్టి దానిని దర్శించి అందులోయున్న ప్రత్యేకతను ఆ గొప్పతనమును గ్రహించిన యెడల ఈ ఎరుకకు ననేక తిప్పలున్నవని తెలుసుకొని ఈ ఎరుక మాటను తలచు

కొనక ఆ పరిపూర్ణమును మాత్రము గురుతులో పెట్టుకొని యుండగలిగిన అంతే చాలును.

క॥ నీవున్నచోట నుండును-నీ వివిధ విచిత్రజగము నీతోగూడన్
నీవు లేనట్టి చోటను-నీ వివిధ విచిత్రజగము నిలువదుకుర్రా॥ 47

తా॥ చిన్నవాడా॥ నీవనే ఎరుక యెక్కడ యుండునో అక్కడనే నీవు నీతోగూడిన జగమంతా చిత్ర విచిత్రములుగా కనుబడుచుండును. నీవనె ఎరుక యెక్కడ లేదో, ఆ స్థానములో నీవు నీతో గూడిన నానా విధములైన రూప జగత్తంతా కనబడక అచ్చోటునందు నిలబడలేక పోవుచుండును.

క॥ నానావికారములుగల-నానావిధ నామరూప నటనలుగల యా
నీ నాదశదిశలనుగల-దీనందేలేక మనము తిరుగుటమప్పా॥ 48

తా॥ శిష్యా! ఏ అచల పరిపూర్ణము నాల్గు దిక్కుల యందును, నాలుగు మూలలయందును, నీకు ముందు. నీకు వెనుక, నీకు క్రిందా, నీకు పైన దశ దిశలుయందు సందులేక నిండియున్నదో ఆ అచల పరిపూర్ణమునందు మనము లేకనే నానా రూపములతో, నానా వికారములతో, నానా నటనలతోగూడి అన్ని వ్యవహారములు చేయుచు తిరుగుచున్నామని తలంచ వలయును.

క। అబ్బీ యీ బయలున్నది-దబ్బున గురుడెరుకజేయ దబ్బర ననుచున్
దెబ్బకు మాయముగాకను-కబ్బముజెప్పుటకు నిల్వగలవే నీవున్॥ 49

తా॥ అబ్బాయి! ఈ బట్టబయలును సద్గురు దేవుడు సూచనచేసి, వస్తు నిశ్చయముగా స్థిరపరచి ప్రతియొక్క యెరుక విషయములను నుపమాన, నుప మేయములతో ప్రత్యక్ష ప్రమాణాలతో నిరూపణ జేయుచుండిన యెడల యిక నా శిష్యునికి జీవేశ్వరైక్య సందానమనియు, జీవ బ్రహ్మైక్య సందానమనియు నిర్వికల్ప సమాధిస్థితి అనియు, పరంజ్యోతి స్వరూపమనియు నివి యన్నియు పొందవలయుననే కోరిక అక్కడ నిలవకుండా పోవును.

వి॥ ఆ॥ అట్టివారు మరల అవని జనించరు బట్టబయలు తనకు పట్ల మాయె కొలను విడిచి హంస గోతికి చేరునా అఖిల జీవిసంగ ఆత్మలింగ॥

క। మూలములేకనె వచ్చిన-నీ లీలలు జూచుకోని నీవె మురుతు వీ
బైలున్నదనుచు దోచితె-నీలేమిని నీవెరింగి నిలువవు కుర్రా॥ 50

తా॥ ఓ చిన్నవాడా! నీకు మూలమనే కారణము లేకనే నీకు నీవే ఈ బట్టబయలులోకివచ్చి నీవుచేయు కర్మలు, నీవుచేయుసిద్ధులు, నీవు చేయు మహత్తులు నీవే చూచుకొనుచు నీకు నీవే సంతోషపడు చుందువు. నీ కంటే అధికమైనది, శాశ్వితమైనది, అనంతమైనది ఏ అచల పరిపూర్ణమున్నదో దానిని ఒక్కసారి చూచితివేని నీవు, నీవు చేయు పనులన్నియు ఉత్త పనులేనని నీకు నీకే తెలియబడిన యెడల నీవే లేకుండా పోదువు.

క॥ జ్ఞాన కర్మ స్వరూపము-గాని బయల్ నదుగో చూచి కలకాలము యీ
జ్ఞాన కర్మ స్వరూపం-బౌ నిను నీ వెరిగి మృషనీవని వినవోయీ॥ 51

తా॥ ఓ సుగుణవంతుడా! జ్ఞానముతోగూడిన ఆత్మ స్వరూపముగాని, కర్మముతోగూడిన దేహస్వరూపముగాని, ఈ రెండునుగాక ఏ బట్టబయలు యున్నదో ఆ బట్టబయలును సద్గురుస్వామి అదుగో అని చూపించిన యెడల ఈ యాత్మ దేహములు రెండు నీ స్వరూపమేననియు, నివి కలకాలము నిలువబోవ నియు నీకు నీకే నిశ్చయమయ్యేనేని నేను లేనివాడనని నీవే తలంచగలవు.

క॥ ఈ నిర్మలమౌ బయలున-నానాగమ నిగమకల్పనాయనటంటే
ఏ నరులు నమ్మరిందుకు-నా నీ యందున నటంటె నమ్మిన మాడ్కిన్॥ 52

తా॥ శిష్యా! నే గుణములు, నే రూపములు, నే సంకల్పాదులు లేని పరబయలందు చతుర్వేదములు, ఉపనిషత్తులు మొదలగు గ్రంథరాజము లన్నియు పుట్టినాయని తెల్పినయెడల యెవరు నమ్మజాలరు. యెందువలననగా ఆ పరిపూర్ణములో ఏ గుణములు, ఏ సంకల్పములు, ఏ కదిలికలులేక నిర్మల ముగా యున్నందువలన అట్టి దానిలో యెట్లు పుట్టగలవని యాక్షేపణలు వేయు చుందురు. నీవు నేననెడి ఎరుకచేత పుట్టినవని తెలిపిన యెడల అది బాగనే యుందని నమ్ముచుందురు.

క॥ నే నీవనని మహాత్ముని-కీ నిగమాగమ విచార మిష్టతియౌ నా
నే నీవని యీ పల్కే-నా నీకే యిష్టతౌర నానాయన్నా॥ 53

తా॥ అన్నా! నేను నీవు అనెడి ఎరుక లేక యుండునట్టి సూరిజనులైన మహాత్ములకు వేదములు, ఉపనిషత్తులు, రామాయణ, భారత, భగవద్గీతలు,

"అహం బ్రహ్మాస్మి" మహావాక్యములన్నియు హితవుగా వారి మనసుకు తృప్తి నివ్వజాలవు. నేను నీవు అనుచు నెరుకతోగూడి యెవరుయుందురో అట్టి వారికే ఈ శాస్త్రములన్నియు హితవునై సంతోషము గలిగించుచుండును.

క॥ కల వేళ్ళను యీ మేల్కను–గల యీ బయలుండ–జూచి కలమేల్కలలో
గలలేని నిన్ను నీమే–నుల లేవని నీవు దెలసి యుండుము బాలున్॥ 54

తా॥ శిష్యా! స్వప్నమందుగాని, జాగ్రతందుగాని ఈ పరిపూర్ణమొక్కటియే స్థిరమని సత్యమని తలంచుము, స్వప్నములోగాని, జాగ్రతలోగాని, ఆ బట్టబయలులో లేకనే కనుపించుచున్న నిన్నును నీ దేహమును రెంటిని అసత్యముగా తెలుసుకొని అవి లేనివని ఆ నమ్మకము నీకు దృఢముగా నిలబడి యున్నయెడల నిక తెలుసుకోవలసినది యేది యుండదు.

క॥ మేను జడ మజడమనినను–నేనును మీ రెండుగలసి నేనన బడు స్వ
ప్నానందమె మదవస్థగు–నేనే నను మృషని తెలియ నే మృషనౌదున్॥ 55

తా॥ శిష్యా! ఒక మొద్దుగా జడస్వరూపముగా కనబడుచున్న ఈ దేహములో ఒక చైతన్యముయుండి ఆ దేహచైతన్యముల రెండు కలియకవలన నేను నేను అను అహముయేర్పడి ఆ అహమే సర్వజీవోపాదులయందు నేను నేను అనుచు, సర్వకర్మలనెల్ల జేయుచు తనకు తాను గొప్పగా నిలువుకొను చుండును. ఆ దేహచైతన్యముల కలియక యెప్పుడు వీడిపోవునో అప్పుడే ఈ అహము కనుపించకుండా పోవుచున్నది. ఇట్టి ఈ అహముకు తనవిషయం తనకు గోచరించిన యెడల తన స్థితి స్వప్నానందముతో సమానముగా యున్నదని తెలుసుకొని స్వప్నానందము యెంత క్షణికమైనదో నాస్థితిగూడా అంత క్షణికముగా యున్నదని తలంచుకొని తానేలేకపోవును.

క॥ నేనె తానైతె నావలె - యీ నే లేనట్టి బ్రహ్మ నేననకున్నే
నేనందు నేను లేనిదె-మేను జగత్తులయితోచి మృషనౌ కొంచున్॥ 56

తా॥ శిష్యా! నేను నేను అనెడి యెరుక ఆ పరిపూర్ణమయ్యేటట్లుగా యుంటే ఆ పరిపూర్ణముగూడ నేను నేను అని తెలుపుచుండును. ఈ యెరుక ఆ పరిపూర్ణముకాదు గనుక ఆ పరిపూర్ణము నేను నేను అని యెప్పుడు అనబోదు.

ఈ ఎరుక ఆ పరిపూర్ణమునందు లేకనే మేను జగత్తులను జేసుకొని తన విషయం తాను తెలుసుకొనిన పిమ్మట తానే లేకుండా పోవుచున్నది.

క॥ కానరా వారు మతములు-నానాగమ నిగమ సమితి నామము రూపం
బేను లేనపుడు నాకై -నేనరుదెంచినను వెంటనే యవివచ్చున్॥ 57

తా॥ శిష్యా! ఈ లోకములోనున్న మతముల వారందరికి నేనునేను అనుచున్న యెరుక యొక్క విషయము తెలియక నామతము గొప్పది నా మతము గొప్పదని పోట్లాడుకొనుచుందురు. ఈ నేను నేను అనుచున్న యెరుక యున్నంత వరకే ఈ వేదములు ఉపనిషత్తులు పురాణములు క్రైస్త వమతము, మహమ్మదీయమతము హిందూమతము శాక్తేయమతము గాణపత్య మతము బౌద్ధమతము ఏ మతములైనా ఏ సిద్ధాంతములైనా నిలబడియుండును అ నేను నేనను చున్న, యెరుక యెప్పుడు పోవునో, అ యెరుక వెంటనే సర్వ శాస్త్రములు, సర్వమతములు, సిద్ధాంతములన్నియు ఏ ఒక్కటిలేకుండ సమూలంగా నూడ్చుకొని పోవుచుండును.

క॥ నామీది ప్రేమచేతను-యీ మనుజులు నిలుపదలచి యెన్నో యుక్తుల్
తా మొనరించిన నిల్తునె-నేమృష మృష నిల్వగలదె నిశ్చయమువలెన్। 58

తా॥ శిష్యా! ఈ యెరుక తనమీద తనకున్న యభిమానముచేత ఈ భూమిమీద తాను స్థిరముగా శాశ్వితముగా యుండవలయునని కుండలి యోగములు నిర్వికల్ప సమాదులు, లంభికా యోగములు, పరకాయ ప్రవేశ ములు, రసకల్పన, గంధకల్పన, మూలికాకల్పన మొదలగు కల్పనలతోగూడిన యుక్తులతో కాయసిద్ది గలిగి ఈ యెరుక పోకుండ యుండవలయునని యెంత ప్రయత్నము చేయుచు పడరాని బాధలు పడుచుండినను, ఈ యెరుక ఒకనాడు నిలువకుండా పోవునేగాని శాశ్వితముగా యుండబోదని ఈ మాటసత్యమని తలంచవలయును.

క॥ నీ తండ్రి తాతలవలెనె-నీ తనయులు నీవు జనుట నిశ్చయమె కదా
మీతోటివాడుగద బయ-లీతెర గెరిగిపుడు శూన్యమేదో కనరా॥ 59

తా॥ శిష్యా! నీ తాతలు, నీ ముత్తాతలు, నీ తండ్రులు లేకుండా పోయి నట్లుగా ఒక నాడు నీవు నీ తనయులు లేకుండాపోదురు. ఇది నిజమేనని, నీకు

తెలియుచున్నది. ఈ బట్టబయలు మాత్రము మీతోగూడా రావడములేదు. అది కదలక సర్వకాలముల యందును, స్థిమితముగా యున్నదని నీకే తెలియబడు చున్నప్పుడు ఆ బట్టబయలును శూన్యమని తెలుపగలవో! యెరుకను శూన్యమని తెలుపగలవో! నీవే బాగుగా యోచించి తెలుపవలయును.

క॥ బయలెపుడు పుట్టి గిట్టదు-బయలెప్పుడు ముట్టుకోదు బ్రహ్మాండంబున్
బయలెపుడు నన్నెరుంగదు-బయలెప్పుడు జేయబోదు పనులెవ్వైనన్॥ 60

తా॥ శిష్యా! ఈ బట్టబయలు ఒకప్పుడు పుట్టినదికాదు. ఒకప్పుడు గిట్టినదికాదు. ఈ పుట్టుగిట్టులనే దోషములు ఈ బట్టబయలు నంటకనే యుండును. పిండబ్రహ్మాండములనబడు పంచభూతములనుగాని, పంచ శక్తులనుగాని, ఈ పరిపూర్ణము యెప్పుడు ముట్టుకొనక యుండును. నేను నేననుచు సర్వ సృష్టిని చేయుచున్న యెరుక సంగతి దానికి తెలియబడక యుండును. సృష్టించుట, పోషించుట, లయపరచుట అనే పనులు ఈ బట్టబయలు యెన్నడు చేయక, ఏ దానిని పట్టించుకొనక తనకు తానుగానే యుండును.

క॥ బయలనిన నిత్యవస్తువు-బయలన నొకరీతినుండు బ్రహ్మాండములో
బయలనిన కండ్లబడనిది-బయలన బ్రహ్మాండ మవల బరగెడిదిసుమీ॥ 61

తా॥ శిష్యా! బయలనగా నిత్యవస్తువై సమస్త కాలములయందును, కదలక హెచ్చు తగ్గులులేక వకేతీరుగా యుండుచు, బ్రహ్మాండ భాండములెల్లయు చలించుచు అనేక మార్పులు బెందుచుండినను ఈ బయలు మాత్రము చలించక యే మార్పులను బెందక ప్రళయకాలములయందును తన నిలకడకు నంతరాయము గలుగక యుండును. ఈ బయలు బ్రహ్మాండ భాండములలో సందులేక నిండి యున్నను, బ్రహ్మాండ భాండముల నంటకయుండి కళ్ళకు మాత్రము కనుపించక అఖండ ఎరుకకు ఆవలగూడా యుండును.

క॥ బయలనిన నేను లేనిది-బయలనిన నుపాధి గానబడనిది యెపుడున్
బయలనిన పలుకులేనిది-బయలిట్టిది యనుచు దెలియబడ దెవ్వరికిన్॥ 62

తా॥ శిష్యా! ఈ బట్టబయలు యెట్టిదనగా! నేను నేననుచు, సమస్తమును ఏ యెరుక గుర్తించుచున్నదో? ఆ యెరుకగాక యున్నదే బట్టబయలని తెలియుము. జీవతనువులైన స్థూల, సూక్ష్మ కారణ మహాకారణంబులనెడి నాలుగు

తనువులును ఈశ్వర తనువులైన విరాట్ పురుష, హిరణ్యగర్భ, అవ్యాకృత మూల ప్రకృతియను నాలుగు తనువులును ఈ యెనిమిది తనువులలో ఏ తను వునుగాక యున్నదే ఈ అచల పరిపూర్ణము నేను నేననెడి పలుకుగాని, నీవు నీవనెడి పలుకుగాని, ఓం అనెడి పలుకుగాని, రామ అనెడు పలుకుగాని, కృష్ణా అను పలుకుగాని ఏ పలుకులు లేక నిశ్శబ్దముగా నున్నదే, ఈ బట్టబయలు. ఇట్టి బట్టబయలుయొక్క రహస్యము ఎవ్వరికి తెలియు శక్యముగాక యుండును.

క॥ చెప్పి చూపించరానిది-యప్పా యల్లదిగొ చూడుమని నే నీకున్
చెప్పి చూపి స్తి మరువకు-యెప్పటికిదినమ్మి లేని యెరుకను విడరా॥ 63

తా॥ అప్పా! "యతో వాచో నివర్తంతే" అను శ్రుతి న్యాయంబున ఇట్టి దని తెలుపుటకుగాని, ఇదుగో అని చూపుటకుగాని సాధ్య పడక అవాఙ్మానస గోచరమైన అచల పరిపూర్ణమును నేను నీకు తెలియ పరచితిని గనుక అట్టిదానిని నీవు సర్వకాల సర్వావస్థలయందును మరచిపోక దానినే నమ్మికొని లేని యెరు కను మాత్రము యెన్నడు నమ్మక లేని దానినిగానే భావించుచు కర్తృత్వ రహి తుడవై యుండవలయును.

క॥ ఉన్నదిగద నే జెప్పిన-దన్నా దాన్నుండజూచి తలగుము మృషయౌ
నిన్నంటియున్న సంపద-లన్నియుగొని నీవు వచ్చినట్లు మృషగుచున్॥ 64

తా॥ శిష్యా! నేను నీకు తెలియపరచిన అచల పరిపూర్ణము సర్వకాలముల యందును ఒకే తీరుగా యుంటున్నదో, లేకుండా యున్నదో అది నీవు చక్కగా పరిశీలించుకొనుచు అందులో నీవనే వాడవు వున్నావో, లేవో అని పరిశీలించు కొనుము. పంచతన్మాత్రలు బయలులోనున్న ఎడల నేను అందులోయున్నానని తలంచుము. పంచతన్మాత్రలు బయలులోలేని ఎడల నేను లేనివాడనని తెలుసు కొనుము. నేనులేని వాడనని యెప్పుడు నీకు దృఢమైనదో, నీవు లేక పోవుచు, నీవెంట వచ్చిన సర్వసంపదలన్నియు నీతోగూడ లేకుండపోవును.

క॥ పంచకోశములసంచును-మించిన దీయెరుక యనుట మేలా బయ
లంచెంచిన దగునా ముచ్చట-నంచితసద్భక్తి యుక్త అమితానక్తా॥ 65

తా॥ సద్భక్తిగలిగిన శిష్యుడా! అన్నమయ. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనెడు పంచకోశములు దేహ సంబంధమై జడ

ముగా యున్నవనియు, నీ ఎరుక హిరణ్మయ కోశముగా విలక్షణముగయుండి ఈ పంచ కోశములతో గూడిన దేహమును చైతన్య వంతముగా వేయుచున్న దనియు, కొంతమంది తెలుపుచుందురు. అది నిలబడే విషయముగా యుండదు. ఈ పంచకోశములును, ఈ పంచకోశములకు విలక్షణమై హిరణ్మయ కోశ ముగాయున్న యెరుకయు ఈ రెంటి జాడలు పరిపూర్ణమునందు కనబడక యున్నందువలన నీ పంచకోశములు హిరణ్మయకోశము. ఈ ఆరు కోశములు యెరుక ముచ్చట్లేగాని మరేమిగావని తెలియవలెను.

క॥ లేని నేనను శరీరము-లోన బయట గలిగినట్టి లోకసమితికిన్
లోన బయటగల బయలిది-దీనందే లేక మనము తిరుగుట మనఘా॥ 66

తా॥ ఓ పాపరహితుడా! లేకనే కనబడుచు నేను నేనను శరీరానికి, బయట కనబడు ప్రపంచానికి ముందు, వెనుక, లోపల బైట ఆ పరబయలే కనుపించు చున్నది. అందులో మనము లేకనే అనేక వూహాపోహలతో, ననేక భ్రాంతు లతో చచ్చుచు, పుట్టుచు తిరుగాడుచున్నామని తెలియవలెను.

క॥ ముడిబడి కర్మము జ్ఞానము-విడువక నారెండు వెలసె విశ్వమన నదే
కడువేడ్క బయలుగనె నా-ఘడియైనను నిల్వలేక కల్లై పోవున్॥ 67

తా॥ శిష్యా! కర్మతోగూడిన శరీరము, జ్ఞానముతోగూడిన ఆత్మ ఈ రెండును ఒకటిగా ముడిబడి యుండునేగాని, ఈ ముడివీడి యే దానికది రెండుగా యెప్పుడు కనుపించవు. ఈ కర్మజ్ఞానములనెడి దేహాత్మలు రెండు కలసి యుండునట్టిదే ఈ కనబడుచున్న సర్వప్రపంచమై యున్నది, ఈ కలియక లేనిచోట రూపాదులతో గూడిన ప్రపంచమే కనిపించదు. ఇట్లున్న కర్మజ్ఞాన ములు రెండును, సద్గురుమూర్తి కరుణచే ఆ బట్టబయలును జూచినవేంటనే ఒక్క ఘడియకూడ అక్కడ నిలువకపోవును.

వి॥ మరొక విధముగా "ప్రకృతిం పురుషంచైవ విద్యనాది ఉభావపి" కర్మతోగూడిన పకృతి, జ్ఞానముతో గూడిన వురుషుడు వీరిద్దరు అనాదినుండియు యెడబాటులేక సర్వసృష్టిని వేయుచున్నారని గీత 13-20 తెలుపుచున్నది. ఈ ప్రకృతి పురుషులు ఒకే వస్తువుగా యుండుటవలన అర్ధనారీశ్వరుండని తెలుపబడుచున్నది. "మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం" పురుష

డైన బ్రహ్మములో మాయయనెడు ప్రకృతి అధిష్టానముగా యుండి ఈ చరా చర సృష్టిని చేయుచున్నారని గీత 9-10 తెలుపుచున్నది. పురుషుడు జ్ఞాన స్వరూపుడై, ప్రకృతి కర్మస్వరూపమై ఈ రెండు కలియకతో జేసినదే ఈ కన బడెడు జగత్తుగాయున్నది. ఈ కలియక లేకయున్న యెడల జగత్తేకనుపించదు. ఇట్లు కలసి సృష్టినిచేయుచున్న కర్మజ్ఞానములనబడు ప్రకృతి పురుషులు ఏ కలియకలేక తనకు తానుగా కదలకయున్న పరిపూర్ణమును జూచినయెడల వారిరువురిలో గలుగు సృష్టిసంపద స్థిరము లేకయున్నదని తలంచుకొని వారే లేకుండా పోదురు.

క॥ సకలంబులేని బయలున-సకలములేనిదిటకొచ్చి చనెనా లేనం
చు కని తా లేచిపోయిన-నిక నిలిచే బయలు నెరుగ నేదుండునురా॥ 68

తా॥ శిష్యా! రూపనామాదులతో గూడిన సకల జగత్తు లేకయున్న పరి పూర్ణపరబయలులో రూపనామములు గలిగి విచారించితే లేకపోవుచున్న యెరుక ఒకటి వచ్చి అనేక చిత్రవిచిత్రములైన రూపాదులను కల్పించుకొని ఆ రూపా దులతో గూడుకొని సంతోషించుచు, దుఃఖించుచు ఒకనాడు తన యదార్థమును తెలసికొని తానే లేకపోయిన పిమ్మట యిక కలకాలము కదలకయున్న పరి పూర్ణమును చూచేటందుకు అచ్చట యెరుక కనబడక పోవుచుండును.

క॥ ఉన్న లేనేమొయనకన్-వున్నది బయలనుచు యేమొ వుంటిని లేనం
చెన్న లేనట్టి నిన్నును-పన్నగగని లేనినీవు పరుగిడవోయీ॥ 69

తా॥ శిష్యుడా! ఈ బట్టబయలు రూపనామాదులుగ కనుపించక పోవుట వలన నది యున్నదో? లేదో? యని సంశయము పెట్టుకొనకుము. నీ గురు దృష్టితో అన్ని కాలముల యందును. నా పరబయలును చూచుకొనుచు, నా పరబయలులోయున్న లోకాలోకంబులను జూచుచు అందులో నీ విషయము గూడా చూచుకొన్న యెడల నీవు నిలవడానికి యెచ్చటా తావులేదని నీకే తెలి యబడును. అప్పుడు నేను ఏ ఆధారములేని నిరాధారుడనని యేమితోచక పరు గెత్తిపోదువు

క॥ రెండు వస్తువుల నడుమ న-ఖండంబిదె కానుపించుగద దీనిని నీ
వుండి కనుగొని చనందగు-మండిత సత్కీర్తిసాంద్ర మానవచంద్రా॥ 70

తా॥ మనుజులలో వివేకముగలిగి చంద్రునివలె చల్లని బుద్ధిగలిగిన శిష్యుడా! ఆ వస్తువ ఈ వస్తువ రెండువస్తువుల నడుమ నేది అఖండముగా కనబడుచున్నదో దానిని బాగుగానుండజూచుకొంటివేని అదియె యెల్లకాలముల యందును, యెల్లలోకముల యందును స్థిరముగ కనుపించుచుండును. దానినె పరబయలని నమ్ముము. అట్టి దానిని నీవున్నప్పుడే తెలసికొని ఆ దెలసికొనిన యెరుక ఖండ ఖండములుగా కనుబడుచు అంతలో లేకపోవుటవలన లేని యెరుకను లేని దానినిగ జూచుకొను చుండవలయును.

క॥ ఉన్నదా నందు నిజముగ-నెన్నడు లేనట్టిమనము యేతెంచిట యీా
తిన్నని ముచ్చటలాడితి-మిన్ని యికన్ మనము బోతె యేదిరమాటా॥ 71

శిష్యా! ఏ రాకపోకలు, ఏ రూపనామాదులు లేక యెల్లకాలములయందును చలనములేకయున్న పరిపూర్ణ పరబయలునందు రాకపోకలుగలిగి రూపనామాదులతోయుండిన మనమిద్దరముచేరి ఆ పరబయలును గురించి ఇప్పటివరకు బోధచేసుకొనుచుంటిమి. ఆ బోధవలన నీవు నేను అనె యెరుక మన ఇద్దరిలో లేకపోయిన యెడల బోధను తెలిపేదానికి నాలోను, బోధను వినేదానికి నీలోను ఇద్దరిలో యే మాటలురాక నిలబడిపోవును.

క॥ ఓ పాపరూప బయ-లే పరమాత్మనుచు నమ్మి లేనట్టి నినున్
ఆపోజ్యోతిననుచు దెల-సీపట్లనె లేనటంచు చేరు ముళ్ళక్కన్॥ 72

తా॥ కంటిపాపలో కాంతిరూపముగ నున్నశిష్యుడా! నీ యెరుక రూపము కన్నుల మద్యన సన్నని రంధ్రములో కనబడుచు సర్వమును గుర్తించుచున్నది. ఆ గుర్తించే యెరుకచేతనే, అంతటా వ్యాపించియున్న పర బయలైన పరమాత్మను దర్శించి అదే శాశ్వితమని నమ్ముకొని కన్నులమద్యనమాత్రమే కనబడుచున్న నీవు ఆత్మనియు, ఆపోజ్యోతనియు పిలువబడుచు దేహ మున్నంత వరకే కనబడుచు దేహము పోయినయెడల ఆ దేహముతోగూడా ఆత్మ ఆపోజ్యోతులుపోవుచున్నవి. ఇట్టిది నీ స్వరూపమని నీకు తెలసినయెడల నీవు ఈ ప్రక్కనే నిలువకుండాపోదువు.

క॥ ఇచ్ఛారాహిత్యంబునె-స్వచ్ఛంబగు బోధయనుచు సజ్జనులని యీా
యిచ్ఛనె కూడని దనిరా-స్వచ్ఛందుల మాటలన్ని సత్యము వినరా॥ 73

తా॥ శిష్యా! ఏ భ్రాంతులుగాని, ఏ సంశయాలుగాని, ఏ యనుమానాలుగాని, ఏ కోరికలుగాని పుట్టకుండా జేయునది ఈ అచలబోధ యొక్కటియే ననియు, నితరబోధలు పనికిరావనియు, సుజనులైన సద్గురువులందరు తెలుపుచున్నారు. జీవుడు ఈశ్వరుడు కావలయుననే జీవేశ్వరైక్యభ్రాంతి, జీవుడు బ్రహ్మము కావలయుననె జీవ బ్రహ్మైక్యభ్రాంతి, యెరుక పరిపూర్ణము కావలయుననె యెరుక పరిపూర్ణైక్య భ్రాంతి, ఈ కోరికలు యున్నంత వరకు నిర్మలమైన పరిపూర్ణ బోధస్థితి అందబడదని స్వచ్ఛందులైన మహాత్ములు దెలుపుచున్నారు.

క॥ ఏ యాపేక్ష జనించిన-నా యాపేక్షలెల్ల మాయ యని తెలియదగున్
ఆయాసమౌను దానను-ఛీ యని యవి విడువదగును సేమముకొరకై॥ 74

తా॥ శిష్యా! నీ మనసులో యే సంశయము గలిగిన యే కోరిక గలిగిన యే భయము గలిగిన అవి నిజము కాదనియు, భ్రాంతియేననియు తలంచుము. అట్లు గలుగుటవలన నీకు ప్రయాస, శ్రమయేగాని సుఖము లేనందువలన అట్టి సంశయములు కోరికలు నీలో పుట్టకుండ, ఛీ-ఛీ-యని వాటిని నీ దగ్గరకు రానియ్యక చేసుకొనవలయును. అట్టికోరికలు, సంశయములు యున్నంతవరకు ఈ అచలబోధ నీకు పట్టక యుండును. ఇది యంతయు నీ క్షేమము కొరకు తెలుపుచున్నాను.

క॥ లేని నీ కలిమి వంధ్యా-సూనునివలె పుష్కర ప్రసూనమువలె స్వ
ప్నానందమువలె గంధ-ర్వానీక స్థానమువలె నని తెలియదగున్॥ 75

తా॥ శిష్యా! నీవు పుట్టడముగాని, మరణించడముగాని నీ సంపదంతా యెట్లున్నదనిన గొడ్రాలికి పుట్టిన బిడ్డ అనేమాట యెంత నిజమై యున్నదో, ఆకాశ పుష్పమనే మాట యెంత నిజమైయున్నదో, స్వప్నానందమనే మాట యెంత నిజమైయున్నదో, గంధర్వ నగరమనే మాట యెంత నిజమైయున్నదో, నీ మాటగూడా అంత నిజముగ యున్నదని తలంచి నీమీద, నీ దేహముమీద యున్న భ్రాంతిని విడచిపెట్టవలయును.

క॥ నీ తండ్రి జననమీదట-నీ తనయుడు రాకమునుపు నీ వున్నపుడున్
ఏ తత్వమంతటను గల-దా తత్వము నరసి మృషని తలపుముమిమ్మున్ 76

తా॥ శిష్యా! నీ తండ్రి మరణించిన తరువాత యేది యున్నదో, నీ పుత్రుడు పుట్టక ముందు యేది యున్నదో, నీవు వున్నప్పుడు యేది యున్నదో, అట్టి దానిని బట్టబయలుగా తెలుసుకొని, ఆ బట్టబయలు అంతటా నిండి సర్వ కాలములయందును చలించక ఒక్క తీరుగా యున్నదని నీకు గట్టిగా తెలిసిన మీదట ఒక కాలములో యుండి ఒక కాలములో లేక పోవుచున్న నీ తండ్రి, నీ తనయుడు, నీవు నిజముకాదని ఆ భ్రాంతిని విడచిపెట్టి యుండవలయును.

(ఇది వరుసలో లేని కందము)

క॥ మనమీ బయలున లేనిదె–మనకు మనమేవచ్చి నిల్చిమనమేగిన నే
మనకమనజోలి గొనకన్ –తనకై తానిండియున్న దదుగో కనరా॥

తా॥ శిష్యా! మనమంతా ఈ అచల పరిపూర్ణములో కనుపించక మనకు మనమే పుట్టుచు మనకు మనమే పెరుగుచు మనకు మనమే లేక పోవుచున్నాము మనము పుట్టినది, పెరిగినది, మరణించినది ఆ బట్టబయలుకు యే మాత్రము తెలియక సర్వత్రా వ్యాపించి యున్నది. అట్టి దానిని ఏ చాటు మాటు లేకుండా అదుగో అని చూపుచున్నాను.

క॥ నీవెసుమీ జీవశివుల్–నీవెసుమీ మేనుజగము నీవేసుమ్మీ
జీవశివైక్యము బయలున–నీవు గలుగలేదు లేదు నీ మొదలెచటన్॥ 77

తా॥ శిష్యా! నీ విషయముమ గురించి విచారించగలిగితే జీవోహం అనెడి జీవుడవు నీవె, శివోహం అనెడి శివుడవు నీవె, దేహము నీవే, ప్రపంచమునీవె అంతా నీ యెరుక స్వరూపమేకాని నీవు లేనిది ఈ బ్రహ్మాండభాండములలో నే యొక్కటియు కనిపించదు. నీవే అంతానైనప్పుడు జీవేశ్వరైక్యముగాని, జీవ బ్రహ్మైక్యముగాని ఈ రెండు లేనివగుచు అబద్ధమేనని తలంచుము. నీవు బయలులో అసలే లేనివాడవై యున్నందువలన బయలులోగూడ నీకు స్థానము లేదని తలంచుము.

క॥ కదిలీనా మెదిలీనా-కదలని యీ బయలు నిన్ను గనలేదు గదా
మొదలెక్కడ గనరాదిక-కదులుము నీకలిముళ్ళక్కిగా దల్చి సుతా॥ 78

తా॥ బిడ్డా! నీవీ దేహమును తోడువేసికొని కదలుచున్నను, మెదలు చున్నను కదలక మెదలకయున్న పరిపూర్ణ పరబయలునకు మాత్రము తెలియ

బడకయున్నది. కదిలే మెదిలే నీకు మొదలుయెక్కడా కనబడక పోవుటవలన నీ కదిలిక, మెదిలికలను విడవిపెట్టి నీమాట హుళక్కని నీవు లేకుండా పోవల యును.

క॥ మేనని నను దెలిసినగతి-నేనన నిది బయలుగాను నీవెరుగోయీ
నేనన నిది నేననదని-నేనను నేనరయ మృషని నే మృషనౌదున్॥ 79

తా॥ శిష్యా! ఏ యెరుకచేత నీ దేహమును యెరుగుచు నీ దేహమని, నా దేహమని పలుకుచున్నావో, ఆ యెరుకచేతనే దేహములేని పరిపూర్ణమును దెలిసిన యెడల ఆ పరిపూర్ణమందు నేననే యెరుక లేకపోవుట వలన నే ననే పలుకు అందులో లేక యున్నదని తెలుసుకొని ఈ పలుకుచున్న నేను లేకనే పలుకుచున్నానని నీ విషయము నీకు తెలిసినప్పుడు ఈ పలుకుచున్న నీవు లేకుండ పోదువు.

క॥ మేనొక్కటి నేనొక్కట-నే నీ మాటలను విడచి నిను నీ తనువున్
నేనేనని యచలముగని-నేనను నీవేగవోయి నే మృషననుచున్॥ 80

తా॥ శిష్యుడా! ఈ నేను మేనులు వేరు వేరుగా కనబడుచున్నవనియు, నేనొకటి మేనొకటిగా యున్నదనియు, పొరపాటు పడబోకుము. ఈ నేనుగాని, ఈ మేనుగాని నేననే యొక యెరుకచేతనే గలిగి నేను మేనులుగ కనుబడు చున్నవేగాని ఇందులో నొకటి యెక్కువాలేదు, యొకటి తక్కువాలేదని ఈ రెంటిని సమానముగ భావించుము. ఈ నేను మేనులను ఏ యెరుక జేసినదో, ఆ యెరుక స్వరూపముగల నీవు య్యే నేను మేనులు లేకయున్న పరిపూర్ణమును జూచిన యెడల ఈ నేను మేనులు ఉత్తవిగా తెలిసికొని నీ సంపద యుత్తది అనుకొని నీవే లేకుండా పోదువు.

క॥ దేహమున కొంతనిజమని-మోహంబున నిల్చుకొనుటె మోసంబు గురు
ద్రోహమగుగాన విడువుము-మోహంబును మేల్కని కల మణిగినరీతిన్ 81

తా॥ శిష్యుడా! ఈ దేహిదేహముల రెంటిలో దేహము అబద్ధమనియు దేహి సత్యమనియు తెలుపుచున్న వారిమాటలు నమ్మబోకుము. ఈరెంటిలో అబద్ధము అయితే రెండు అబద్ధము కావలయును. నిజమైతే రెండు నిజముకావలయును. ఇందులో ఒకటినిజము ఒకటిఅబద్ధమని తెలుపుచున్న మాటలలో మోసము

కనబడుచున్నది. పుష్పమును విడచి పరిమళము, పరిమళమునిడచి పుష్పము వుండలేకపోయినట్లుగ ఈ దేహిదేహములును ఒకదానిని విడచి ఒకటివుండలేక యున్నవి. అట్టి సంబంధమును వేరు వేరుగాదెల్పుట సత్యమైన మాటలుగ యుండక నిజమెరిగిన వారిదగ్గర గురుద్రోహముగ నుండును. కలలో కనబడిన వస్తుసముదాయము మెలుకువరాగానే యేమికనబడనియట్లు గురు మెలుకువ గలుగగానే దేహిదేహములు రెండు లేనివేయగుచున్నవి.

క॥ చలనమన నీవుసుమ్మీ-చలనరహితమనిన బయలు చలనమె కల యీ
చలనము చలనరహితము-గలదని కని తొలగ మేలుకగునోయప్పా॥ 82

తా॥ అప్పా! చైతన్యవంతమై చలనాదులతో గూడుకొని కదిలే వస్తువు నీవేనని తెలియుము ఏ చలనాదులు లేక స్థిరముగనుండి కదలని వస్తువు అచలమేనని భావింపుము. ఈ చలనాదులతో గూడిన నీవు నే చలనాదులులేని అచల పరిపూర్ణమును జూచుకొని ఆ అచల పరిపూర్ణమునందు నేను లేనివాడనని గట్టిగా తెలుసుకొని కలలోని వాడవుగాదలంచి నీ చలనాదులనంతయు మానుకొనిన యెడల నీకేమేలుగలుగును.

క॥ ఈ గుర్తెరిగే మేనును-బాగుగ విడచుండు మిందు బట్టకు దేనిన్
అగడమౌ దానను విని-త్యాగము నీకుంటె మంచిదౌరా వోరీ॥ 83

తా॥ శిష్యుడా! సమస్తమును గుర్తించుచు, నీ స్థూలదేహములో నేను నేననుచున్న సూక్ష్మదేహమను ఎరుకపై నీకు ఇష్టముగలిగి యది నీ స్వరూపమని భ్రాంతి పెట్టుకొనకుము ఆ ఎరుకను జ్ఞానమని, సాక్షియని, ప్రత్యగాత్మయని, పరమాత్మయని, చిదాభాసుడని, సత్యజ్ఞానానందమని, సచ్చిదానందమని, స్వస్వరూపమని, ఆత్మని యెన్నియో నామములతో అగడములు చేయుచుందురు. అట్టి అగడములయందు భ్రాంతిలేని త్యాగబుద్ధి నీకు యుండెనేని అది నీకు మంచిదిగానే యుండి స్థిమితము నిచ్చుచుండును.

క॥ చలియించని దాకాశము-చలనంబే వాయువనుచు సాటింపదగున్
చలనమె విశ్వము నేనన-చలనమె తనువెరుకలనిన జగమనినసుతా॥ 84

తా॥ పుత్రుడా! ఆకాశమునకు లక్షణం శబ్దమేకాని, చలించే లక్షణం లేదు. చలియించే లక్షణం వాయువు కున్నందువలన ఈ వాయువే చైతన్య

రూపముగా సమస్త సృష్టిని చేయుచున్నదని " ప్రాణోపలక్షిత పరమాత్మ " ప్రాణమే సకలభూత సృష్టికి పరమాత్మ స్వరూపమని చాందోగ్యోపనిషత్తు మొదలైన గ్రంథములు చాటుచున్నవి. ఈ ప్రాణరూపమైన వాయుతత్వమే నీవుగాను, నేనుగాను, ప్రపంచముగాను, తనువుగాను, ఎరుకగాను అన్ని రూపులతో అంతటికి ఆధారముగా యున్నదని తెలియుము.

వి॥ ఆ॥ మాయ తెలియరాదు మాయ మూలములేదు మాయ వాయు రూపమాయె మమత మమతతోడ బుట్టె మహదహంకారంబు అఖిల జీవసంగ ఆత్మలింగ॥

క॥ వలదెక్కువ ముచ్చట్లిక-చలనము లేనట్టి బయలుచందముగని యా
చలనమగు నీకు నీ నే-తలిదండ్రులటంచు దెలిసి తలగుముచాలున్॥ 85

తా॥ శిష్యా! ఇప్పటివరకు మనము తెలియని యెన్నో మాటలు మాట్లాడుకొని యుంటిమి. ఇక ఆ మాటలన్నియు చాలించుకొని యున్నదానిని గురించి ఆలోచించిన యెడల యే గుణముల, యే రూపములు, యే చలనాదులు లేక స్తబ్దతగా కదిలికలేకయున్నది. ఆ పరబయలొక్కటియే యనియు, సకలగుణములతో, సకలరూపములతో, సకలచలనాదులతో గూడియున్నది. నీవను నేనను యెరుక అనియు తెలియబడుటవలన ఆ యెరుకే అన్నిరూపాదులు దాల్చుచు, తల్లిగాను, తండ్రిగాను, సోదరులుగాను సమస్తము నా యెరుకొక్కటియే నని తలంచి ఆ యెరుకను విడచియుండవలయును.

క॥ బ్రహ్మందులేక కలిగిన-బ్రహ్మను నే ననెటిమాయ ప్రబలె జగంబై
బ్రహ్మనుగని తా నేగుటె-బ్రహ్మననే మాయకు పని బ్రహ్మందుజుమీ॥ 86

తా॥ శిష్యుడా! అచల పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేకనే గలిగిన యెరుక మాయజగత్తును సృష్టించుటవలన నేను బ్రహ్మమును "అహంబ్రహ్మాస్మి" అని తెలుపుచున్నది. నేను బ్రహ్మమను శబ్దముచే పలుకుచున్న ఈ మాయ యెరుక నేనను పలుకులేక అఖండముగా నిశ్శబ్దముగాయున్న పరిపూర్ణ పర బయలును జూచినయెడల ఆ పరబయలు దగ్గర పలుకుగలిగి ఖండ ఖండములుగా కనుబడుచున్న నా బ్రహ్మత్వమెందుకని ఈ యెరుక ఆ బ్రహ్మస్థానము నుండి తొలగిపోవును.

క॥ నిరుపాధికమగు బయలున-మరి లేకనె కలిగినట్టి మారుతమునకే
పరియాయ నామములగు-కరువలియన ఎరుకయనిన కడుమాయ యనన్ 87

తా॥ శిష్యా! ఏ రూప నామాదులు తెలియబడక ఉపాధి ధర్మముగా కను పించని నిరుపాధికమైన బట్టబయలందు లేకనే యొక చైతన్యముగలిగి ఆ గాలి చిన్న చిన్నగా బలబడుచు ఒకదానితో నొకటి సంఘర్షణలు గలిగి విక్షేపశక్తిగా మారుచున్నది. ఆ విక్షేపశక్తియే సకలసృష్టికి మూల పదార్థమై యనేక రూప గుణములతో వికాశించుచున్న ఆ మారుతమునే చైతన్యమనియు, యెరుక యనియు, మాయయనియు పర్యాయ నామములచే తెలుపబడుచున్నది.

వి॥ ఈ చైతన్యము సకలమును కదిలించుచు, సర్వమునకు ఆధారమగుట వలన శ్లో॥ "శేతే నారాయణో మ్భోదౌ ద్యాని బ్రహ్మపురేబ్జజః। కాంన్తాగతో హరః శైలే స్వర్గే సురవరో హరిః" తా॥ ఆ చైతన్యమే సాగరమున శయనించిన నారాయణుడుగాను, కమల సంభవుడైన బ్రహ్మదేవుడుగాను, అర్ధనారీశ్వరుడైన పరమేశ్వరుడుగాను, సురులకు రాజైన ఇంద్రుడుగాను తెలియబడు చున్నారని యోగవాశిష్టము తెలుపుచున్నది.

క॥ మానసము దేహి జీవుం-డానందము సత్తుచిత్తు లహము జగదది
ష్ఠానంబు సాక్షిసత్యజ్ఞాన ముద్రష్టనిన నీవె సత్యము సుజ్ఞా॥ 88

తా॥ సుజ్ఞానియగు శిష్యుడా! సర్వసృష్టికి ఎరుకే బీజముగా యున్నందు వలన దేహమన్నను, దేహియన్నను, మనస్సన్నను, జీవుడన్నను, సత్తన్నను, చిత్తన్నను, ఆనందమన్నను, సాక్షియన్నను, ద్రష్టయన్నను జగత్తుకు అధిష్టానమన్నను. కూటస్థుడన్నను ఈ నామములన్నియు యెరుకకు పెట్టిన పేరులే గాని ఎరుకగానిది ఏ యొక్కటియు లేదని ఈ మాటసత్యమని నమ్ముము.

క॥ జ్ఞానాజ్ఞానంబులు యీ-జ్ఞానంబువెకాని వేరుగా వెన్నటికీ
జ్ఞానాజ్ఞానానికి పని-జ్ఞానాతీతమునుగాంచి చనుటయె సుమ్మీ॥ 89

తా॥ శిష్యా! సృష్టి నిర్మాణము జరిగిన క్రమమును పెద్దలు పంచీకరణ మందు ఆకాశముయొక్క అర్ధాంశము, చతుర్వింశతి తత్వములై, దేహస్వరూపముగా అజ్ఞానముగ యున్నదనియు, మిగిలిన ఆకాశముయొక్క అర్ధాంశము ఆత్మ స్వరూపముగా జ్ఞానముతోగూడి యున్నదని తెలుపుచుందురు. ఈ జ్ఞానా

జ్ఞానములు రెండు నొక్క ఆకాశతత్వమే అగుటవలన ఈ రెండు వేరు వేరు పదార్థములని తెలుపగూడదు. ఈ జ్ఞానా జ్ఞానంబులు రెండు, జ్ఞానా జ్ఞానంబులకు అతీతముగాయున్న పరబయలును చూడగలిగిన యెడల ఈ రెండు లేక పోవును.

క॥ జలమందు మొదలు లేకనె-జలచరములు బుట్టి పెరిగి సమసినరీతిన్
అల పరిపూర్ణములోనీ-విలసజ్జననంబుస్థితియు విలయములౌరా॥ 90

తా॥ శిష్యా! జలములో మొదటలేకనే జలచరము లెల్లయు అక్కడనే పుట్టి, అక్కడనే పెరిగి, అక్కడనే సమసిపోయిన రీతిగా అచల పరిపూర్ణమునందును ప్రపంచముతోగూడిన రూపనామాదులెల్లయు మొదటలేకనే వాటికవే పుట్టి, వాటికవే పెరిగి, వాటికవే సమసిపోవుచున్నవని తలంచవలయును.

క॥ అచలమున మొదలులేకనె-సచరాచరజంతు నిచయ జననమగు య
ప్ప్రచయమున లేని జలచర-నిచయము జన్మించినట్లు నిశ్చయముసుమీ 91

తా॥ శిష్యా! అచలములో మొదటలేకనే ఈ సకల చరాచరములైన జీవరాసులెల్లయు యెట్లు పుట్టుచున్నవి, యెట్లు పెరుగుచున్నవి, యే విధముగా సమసిపోవుచున్నవని నీకు సంశయము గలిగినయెడల జలములో మొదట లేకనే జలచరములు వాటికవే యెట్లు పుట్టుచున్నవో, వాటికవే ఆ జలములో యెట్లు పెరుగుచున్నవో, వాటికవే యా జలములో యెట్లు సమసిపోవుచున్నవో ఆలాగుననే ఈ పరిపూర్ణమందుగూడా ఈ ప్రపంచము కనిపించుచున్నదని నిశ్చయించుకొనవలయును.

క॥ నీరందు వాపలేకనె-నీరున జన్మించి మించి నీల్గినరీతిన్
తోరమగు బట్టబైటను-వారకగు రెరుగు మేను వచ్చున్ బోవున్॥ 92

తా॥ శిష్యా! నీటిలోచేపలు లేకనే ఆ నీటిలో యెట్లు చేపలుపుట్టి పెరిగి నశించుచున్నవో ఆ విదముగ నపరిమితమగు పరిపూర్ణపరబయలునందు నీ యెరుక దేహాదులు దాల్చుకొని యెడతెగని జన్మములెత్తుచు వచ్చుచు పోవుచు స్థిరత్వములేక యున్నది.

క॥ జలధి జలచరము లోపల-గల దా జలరాసిలోని జలచరము వలెన్
జలధి నిత్యం బనిత్యము-జలచరమట్లచలచలము సరణులు గనుమీ॥ 93

తా॥ శిష్యా! సముద్రములో జలచరములుండునుగాని, జలచరములలో సముద్రముండబోదు, సముద్రము గంభీరముగ గొప్పదిగా యున్నది. జలచరములు నల్పములై యనిత్యముగనున్నవి. అటులనే పరిపూర్ణము ఖండ ఖండములుగాక యఖండముగాయున్నది. యెరుక ఖండ ఖండములుగా కనిపించుచు అనిత్యమువై యున్నది. అందువలన నిత్యమైన పరిపూర్ణముతో ననిత్యమైన యెరుకకు నెప్పుడు పనియుండును. అనిత్యమైన యెరుకతో పరిపూర్ణమునకు నెప్పుడు పనియుండబోదని ఈ తారతమ్యములను ఆలోచించి చూచుకొనుము.

క॥ జలరాసికి బుట్టవుగద-జలచరములు వాటికవ్వె జనియించుగదా
కలకాలమిట్లు బయలెరు-కల గాంచిన సంశయంబు కడకేగుజుమీ॥ 94

తా॥ శిష్యా! నీటిలోనున్న యే జీవులనైనను నీరుపుట్టించలేదు. ఆ జీవులు వాటికవే పుట్టుచున్నవి. ఆ విధముగనే ఈ రూపనామాదులతో గూడిన లోకాలోకములన్నిటిని పరబయలు పుట్టించలేదు. ఈ లోకాదులన్నియు వాటికవే పుట్టుచున్నవి. ఈ లాగున మన సృష్టినిగురించి తెలసికొనిన యెడల యే సంశయములు గలుగకయుండును.

క॥ పుట్టదు గిట్టదు వొకరిని-పుట్టించదు చంపబోదుభూమ యెరుక దా
పుట్టును గిట్టును వొకరిని-పుట్టించును సమయజేయుభూమ కితరమై॥ 95

తా॥ శిష్యా! బుద్ధి కగోచరమై బృహత్ స్వరూపముగనున్న అచల పరిపూర్ణము తానుపుట్టక గిట్టక మరొక దానిని పుట్టించక తనకు తానుగానే యే చలనాదులులేక యున్నది. ఈ యెరుకే పుట్టుచు, గిట్టుచు మరొకదానిని పుట్టింపజేయుచు, గిట్టింపజేయుచు ఆ పరబయలుకు వేరుగానుండి అన్ని పనులు యెరుకే జేయుచుండును.

క॥ కలలోపల ఏనుగపై-గలదొర మేల్కనిన నిల్వ గలడా గురుడున్
తెలిపి బయలు నీవు లేవిక-దలపకుమన నీకు నిల్వదరమా తలపన్॥ 96

తా॥ శిష్యా! కలలో నేనుగుమీద యంబారిపై కూర్చొని వూరేగుచున్న మహారాజుకు మెలుకువరాగానే అచ్చట ఏనుగు నంబారి కనుపించక పోయి నటుల సద్గురుమూర్తి కరుణచే పరిపూర్ణమును దర్శించి ఆ పరిపూర్ణములో నీవు యెట్లు వచ్చితివో నీ సంపదయెంతదో దృఢపరచి నిన్ను లేకజేయుబోధ తెలిపెనేని ఇక నీవు ఇహములోగాని, పరములోగాని లేకుండాపోదువు.

క॥ ఎందరు లేదన్నను తా-నెందుకు లేకుండు బయలు నే నీవనకన్
యెందరు కలదని యన్నన్-యెందుకు కలిగుండు యెరుకనే నీవనుచున్ 97

తా॥ శిష్యా! సద్గురుసూచన పొందలేనివారు సర్వకాల సర్వావస్థలయందు కనిపించుచున్న ఈ పరిపూర్ణమును లేదనియు, శూన్యమనియు దెల్పుచుందురు. యెందరు యెన్ని విధముల దెలిపినను, ఈ పరిపూర్ణము లేకుండ పోవడము లేదు. ఈ ఎరుకను నిలుపదలచి యందరెన్ని విధములుగానో ఆత్మనియు, పరమాత్మనియు, సాక్షియనియు, కూటస్థుడనియు పొగడుచు దీనిని యెంతనిలు పదలచినను ఈ ఎరుక పోనేపోవునుగాని స్థిరముగయుండబోదు.

క॥ నీ కచ్చిరాని యూరున-నీ కే గృహ మచ్చనట్లు నీవౌ మేనన్
నీకచ్చిరాదు నీవు నిను-చేకొనుటము మానవయ్య శ్రేయస్కామా॥ 98

తా॥ శిష్యా! నీకు అచ్చిరాని వూరులో నీకు కలసిరాని ఇంట్లో నీవు వుండుటకు ఇష్టపడక, ఆ యూరిలో ఆ ఇంటిలో యున్నంతవరకు నీకు క్షేమము లేదని ఆ ఇంటిని ఆ యూరిని యెట్లు విడిచి పెట్టుదువో అలాగుననే ఈ దేహమువలన నీకు అనేక భ్రాంతులు, అనేక సంశయాలు, అనేక కోరికలు పుట్టుచు సుఖము శాంతి కలుగక యున్నది. అట్టి దేహముపై అభిమానము నిడచి యుండవలయును.

క॥ అష్టాంగ యోగముల నతి-కష్టించే ప్రజలవలెనె కష్టించక యా
స్పష్టమగుబోధవిను నీ కష్టములన్నియును దొలగి కడకేగుసుమీ॥ 99

తా॥ శిష్యా! కొంతమంది యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, దారణ, సమాధులనెడు అష్టాంగయోగములు చేయుచు వీటివలన జనన మరణములు తొలగి పోవునని యనేక కష్టములు పడుచుందురు. అట్లు కష్టపడువారివలె నీవు యే కష్టములు పడక యే చిక్కులు పెట్టుకొనక, యే భ్రాంతులు లేనిదియు సులువైనదిగానున్న ఈ అచల పరిపూర్ణబోధను తెలిసిన సద్గురునిచే యున్నది యున్నట్లుగా శ్రద్ధతో వినగలిగిన యెడల నీకున్న దుఃఖము లెల్లయు తొలగియున్నన్ని రోజులు సుఖముగానే కడతేరగలవు.

వి॥ లోకములో ఈ బ్రహ్మవిద్య ప్రయాణమందు అక్షివిద్య, దారణ విద్య, భూమవిద్య అను విద్యలున్నవి. అక్షివిద్య యనగా భ్రూమధ్యమందు

చూపునునిలిపి చూడడము, దారణవిద్య యనగా స్వాసపైనిగాపెట్టి చూడడము, భూమ విద్యయనగా యున్న పరిపూర్ణమును తెలుసుకొని ఏ సంశయములు లేక నిస్సంశయులుగా యుండడము.

క॥ ఇదిగాదుబోధ నే దె-ల్పెదరమ్మని నీకు వేరెపేరిడి యవలన్
ముదమున నే బ్రహ్మననుచు-వదురుమనినవాడె మాయ వసుమతిలోనన్ 100

తా॥ శిష్యా! లోకములో కొంతమంది గురువులు నీ దగ్గరకువచ్చి నీవు తెలుసుకొనిన బోధలో ఏ మహత్తులులేవు, అది మంచిదికాదు నా దగ్గరకు రమ్మని నిన్ను వారిశిష్యశ్రేణిలో చేర్చుకొని నీకొక దీక్షానామముపెట్టి సృష్టి కాధారమైన సచ్చిదానందమగు ఆత్మతత్వమునే బోధించుచు చతుర్వేద మహా వాక్యములైన అహం బ్రహ్మాస్మి ప్రజ్ఞానం బ్రహ్మ తత్వమసి అయమాత్మ బ్రహ్మ అను వాక్యములను ఒక్కొక్క వాక్యము ఒక్కొక్క నెలలో పౌర్ణమిరోజున దెల్పుచు నాల్గువాక్యములను నాలుగు పౌర్ణములకు పూర్తిజేసి నీవు బ్రహ్మమైపోతివి ఇక జననమరణాదులునీకులేవని తెలుపుచుందురు. అట్టి మాయగురువుల మాటలువిని భ్రాంతిరహితమైన బోధను తెలుసుకొని మరలా ఆ భ్రాంతులలో పడబోకుము.

క॥ మంత్రయంత్రములు ముద్రలు-తంత్రంబులు నీకుదెల్పి ధనమడిగెటి యా
మంత్రజ్ఞుల మంత్రములకు-యంత్రములకు తంత్రములకు నీగకుకూనా॥ 101

తా॥ శిష్యా! లోకములో మోసకారులు నీకున్న పీడలు కర్మములు తొలగిపోయి సుఖముగ నుండగలవని నమ్మించి మంత్రములు కొందరు చెప్పుచుందురు. యంత్రములు కొందరిచ్చుచుందురు. తంత్రములు కొందరు చూపుచుందురు. ముద్రలు కొందరు పట్టుమందురు. ఇవియన్నియు బూటకములేగాని యిందులో యేదియు నిజముకాజాలదు. ఈ యెత్తుగడలంత నీ దగ్గరున్నధనము అపహరించుటకేగాని అందులో నే యొక్కటియు నీకు మేలును గలిగింపలేవని తలంచి ఆ మోసములకు వశపడక యుండవలయును.

క॥ దీపముగతి కన్నులలో-పాపవలెన్ మెలగు నన్ను పరమాత్ముడవం
చీ ప్రజలు దలతురెరుగక-నీపాల్గెరిగుండి నేను నినునమ్ముదునే॥ 102

తా॥ శిష్యా! కన్నులలో పాపయందుగల సన్నని రంధ్రములో దీప కాంతివలె ప్రకాశించు వెలుగును పరమాత్మయని కొందరు దెలుపుచుందురు. శ్రుతి॥ " చక్షుర్మ ధ్యేస్థితం గుహ్యం అంగుష్టం పరమాత్మకః " శాస్త్రములలో కనుబడుచుండును. ఇట్లు యెందరెన్ని దెల్పినను ఆ కన్నులలో వెలుగు మాయగ నున్న యెరుక రూపమే యగుచు, దేహములో భ్రూమధ్యభాగమున నొక దగ్గరే కనుబడుచుండునుగాని ఇక బయట యెచ్చట కనిపించక యుం డును. ఇట్లు ఒక దగ్గర కనబడుచు, ఒక దగ్గర కనుపించని మాయ యెరుకను నిత్యమైనది, సత్యమైనది కాదని ఆ నిజము దెలిసిన సద్గురువు లెల్లరు తెలుపు చున్నారు.

క॥ తర్జనులవలన జూపును-నర్జునవర్ణగత నీలమని శిష్యులకున్
దౌర్జన్య గురుడునీవు వి-సర్జింపు మసత్యమనుచు సజ్జనతిలకా॥ 103

తా॥ సజ్జనులలో శ్రేష్టుడైన శిష్యుడా! కన్నుల కొలుకుల దగ్గర చూపుడు వ్రేళ్ళతో నొక్కగ నచ్చట చక్రమువలె, నర్ధచంద్రాకారమువలె, మెరుపు తీగెల వలె, హరివిల్లువలె యెరుపు తెలుపు నీలము మొదలగు రంగులవలె కనబడు చుండు కాంతులను ఆత్మ అనియు, నీ స్వరూపమనియు కొంతమంది గురువులు భ్రమ పెట్టుచుందురు. అదియంతయు నిజముకాదని వాటియందు నమ్మకమును విడువవలయును.

క॥ పురుషోత్తముడని పూజలు-నరులొనరింపుదురు భువిని నానాచోట్లన్
ధరమొదలగు భూతములను-విరుత శిశువులాడుకొనెటి చేష్టలరీతిన్॥ 104

తా॥ శిష్యా! ఈ పామరజనులు రాముడనియు, కృష్ణుడనియు, నారా యణుడనియు, గోవిందుడనియు, పురుషోత్తముడనియు నానా విధములైన పేరులు పెట్టుకొని రాళ్లను, కొయ్యలను, లోహాదులను దైవములని పూజించు చుందురు. మరికొందరు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములనెడి పంచభూతములకు పూజలు సలుపుచుందురు. ఇట్లు చేయుచున్న జనుల తలంపు లెట్లువున్నవనిన చిన్నపిల్లలు బొమ్మలతో ఆడుకొనినట్లుగా యున్నదేకాని అంతకంటే అధికములేదని తలంచవలయును.

క॥ రసమన దగనిది వస్తువ-బసవన్న కదెట్టులెరుక ప్రభువుకు దెలుసున్
రసమైతె విసము సగుణము ససిగా దాముచ్చటంత వెవులవినుటకై॥ 105

తా॥ శిష్యా! సకలరూపాదులకు రూపమివ్వనిది, సకలసృష్టికి ఆధారంకానిది గుణసంపదతోగూడిన రస సముదాయము, అందులోలేక గుణాతీతముగ యే మహత్తులులేని పరిపూర్ణమున్నదో, అట్టి దానిని పొందుటకు లోకభ్రాంతులు లేనివారుగ యుండవలయును. ఎందువల్లననగా శైవమతస్థుడైన బసవేశ్వరులు గొప్ప గొప్ప మహత్తులు జేయుచు ప్రజలలో పేరుప్రతిష్టలు సంపాదించుకొని ఆ మహత్తులవలన తనకు జన్మరాహిత్యము కలుగబోదని తానే ఆలోచించుకొని అచల గురువైన అల్లమా ప్రభువు నాశ్రయించి, పరిపూర్ణమును దర్శించి జనన మరణముల కతీతుడయ్యెను. అందువలన సత్వగుణముతో గూడిన మహత్తు లెల్లయు విషముతో సమానమగుచు మరల జన్మకుదారి తీయుచుండును. ఆ మహత్తులు, ఆ సిద్దులయందు భ్రాంతిని పెట్టుకొనక యే మహత్తులులేని పర బయలును తెలుకొని మహత్తులపైన అభిలాషను విడచిపెట్టి యుంటివేని శాంతి లభించి స్థిమితముగ యుండగలవు.

వి॥ కొందరు గొప్పలకొరకు, ధనముకొరకు కొన్ని క్షుద్రవిద్యలను సంపాదించుకొని ఆ విద్యలను అమాయక ప్రజలకుచూపించుచు, గొప్పవాడుగ చలామణియగుచు కొంతకాలమునకు ఆ మహత్తులు నిలువక, మనశ్శాంతినివ్వక అనేక ఉపద్రవములుగలిగి ఆఖరుకు పదుగురిలొ అపనిందలుపాలగుచుందురు. అట్టి గారడివిద్యలను అచల గురుపుత్రులు యేనాడు నమ్మక మనసులోనైన తలంచకయుందురు.

క॥ నీరాంశమసృగ్వేదన-సారము రేతస్సు రెంటి సమ్మిశ్రంబే
ధారుణి తనువై నిలుచును-నారీ నరసంగమము ననయ గుణరత్నా॥ 106

తా॥ రత్నములవంటి గుణములు గలిగిన శిష్యుడా! మనము భుజించు చున్న అన్నముయొక్క మద్య సారమువలన శుక్లము యేర్పడుచు, మనము త్రాగుచున్న నీటియొక్క మద్య సారమువలన శోణితము ఏర్పడుచు, స్త్రీపురుష సంయోగంబున నీ రెండుగూడి నొక దేహాకారము దాల్చుచు, నా దేహాదులే సర్వజగత్తుగా కనుబడుచున్నది. ఈ జగత్తుగా కనుపించు రూపనామాదుల కంతటికి మనము భోంచేయు నీరాన్నములే కారణముగ నున్నవి.

క॥ మనుసన్నపు సూక్ష్మాంశము-విను జలసూక్ష్మాంశ వలన వెలసెను ప్రాణం
బును రెండుగలసి పిండంబన బ్రహ్మాండంబనంగ బరగును వత్సా॥ 107

తా॥ వత్సా! అన్నము యొక్క సూక్ష్మాంశమువలన మనసు యేర్పడుచున్నది. జలముయొక్క సూక్ష్మాంశమువలన ప్రాణమేర్పడుచున్నది. ఈ ప్రాణ మనస్సుల కలయికయున్న జాగ్రదావస్థయందు మాత్రమే నీ యెరుక సర్వమును గుర్తించుచున్నది. ఆ కలయిక వీడి పోయిన సుషుప్త్యావస్థలో నీ యెరుకకు నెరిగే పనిలేక పోవుచున్నది. ఈ విధముగ జూచిన యెడల ఈ ప్రాణమనస్సుల సంబంధమే పిండాండముగాను, బ్రహ్మాండముగాను కనుపించుచున్నదని తెలియవలయును.

వి॥ మనము నిత్యము భోంచేయు అన్నమే సర్వ దేహాదులకు ఆధారమగుట వలన ఈ అన్నమును దైవముగ భావించవలయునని "అన్నం బ్రహ్మేతి వ్యజనాత్" తైత్తిరీయో పనిషత్తు తెలుపుచున్నది.

క॥ రెండురీతుల గనంబడు-చుండే యీ మేనిచేత చూచి బయలు ను
దండత దీని నుశక్యని-యుండుము దీనందు వాంఛనుంచక శిష్యా॥ 108

తా॥ శిష్యా! ఈ ప్రాణమనస్సులు రెండు యున్నంతవరకే ఈ దేహము కనబడుచున్నందువలన ఈ దేహము పోకముందే అంతటనిండి యేక స్వరూపముగ కనబడుచున్న బట్టబయలును తెలుసుకొని ఈ ప్రాణమనంబులను గాని, ఈ రెంటిచే నేర్పడిన యెరుకనుగాని, యివి నిత్యమని నమ్మక యివి యుత్తవియే నని తలంచి వాటియందు వాంఛనువిడిచి యుండవలయును.

క॥ ద్వైతాద్వైతవిశిష్టా-ద్వైతులమని కీచులాడు దయ్యములవలెన్
ద్వైతాద్వైతవిశిష్టా-ద్వైతులతో కీచులాడదగునే నీకున్॥ 109

తా॥ శిష్యా! ఈ లోకములో యెవరికివారే వారికి అనుకూలమైన మతముల నేర్పరచుకొని జీవుడువేరు, దేవుడువేరని ద్వైత మతస్తులు తెలుపుచుందురు. దేవుడు, జీవుడు నొకటేనని అద్వైతమతస్తులు దెలుపుచుందురు. సమస్తమునకు దేవుడు ఒక్కడేనని విశిష్టాద్వైతులు దెలుపుచుందురు. ఇట్లు అనేక మతములుగలిగి వారి వారి మతమే వారు గొప్పదనుకొనుచు ఒక మతమువారికి ఒక మతముగిట్టక ద్వేషములు పెంచుకొని మతోద్రేకములతో దయ్యములవలె పోట్లాడుకొనుచుందురు. నీ వా చపలాదులను విడచిపెట్టి అట్టి వారితో వాదోపవాదములు చేయక, యెవరితోను కీచులాటలు పెట్టుకొనక

సర్వులయందును నేక భావముతో యుండిన యెడల నీవు మంచివాడవని అందరు అభిమానించుచుందురు.

క॥ అనుభవ వేదాంతులమని-తినరాని పదార్థమెల్ల తిను దుర్జనులన్
కనబోకుము తద్బోధను-వినబోకుము యెన్నటికి వివేకవిచారా॥ 110

తా॥ వివేక విచారము గలిగిన శిష్యుడా! కొంతమంది గురువులు మాది అనుభవ వేదాంతమని తెలుపుచు, శుక్ల శోణితములను, మల మూత్రములను వారు తినుచు, శిష్యులకునుగూడా తినిపించుచు, కోతులు వాటి శుక్ల శోణితములను తినేటప్పుడు ఆ కోతులను చూపించుచు, రామచంద్రుడు ఆంజనేయ స్వామికి తినిపించినాడనియు దానితో ఆంజనేయస్వామికి దైవబలము గలిగి సముద్రమునుదాటి లంకాపురిలో రాక్షసులను జయించినది యిందులోయున్న గొప్పతనమేనని యది ఆంజనేయుడు తన జాతియైన కోతులకునిచ్చిన వరము ఈ నాటికి జరుగుచున్నదని తెలుపుచుందురు. శిష్యులు అమాయక ప్రజలు గనుక మాకు ఆ బలము వచ్చునని అన్నిటికి సిద్ధపడుచుందురు. ఇంక నెన్నో రీతులుగా జరుగుచుండును. నీవు ఆ బోధలనన్నిటిని వినక ఆ నీచపు పనులు చేయక అట్టి వారితోను స్నేహము చేయక యుండవలయును.

క॥ జిహ్వోపస్థ విషయము-లెవ్విగలవో వాటి విడువలేని గురువులన్
యెవ్వరుజేరి కొలుతురో-ఇవ్వసుధను వారు జెడుదురిది నిజముసుమీ 111

తా॥ శిష్యా! మానవునకున్న చాపల్యములలో జిహ్వాచాపల్యము, గుహ్యాచాపల్యము ఈ రెండు యెంతవారినైన బానిసలు చేసుకొనుచున్నవి. ఈ చాపల్యములను యెవరు నిగ్రహించుకొనుచుందురో వారిని సర్వదేవతలు కొనియాడుచుందురు. ఈ చాపల్యము లే గురువుదగ్గర లేకుండాయున్నవో అట్టి గురువు నాశ్రయించిన వారికి ఆ చాపల్యములు లేకుండా పోవును. ఆ చాపల్యములు గలిగియుండిన గురువునాశ్రయించిన వారికి ఆ అలవాటులే ప్రాప్తించుచుండును.

క॥ పాషండ మతము వారల-వేషంబులుజూచి శిష్య వితతి భ్రమించున్
ఈ షత్తీబోధెరుగక-దూషింతురు విన్న కన్న దుర్భాషణలన్॥ 112

తా॥ శిష్యా! గంగాదినదులలో స్నానములుజేయుచు కాశీరామేశ్వరములకు పోవుచు నందున్న ప్రతిమలను దేవుడనితలంచి కర్మకాండముతో గూడిన

అభిషేకములు, నిత్య పూజార్చనలు చేయుచున్నవారిని జూచి పరిపూర్ణబోధ తెలియనివారు భ్రమించి ఇది చాలామంచిదిగ నున్నదని తలంచి వారిని మెచ్చుకొనుచుందురు. ఈ పరిపూర్ణబోధలో శాంతిపడి యే పరుగులు ఆరాటసలు లేక స్థిమితముగ సుఖముగ యున్నవారి స్థితిని ఈ ప్రజలు గమనించలేక వీరికేది పట్టదని దుర్భాషలాడుచుందురు.

క॥ ఎందరు దూషించితె యే-మందరు మనవారెకాని యన్యులె నీ వా
యందరితో వాదించక-నందంబౌ నిట్టిబోధ నరయర తండ్రీ॥ 113

తా॥ తండ్రీ! యెవరు యెన్ని విధములుగానో నిన్నుగాని, నీవు పొంది యున్న బోధనుగాని నిందించుచు, యెగతాళి చేయుచున్నను ఆ మాటలన్నియు నీ చెవులలో పెట్టుకొనక తిరిగి వారిని నిందించక ఆ నిందించు వారంతా మన వారేనని తలంచి నీవు అందియున్న మహత్తరమైన అచల బోధను జారవిడచు కొనక యుండవలయును.

క॥ కోపమె పాపంబనబడు-కోపమె హంకారమనుచు కొనియాడబడున్
కోపమె తాపంబనబడు-కోపమె మృత్యువనబడును కుటిలరహితా॥ 114

తా॥ కుటిలస్వభావములేని శిష్యుడా! కోపమనునది మనుజునకు శత్రువై యున్నది. ఈ కోపమువలన నితరులు నీ దగ్గరకువచ్చి యే మాటనైన చెప్పుకొనుటకు భయపడుచుందురు. ఆ భయముచేవారు నీకు అనుకూలముగాలేరని రోజు రోజుకు వారిపైన విరక్తి అనే పాపము నీలో పెరుగుచుండును. ఆ విరక్తి వలన నీకు మనసు శాంతిలేక అన్నదానికంత విసుగుపడుచు ప్రతివిషయంలో ఓర్పులేక తొందరపడుట వలన ఆ తొందర ఇతరులకు అహంకారముగా కనుబడుచుండును. ఈ అహంకారము వలన పదుగురితో దూషింపబడుచు, పదుగురికి చులకనై గౌరవము పోగొట్టుకొనుచుందువు. ఈ గౌరవములేని నీ విషయం నీకు లోలోన తాపముగా (బాధగా) వెలరేగుచు అన్ని అనర్థాలకు కారణమైనదగుచు నీ మీద నీకే నిరాశగలుగును. అందువలన ఆ కోపము నీలో పుట్టనివ్వకుండ నణచివేయు ప్రయత్నములోనే యుండవలయును.

క॥ నిజగురుబోధ నెరుంగక-గుజగుజ శిష్యులకుజెప్పు గురువుల బోధల్
భుజగవిషోపమ మగుసుమి-సుజనౌఘముమెచ్చ దట్టి సుద్దిని పట్టీ॥ 115

తా॥ శిష్యా! స్వచ్ఛమైన ఈ పరిపూర్ణబోధను తెలసిన నిజగురువుల వద్దకు పోయి వారి వలన ఈబోధ ధర్మ మర్మములను తెలుసుకొనకనే మేము అచల బోధను పొందినామని శిష్యులను జేసుకొని ఆ శిష్యులకు రహస్యముగ గుజగుజ బోధలు తెలుపుచుందురు. ఆ బోధలన్నియు అమృతపానమునకు బదులుగా, విషము త్రాగినట్లుండును. అట్లు గుజగుజలు గాకుండ ప్రతి విషయము శిష్యులకు ప్రత్యక్ష ప్రమాణాలతో నిరూపించు సద్గురువు లట్టిబోధలను మెచ్చుకొనక యుందురు.

క॥ తనువును విడి బ్రహ్మను నే-నను మునుపటి నీ విచార మటు బెట్టిపుడున్
నినునీతనువును వేరని-యనకను పరిపూర్ణమరసి యవి విడువదగున్॥116

తా॥ శిష్యా! నీవు ఇప్పటి వరకు నేను మేనులు వేరని తలంచి తనువు అశాశ్వితమనియు, నేను సత్యము బ్రహ్మమనియు శాస్త్రములలో దెలుపుచుండు నదిగాని, నీవు నమ్ముకొనినదిగాని ఇంతకు ముందు నీకు యున్న నమ్మకము లన్నియు ఇక నీ దగ్గర లేకుండ జేసుకోవలయును. నేను మేనులు రెండు ఒక యెరుకచేతనే నేర్పడి,యుంటే రెండు యుండును, పోతే రెండు పోవుచున్నవి. అందువలన ఈ అచల పరిపూర్ణమును చక్కగా విచారించుకొని ఆ అచల పరిపూర్ణమే సత్యమనుకొని ఈ నేను మేనులు రెండు లేనితంటాలేనని నిందులో నేదానిని నమ్ముకొనక యుండవలయును.

క॥ కొందరు వైరాగ్యంబున-కొందరు తీర్థాటనమున కొందరు కర్మం
బందున వ్రత జప తపముల-మరికొందరు నటియింతు రిట్టి
కోర్కెల మనుజుల్॥ 117

తా॥ శిష్యా! కొందరు భార్యాబిడ్డలతోగూడి సంసారము చేయుచున్నంత వరకు దేవుడు కనబడడని వైరాగ్యముబూని కొండకోనలలో నివాసము చేయుచుందురు. కొందరు పుణ్యనదులలో మునుగుచు దివ్యక్షేత్రములకు పోవుచుండిన మంచిదని తలంచుచుందురు. కొందరు స్నాన సంధ్యవందనాది సత్కర్మల యందు ప్రీతిని జూపుచుందురు. కొందరు జపతపములు గలిగి యనుష్టాన పద్ధతిలోనుందురు, కొందరు చాంద్రాయణాది వ్రతములు ఆచరించుచుందురు. ఇవన్నియు దేవునిదగ్గరకు తీసుకొని పోలేవనియు, భ్రాంతిమార్గములనియు తలంచవలయును.

క॥ కొందరు భక్తిత్రయమున- కొందరు యోగములయందు కొందరు జ్ఞానం
బందు రమింతురు వారల-కందరి కీ బోధ యిష్టతౌనా నాయనా॥ 118

తా॥ శిష్యా! కొందరు బాహ్యభక్తి, యనన్యభక్తి, ఏకాంతభక్తి అను త్రివిదభక్తులున్ను శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము,అర్చనము, వందనము, దాస్యము, సంఖ్యము, ఆత్మ నివేదనము అనియెడు నవవిధ భక్తులున్ను సలుపుచుందురు. కొందరు యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ద్యానము, దారణము, సమాధి అను అష్టాంగయోగములు చేయుచుందురు. కొందరు ఈ దేహమును పరిశోధించుచు ఇందులో దేహిదేహములను వేరుచేయు జ్ఞానపద్ధతిలోయుందురు. ఈ పద్ధతులలోయున్న వారి కందరికి నీ సులభమైన అచలబోధను వినుటకుగాని, ఈ బోధను పొందుటకుగాని యిష్టపడక కష్టముతో విసుగు పడుచుందురు.

క॥ భ్రమరహిత సహిత జనులకు—సుమనసులను నరుల సమము జూచిన విశ్వం
బమరి లేకుండునుండును-క్రమమున కలవంటి దగుచు కడు నిజముజుమీ॥
119

తా॥ శిష్యా! కొంతమంది ఈ రూపనామాదులతో గూడిన ప్రపంచమును చూచుచు, నీ రూపనామాదులన్నియు, ఈ నాడు కనిపించుచున్నవి మరునాటికి లేకుండాపోవుచున్నవి ఇవి అశాశ్వితమేకాని శాశ్వితముకావని తలంచుచుందురు. కొంతమంది ఈ ప్రపంచములో గలుగు సుఖభోగాలను ననుభవించుచు నీ భోగాలు, నీ ప్రపంచము శాశ్వితముగ యుండునని తలంచుచుందురు. యీ యిరువురికి ఈ ప్రపంచము రూపనామాదులతో కనబడుచు ఒకరికి మరునాడు పోవుననియు, నింకొకరికి శాశ్వితముగా యుండుననియు, తలంచుచుందురు. పరిపూర్ణబోధ నెరిగిన సుజనులకు మాత్రము ఈ ప్రపంచమొక కలగా కనబడుచు లేనిదిగానే జూచుచుందురు.

క॥ కలతనను లేను కలనని-తలపోసెటి వారిమాట తమకే నిజమౌ
కలలేనివారు కలవా-రలు వీరలె నొకరినొక రరయ రిరువురున్॥ 120

తా॥ శిష్యా! మానవుడు కలలో యున్నంత వరకు నా కలలో తననుగాని, తాను చూచుచున్న ప్రపంచమునుగాని నిజమనియే నమ్ముచుండును. మెలుకువ

గలిగిన వెంటనే ఆ కలలోయున్న తనను తానుజూచిన ప్రపంచమును ఉత్తదిగ తలంచుట సహజముగయున్నది. మనుజుడు కలలోయుండి, ఆ కలను నిజమని తలంచి కలవరింపులు పడుచున్నవాని సమయము దగ్గర జాగ్రతలోయున్న వారు యుండరు. జాగ్రతలో యున్నవారి సమయము దగ్గర కలలోయున్న వారుయుండరు. వీరిద్దరి స్థితులను ఒకరి కొకరు నెరుగక యుందురు. అటులనే పరిపూర్ణ బోధనెరిగి మెలకువలోనున్న వారికి ఆ బోధనెరుగక కలలోయున్న వారికి ఒకరి దగ్గర ఒకరు యుండక అభిప్రాయములు బేధముగ యుండును.

క॥ ఎరుగుట జ్ఞానము దానను-జరిగేపని కర్మమనుచు జనులెన్నిరి యీ
యెరుకయు కర్మములేనిదె-పరిపూర్ణము వీటి నీవు బట్టకు మెపుడున్॥121

తా॥ శిష్యా! సమస్తమును ఏ యెరుక యెరుగుచున్నదో ఆ యెరుకను జ్ఞానమనియు లేక బ్రహ్మమనియు, ఆ జ్ఞానముచేయుచున్న సకల సృష్టిని కర్మమనియు ప్రజలు దెలుపుచుందురు. ఆ జ్ఞానకర్మలు రెండును శాశ్వితమైన అచల పరిపూర్ణమునందు లేకపోవుటవలన నీ జ్ఞానకర్మలు రెంటిని లేనివిగనే భావించుకొని వాటియందాసక్తిని విడచిపెట్టి యున్న నిర్గుణమైన బట్టబయలు, మాత్రమే సత్యమని నమ్మియుండుము.

క॥ కల వారికి మేలుకలో-గలవారికి జాగ్రతందు కలహము గలదా
కలహించిరేని వారలు-కలవారలె మేల్కవారు గారెన్నటికిన్॥ 122

తా॥ శిష్యా! కలలోయున్నవానికి మెలుకువలోయున్నవాని విషయము తెలియక పోవుటవలన, మెలుకువలో యున్నవానికి కలలోయున్నవాని విషయము తెలియక పోవుటవలన వీ రిద్దరు కలహము పెట్టుకొనక యెవరిదివారే నిజమని నమ్మియుందురు. అటులనే గురుబోధ తెలియక కలలోయున్నవాడును, గురుబోధతెలసి మెలుకువలో యున్నవాడును వీరిద్దరు ఒకరిదగ్గర ఒకరు లేకుండుటవలన వీ రిద్దరు వాదించుకొనక యుందురు. యీ విషయంతెలియక కలహములు పెట్టుకొనిన యెడల ఇద్దరు కలలోనివారే యగుచుందురు కాని గురుబోధ తెలసిన దానికి ప్రత్యేకత యుండదు.

క॥ సురలందు దోచు కలవలె-నరుదెంచును బ్రహ్మయందు నఖిల జగంబుల్
యరుదెంచి యజుని గన్గొని-బిరబిర తామేగు నిల్వ బిడియంబగుచున్॥123

తా॥ శిష్యా! ఈ పరిపూర్ణబోధను చక్కగా విశదపరచు సద్గురువుల దగ్గర ఈ యెరుక లేనిదయ్యును, మొదట యే రూపముగ నగుపడి ఈ సృష్టి విస్తారము జేసినదో ఆ రహస్యము తెలియబడిన సూరిజనులకు మనోభ్రాంతులు లేశమైనను లేకపోవుటవలన వారికి కల ననునదియే రాకయుండును. అట్టివారిని సురులనియు (దేవతలు) అనియు పెద్దలు పేర్కొనినారు. ఆ సురులయందు ఎట్లు కల లేక యున్నదో ఆ విధముగ అచల పరిపూర్ణమందు ఈ యెరుకలేకనే ఒక కలగా యేర్పడి, భ్రాంతి రూపముగ సకల ప్రపంచమును సృష్టించెను. అటు తనకు తాను కలగా వచ్చిన యెరుక శాశ్వితముగనున్న బట్టబయలును జూచిన యెడల తన స్థితి తనకే సిగ్గుగాదోచి తానే లేకపోవును.

క॥ మన మీ బయలునలేనిదె-మనకు మనమె వచ్చి నిల్చ మనమేగిన యే
మనక మనజోలిగొనకన్ - తనకై తానుండి యున్నదదుగో కనరా॥ 124

తా॥ శిష్యా! నీవుగను, నేనుగను, పరులుగను కనుపించుచున్న మనమందరము ఒకనాడు మూలములేకనే ఆ బట్టబయలులోకి మనకు మనమే వచ్చి కొద్ది రోజులు ఆ బట్టబయలులో యుండి తిరిగి మనకు మనమే పోవుచుందుము. ఆ బట్టబయలు మాత్రము కదలక శాశ్వితముగ యుండును. మనము వచ్చినదిగాని, పోయినదిగాని ఆ బట్టబయలు యెరుగక యుండును. అట్టి అచల పరిపూర్ణము యెచ్చటనో యున్నదని తలంచక యిచ్చటనే చూడుము.

క॥ జ్ఞానంబు సత్వగుణమను-దానికి జన్మంబె ననుచు దామోదరు డా
మేనత్తకొడుకుతోననె-జ్ఞానమునకు జన్మ మొకటిగలిగె గదోయీ॥ 125

తా॥ శిష్యా! యెరుకను జ్ఞానమనిదెల్పుటవలన ఈ జ్ఞానము సత్వగుణము వలన గలిగినదని "సత్త్వాత్సంజాయతే జ్ఞానం" త్రిగుణములలో ఒక్కటైన సత్వ గుణముకు నీ జ్ఞానముగలిగినదని కృష్ణభగవానులు తన మేనత్త కుమారుడైన అర్జునునితో దెలిపినట్లు గీత 14-13 నందుయున్నది. ఈ జ్ఞానము త్రిగుణ ధర్మములగుటవలన వృద్ధి క్షయములు పొందుచు నిలకడలేక వచ్చుచు పోవుచుండును. అట్టి జ్ఞానమును అధికమని నమ్మబోకుము.

క॥ పుట్టింది గిట్టు జ్ఞానము-పుట్టెననుచు కృష్ణమూర్తి పురుహూతజుడా
నట్టి తను ముద్దుమరదికి-గట్టిన వినజెప్పె నిండుకలతేమోయీ॥ 126

తా॥ శిష్యా! సర్వజనులు నిలుపుచున్న జ్ఞానము ఒకప్పుడు యుండుచు, ఒకప్పుడు లేకపోవుటవలన ఈ జ్ఞానమునకు పుట్టు గిట్టులున్నవని "సంభవామి యుగేయుగే" ఉపాదులు గలిగిన యుగ యుగములలో జన్మకువచ్చుచున్నానని శ్రీకృష్ణమూర్తి దేవేంద్రుని కుమారుడైన తన ముద్దులమరదియగు పార్థునితో దృఢముగ దెలిపినటుల గీత 4-8 యందు యున్నది. ఈ మాట అబద్ధము కాదు గనుక ఈ జ్ఞానమును గొప్పదని తలంచక లేనిదనియే భావించి యే కలతలులేక యుండవలయును.

క॥ జ్ఞానమగు నీవు జ్ఞేయం-బైన బయలుగాంచి జ్ఞానమగు నిను నీవే
లేనంచు దెలియుమని తా-నా నరునకు వాసుదేవు డానతియిచ్చెన్॥ 127

తా॥ శిష్యా! జ్ఞానరూపుడవైన నీవు నీకంటె ఉత్తమమైన జ్ఞేయమగు అచల పరిపూర్ణమును, నీ జ్ఞానముచేతనే దర్శించి ఆ దర్శించిన జ్ఞానమును పరిత్యజించ వలయునని " జ్ఞానేనజ్ఞేయ మాలోక్య పశ్చాత్ జ్ఞానమ్ పరిత్యజేత్ " ఉత్తర గీతలో కృష్ణమూర్తియైన వాసుదేవుడు నరుడైన అర్జునునకు తెలిపినట్లు యున్నందువలన జ్ఞానమనెడు యెరుకతో జ్ఞేయమగు బట్టబయలును దర్శించి, ఆ దర్శించిన యెరుకను విడిచిన యెడల యెరుకతో వచ్చిన చిక్కులు యెరుకతోనే పోవును.

క॥ మన మచల మనదగదు తగ-దనుటయు మన మచలమునకు తగవేరని రెం
డనిలేవు మన మచలమని-విను మనముళ్ళకిక్క తెలియవిడు మనముమనన్॥
128

తా॥ శిష్యా! నీవు నేను అను మన మందరము ఆ అచల పరిపూర్ణము యెప్పుడు కాజాలము. ఎరుక పరిపూర్ణమగుననె మాట అది నిజమైనమాటగాదు. ఆ పరిపూర్ణములో రెండవ వస్తువు లేక పోవుటవలన అందులో రెండవ వస్తువు కలియబోదు. మనకు, పరిపూర్ణమునకు నే సంబంధములేక మనకు మనము వేరుగానేయుండి మనకు మనమే వచ్చుచు, మనకు మనమే పోవుచుందుముగాని ఆ అచల పరిపూర్ణము మాత్రము కదలక శాశ్వతముగానే యుండును.

క॥ జ్ఞానము నేనన నొక్కటె-జ్ఞానమునే వేరటంచు గనబోకుసుమీ
జ్ఞానమువచ్చును బోవును-జ్ఞానాతీతమును తాను గాంచినదాకన్॥ 129

తా॥ శిష్యా! జ్ఞానమనినను, నేననినను ఈ రెండు వొక్కటేనని భావింపుము, జ్ఞానమువేరు, నేనువేరని యెప్పుడు తలంచబోకుము ఈ జ్ఞానము అనుక్షణం. పుట్టుచు, గిట్టుచు, వచ్చుచు, పోవుచు స్థిమితములేక తిరుగుచుండును. ఇట్లు ఈ జ్ఞానము (ఎరుక) జ్ఞానాతీతముగయున్న బట్టబయలైన పరిపూర్ణమును చూచిన యెడల దీనికున్న చలనాదు లన్నియు రహితపడి నిలకడ గలిగియుండును.

క॥ నీకలను వచ్చి పోయిన-లోకుల లోకములవలెనె లో నినుగనుమీ
నీకలను నీవుమేల్కని-ఈ కల నటువలెనె చూస్తె యెటు నిల్వవురా॥ 130

తా॥ శిష్యా నీవు పొందుచున్న స్వప్నములో నిన్నును, లోకులను, ప్రపంచమును, చూచుచు అది నిజమని సంతోషించుచున్న సమయమందు నీకు మెలుకువ కలిగెనేని ఆ కనబడిన నిన్నును, లోకులను, ప్రపంచమును ఇది అంతా భ్రమయేనని, అది నిజముకాదని నీకు నీవే యెట్లు తలంచెదవో అటులనే జాగ్రతయందును నీకు కనబడుచున్న నిన్నును. లోకులను, ప్రపంచమును నివి యన్నియు నొకకలయేనని నది సత్యముకాదని ఆ నిశ్చయము నీ మదిలో దృఢముగ నిలబడినయెడల అచ్చట నీవు లేకయున్నావని తలంచుము.

క॥ అందరికల నీ కలెకద-అందరు నీ కలనువచ్చి అగుపడి పోవన్
కందువుగద నిన్నట్లనె-మందమతీ కనగదోయి మరి లేననుచున్॥ 131

తా॥ శిష్యా! అందరికి కలయెట్లువచ్చుచున్నదో నీకుగూడా ఆ కలవచ్చుచూ యున్నది. ఆ కలలోనీవు అనేకమంది జనములతోగూడి చరించినట్లుగను వారితో ప్రపంచ వ్యవహారములన్నియు మాట్లాడినట్లుగనుండి మెలుకవరాగానే ఆ జనములందరు నీకు కనబడక పోవుచుందురు. ఆ కలలో కనబడిన జనములందరు యెచ్చటనుండి వచ్చినారో యెచ్చటికి పోయినారో అది నీకు తెలియక యుండును. అటులనే జాగ్రతలో నీవు జూచుచున్న ప్రపంచమునుగాని, నీవుగాని, నీతోయున్న జనములుగాని కలతో సమానముగా భావించి కలలో వచ్చిన వారికి యెట్లు ఆధారము లేదో జాగ్రతలో నీవు జూచువారికిగూడా ఆధారము లేదని నీలోయున్న మందబుద్ధిని విడచిపెట్టి నిన్నును ప్రపంచమును లేనిదానిగ భావించి ఇక దానిమీద నీకుయున్న అభిమానమును విడచిపెట్టియుండవలయును

క॥ ఆకాశమనిన శూన్యం-బాకాశం బనిన సగుణ మాకాశమనన్
కాకివలె నల్లరూపుది-ఆకాశము మితములోన నణగుండు జుమీ॥ 132

తా॥ శిష్యా! ఆకాశమే బయలనియు, బయలే ఆకాశమనియు కొంతమంది తెలుపుచుందురు. శ్రుతి "ఆత్మనో గగనం జాతం తస్మాజన్మ వదీర్యతే" అఖండ చేతనమైన ఆత్మసత్తానుండి ఆకాశముపుట్టి, సర్వరూపాలనంతయు పుట్టించి తిరిగి యా రూపాదులతో పోవుటవలన ఆకాశమును శూన్యమని తెలుపవల యును. ఈ ఆకాశము మిగతానాలుగు భూతములకు ఆధారమగుట వలన సగుణమని దెలుపవలయును. ఈ ఆకాశము గుర్తెరుగుజ్ఞానమై కంటిపాప నలుపు నందుండి సర్వమును జూచుటవలన నలుపురూపము గలదని తెలుపవలయును. ఈ ఆకాశము ఒక ఉపాధితోగూడి యుండుటవలన మితము గలిగినదని దెలుపవలయును.

క॥ ఆకాశమనినకాలం-బాకాశంబన విలంబ మాకాశమనన్
లోకమున చంచలంబగు-నాకాశము శబ్దరూపమగు వినవోయీ॥ 133

తా॥ శిష్యా! ఈ ఆకాశము, భూతకాలము, భవిష్యత్కాలము, వర్తమాన కాలములను నడిపించుచున్నందువలన కాలరూపముగ యున్నదని దెలుపవలయును. ఈ ఆకాశము అఖండచేతనమైన ఆత్మశక్తిని ఆశ్రయించి యుండుటవలన యాలంబనమని తెలుపవలయును, ఆలంబనము అనగా నొక దాని ఆధారముచే నుండుట, ఈ ఆకాశము కామ, క్రోధ, లోభ మోహ భయ ములను గలిగించునదిగ నున్నందువలన చంచలమని దెలుపవలయును. ఈ ఆకాశమునకు స్వభావికలక్షణం శబ్దముగనుక శబ్దరూపముగనున్నదని దెలుప వలయును. ఇట్టి గుణధర్మములచేనున్న ఆకాశమును బట్టబయలని దెలుప గూడదు.

క॥ అహమే తను వీవిశ్వం-బహమే జీవేశ్వరులన నహమె తదైక్యం
బహమే యహముకు మూలం-బహమణగిన నణగునన్ని యనఘచరిత్రా॥
134

తా॥ శిష్యా! నేను నేనను నీ అహంకారమే ఈ మేననెడి శరీరము దాల్చినది ఆ యహంకారమే ఈ కనబడుచున్న ప్రపంచ రూపముగ నున్నది. "జీవోహం – శివోహం" అని ఈ అహంకారమె యనుచున్నది. జీవేశ్వరైక్య సంధాన మనినను, జీవ బ్రహ్మైక్య సంధాన మనినను నీ యహంకారమే యగు

చున్నది. ఈ యహంకారము తనకుతానే మూలమగుచు, సకల ప్రపంచమును పుట్టించుచు, సర్వమునకు తానే బీజముగ నుండును. ఈ అహంకార మెప్పుడు అణగిపోవునో, అప్పుడే సర్వము నణగిపోవునని నిశ్చయము గలిగి యుండ వలయును.

క॥ భ్రమయనిన పుట్టుకనినను-భ్రమకే నామంబు లిట్టి భ్రమనే నీవున్
భ్రమ యీ మేనుజగత్తులు-భ్రమె యెరుకయు మఱపు రెండు భ్రమె
భ్రమవినరా॥ 135

తా॥ శిష్యా! పుట్టడము అనేది భ్రాంతియే, చావడమనేది భ్రాంతియే, నీవనేది భ్రాంతియే, నేననేది భ్రాంతియే, మేననేది భ్రాంతియే, ప్రపంచమనేది భ్రాంతియే, యెరుకనేది భ్రాంతియే, మరుపనేది భ్రాంతియే, సర్వ రూపాదులకు పెట్టిన నామాదులును భ్రాంతియే. ఇట్లు సర్వమును భ్రాంతిగానే దలంచి అట్టి భ్రాంతిని విడచిపెట్టి యుండడమే మంచిదగును.

క॥ యెరుకసుమీ బ్రహ్మనినను-యెరుక సుమీ మాయ యనిన యెరుకే జీవుం
డెరుకసుమీ ఈశ్వరుడన-యెరుకసుమీ నేను విశ్వమిది సత్యమురా॥ 136

తా॥ శిష్యా! బ్రహ్మమని దెల్పినది ఈ యెరుకనె, మాయయని దెల్పినది ఈ యెరుకనె, జీవుడని దెల్పినది ఈ యెరుకనె, ఈశ్వరుడని దెల్పినది ఈయెరుకనె, ప్రపంచమని దెల్పినది ఈ యెరుకనె· యెరుకగానిది యే వక్కటియు లేకపోవుట వలన సర్వము నెరుకేననియు, ఈ మాట అబద్ధముకాదనియు నమ్ముము॥

క॥ మాటసుమీ నేననినను-మాటసుమీ మాయ యనిన మరి జీవశివుల్
మాటసుమీ బ్రహ్మనినను-మాటసుమీ మేనుజగము మాటేసుమ్మీ॥ 137

తా॥ శిష్యా! పెద్దలు నోటిగుండా వచ్చుమాటయే వేదశాస్త్రపురాణ ఇతిహాసాది సర్వశాస్త్రములైనటుల మనకు తెలియబడుటవలన నేననేది మాటయే, నీవనేది మాటయే, జీవుడనేది మాటయే, ఈశ్వరుడనేది మాటయే, మాయ యనేది మాటయె, బ్రహ్మమనేది మాటయె, మేననేది మాటయె, జగమనేది మాటయె ఇవి యన్నియు మాటలచేత నిర్ణయమేకాని వస్తునిర్ణయములేక పోవుట వలన ఈ ప్రపంచమంతయు మానవనిర్మిత శబ్దప్రపంచమని తెలియవలెను·

క॥ ప్రకటమగు బింబమందున-ముకురము ముకురస్థ బింబములు లేవెపుడున్
ముకురంబు వలన బుట్టును-ముకురస్థము దానివలన ముకురముదోచున్॥ 138

తా॥ శిష్యా! జగత్తును ప్రకాశింపజేయు సూర్యబింబమునందు అద్దము లేదు, అద్దంలో కనుపించు ప్రతిబింబములేదు. అంతః కరణములో ప్రకాశించు బుద్ధియనే సూర్యునియందు మాత్రము అంతః కరణమనె అద్దముకలదు. లోక వ్యవహారములను ప్రతిబింబము కలదు. అందువలన ఈ అంతఃకరణము సకల వ్యవహారములకు కారణమై సకలభ్రాంతులను పుట్టించుచు సకలదుఃఖములకు ఆధారముగ యున్నందువలన "బుద్ధిర్గతి సూర్య" ఈ బుద్ధి సూర్యునివలె ప్రకాశించు సామర్థ్యముతోనున్నదని శ్రుతులు దెలుపుచున్నవి.

క॥ లేని నీరాకడే స్వ-ప్నానందము నీకు గురుడు పరిపూర్ణంబున్
పూని తెలిపి మేల్కొల్పిన-నేననకను నీవుబోవ నీ మేల్కదిరా॥ 139

తా॥ శిష్యా! స్వతఃసిద్ధముగ నున్న పరిపూర్ణ పరబయలునందు ఏ గుణములు, ఏ వికారములు, ఏ సృష్టి సంపద లేక నిర్బీజముగనున్న దానియందు నీవు జన్మించడము, మరణించడము జూస్తూ యుండిన యెడల స్వప్నములో ఆనందమువచ్చి పోయినటుల కనబడుచుందువు. నీవును సద్గురుస్వాములవలన అచల పరిపూర్ణమును దెలిసికొని అందులో మెలుకువ గలిగిన యెడల నేను నేనను నీవు లేకుండా పోదువు. అదే గురు మెలుకువ యని తలంచుము.

క॥ తనకు దా నొరులుచణకిన-ధ్వనిబుట్టనిచోట బ్రహ్మ తను దా నొరులున్
చనకిన ధ్వనిగలచోటది-విను మాయయు లేనిమాయవిడు లేనవినన్॥ 140

తా॥ శిష్యా! నీవు నితరులతొ కోపబడి ధ్వని పుట్టులాగున మాట్లాడు నప్పుడు, శబ్దము యెచ్చట కనబడక యున్నదో దానినే అచల పరిపూర్ణమని తెలియుము. నీవు ఇతరులను తిట్టునప్పుడు శబ్దము యెచ్చట పుట్టుచున్నదో దానినే మాయ యనియు, అదియే నీవు అనియు తలంచి శబ్దము లేనిదానిని నమ్మికొని శబ్దము గలిగిన దానిని విడువవలెను.

క॥ మనుసుకు వాక్కుకు దెలియని-ఘన వస్తువు బయలటంచు గనియా రెంటిన్
నిను నను విశ్వముగాగని-విను మూలము లేనివి వీటివిడరా శిష్యా॥ 141

తా॥ శిష్యా! మనసుచే నిట్టిదని యూహించుటకు సాధ్యముకానిది, వాక్కుచే నిట్టిదని వచించుటకు శక్యముగానిది, ఏది ఘనమైన చలనములేని అచల పరిపూర్ణమున్నదో, అట్టిదానిని గురుమూర్తి కరుణచే దెలిసికొని మనోవాక్కుల రెంటిని విడచిపెట్టి మూలములేకనె కనబడుచున్న నిన్నును, నన్నును, ఈ ప్రపంచమును లేనిదిగానె నిశ్చయించుకొని వాటిమీదయున్న అభిమానమును పోగొట్టుకొనవలయును.

క॥ కలలో వానికి మేలుక-గలదని గుర్తెరుగ వశమె కలమేల్కానినన్
కలవాడు గలడె తెలియను-తలపోయుము నిన్ను నీవు తగనీరీతిన్॥ 142

తా॥ శిష్యా! స్వప్నము పొందుచున్నవాని దగ్గర జాగ్రతలోయున్న సముదాయమేదియు తెలియబడదు. జాగ్రతలోనున్నవాని దగ్గర స్వప్నములో కనబడిన సముదాయమంతయు కానబడదు. మరియు మెలుకువలో యున్న వాని దగ్గర స్వప్నముకనేవాడు యుండడు. స్వప్నముకనేవాని దగ్గర మెలుకువ గలిగినవాడు యుండడు. అందువలన నీవు స్వప్నములో నున్నవాడవో, లేక మెలుకువలో నున్నవాడవో బాగుగ నాలోచించి నిన్ను నీవే నిర్ణయించుకొనవలయును.

క॥ కలవాదు వాని చదువులు-గలవా తా మేలుకనిన గనుగొను మటులన్
కల నిన్ను నీదు చదువును-ఫలమేమిక చాలు పెక్కు పలుకులతండ్రీ॥ 143

తా॥ శిష్యా! కలలో యెన్ని చదువులు చదివినట్లు యుండినను, యెన్ని మతములను స్వీకరించినట్లు యుండినను, యెన్ని సిద్ధాంతములను నిలబెట్టినట్లు యుండినను మెలుకువ గలుగునప్పటికి అందు నే యొక్కటియు నిలబడక అంతయు నబద్ధమగుచున్నది. అటులనే గురు కరుణబడసియున్న సత్యమగు అచల పరిపూర్ణమును తెలసికొని యా మెలుకువలో యున్నయెడల ఈ ప్రపంచము, ఈ ప్రపంచములోయున్న చదువులు, మతములు, సిద్ధాంతములు నీవు, నేను సర్వము కలతో సమానముగ కనబడక పోవుదుము. అట్టి కలతో సమానమైన చదువులవలన, మతములవలన నేమి ప్రయోజనము లేదని యా మాటల నన్నియు విడచిపెట్టి యుండవలయును.

క॥ కల రాజు సకల సంప-త్కలితుండై తాను మేలుకన లేడెచటన్
కల నిన్ను వానివిధమున-చలపుము తలచితివెచాలు ధన్యచరిత్రా॥ 144

శిష్యా! నీకు వచ్చుచున్నకలలో నీవు ఒక రాజువుగనుండి దాస దాసీ జనంబులతో సేవలందుకొనుచు సకల సంపదలతోగూడి అష్ట ఐశ్వర్యముల ననుభవించుచుండగ మెలుకువగలిగెనేని అచ్చట యేమియుకనబడకుండపోవును. అదేవిధముగ నీ ప్రపంచమనెడు కలలో నిన్నును నీతోయున్న సర్వప్రపంచ మును భ్రమరూపముగ దలంచి వాటిమీద వ్యామోహము నిడచి యుంటివేని నీ జీవితము ధన్యజీవితమని తలంచుము.

క॥ ఏ నిర్ణయమును జేయడు-నే ననని మహాత్ముడెపుడు నేననువాడే
నానావిధాల వదురును-నేనను తనవంటివారి నెప్పుడుగనినన్॥ 145

తా॥ శిష్యా! నేననే అహంకారము లేని మహాత్ముడు నీ లోకములో జనులుచేయుచున్న యే కర్మలయందును నిది అవుననిగాని, యిదికాదనిగాని, యిది యున్నదనిగాని, యిది లేనిదనిగాని యే నిర్ణయములు చేయక వాదోప వాదములు సలుపక నిమత్తమాత్రముగ సర్వుల కనుకూలముగ వర్తించు చుండును. నేనని అహంకారము గలిగినవాడు తన మెప్పులకొరకు యిది యవునని, ఇదికాదని, ఇదితప్పని, ఇదిఒప్పని తనవంటి భ్రాంతిరూపులతో నానా విధముల వదరుచు వాదోప వాదములు చేయుచుండును.

క॥ మలుకలులే వీ త్రోవను-చులుకనగా దెలియవచ్చు సుజనులకెల్లన్
తలుపదగు దీని నెప్పుడు-మలకల త్రోవలకుబోక మాన్యచరిత్రా॥ 146

తా॥ ఈ స్వచ్ఛందమైన అచలబోధ వినేటందుకుగాని, యాచరించే దానికిగాని యెంతో సులభమై యే చిక్కులు యే కష్టములుగలుగక తేలిక మార్గముగ యున్నందువలన సుజనులుగ నున్నవారు ఈ బోధను బహుసులువుగ గ్రహించి ఇందులోయున్న సుఖమును అనుభవించుచుందురు. ఈ లోకములో నానా శ్రమలతోనున్న బోధ లన్నింటిని విని మనశ్శాంతిలేక ననేకబాధలు భ్రాంతులు నష్టకష్టము పడేదానికంటే ఈ తేలికైన మార్గము తెలుసుకొని మనుజులలో శ్రేష్టుడవు కావలయునని కోరుచున్నాను.

క॥ నామాట నమ్మవేమో-నీ మానస మెరుగకంటి నే నీమాటన్
నామాటసత్యమైనను-యేమారకు దీన్ని నీవికెప్పటికప్పా॥ 147

తా॥ శిష్యా! నేను నీకు తెలిపిన అచల పరిపూర్ణబోధయందు నీకు నమ్మకము కలిగినదో లేదోయని నీ మనోనిశ్చయమును తెలియగోరి ఈ బోధ సులువైనది, శ్రేష్ఠమైనదని తెలిపినాను. ఆ మాట నీకు సరిగ సరిపోయి ఆ బోధవినుటవలన నీకున్న సంశయములన్నియు రహితపడి నిన్ను వేధించుచున్న జననమరణబాధ తొలగినయెడల నా మాట మంచిమాటేయని ఈ బోధను విడువక ఏ బోధల వైపుకు మరలక ఈ బోధయందే స్థిరతగలిగియుండుము.

క॥ సిద్ధాంతోక్తులు యివి నీ-బుద్ధికి దెలసుండి చదువబోకుము వీటిన్
బద్ధుల వినుమని వారలు-యుద్ధమునకు కాలుదువ్వు చుందురు పెలుచన్॥
148

తా॥ శిష్యా! మనుజులను వేదములు కర్మబద్ధునిగ జేయును. వేదాంతము జ్ఞాన బద్ధులుగ జేయును. కర్మ బద్ధులనుజూచిన జ్ఞాన బద్ధులకు గిట్టదు. జ్ఞాన బద్ధులను జూచిన కర్మబద్ధులకు గిట్టదు. వీరిద్దరు నొకరిపై నొకరు చుర చుర లాడుచుందురు. ఈ జ్ఞాన కర్మలకు నతీతముగ నున్నదియె ఈ బృహద్వాశిష్ఠ సిద్ధాంత అచలబోధ. ఈ అచల బోధను, నీకు సిద్ధాంతపరముగ యెన్నో యుక్తులతో, నుపమాన, నుపమేయములతో చక్కగ బోధించితిని అట్టి బోధను జ్ఞానకర్మలకు బద్ధులై యున్నవారి ముందరగాని, విచక్షణా సంస్కారము లేని పామరులముందుగాని తెలిపిన యెడల వారు నీపైకి యుద్ధమునకు వచ్చెదరు. అట్టివారిముందు ఈ పరిశుద్ధబోధను తెలిపి లేనిపోని పోట్లాటలు తెచ్చి పెట్టు కొనక లోకములో జాగ్రతగ మెలుగుచుండవలయును.

క॥ ముద్దుగ యీ గ్రంథంబును- పెద్దల ముందర పఠింప పిరిదివియకుమీ
దిద్దెదరు తప్పులున్నను-వద్దనకను దిద్దనివ్వు వరకీర్తినిధీ॥ 149

తా॥ కీర్తిగలగిన శిష్యుడా! ఈ గ్రంథమును పెద్దలముందు జరువుటకు వారికి వినిపించుటకు సంకోచింపక, భయపడక ధైర్యముగ చదువుచుండుము. అందులో ఏదైనా తప్పులున్న యెడల ఆ తప్పులను పెద్దలు చక్కదిద్ది శుద్ధ ప్రతిగ చేయగలరు. వారుదిద్దుటకు ప్రయత్నము చేయుచున్న యెడల వలదని వారిని నాటంకపరచక సమ్మతిగ నుంటివేని ఈ గ్రంథమును చక్కగ సవరణ జేసి ఏ దోషములు లేకుండా జేయుదురు.

క॥ నేనుగల మేనులేదని-మేనున నీవుండి యిట్లు మిడుకుట మేలా
మేనునువిడిచను వినియెదు-మానుగ నీవనకయున్న మాయవెసుమ్మా॥ 150

తా॥ శిష్యా! ఈ మేనులో నేనుయుండి ఈ మేను అసత్యమనియు, నేను సత్యమనియు పలుకుట ఈమాట న్యాయమైన మాటగయున్నదో ఆలోచింపుము. ఈ నేను యెప్పుడైనా ఈ మేనును వదలిపెట్టి యేదైనా నొక ప్రదేశములో తా నొక్కటేయుండి మేను అబద్ధమనియు, నేను సత్యమనియు దెల్పిన యెడల నది సమ్మతి గలిగిన మాటగానే యుండును. అట్లు తెలుపుటకు సాధ్యపడదు. గనుక ఈ నేను మేనులు రెండు వక్కటేననియు, నీ రెండు మాయయేననియు తలంచవలయును.

క॥ కట్టెలు పిడుకలు లేకను-యెట్టుంబలె నిప్పు నిల్వకేగునొ పుడమిన్
అట్టుంబలెనే నీవును-యిట్టి శరీరంబులేక నెందుందువురా॥ 151

తా॥ శిష్యా! కట్టెలు, పిడుకలుయున్న దగ్గరనే నిప్పుయుండి ప్రకాశించు చుండును. కట్టెలు పిడుకలు లేనిదగ్గర నిప్పుగూడ లేక పోవుచుండును. అలాగుననే ఈ శరీరమున్న దగ్గరనే నే నుండి సకల వ్యవహారంబులు చేయు చుండును. ఈ శరీరంలేనిదగ్గర నేనుగూడా లేక పోవుచుండును. ఈ శరీరము లేక యుండిన యెడల యెచ్చటయుండి నేను నేనని తెలుపగలవో, నిదానముగ నాలోచింపవలయును.

క॥ తనువు నేగాననంటే-ఘన సుఖదుఃఖములు-రెండు గనుపడె నీవై
గనుక తనువు నీవొక్కటె-వినరా నామాట నిట్టి వెర్రినబడకన్॥ 152

తా॥ శిష్యా! ఈ తనువు నేనుగాదు, ఈ తనువునకు నేను వేరుగా సాక్షిగా యున్నానని తెలుపుచుందువు. ఈ తనువునకు నీవు వేరుగయుండి ఈ తనువు నీవు కాకపోయిన యెడల వచ్చే సుఖ దుఃఖములు, పుణ్యపాపములు, జనన మరణములు నాకే వచ్చుచున్నవనియు, నేనే అనుభవించుచున్నాననియు పరితపించడ మెందుకు? ఆయాసపడడ మెందుకు? ఆ వచ్చే బాధలన్నియు ఈ తనువునకేకదా? ఆ వెర్రి మాటలన్నియు విడచిపెట్టి నేను మేనులు రెండు ఒకటేనని నేను దెలుపు మాటలను నమ్మియుండుము.

వి॥ పుణ్య పాపములనగా స్థావర జంగమాది సకల జీవులకన్నను మనుష్యజన్మ ఉత్తమమైనదని "దుర్లభం మానుషదేహం" శ్రుతి దెల్పుచున్నది.

అట్టి మనుష్యజన్మ కలగడమే మహా పుణ్యమని తలంచవలయును. అట్టి మనుష్యజన్మ ప్రాప్తించియు ఒక సద్గురువు నాశ్రయించి సత్యా సత్యములు తెలుసుకొనక మరణించడమే మహా పాపమని తలంచవలయును.

క॥ ఎరుకలేనట్టి బయలున-బిరబిర నరుదెంచి యెవరు బిలువనిదె తా
నరసి పరిపూర్ణమున్నది-యెరుకేగితెవాలు లేనిదెరుకనిలేకన్॥ 153

తా॥ శిష్యా! యెరుకలేకయున్న పరిపూర్ణమందు యెరుకొక్కటి తనకు తానుగా యేదోపని యున్నట్లు వడివడిగా యేతెంచి ఈ యెరుకకన్నను ముందునొక అవల పరిపూర్ణమున్నదని సద్గురుస్వాములవలన తెలుసుకొని నేను లేకనే వచ్చినానని ఈ యెరుక కెరుకకే తెలియబడిన యెడల యెరుక లేకుండపోవును. అక్కడికి అన్నియు సరిపోవును.

క॥ తనువు నేగాన నంటివి-విను సుఖదుఃఖములు యెవరివిర నాతోడన్
వినజెప్పుము నే వినియెద-తనయా తప్పితివె నిన్ను దండింతుజుమీ॥154

తా॥ తనయా! ఈ తనువు నేనుగానని తెలుపుచుందువు. ఈ తనువు నీవుగాని యెడల మేలు, కీడులు, నిందాస్తుతులు, మానాభిమానములు, జయాపజయములు నీ ద్వంద్వములన్నియు ఈ తనువులో అనుభవించువారు నీవుగాక యెవరైనా యున్నారేమొ తెలియజేయుము. లేక ఈ దేహమే అనుభవించుచున్నదని తెలిపెదవా? నదియు తెలుపుము. ఈ విషయంలో ఆలోచనలేక యున్నవిషయంతప్పి మాట్లాడితివేని దండించవలసివచ్చును.

వి॥ యెరుక లేనిదని తెలిపినవాడే సద్గురువనబడును. నీవే బ్రహ్మము, నీవే పరిపూర్ణమని తెలిపేవాడు సద్గురువు కాజాలడు. కుక్కను పట్టుకున్నవాడు కుక్కయే అగును. కుక్కను విడచినవాడే గురువుకాగలుగును. గురువునకు భ్రాంతితీరకపోయిన శిష్యునకు భ్రాంతి యెట్లు తీరగలదు.

క॥ అందరి మాటల కురికే-వెందుకు నామాట నమ్మమిదె బాలును యా
యందరు లేనిబయలు గని-యందున నీ లేమినెరిగి యరిగితెసరిరా॥ 155

తా॥ శిష్యా! లోకమందుయున్న మనుజులందరు వారి వారి నమ్మకముకొలది వారి కనుకూలమైన మతములను సిద్ధాంతములను వారికి వారే

యేర్పాటులు చేసుకొని మా మతముగొప్పది, మా సిద్ధాంతముగొప్పదని తెలుపు చుందురు. ఆ మాటలన్నిటికి నీవు మనసిచ్చి ఆ మార్గములవైపుకు పరుగు లెత్తకుము. నేను నీకు తెలిపిన అచల పరిపూర్ణమందు నీ మతములు నీ సిద్ధాంతములు నీవు గూడాలేవని నిన్ను నీవు యెరిగిన మీదట ఇక యేమార్గములలోకి పోవలయుననే కోరిక నీకు పుట్టకుండ యుండడమే సరియైన మార్గమని తెలియుము.

క॥ నాబోతురుచికి రుచినిడు-నీబోధ నపేక్ష చేత నేర్చిన వారిన్
ఏ బాధలు బాధింపవు-బాబూ యిదినీవు నేర్చిపఠియింపగదే॥ 156

తా॥ బాబు! నేను బోధించెడి ఈ అచలబోధయందు యెవరికి ఇష్టము గలిగి ప్రీతితో వినగలుగుచుందురో అట్టివారికీబోధ యెంతో తృప్తిని గలుగ జేయుచు రుచులకుమించిన రుచియై, మధురముల కన్నను మధురమైయుండును. అట్టి సద్బోధయందు యెవరు అపేక్షగలిగి శ్రద్ధతో వినుచుందురో, అట్టివారందరు ఏ బాధల చేతను బాధింపబడక సుఖవంతముగ నుందురు. అట్టి బోధను నీవు మరువక అన్ని సమయముల యందును పఠించుచుండవలయునని కోరుచున్నాను.

వి॥ పైన దెల్పిన 156 వ కందపద్యము. కొన్ని గ్రంథముల యందు "నాబోతు రుచికి రుచినిడు" అని యున్నది. బెల్లము, చనిగపప్పు కలిపి మిశ్రమము జేచిన పధార్థమును "నాబోతు" అని కొన్ని ప్రాంతములవారు తెలుపుచుందురు. ఈ పదార్థము తీపుగ యుండి తినుటకు యెంతో రుచిని యిచ్చుచు, తరువాత పొట్ట వుబ్బి బాధలు గలుగజేయును. అటులనే ఇతర బోధలన్నియు ముందు ముందు రుచిగ కనుబడుచుండినను తరువాత అనేక భ్రాంతులతో గూడిన బాధలు కలుగజేయును. ఏ భ్రాంతులు, ఏ బాధలు యెన్నడు గలుగని ఈ పరిపూర్ణ బోధను పొంది శాంతిగ స్థిమితముగ యుండవలయునని కోరుచున్నాను. అనిగూడ తెలుపవచ్చును.

క॥ తాము తమతప్పు నెరుగక-నామాటలు తప్పులనుచు నవ్వేజనముల్
సామాన్యులనుచు దెలియుము-నీమానసమందులెస్స నిరుపమ సుగుణా 157

తా॥ సుగుణవంతుడా! ఈ ప్రపంచములోయున్న రకరకములైన బోధకులందరు వారి తప్పు వారికి తెలియక నేను నీకు తెలియజేయుచున్న

అచల బోధనువిని హేళనచేయుచు, పక పకా నవ్వుచుందురు. అట్టి వారందరు అచల విద్యలోనున్న సారాంశమును అవగాహన చేసికొనలేని సామాన్య మానవులేగాని అనుభవజ్ఞులుగారని నీ మనసులో చక్కగ విచారించుకొని వారు చేయుచున్న పరిహాసముల కంతయు నీ బుద్ధిని పాడుగావింపకయుండుము.

క॥ దప్పృప్పున జనినట్లుగ-నిప్పున చలిబాసినట్లు నిజమోగిరమున్
వొప్పుగ దిన్నప్పుడె క్షుధ-దప్పినగతి భోధవిన్న దప్పునుబాధా॥ 158

తా॥ శిష్యా! తప్పుజేసినవాడు వొప్పుకొనిన, ఆ తప్పు తీరిపోయినట్లుగను, దాహము గొన్నవాడు నీళ్లు త్రాగిన ఆ దాహమణగి పోయినట్లుగను, చలిచేత బాధపడుచున్నవాడు నిప్పుదగ్గరకుపోయిన ఆ చలి పోయినట్లుగను, ఆకలి బాధతో యున్నవాడు అన్నముతినిన యా యాకలి లేకపోయినట్లుగను ఈ అచల పరిపూర్ణబోధను తెలసికొనిన యెడల అన్ని బాధలు తొలగిపోవును.

క॥ సాధనలుజెప్పి శిష్యుల-బాధల పెట్టేటి గురుని బాట వదలి యే
బాధలు లేనీబోధను-సాధుల సేవించి వినుము సద్గుణశాలీ॥ 159

తా॥ సద్గుణశాలీ! బాధలతోగూడిన యోగములు, ఆసనములు, ముద్రలు, లక్ష్యములు, బ్రహ్మైక్య సంధానములు, నిర్వికల్ప సమాధులు మొదలైన సాధనములను పట్టుగాచేయమని శిష్యులకు దెలుపుచు వాటివలన ముక్తిగలుగునని దెలిపే గురుబోధలను విడచి పెట్టి యే సాధనలతో, యే యోగములతో పని లేని సులభమైన అచల పరిపూర్ణబోధను సాధువులైన సద్గురువులవలన శ్రద్ధతో, ఏకాగ్రతతో వినగలిగిన యెడల అన్ని శంఖలు తీరిపోయి వున్న సత్యమేదో గోచరించగలదు.

వి॥ సూర్యునిజూచుటను దీపముతో పనిలేనట్లుగ, ముంజేతి కంకణము జూచుటకు అద్దముతో పనిలేనట్లుగ సర్వవ్యాపకమైన పరిపూర్ణము జూచుటకు యే సాధనములతో, యే యోగములతో పనిలేదని అచల భావస్తులు తెలుపు చుందురు.

శ్రీ ఉడుతా వెంకటదాసార్య సద్గురుస్వాములవారు రచించిన సద సద్రహిత కందార్థములయందు తెలిపిన కందార్థము.

కం॥ సాధనలు గో-రకెప్పుడు సాధనలవి దొమ్మరింటి - సానెవిగావా-
కాదని యోగులు మును బహుసాధనలనుజేసి వారు - చావకున్నారా చావును
ద్రిప్పె- వారలున్నారా - బాధలేమియు లేని - పరిపూర్ణగురుజేరి -
అద్యాంతములు లేని - అచలమర్మము గనక చావకున్నారా - చావును ద్రిప్పె
వారలున్నారా॥

"అని తెలుపబడియున్నవి."

క॥ బోధల కెల్లను గురువగు-బోధసుమీ దీన్ని నీకు బోధిస్తిని యీ
బోధను వదలకు మెప్పుడు-సాధుజనస్తుతవివేక సతతాశోకా॥ 160

తా॥ వివేకవంతుడా! ఈ లోకములో తెలుపబడుచున్న ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, శైవము, శాక్తేయము, కాపాలికము, బౌద్ధము, కుటీచకము, మహమ్మదీయము, క్రైస్తవము మొదలైన అనేక విధములైన బోధలుయున్నను ఆ బోధలన్నిటికి మొట్టమొదటిది అచల బోధ అగుటవలన ఈ బోధను గురుబోధని పెద్దలచె తెలుపబడుచున్నది. అట్టి బోధను నీకు బోధించితిని గనుక ఈ బోధను సామాన్యమైన బోధగా తలంచక యెల్లవేళల యందును ఈ బోధను మరువక యుండవలయును.

క॥ ఈ వికాసించు గురుడును - నావొద్దొక కాసులేదు నన్నడుగకు పో
పోవయ్య యనెటి శిష్యుడు- కేవల హీనాత్ములనుచు కీర్తింపదగున్ 161

తా॥ శిష్యా! ధనమే ముఖ్యమైనదిగా దలంచుచు, ఆ ధనముపై నపేక్ష గలిగి మాటి మాటికి నేదోయొక నెపముబెట్టి నాకు కాసులివ్వమని శిష్యులను పీడించె గురువును గురు రుణమెంతదో, ఆ రుణము నేవిధముగ తీరగలదో, అనే ఆలోచన లేక గురు ధర్మమును విడచి లోభిగుణముకు దాసుడై నా వద్ద యొకరూకగూడ ఈ సమయములో లేకయున్నది. నన్నడగకుండా పో పొమ్మని గురునితో దెలిపే శిష్యుడును, వీరిద్దరు హీనమైన బుద్ధిగలవారని చాటి చెప్ప వలయును.

క॥ దేవుడు లేతెమ్మనునా-జీవుడు లేదనుచు మదిని శిడిముడి పడునా
భావమున దెలసి యిద్దరు-నావిధమున నడువ వలయు నందరుమెచ్చన్॥
162

తా॥ శిష్యా! గుళ్ళలోనున్న దేవుళ్ళందరు మాకు నిత్య నైవేద్యములు పెట్టమని, పూజలొనర్చమని, నభిషేకములు చేయమని ప్రజలను కోరడము లేదు. ఆ దేవుళ్ళు అడగడములేదని ప్రజలు నిత్య నైవేద్యములు మానుకోవటములేదు. అటులనే గురువుగూడ దేవుని విధముగ ఆశలేనివాడై శిష్యులను పెట్టమని, యివ్వమని కోరక యుండవలయును. శిష్యులును అరమరలేనివారై గురువునకు నిచ్చు దానిలో వెనుకాడక తనకున్నదానిలో విసుగుపడక భక్తితో గురువుకు ఏదైన ఇచ్చుచుండవలయును. అట్లున్న యెడల ప్రజలలో ఇద్దరు గౌరవము గలిగి యుందురు.

క॥ కోటి విధంబుల జెప్పిన-చేటొదవేటి తనదు పూర్వచేష్టలు విడకన్
చాటున నేటున ద్వివిధము-గాటన మొనరించు నతని కతుకునెబోధా॥ 163

తా॥ శిష్యా! గురువు శిష్యునిపై దయదలచి వానిలోనున్న మూఢబుద్ధిని తొలగించి ఈ పరిపూర్ణబోధను వానికి బాగుగ పట్టించవలయునని, ఇందులో నున్న ధర్మ మర్మములు గోచరించవలయునని యెన్నో నుపమాన, నుపమేయములైన యుక్తులతో మనసుకు నాటేలాగున పదే పదే కోటి విధములుగ బోధించినను ఈ బోధలోయున్న గొప్పతనమును, సుఖమును తెలియలేక వారికి సహజముగనున్న దుష్టగుణంబులు ప్రమాదకరమైన నడతలు విడువలేక అహంకార మమకారాలతో, లోపల ఒకటి, బయట ఒకటి మాట్లాడే కలుషితమైన వారికి ఈ పవిత్రమైన అచలబోధ పట్టుబడక వ్యర్థపు బ్రతుకే బ్రతుకుచుందురు గాని, ఉత్తమమైన బ్రతుకు బ్రతకలేక యుందురు.

క॥ బంగారువంటి యీ బో-ధాంగీకరుణులను జేరి యదివిని వారిన్
భంగపరచ దలచేటి యా-వెంగళులకు జెప్పకుమని వేడెదనిన్నున్॥ 164

తా॥ శిష్యా! భూమిపైయున్న సప్తలోహములలో బంగారమెట్లు శ్రేష్టమై, గొప్పదై యున్నదో అటులనే లోకములోయున్న సర్వసిద్ధాంతముల కన్నను ఈ అచల సిద్ధాంతము శ్రేష్టమై గొప్పదై యున్నది. అట్టి అచల సిద్ధాంతమును పొందిన నీ దగ్గరకు ఇతర సిద్ధాంతముల వారందరు వచ్చి యీ బోధను నీ వలన వారి చెవులతోవిని ఇది యేమిబోధని పరిహాసము చేయుచు ఎరుక మహాత్ములతోగూడిన వారిబోధలు నీకు దెలుపుచు ఆ బోధలపై అభిలాషగలిగేటట్లు

ప్రసంగములు చేయుచు నీకున్న స్థిరమైన బుద్ధిని చెడగొట్టుచుందురు. అట్టి నీచులముందు యే పరిస్థితిలోను నీ పరిపూర్ణబోధను చెప్పవలదని ప్రతిమాలు కుంటూయున్నాను.

క॥ సదమల గురువెవరనినను-యిదుగో బయలిదుగో లేని యీ గురుతెరిగే
టి దగు శరీరము-దీనిని వదులుమనుచు నీకు జెప్పవచ్చినవారే॥ 165

తా॥ శిష్యా! గురువులలో సరియైనగురువు, పరిశుద్ధమైన గురువు యెవ్వరనగా ఇదుగో ఈ యుత్తబట్టబయలుతప్ప మరేమిలేదని తెలుపుచు కనుసంజ్ఞతో నాలుగుదిక్కులను జూపించి ఆ నాలుగు దిక్కులలోనున్న గురుసంజ్ఞను యే గుర్తెరిగె శరీరము యెరిగినదో ఆ యెరిగిన యెరుకకు మూలము లేదని దృఢపరచి దాని మీదయున్న భ్రాంతిని విడచిపెట్టమని తెలిపినవారే నిజగురువులని దెలుపవలయును.

క॥ రోగపు చేష్టలు బోయిన-రోగముగలదనిన మాడ్కి రోయకనిన్నున్
నీ గుర్తెరుగుట మణగిన-నే గలనననీదు మాట నిశ్చయమటరా॥ 166

తా॥ శిష్యా! మందుతిని తనకున్న రోగముపోయిన తరువాతగూడ నాకు రోగమున్నది, రోగమున్నదని తలంచుటవలన కృశించిపోవడమే జరుగుచుండును. అటులనే సర్వమును గుర్తెరుగుచున్న ఈ యెరుక లేనిదని నీకు గట్టిగ దృఢమైన పిమ్మటగూడ మరలా నేనుయున్నానని యెరుక పోలేదని చెప్పుకొవడము, దానివలన నీకు నష్టమేకాని మంచిదికాకయుండును.

క॥ దిచ్చుతనపు శిష్యునిమది-నొచ్చిన ధనమివ్వడనుచు నూహించి మదిన్
యిచ్చకము లాడబోకను-వెచ్చెర ఝాడించు వాన్ని సద్గురుడైతే॥ 167

తా॥ శిష్యా! యదార్థబోధ గలిగిన సద్గురువుదగ్గర కుచ్చితమతి గలిగిన శిష్యుడుచేరి గురుధర్మము, గురువు ఆధిక్యత గమనించక లోభి బుద్ధిగలిగి కుట్రలతో, కుతంత్రాలతో ఇతరులనుగూడ పాడుచేయు ప్రసంగములుచేయుచున్నవానిని గురువుజూచి గురువు కోపపడినను, వానితో ప్రియముగమాట్లాడక పోయినను వానివలన వచ్చురాబడులు వస్తువాహనాదులు రావేమొ అని తలంగక అతనిచ్చు ధనమును లెక్కచేయక వానిలో యున్న దుర్గుణంబులను ఖండిచి వెంటనే బయటకు పంపించువాడే నిజగురువని తెలుపనగును.

క॥ గురుడు తననెంతమెచ్చిన-వరశిష్యుడు లొంగి తిరుగవలయును మదిలో
మురసి భయభక్తిలేకను-తిరిగిన చేటొాదవు నిజము తెలియగదోయీ॥ 168

తా॥ శిష్యా! గురువు శిష్యునిపైన తనకున్న వాత్సల్యముతో మంచి వాడనియు, బుద్ధిమంతుడనియు, నితరులముందు యెంత మెచ్చుకొనుచుండినను శిష్యుడు గురునియందు భయభక్తులుగలిగి గురువాజ్ఞను మీరక యెంతో యణుకువగ నడుచుకొనవలయును. గురువు తనను అందరికన్న యెక్కువుగ గొప్పగ మెచ్చుకొనుచున్నాడనే గర్వము తన మనసులోగలిగి వినయవిధేయతలులేక తిరస్కార భావముతోనున్న యెడల అది వానికి వెంటనే నిజముగ తగువైన ప్రాయశ్చిత్తము జరుగుచుండును.

క॥ గురుశిష్యుల లక్షణములు-గురుశిష్యుల బోధరీతి గురుగీతార్థం
బెరిగిన నరులకె మెప్పగు-నెరుగని యా మూఢనరుల కిష్టతి యౌనే।169

తా॥ శిష్యా! సద్గురుమూర్తి శిష్యులపై నెంతప్రేమగలిగి యుండవలయునో, శిష్యులు గురువులయందు యెంత భక్తిగలిగి యుండవలయునో గురుగీత యందు పార్వతికి పరమేశ్వరుడు తెలిపినట్లుగ యున్నది. ఆ గురుగీతలుజూచిన గురుపుత్రులు మాత్రమె గురుశిష్యులయొక్క పద్ధతులు నడవడికలుజూచి యెంతోగొప్పగ సంతోషించుచుందురు. ఆ గురుగీతలు చూడక ఆ గురుశిష్యుల ధర్మములు తెలియని మూఢమానవులకు గురుశిష్యుల నడవడికలు ఆ పద్ధతులు ఇష్టపడక యేమేమొ గొణుగుకొనుచు నిందలతోగూడిన మాటలు మాటలాడుచుందురు.

క॥ స్థిరముగ నిల్చెదైతే-పరుగెత్తక భ్రాంతినిల్వ బడదా భువిలో
నరులు విమర్శించిన తా-నురుకుట మది యెందుకోస మూహానుకనరా॥
170

తా॥ శిష్యా! ఈ మానవులకు భ్రాంతి గలుగుట సహజముగనే యున్నది. ఈ భ్రాంతి నిజముగనే యున్నదైతే అటులనే యుండవలయును. దానిని పెద్దలు విమర్శించిన యెడల లేకుండా పోవుచున్నది. విమర్శించక పోయిన యెడల నిన్ను వేధించుచు, నొక భ్రాంతి పోయిన నింకొక భ్రాంతి పుట్టుచు, నీ ప్రాణమును తీయుచున్నది. ఈ విషయమును నీవు బాగుగ ఆలోచించి ఆ

భ్రాంతి లేనిదని గట్టిగ విచారించి యిక యెప్పుడు ఈ భ్రాంతులకు లోనుగాక స్థిరచిత్తుడవై యుండగలిగితివేని ఈ లోకములో యున్నన్నినాళ్ళు, ఏ భ్రాంతులలో బడక సుఖముగ యుందువు.

క॥ తన సంతతిపైగల దయ-తన శిష్యుని మీద నుంచదగు గురుడెపుడున్
తన ధనము మనుసు తనువులు-తన గురునివటంచు దల్చదగు శిష్యునకున్॥ 171

తా॥ శిష్యా! గురువు తన బిడ్డలపై యెంత ప్రేమ ప్రీతి అనురాగములు గలిగి యుండునో అటులనే తన శిష్యులపైగూడ అంత ప్రేమ, ప్రీతి, అనురాగములు గలిగి యుండవలయును. శిష్యులుగూడ గురువుపైన తనను కన్న తండ్రిగ అభిమానించుచు తనకు ఇష్టమైన తను మన ధనములు సర్వము గురుదేవుని సొమ్ముగ భావించి వాటియందు స్వాతంత్ర్యము విడచిపెట్టి తన ఇష్టానుసారముగ యుండక గురువాజ్ఞలో నడుచుకొనుచు నేననే అహంకారము విడచి వర్తించుచుండవలయును.

క॥ శూరత్వమాత్మపనికై -వైరాగ్యము గురునిగొల్చు వర్తన కెపుడున్
యీరీతివృత్తిగల్గిన-నారీనరులేగిచొరరె నరకములోనన్॥ 172

తా॥ శిష్యా! గురుపుత్రులైనవారికి ఈ యెరుక భ్రాంతివీడక తన స్వకార్యములైన ఇంటిపనులయందు మాత్రము యెంతో శ్రద్ధనుజూపుచు రేయంబవళ్ళు సంసారముయొక్క అభివృద్ధికొరకు అనేక శ్రమలుపడుచు, అందు గలుగు కష్టనష్టములను భరించుచు, యెంతో పట్టుదలతో అందరిలో గొప్పవాడుగ శూరునివలె ప్రవర్తించుచుండును. అట్టి వానికి గురుకార్యములేమైన వచ్చినయెడల దుర్బుద్ధికి దాసుడై నేనంతా గురువుకే సమర్పించియున్నాను. నే నిప్పుడు నిమిత్తమాత్రంగయున్నాను. నేను తినే అన్నము గురువార్పణమని తింటూయున్నాను. నేను ధరించే వస్త్రము గురువార్పణమని ధరించుచున్నాను. ఇందులో నా కర్తృత్వమేమియులేదని తెలుపుచు తప్పకొని తిరుగుచున్న స్త్రీలకైనను పురుషులకైనను నరకము తప్పదని తెలియవలెను.

క॥ మనసున నొకటిదల్చు వా-క్కున నొక్కటి బలుకుచుండు కుటిలుడు మరి తా
తనువున నొక్కటి జేయును - వినువానికి బోధదెల్ప విహితమటోయీ॥ 173

తా॥ శిష్యా! కపట ప్రవర్తన గలిగి కుచ్చిత మతియగు మనుజునకు మనసునందు నొక సంకల్పముండును. మాటలలో మరొక విధముగ దెల్పుచుండును. చేతులతో వేరొక విధముగ జేయుచుండును. అట్లు యున్నవానికి త్రికరణములు మూడు, మూడుదారులై యుండుటవలన వానికి మతిస్థిమితము లేక చలనముతో యుండును. ఈ చలనముగల వానికి పరిపూర్ణబోధ దెల్పిన యెడల వాని బుద్ధికి పట్టక అందులో యున్న ప్రయోజనము యెరుగక ఈ విద్యను అప్రతిష్టపాలు జేయును. అట్టి వానిని ఈ బోధ దగ్గరకు రానియ్యక యుండడము మంచిది.

క॥ మనసున వాక్కున తనువున-పనియొక్కటె జరుపునట్టి భక్తునికి దయన్
వినిపించుము వినుమని ఈ-ఘనబోధను వానికతుకగల దుడుగకుమీ॥ 174

తా॥ శిష్యా! త్రికరణశుద్ధిగ తన ప్రవర్తనలు జరుపుచు మనస్సులో గలిగిన సంకల్పమె వాక్కుతో తెలుపుచు, వాక్కు తెలిపిన ప్రకారమే చేతులతో జేయుచు ఏ మనుజుడు యుండునో, అట్టివానికి ఈ విమలమైన అచల బోధను దెల్పిన యెడల వాని బుద్ధికి సులభముగ నందగలిగి ఆ బోధ ప్రయోజనము నెరిగి సుఖముగ నుండగలడు. అట్టి భక్తునికి ఈ పరిపూర్ణబోధను తెలిపేదానికి యే సంశయము లేక బోధించవలయును.

క॥ మేలైన బోధవినుటకు-చాలా విఘ్నములువచ్చి సమకూడిన యే
లీలన్ విడు సచ్ఛిష్యుడు-వాలాయము బోధయందె వర్తించుజుమీ॥ 175

తా॥ శిష్యా! బోధలలో మేలైన అచల బోధను పొందవలయునని అభిలాషగలిగి గురువుదగ్గరచేరి గురువాక్యములను వినవలయునని ప్రయత్నము జేసినయెడల భార్యవలనో, బిడ్డలవలనో, పరులవలనో యేదోయొక విధముగ విఘ్నములు తప్పక వచ్చుచుండును. అట్టి విఘ్నములు మదిలో పెట్టుకొనక ఈ బోధను విడువక వీలైనంత వరకు గురు సేవజేయుచు, గురువ్యాకములు వినుచు, అచల గ్రంథములు చదువుచు అట్టిగురుపుత్రుల సాంగత్యముచేయుచు, వారి హితవైన మాటలువినుచు తగువైన ప్రయత్నములోనె బుద్ధిమంతుడు యుండవలయును.

క॥ గురుడు తన యాజ్ఞలోపల-చరియింపగ గోరునట్టి శిష్యున కెపుడున్
దురితంబు వృద్ధియై తా-నరకమునన్ గూలకున్నె నరసుతచరితా॥ 176

తా॥ జనులచేత కీర్తింపబడిన సుగుణవంతుడా! అహంకారము గలిగిన శిష్యుడు తన గురువును తన అదుపులో నిలుపుకొని తన ఇష్టప్రకారము మెలగ వలెననియు, తన మాటప్రకారము నడుచుకొనవలయుననియు, తాను చెప్పినట్లు వినవలెననియు కట్టడిజేసె పాపాత్మునకు ననేక గష్టాలు ప్రాప్తించి పిమ్మట రౌరవాది నరకము తప్పకగలుగును.

క॥ గురు కనుసౌజ్ఞను గనుగొని-పరిచర్య యొనర్చుచుండు భక్తుడు భక్తిన్
పరిపూర్ణబోధజెందును-పరమోదారప్రచండ బంగరుకొండా॥ 177

తా॥ బంగారు కొండవంటి శిష్యుడా! సద్గురుమూర్తి తన నోటితో నిదుగో యని తెలుపకనె ఆయన జూమనట్టిదియు, ఆయన కనుసంజ్ఞలో నుండునట్టిదియు యే నిశ్చయ స్థానమున్నదో, ఆ నిశ్చయ స్థానమును సూక్ష్మ బుద్ధి గలిగిన శిష్యుడు గనుగొని యా స్థానములోయున్న ధర్మ మర్మములను గ్రహించుచు, ఆ నిరామయమైన అచల స్థితిని అవగాహన జేసుకొనుచు, నా పరబయలునందే దృష్టిని నిలుపుకొని యెల్ల వేళల గురువాజ్ఞను పాటించుచు, గురుసేవలో నిమఘ్నుడై ఆనందపడుచుండును.

క॥ ప్రాకటముగ నిద్దుర యిక-యే కథలను విననరాదు యీ బోధందున్
రాకుండదేమిచిత్రమొ-ప్రాకృత నరమూకకెల్ల పావనచరితా॥ 178

తా॥ పావన చరిత్ర గలిగిన శిష్యుడా! ఇది యెంత విచిత్రముగయున్నదో ఆలోచించుము. పామర జనులుగయున్నవారికి రామాయణ, భారత, భాగవత, శృంగార కథలను వినునప్పుడు మాత్రము నిద్రావస్థ రాకయుండును. మరి జనన మరణ రహితమైన పరిపూర్ణబోధను వినునప్పుడు మాత్రము వారికి తప్పక నిద్రావస్థ వచ్చుచుండును. గురుపుత్రులైన సుజనులకు మాత్రము, ఆ శృంగార కథలు వినునప్పుడు ఆ కథలు రుచి యివ్వక, వాటియందు తలంపు బెట్టక తాము తరియించు మార్గములైన యెరుక రహితమును గూర్చియు, పరిపూర్ణ నిశ్చయమును గూర్చియు తెలుపుచున్న బోధలను వినుచు నిద్రావస్థ లేక మెలుకువలోనెయుందురు.

క॥ కొత్త దంపతుల కూటమి-నెత్తెరగున లేమలంత నిదురలు బోకన్
మొత్తములై కనునటువలె బిత్తలదిరిగేటి చిన్నబాలలకగునే॥ 179

తా॥ శిష్యా! కొత్తదంపతులను శోభన గదిలోనికిపంపి వారుపడుచున్న ఇష్టాగోష్టుల నెల్లను చాటుమాటుగ పెద్దవారెల్ల మిక్కిలి యాసక్తితో నిదుర లేకుండ చూచుచుందురు. ఆ యనుభవములేని చిన్నపిల్లలు మాత్రము దానిని పట్టించుకొనక నిద్రావస్థలో మునిగియుందురు. అటులనే జననమరణరహితమైన అచల పరిపూర్ణబోధను మహాత్ములు బోధించుచుండగ అందులోనున్న సుగుణములను దీసుకొను పెద్దవారంత నిద్రావస్థను జెందక యెంతో ప్రీతిగల వారలై మెలుకువగలిగి ఆ బోధ సుధా సారమును పొందుచుందురు. అట్టి అనుభవము లేని భ్రాంతిమయులైన పామరజనులెల్లరు నా పిల్లలువలె నిద్రావస్థను పొందుచుందురు.

క॥ మనసరయక ప్రజలను విను-మని చదువకుబోధ బాధయని యిండ్లల్లో
పనులన్ని యాదిజేసుక చనియెద రాసమయ మందసహ్యమున సుతా॥ 180

తా॥ బిడ్డా! ఈ లోకములోనున్న మనుజులయొక్క మనస్తత్వములను గ్రహించలేక నీవు పొందిన పరిపూర్ణబోధను వినుమని వారికి తెలియపరచిన యెడల వారికిబోధ బుద్ధికిపట్టక బాధగా కనబడుచు మా ఇంట్లోపనులున్నవి, తొందరగ పోవలయునని తప్పుకొని పోవుచుందురు. ఈ అచల బోధ అందరికి ప్రాప్తమగునదికాదు. దైవాంశ సంభూతులైన వారుమాత్రమే అర్థముజేసుకొని ఈ బోధలోనున్న సుఖమును పొందగలుగుదురు. తక్కిన వారందరికి సాధ్యపడునదికాదని తలంచవలయును.

క॥ వీనుల వినడీబోధను-నేనే బ్రహ్మనని నిక్క నీల్గెటివాడున్
మానికము గానవచ్చిన-దానిని రాయనుచు దలచు తార్కికుని గతిన్॥ 181

తా॥ శిష్యా! చతుర్వేద మహావాక్యములను ఆధారముగ దీసుకొని "అహం బ్రహ్మాస్మి" నేనె బ్రహ్మమని తెలిపేవారికి ఈ అచల బోధ తెలిపిన యెడల యిందులోనున్న స్వచ్ఛతను వారు తెలుసుకొనలేక చులకనగ భావించి పరిహాసము చేయుచుందురు. అది యెటులనిన దారినపోవువానికి ఉత్తమమైన మాణిక్యము దొరికిన యెడల దానిని నిదానముగ పరికించలేక పలుకురాయిగ భావించి దూరముగ పారవేసినవాని గతిగనుండును.

క॥ ఒకరువిని మెచ్చవలెనని-సకల పురాణములు వేదశాస్త్ర శ్రౌత
ప్రకరమును నేర్చువిద్య-న్నికరం బీబోధ మెచ్చ నేర్చునె సుమతీ॥ 182

తా॥ మంచిమనసుగలవాడా! నాలుగు వేదములు, పదునెనిమిది పురాణములు, వెయ్యిన్ని నూటయెనిమిది ఉపనిషత్తులు, భారత భాగవత, రామాయణాది సకల గ్రంథములెల్లయు చదివి లోకములో యెల్లవారల చేతను పండితులమని కీర్తిఘడించి ధనము సంపాదించవలయునని కోరిక గలిగిన శాస్త్ర వేత్తలకు ఈ స్వచ్ఛందమైన పరిపూర్ణవిద్య మెప్పుగ కనబడక దీనియందు ఇష్టము చూపకయుందురు. జననమరణరహితమైన ఈ అచల బోధను వారు విని ఆనందించలేరని భావింపుము.

వి॥ ఈ పరిపూర్ణబోధ యేదిగాక సర్వమునకు అతీతమైన బోధ అగుట వలన తత్వమస్యాది వాక్యములమీదను, సత్యజ్ఞానానందములమీదను, నీవే బ్రహ్మమను దెలిపే శాస్త్రములమీదను నమ్మకము యున్నవారికి ఈ బోధ ధర్మములు యెట్లుండుననిన ద్రవ్యము తోలుబిళ్లలుగాను, కుండపెంకులుగాను తేళ్లుగాను, పాములుగాను కనబడినట్లుయుండును.

క॥ సాధారణముగ దెల్పకు-మీధర మానవుల బిల్చి యీ బోధను బల్
మేధావిధి యాచించిన-బోధించుము వద్దు లోభబుద్ధి సుబుద్ధీ॥ 183

తా॥ బుద్ధి కుశలత గలిగిన శిష్యుడా! ప్రపంచ వాసనలకు లోబడి అనేక భ్రాంతులలో, అనేక సంశయములలో, అనేక కోరికలలో మునిగి యెంత దెలిపిన ముందున్న చీకటిలో నుండి బయటకురాలేని మందమతులకు ఈ బోధను దెలుపక యుండవలయును. సూక్ష్మబుద్ధితో యుండి గురువు తెలుపుచున్న మాటలను జాగ్రతగ యెవరు గ్రహించుచుందురో అట్టివారికి ఈ అచలబోధ తెలుపుటకు వెనుదీయక యున్నది యున్నట్లుగ సంశయము లేకుండ బోధించుచుండుము. నీ బోధ వారు విని సంతోష పడుచుందురు.

క॥ ఏ బోధ శిష్యులకుగల-యా బాధల నణచివేసు నదె సద్బోధా
ఆ బోధ యేదియనినను-యీ బోధెసుమ్మి దీన్ని యిక విడువకుమీ॥ 184

తా॥ శిష్యా! ఏది మనుజుల హృదయాలను నంటుకొని ఏ కర్మాదుల చేతను విడచిపోక అనేక దుఃఖాలను, అనేక భ్రాంతులను, అనేక అనుమానాలను

పెంచుకొనుచు శాంతి సుఖము లేక జేయుచున్నదో అట్టి దానిని మొదలంటూ లేక నిర్మూలము జేయుదానిని సద్బోధయని తెలుపబడును. ఆ సద్బోధ యేది యనగ నీ అచల పరిపూర్ణబోధయే యగుట వలన యట్టి బోధను వేమారక వినుచు మరచిపోక యుండవలయును.

క॥ హెచ్చైన బోధదెల్పే-సచ్చరితుల కియ్యలేరు జనులు ధనంబుల్
గచ్చులుగొట్టే దిచ్చుల-కిచ్చిన క్రియ నిట్టి నృతతి నేమననోయీ॥ 185

తా॥ శిష్యా! మానవునిలో జన్మజన్మల నుండి పాదుకొని వచ్చుచున్న అజ్ఞానమును తుడచివేసి పుట్టుక, చావుల కాధారమైన తావును యెరిగించి తనను అనుక్షణం వేదించు సకల భ్రాంతులను సమూలముగ నాశనముజేసి, నిశ్చల స్థితిలో నిలబెట్టి శాంతిమయునిగజేయు హెచ్చైన బోధను దెలుపు సద్గురు దేవునకు మనసొప్పి ఏదైనా గురుఋణము ఇచ్చుటకు ఆలోచించుచుందురు. మాయ మాటలుచెప్పి లేని భ్రాంతులనెల్ల కలుగజేసి మతిభ్రష్టులను చేయుచు, నా దోషముల నివారణకొరకు మంత్రాలు, యంత్రాలు విభూది కుంకుమలిచ్చుచు బూటకపు ఆశలను కల్పించి ధనము గుంజుకొను వారికి మాత్రము యేదియు నాలోచించక వారు అడిగినంత ధన వస్తు సముదాయములర్పించుకొనుచుందురు. ఇట్టి మానవులను యేమని యనవలయునో నీవే దెలుపుము.

క॥ నీమదికీ నిజబోధన్-ప్రేమతొ నాటించ దలచి పెక్కు విధములన్
నే మొదలు బెట్టి చెప్పి-తి దేమాత్రము రాత్రి బగలు యేమారకుమీ॥186

తా॥ శిష్యా! నేను నీమీద కరుణగలిగిన వాడనై నిన్ను కృతకృత్యుని చేయదలచి ఈ పవిత్రమైన అచల బోధను నీ మనసునకు చక్కగ పట్టించవలయునని పట్టుదలతో అనేక విధములైన యుపమాన, యుపమేయములతో విసుగులేకుండ బోధించితిని. నీవు నటులనె మనసుబెట్టి శ్రద్ధతో వినగలిగితివి. ఇక ఈ అచల బోధను నేమాత్రము మరచిపోక రాత్రింబవల్లు నీ బోధలో యున్న ధర్మములను గుర్తుకు తీసుకొనుచు యే సమయములోనైన నీ మార్గమును విడచిపెట్టకయుండవలయును.

క॥ కమలంబులున్న కొలనుకు-భ్రమరము లేతెంచినట్లు బాగుగబోధన్
తమ మదిగోరి గురుని పద-కమలములనుగొల్వ సుజనగణ మేతెంచున్॥
187

తా॥ శిష్యా! తామరపుష్పములున్న చెరువులు మడుగుల దగ్గరకు యెచ్చటనో దూరప్రాంతములలో యున్న తుమ్మెదలు ఆ మధువును త్రాగవలయునను కోరికతో వెతుకుకొనుచు నచ్చోటికి వచ్చి ఆ పుష్పములందున్న తేనెను త్రాగిపోయినటుల పరిపూర్ణబోధను తెలుపు సద్గురువు తన గ్రామమునకు యెంతదూరములో యున్నను సత్యమును గన నేర్పుగల బుద్ధిమంతులు అచల బోధకొరకై వెదకుకొనుచు సద్గురుపదకమలముల దగ్గరకువచ్చి బోధామృతము గ్రోలిపోవుచుందురు,

క॥ సురవరు డహల్య కోసము-మరులొందినరీతి నెపుడు మరుగుదు రజ్ఞుల్
పొరుగూరి సాధులకు తమ-పురమునగల సాధులందు బుద్ధినిలువకన్॥188

తా॥ శిష్యా! దేవతలకు రాజుగయున్న దేవేంద్రుడు తన భార్య శశీదేవి యెంత చక్కని రూపవంతురాలై యుండినను అడవులలో జడధారియైయున్న గౌతమఋషి భార్యయగు అహల్యమీద కోరిక గలిగి శాపగ్రస్తుడై నట్లు మతి స్థిమితములేని ఈ మూఢ మానవులు సత్యము నెరిగిన సద్గురువు తన సమీపములో యుండినను వారి యందు యిష్టముజూపక యెక్కడో హిమాలయముల దగ్గరయున్న జడధారులు, కౌపీనాధులు ధరించిన గురువుల కొరకు పనిగట్టుకొని వెతకుచుందురు.

క॥ నే నీకు జెప్పబూనిన-యీ నిజసద్బోధ మనుసుకిమిడిన వెనకన్
నీ నా పనిదీరును రా-వో నా ముద్దులకుమార వోనగధీరా॥ 189

తా॥ ధీరత్వము గలిగిన ముద్దుల కుమారా! ఏ దానిని నీకు తెలియపరచిన నీలో పాదుకొనియున్న సంశయములుగాని, పరితాపములుగాని, సమూలముగ నిర్మూలమై పోవునో, అట్టి నిజమైన సద్బోధను నీకు వెలితిలేకుండ బోధించితిని. ఆ బోధ ధర్మము లెల్లయు నీ మనస్సునకు సంశయము లేకుండ యిమిడిపోయిన యెడల ఇక నేను నీకు బోధను దెలుపవలయుననియు, నీవు వినవలయుననియు ఇద్దరికీ పని తీరిపోయినదని భావించుము.

క॥ త్ర్యక్షుని నిందించిన యా-దక్షునిగని ప్రాణమిడి నత్ర్యక్ష సతివలెన్
యీ క్షితి తనదేశికుని-నుపేక్షించిన జనుల తా నుపేక్షించదగున్॥ 190

తా॥ శిష్యా! తామరపుష్పములున్న చెరువులు మడుగుల దగ్గరకు యెచ్చటనో దూరప్రాంతములలో యున్న తుమ్మెదలు ఆ మధువును త్రాగవలయునను కోరికతో వెతుకుకొనుచు నచ్చోటికి వచ్చి ఆ పుష్పములందున్న తేనెను త్రాగిపోయినటుల పరిపూర్ణబోధను తెలుపు సద్గురువు తన గ్రామమునకు యెంతదూరములో యున్నను సత్యమును గన నేర్పుగల బుద్ధిమంతులు అచల బోధకొరకై వెదకుకొనుచు సద్గురుపదకమలముల దగ్గరకువచ్చి బోధామృతము గ్రోలిపోవుచుందురు.

క॥ సురవరు డహల్య కోసము-మరులొందినరీతి నెపుడు మరుగుదు రజ్ఞుల్
పొరుగూరి సాధులకు తమ-పురమునగల సాధులందు బుద్ధినిలువకన్॥188

తా॥ శిష్యా! దేవతలకు రాజుగయున్న దేవేంద్రుడు తన భార్య శశీదేవి యెంత చక్కని రూపవంతురాలై యుండినను అడవులలో జడధారియైయున్న గౌతమఋషి భార్యయగు అహల్యమీద కోరిక గలిగి శాపగ్రస్తుడై నట్లు మతి స్థిమితములేని ఈ మూఢ మానవులు సత్యము నెరిగిన సద్గురువు తన సమీపములో యుండినను వారి యందు యిష్టముజూపక యెక్కడో హిమాలయముల దగ్గరయున్న జడధారులు, కౌపీనాధులు ధరించిన గురువుల కొరకు పనిగట్టుకొని వెతకుచుందురు.

క॥ నే నీకు జెప్పబూనిన-యీ నిజసద్బోధ మనుసుకిమిడిన వెనకన్
నీ నా పనిదీరును రా-వో నా ముద్దులకుమార వోనగధీరా॥ 189

తా॥ ధీరత్వము గలిగిన ముద్దుల కుమారా! ఏ దానిని నీకు తెలియపరచిన నీలో పాదుకొనియున్న సంశయములుగాని, పరితాపములుగాని, సమూలముగ నిర్మూలమై పోవునో, అట్టి నిజమైన సద్బోధను నీకు వెలితిలేకుండ బోధించితిని. ఆ బోధ ధర్మము లెల్లయు నీ మనస్సునకు సంశయము లేకుండ యిమిడిపోయిన యెడల ఇక నేను నీకు బోధను దెలుపవలయుననియు, నీవు వినవలయుననియు ఇద్దరికీ పని తీరిపోయినదని భావించుము.

క॥ త్ర్యక్షుని నిందించిన యా-దక్షునిగని ప్రాణమిడి నత్ర్యక్ష సతివలెన్
యీ క్షితి తనదేశికుని-నుపేక్షించిన జనుల తా నుపేక్షించదగున్॥ 190

వారు దెలుపుబోధ ధర్మములను చక్కగ వినుచు వారికి నెదురుమాట్లాడక వారి ముందు తెలసి తెలియని ప్రసంగములు చేయక పొందికతో వినయ విధేయతలు గలిగి యణకువగ మెలగుచుండవలయును.

కll తనహితవెరుగని మనుజుడు-వినడా ప్రజనో_క్తి దుష్టవృత్తిగల సుయో
ధనుడు దశాననుడు విహిత-జనవాక్యము వినకగాదె సమసిరిరువురున్ll
194

తాll శిష్యా! తనమేలును తానాలోచించక మూర్ఖపద్ధతిలో నడచుకొను మనుజుడు తనకు హితవైనవారు యెంతమంది యెన్ని విధముల తెలుపుచుండినను వారు తెలుపుమాటలు బుద్ధిలోనికి రానివ్వక తాను చెడుటయెకాక తన వారినిగూడ కష్టముల పాలుచేయుచుండును. అది యెట్లనిన దుర్యోధనుడు, రావణబ్రహ్మ వీరిద్దరు తనకు మేలుచేయవలయునని యెంతో ప్రయత్నముతో స్నేహితులు, బంధువులు, గురువులు యెందరు యెన్ని విధములుగ తెలిపినను వారి మాటలు చెవులలో పెట్టుకొనక వారును, వారివంశమును సర్వనాశనము చేసికొనినారు. అందువలన నీవు పెద్దలుదెలుపు వాక్యములు పెడచెవున బెట్టక దానిని నాలోచించుకొనుచు మెలగుచుండవలయును.

కll ఎన్నో గ్రంథ బలధులను-తిన్నగ మథియించిచూస్తె తేలెను సారం
బున్న బయలు గని మృషయగు-నిన్నున్ నీమేను మృషని నిలువకు మనుచున్ll 195

తాll శిష్యా! ఈ ప్రపంచమునందు కర్మనుగూర్చియు, భ_క్తినిగూర్చియు, జ్ఞానమునుగూర్చియు, తత్వమును గూర్చియు, ము_క్తిని గూర్చియు తెలుపుచున్న సముద్రంలాంటి గ్రంథములనెల్లయు తరచి చూచినయెడల చివరకు అచల పరిపూర్ణామృతము శేషించి మిగులును. ఈ పరిపూర్ణామృతమును గురుముఖతా సేవించినవారికి సర్వము తెలియబడి నే ననునదికాని, మే ననునదికాని ఈ రెండు లేనివి యనియు, ననిత్యములనియు తెలియబడియున్న పరబయలు ఒక్కటియె సత్యమని తెలియబడుచుండును.

కll కనక సుమగంధవాసన-తనకొనగా దలచి షట్పదము గొన దటులన్
వినదు లేనహమె బ్రహ్మం-చనిపల్కె నృతతి నిల్వనని యీ బోధన్ll196

తా॥ శిష్యా! ఆరుకాళ్ళు కలిగిన తుమ్మెద, సంపంగి పువ్వువాసన దగ్గరకు పొయ్యేటప్పటికి తాను మరణించుననను భయముచేత ఆ పువ్వుదగ్గరకు ఆ తుమ్మెదచేరక దూరముగానే యుండును. అటులనే "అహం బ్రహ్మాస్మి" నే నే బ్రహ్మమని తెలుపు వేదాంతులు "ఈ యచల" బోధ దగ్గరకు వచ్చునప్పటికి తమకున్న బ్రహ్మానుభవము పోవుననే భీతిచేత ఈ పరిపూర్ణ బోధ దగ్గర నిలబడలేక దూర దూరముగ పోవుచుందురు.

క॥ హద్దు సుమీ గురువాజ్ఞన-ముద్దుసుమీ గురుని సేవ ముదమున జేయన్
వద్దుసుమీ యిట్లుండుట-వద్దుసుమీ గురునితోటి వాదించుటమున్॥ 197

తా॥ శిష్యా! గురువాజ్ఞయనునది గురుపుత్రులకొక హద్దుగ నుండి సకల శుభములను చేకూర్చునదిగా యుండును. అట్టి హద్దును దాటిన వారికి నిహ పరములలో చోటు లేకయుండును. ఆ గురుమూర్తికి సర్వకాలములయందును, భక్తితో, ప్రీతితో శుశ్రూషలు జేయుచున్న యెడల భయ భ్రాంతులనెడి దోషములు తొలగిపోయి, సుఖస్వరూపులై యుందురు. అట్టి గురుదేవుని మానవ మాత్రునిగ ఏ సమయములోనైనా తలంచక ఆ భక్తిని దిగజార్చుకొనక వారితో వాదోప వాదములు చేయక వారి దృష్టిలో నిలబడితివేని అంతకన్న భాగ్యము లేదని తలంచవలయును.

క॥ జంభాల పోతుగోరునె-సంభవ నాశముల బాపు చక్కని బోధన్
కుంభిని షండునకుండునె-రంభా సంభోగ వాంఛ రంభను గనినన్॥ 198

తా॥ శిష్యా! మేకపోతుకు గడ్డము పెరిగి యున్నటుల కొంతమంది డాంబికముల కొరకు గడ్డములు, మీసములు పెంచుకొని యూరూర మెప్పులు పొందుచు తిరుగుచుందురు. అట్టివారు జనన మరణముల కతీతమైన ఈ చక్కని అచలబోధను వినుటకుగాని, పొందుటకుగాని తిరస్కార భావము చూపుచుందురు. అది యెట్టులనిన నపుంసకుని వద్దకు నతి సౌందర్యవతియైన రంభవచ్చినను, నామెనుపొంది రతి సౌఖ్య మనుభవించలేనట్లుగ నాడంబరములతో తిరుగువారి కందరికి ఈ బోధ యున్నతస్థితి తెలియబడక యుండును.

క॥ పతిభక్తిగల యువతివలె-సతతము గురుభక్తి గలిగి సచ్ఛిష్యుడిలన్
స్థితి గుదుర సేవజేయును-ప్రతిరహితాద్భుత చరిత్ర పరమపవిత్రా॥ 199

తా॥ సాటిలేని చరిత్రగలవాడా! లోకములో మహా పతివ్రతయైన భార్య తన భర్తయందు బయభక్తులు గలిగి, ఆయన ఆజ్ఞలో మెలుగుచు, పతిసేవను విడచిపెట్టక ఎటులుండునో, యా రీతిగనే బుద్ధిమంతుడైన శిష్యుడు తనగురువు యందును భయభక్తి విశ్వాసములుగలిగి తనకు పరిపూర్ణస్థితి కొరతలేక గుదురు నంతవరకు ఆయన సంతోషించు విధమున సేవలు జేయుచు చక్కని నడవడికతో మెలగుచుండవలయును. ఈ ధర్మము నెరిగిన శిష్యశ్రేష్టుడు పరిపూర్ణ బోధలో నుత్తీర్ణుడగును.

క॥ జఠరజనితులైనను బహు-కఠినమనస్కులకు ఘోర కలుషాత్ములకున్
శఠులకు జడమతులకివకు-పఠనా సక్తులకు బోధ పట్టుమటంచున్॥ 200

తా॥ శిష్యా! కరుణయనునదిలేక కఠినముగనుండువారికి, నే బయములేక ఘోరపాపంబులు చేయువారికి, ఆ పనిమంచిదికాదని యెంత చెప్పుచుండినను ఆ పనిని విడువక మూర్ఖముగ జేయువారికి, మందబుద్ధిగలవారికి, విషయ విమర్శనములేక అదేపనిగా గ్రంథపారాయణ చేయువారికి ఈ అచల బోధ అందుటకు కష్టమగుటవలన అట్టి గుణములు గలిగిన శిష్యుడైనను, పుత్రుడైనను ఈ బోధను బోధించుట మంచిదికాదని జ్ఞాపకము పెట్టుకొని యుండవలయును.

క॥ కప్పురము నిప్పుగలసే-చొప్పున వెలిగవల కండ్లజూస్తుండగనే
తప్పున గనరావట్లనె-యిప్పుడు నిను నన్ను బోధ నెరుగుము బుద్ధిన్॥201

తా॥ శిష్యా! అగ్ని కర్పూరముకలిసి యొకజ్యోతిగ ప్రకాశించి యా జ్యోతివెలుగుచు, వెలుగుచు మనము చూచుచుండగనె యా అగ్నికర్పూరములు రెండు యెటుల కనబడకపోవుచున్నవో అటులనె మనమిద్దరముగూడ ఈ పరిపూర్ణబోధను విచారించి, విచారించి అందులోనున్న సారాంశమును వెలికి తీసుకొనిన పిమ్మట కర్పూరమువంటి నీవును అగ్నివంటి నేనును కలసి యిద్దరము అచ్చట కనబడక పోవుచున్నామని తెలియవలెను.

క॥ దీవించి యిస్తినే నీ-సేవించిన సేవ మెచ్చి చిత్తములోనన్
కావించు మెపుడు గానము భావించిది ముఖ్యమనుచు పావనశీలా॥ 202

తా॥ పావనమైన శీలవంతుడా! నీవు నన్నాశ్రయించినది మొదలుకొని నీవు నాకు చేయుచున్న సేవలను గురుభక్తిని మెచ్చుకొనుచు నిన్ను దీవించి సాటిలేని ఈ అచల పరిపూర్ణబోధను నీ మనసుకత్తుకొనునట్లుగ నే సంశయము మరల గలుగకుండ బోధించితిని, ఆ బోధ నీలో చెదరక స్థిరముగనుండుటకు నేను తెలుపుచున్న కందార్థములుగల గ్రంథరాజమును ముఖ్యమైనదిగ భావించి యెల్లకాలములయందును మరుపులేక స్మరియించుకొనుచు నుంటివేని నిన్నంటి పెట్టుకొనియున్న జననమరణాదులు తొలగిపోయి నిర్మల జీవితము గడుపగల నేర్పుగలవాడవై యుందువు.

క॥ అని గురుడు బోధజేసిన–విని శిష్యుడు హర్షమంది వేడుకతోడన్
తన గురుని తోటి విజ్ఞా–పన మీ రీతిగ నొనర్చె పటువాక్ప్రౌఢిన్॥ 203

తా॥ ఇట్లు దెలుపుచున్న గురుదేవుని అభయవాక్యము లన్నియు శిష్యుడు విని సంతోషముప్పొంగుచున్న హృదయముగలవాడగుచు భయ భక్తులుగలిగిన నమ్రతభావమున సద్గురుమూర్తినిజూచి మృదుమధురమైన పలుకులతో తన మనసునందు గలిగియున్న అభిప్రాయముల నిట్లుతెలుపుకొనుచున్నాడు.

క॥ నా కొరకు కష్టపడితిరి-మీకై మీరిటకువచ్చి మిము బొగడుటకా
కాకోదరేశుడోపం–డాకార్యము నా తరంబె యచలమనస్కా॥ 204

తా॥ పరిపూర్ణ హృదయముగలిగిన సద్గురుదేవా! నా కొరకుగ నీ భూమి మీదకు మీకు మీరెవచ్చి నన్ను కడతేర్చుటకు నీ యచల బోధను బోధించి నాలోయున్న సందేహములన్నియు రూపుమాపి జననమరణ ప్రవాహమునుండి దరికిజేర్చి నన్నుద్ధరింప జేయుటకు నెంతో కష్టపడితిరి. నా కొరకు మీరుచేసిన ప్రయత్నము నింత అంతని దెలుపరానిది అట్టి మిమ్ముల స్తుతించుటకు బ్రహ్మాదులకే సాధ్యముకానప్పుడు నేనెంతటివాడనని తలంచుచున్నాను.

క॥ తల్లివి దండ్రివి దాతవు-వల్లభుడవు బాంధవుడవు వసుధీశుడవున్
తెల్లమిగ దేవుడవు నీ–వక్కగదా యిట్టి బోధవర్తన వినుటల్॥ 205

తా॥ గురుదేవా! మీరు నాకు బుద్ధిమాటలుదెలిపి మంచి నడవడికలో నడిపించుటకు తల్లితో సమానమైనవాడవు, కర్తవ్యమునెరిగించి బ్రతుకుకుదారి జూపించెడి తండ్రితో సమానమైనవాడవు. మంచి పెద్దలను విచారించి గౌరవమైన

బ్రతుకు బ్రతకమని తెలిపే బంధువుతో సమానమైనవాడవు, సహజముగ చలించు నింద్రియాదులకు నిచ్చల స్థితిని గలిగించు దాతవు (లేక) బ్రహ్మదేవుడితో సమానమైనవాడవు, జీవితములో నే వొడుదుడుకులులేకుండ సక్రమముగ నడిపించు వల్లభుడవు, ప్రభువుతో సమానమైన వాడవు, దుర్మార్గమునువిడిచిపెట్టి సన్మార్గమున వర్తించమని శాశించే రాజుతో సమానమైనవాడవు, రూపనామ క్రియా రహితమైన దేవునిజూపించి మనోవాంచలనెల్ల నిర్మూలము జేసిన ఆ దేవదేవుడవు నీవేయని తలంచుచు నీ వల్లనే యింత మహోన్నతమైన అచల బోధను పొందినానని మురసిపోవుచున్నాను.

క॥ అని శిష్యుడన్న మాటకు–మనమున హర్షించి గురుడు మరి యిట్లనియెన్
వినవోయి శిష్యరాయా-విని నాకోరికెనుదీర్చ వేడుకయైనన్॥ 206

తా॥ అని ఇట్లు తెలుపుచున్న శిష్యుని వినయోక్తులు సద్గురుమూర్తి వినినవాడై మనసునందానందపడుచు, ఓయీ శిష్యరత్నమా! నా వలన నీవు పొందబడిన ఈ యచల పరిపూర్ణబోధను నీవు చక్కగ విని నీ హృదయములో నిలబడి నీకు సంతోషము గలిగించిన ఎడల నాకు నొక కోరిక గలుగుచున్నది. ఆ కోరికను నీవు తీర్చుటకు ఇష్టపడితివేని నాలోనున్న ఉద్దేశ్యమును నీకు తెలియ పరచుచున్నాను. అది యేదియనిన.

క॥ నే జెప్పినట్ల జెప్పర–నే జెప్పిన బోధలెస్స నీకతికుంటే
నే జూతు నీ చమత్కృతి–రాజిత సుగుణైకసార రమ్య విచారా॥ 207

తా॥ సుగుణముల సంపదతో నలరారు శిష్యరత్నమా! నేను ఇప్పటి వరకు నీకు నే అచల పరిపూర్ణబోధను బోధించి యుంటినో, ఆ పరిపూర్ణబోధ నీ మనసునందు చక్కగ దృఢపడి యుండిన యెడల నేను నీకు యెట్లు తెలిపి యుంటినో అదే విధముగ మరలా నాకు తెలుపవలయును. అదియే నా కోరిక. ఆ బోధను యెంత సమర్థవంతముగ దెలిపెదవో! నీ బుద్ధి విశేషత కనుగొనవలయునని నీమీాద నాకుయున్న విశ్వాసముతో ఆ కోరిక నేను గోరుచున్నాను.

క॥ అని గురుడు తనను బల్కిన–విని శిష్యుడులేచి మ్రొక్కి వినుతించి ముదంబున జెప్పదొడగె మును తా-వినినట్లుగ గురుని మదికి వేడుకదోపన్॥208

తా॥ ఇట్లు తెలుపుచున్న సద్గురు దేవునకు శిష్యుడు సాష్టాంగ దండ ప్రణామంబులాచరించి లేచి నిలబడి గురుస్తోత్రంబు జేసికొని భయభక్తులు గలిగిన ప్రసన్న హృదయుడై తాను నింతకు ముందు తన గురుస్వామి దగ్గర యే బోధనువిని సంతసపడి తృప్తినొంది యుండెనో, ఆ బోధను మరల తన గురుమూర్తి సంతోషపడునట్లుగ తన యనుభవమిట్లు విన్నవించుకొనుచున్నాడు.

క॥ నే మొదలు లేని మేనును-నా ముచ్చట స్వప్నమనుచు నమ్మదగుసుమీ
నే మేలుకొన్న లేనని-నా ముచ్చట నేనునిల్వ నరఘుడియైనన్॥ 209

తా॥ స్వామీ! నేను నేననుచున్న ఈ నేను మేనుల గురించి విచారించిన యెడల దీనికి మూలము యెచ్చటను కనుపించకయున్నది. కలలో కనుపించిన శరీరములను మేలుకొని విచారించితిమేని ఈ శరీరములు నెచ్చట నుండి వచ్చినవో, తిరిగి యెచ్చటికి పోవుచున్నవో ఆధారమే కనుపించని యటుల ఈ శరీరాలకుగూడ గురుమెలుకువలో విచారించ గలిగిన ఏ ఆధారములేదని, దృఢమగునప్పటికి నేను నా ముచ్చట, అచ్చట ఒక ఘడియకూడ యుండుటకు అంగీకరించక ఈ ఎరుక లేక పోవుచున్నది.

క॥ లేని నే లేకవచ్చిన-నేనేగిన నుండుబయలు నేనెరుగను యీ
నేనుండి దాన్ని గనుగొని-నేనేగితె మరలబుట్ట నికనెన్నటికిన్॥ 210

తా॥ గురుదేవా! లేని నేను లేకనే వచ్చుచున్నాను, లేకనే పోవుచున్నాను. ఆ పరబయలు మాత్రము నావలెరాక, నావలె పోకయున్నది. అట్టి పరిపూర్ణమొకటియుందని నాకు యెన్నడు తెలియనే తెలియదు. నేనున్నప్పుడె ఆ సద్గురు దేవుని దయవలన ఆ పరబయలును దర్శించుకొని నా రాకడలెల్లయు ఉత్తదేనని నాకు నాకే దృఢముగలిగి ఈ మేను యుండగనే నేను లేకపోయినఎడల ఇక మరల యెన్నటికి ఈ భూమిమీాద పుట్టకుండ యుందును.

క॥ లేని నా రాకపోకలు-దేనందునదోచబడె నదె బయలు సుమీ
దానిని గురుకృపచేగని-నేనేగిన రానుపోను నిజమెన్నటికిన్॥ 211

తా॥ గురుదేవా! లేకనె యున్నట్లుగ తెలియబడుచున్న నేనుగాని, నా జనన మరణములుగాని యే దానియందు వచ్చుచు పోవుచున్నటుల తెలియు

చున్నదో, అదియే పరిపూర్ణ పరబయలని తెలియుచున్నది. ఆ పరిపూర్ణ పర బయలును గురువుద్వారా దెలసికొని లేని నేనుగాని, నా రాక పోకలుగాని లేక పోయిన యెడల ఇక ఏ లోకమందైనను జనన మరణాదులు నాకు వుండవని నిజముగ తలంచుచున్నాను.

క॥ తనువుకు నాకును వేరని–యనగూడ దదెట్లులనిన ననవరతంబున్
పనులన్ని తనువునే లే-కనుజేయగ వశముగాదు గావున సామీ॥ 212

తా॥ స్వామి! కనిపించుచున్న ఈ స్థూలదేహంబును కనిపించక నేను నేననుచున్న సూక్ష్మదేహంబును ఈ రెండు వేరు వేరుగ నున్నవని దెలుప గూడదు. యెందువలననగా లోకములో జేయుచున్న సకల కార్యములెల్లయు స్థూలదేహములేనిదె సూక్ష్మదేహమను నేను యే పనియు చేయడములేదు. సూక్ష్మదేహమను నేను లేనిదె స్థూలదేహము యే పనిచేయడములేదు. ఈ రెండు ఒక అంశమైనందువలన ఈ రెండు కలసి ప్రతి పనిచేయుచుండునుగాని స్వతంత్రముగ నిందులో నొక్కటిగ నే పనిచేయలేక యుండును. అందువలన ఈ రెంటిలొ నొకదానిని అల్పమనియు, నొకదానిని అధికమనియు తెలుప గూడదు.

క॥ నను రమ్మని పొమ్మని తా–ననదుసుమీ బట్టబయలు నాకై నేనే
తనువును జగమును గైకొని–చనుదెంచుట చనుట నాకు సహజముతండ్రీ॥ 213

తా॥ తండ్రీ! ఈ బట్టబయలు యెన్నడు నన్ను రమ్మనిగాని, పొమ్మనిగాని తెలుపడములేదు. నాకు నేనేవచ్చి నేనే సకల ప్రపంచము నంతయు నేర్పరచుకొని కొంతకాలముండి మరల నాకు నేనే పోవునప్పుడు నాతోపాటు నీ సకల జగములను తీసుకపోవడము సహజముగ జరుగుచున్నది. ఇది కొత్తవిషయము కాదని స్పష్టముగ కనిపించుచున్నది.

క॥ ప్రకటమగు బట్టబయలున-సకలముతో లేకవచ్చి చను దరఘుడియన్
వాకకోటి మాట్లనేరా-నొకవేళ్ళను లేనటంచు నూహబొడమినన్॥ 214

తా॥ గురుదేవా! సంశయ మేమాత్రము లేక కనిపించుచున్న ఈ బట్ట బయలునందు పిపీలకాది బ్రహ్మ పర్యంతముగల సకల జీవులన్నియు లేకనే

వచ్చుచు పోవుచున్నవి. అది యెట్లనగ నొక అరఘడియ కాలములో ఈ నోటి గుండా కోట్ల కొలది మాటలెట్లు బయటకువచ్చి పోవుచున్నవో, అదే విధముగ నేనుగాని నాతో వచ్చిన ప్రపంచముగాని పుట్టుచు, గిట్టుచుండును. ఒక నాడు సద్గురువు వలన నా సంగతి నాకు నూహకొచ్చిన యెడల ఈ పరబయలులో నేను లేనివాడనని, నేనే లేకపోవుచున్నాను.

క॥ లేనినేనెరుగ కుండిన-మేనుండదు నేనునిల్వ మేనుండక యీ
మేనగు నాజోలొల్లని-దానిని గుర్తెరిగి నేను తొలగితె చాలున్॥ 215

తా॥ స్వామీ! మూలము లేకనె వచ్చుచు, నేను నేనను ఈ యెరుక ఆ పరబయలును జూచినను, జూడక పోయినను నేనుగాని, నాతో వచ్చిన శరీరాదులుగాని నిలువబోవు. ఇవి నశించి పోవుచునే యుండును. ఈ నశించి పోవుచున్న నన్నుగాని, నాతో వచ్చిన దేహాదులనుగాని, యే పరబయలు యెరుగకున్నదో, ఆ పరబయలును నేను తెలుసుకొని ఆ తెలసికొనిన నేను లేక పోయినచో అన్ని చిక్కులు తీరిపోయి ఇక నా ముచ్చట చాలునని తలంచుచున్నాను.

క॥ మనము మన పెద్దలందరు-చనుదేరక మునుపు వారు చనినన్ గల యీ
ఘనమునుగని మనమేగిన-చనదు గదా మనసుబోలి సారవిచారా॥ 216

తా॥ సారా సార విచారసంపన్నులైన గురుదేవా! మనము మన ముందు వారైన తండ్రులు, తాతలు, ముత్తాతలందరు పుట్టకముందుగాని, వారుయుండినప్పుడుగాని, వారు మరణించిన తరువాతగాని యే గొప్పదియైన అచల పరిపూర్ణము అన్ని కాలములయందును కదలక నిండి శాశ్వతముగనున్నదో అట్టి పరబయలును మనము దర్శించినమీాదట ఆ పరబయలు మనతోరావడములేదు, మనతో పోవడంలేదు, మనతో పనిలేక తాను తానుగనే కదలకయున్నది. అటులున్న పరిపూర్ణమునునేను గుర్తించుచు, నదివక్కటె సత్యమని తలంచుచున్నాను

క॥ మేను మజ్జనని నేనే-మేనికి జనకుడను నేను మేనులొకటియై
దేనందు సంచరింతుమొ-దానిని పరిపూర్ణమనుచు దలచెదనయ్యా॥ 217

తా॥ అయ్యా సద్గురుమూర్తి! ఈ మేను తల్లిగయున్నది, నేను తండ్రిగ యున్నాను. ఈ నేను మేనులు రెండు నొకటియై ఈ చరాచర ప్రపంచసృష్టి స్థితిలయములు జరుపుచున్నాము. ఈ తను ఎరుకలైన మేమిద్దరము ఏ దానిలో

వచ్చుచు పోవుచున్నాము అదియె శాశ్వతమైన పరిపూర్ణమని తలంచుచు నిరంతరము దానినె స్మరించుకొనుచున్నాను. ఈ వచ్చుచు పోవుచున్న మేమిద్దరము ఉత్తవాల్లమేనని నిర్ధారణగ తెలియుచున్నది.

క॥ మేనున్నది నేలేకను-నేనెరుగను మేనులేక నే నిల్వను యీ
మేనుకు నేనుకు మూలము-గానను మముమేమె సృజనగావింతుమయా 218

తా॥ సద్గురుదేవా! నేను లేకుండ ఈ మేను ఒక్కటి యెచ్చటను కనిపించడములేదు. మేను లేకుండ నేను యెచ్చటను కనిపించడములేదు. మేనుకు మూలము నేనుగాను, నాకు మూలము మేనుగాను ఇట్లు నొకరి కొకరమే మూలముగ కనబడుచున్నాము. మాకు మూలము మరియొకటి యెచ్చటను కనబడకయున్నది.

క॥ నేనిల్వ జగములేకను-నేనేగిన జగములేదు నిజమీజగమున్
నేనును లేనప్పుడు గల-దానిని పరిపూర్ణమనుచు దలపోయదగున్॥ 219

తా॥ స్వామీ! నేను లేకపోయినయెడల ఈ జగత్తను దేహాదులుండబోవు. దేహాదులు లేకపోయిన యెడల ఈ నేనను యెరుక వుండబోదు. ఈ రెండు నొకదానిమీద నొకటి ఆధారపడుచున్నవి. ఇది నిజముగనె కనబడుచున్నది. ఈ దేహముగాని, నేనుగాని లేనప్పుడు ఏ ఆధారముతో పనిలేక తనకుతానుగ ఏదివున్నదో అట్టి దానిని అవల పరిపూర్ణమని నమ్ముచున్నాను.

క॥ లేని నే మాయమైనను-మానవులది మరుపు మూర్ఛ మరణంబును గా
ఢా నిద్రయు నిర్నిద్రన-నేనవి విని మృషని నమ్మనేర్తునెవాటిన్॥ 220

తా॥ అయ్యా! ఒకప్పుడు కనబడుచు, ఒకప్పుడు కనబడక మాయమగు స్వభావముగలిగిన నేను ఒక సమయమందు కనబడకపోయిన యెడల ఆ స్థితిని మరుపనియు, మూర్ఛనియు, మరణమనియు. గాఢనిద్రనియు, నిర్నిద్రనియు ఈ మానవులు కల్పించుకొని తెలుపుచుందురు. ఆ విషయమెట్టిదో నాకు తెలియబడుటవలన ఆ మాటలన్నిటిమీద నాకు నమ్మకము లేకుండపోయినది.

క॥ వినుభాష్యములకు త్రాళ్లను-జనములుననుగట్టి యుంచ జనక నిలుతునా
చనుదొత్తునాకునేనై-కనుకనె ననునమ్మరెపుడు ఘనులగువారల్॥ 221

తా॥ గురుదేవా! మానవులు నన్ను ఈ దేహమునువిడచి బయటకు పోనీయక ఈ దేహమునందే శాశ్వతముగ నిలుపవలయుననెడి కోరికతో ననేక శాస్త్రంబులు వ్రాసిపెట్టి యందు లంభికాయోగంబులు, అణిమాది అష్ట సిద్ధులు, నిర్వికల్ప సమాధులు, అష్టాంగ యోగములు మొదలైన సాధనంబుల వలన నన్ను గట్టిగ బంధించాలని యెంతో ప్రయత్నము చేయుచున్నను ఆ బంధనములకు నేను బంధింపబడక నాకు రావడము నేనే నాకు నేనే పోవడము అది నాకు పరిపాటిగానె యున్నది. అందువలన అచల బోధను పొందిన మహాత్ములు నన్ను యెన్నటికిని నమ్మకయుందురు.

క॥ నానాభాషలచేతను-నానావిధశాస్త్ర తతుల ననునమ్ముటకై
నేనే రచించి పెట్టితి-నానా దేశములయందు నరరూపమునన్॥ 222

తా॥ స్వామీ! నామీద నాకు యున్న యిష్టము వలన నన్ను నే నె నిలుపు కోవలయుననే యాశయము గలిగి అనేక శాస్త్రములను నాకు నే నె కల్పించుకొని ఈ ప్రజలు నన్ను నమ్ముటకై దేశ దేశాలు తిరుగుచు ఆ దేశ భాషలతో వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, గీతలు మొదలగు గ్రంథములెల్లయు నేనె వ్రాసుకొని ఆ వ్రాసిన గ్రంథములయందు నేనె బ్రహ్మ మని ప్రతిపాదింపుచు, నా కంటే అధికము లేదని బోధలు చేయుచు ఈ నర రూపములో నుండి నన్ను నేనే పొగడుకొనుచున్నాను.

క॥ ఒకచోట నవ్వుదును వే-రొకచోటను మిడుకుచుందు నొక చోటను నే
ప్రకటమగుదు లేకుందును-నొకచోటను యిట్టి చేష్టలుండుననాకున్॥ 223

తా॥ మహాత్మా! నేను నేను అనిపలుకుచున్న ఈ యెరుక పనితీరుజూచిన యెడల యెంతో విచిత్రముగ కనుబడుచుండును. అది యెట్లనిన ఈ యెరుక యొక దేహములోజూచిన నవ్వుచుండును, ఇంకొక దేహములో జూచిన దుఃఖ పడుచుండును, మరియొక దేహములోచూచిన పుట్టుచుండును. వేరొక దేహ ములోజూచిన చచ్చుచుండును. ఈ యెరుక యిన్ని వ్యవహారములతో ఈ దేహమందే గనుబడుచుండునుగాని మరి యెచ్చట కనిపించదు. ఇట్లు నేనైన ఒక్క యెరుకయె ఇన్ని పాట్లుపడుచున్నదని తెలియుచున్నది.

క॥ కావేటి కాలువలవలె-నావల్లనె కల్పనొను నానావిద్యల్ యీ
విశ్వమందు విశ్వము-నావెంటనెవచ్చు పోవు నావలెను సుమీ॥ 224

తా॥ గురుదేవా! భూమిమీదయున్న కాలువలలో కావేటికాలువకు యెన్నో పిల్లకాలువలున్నట్లుగ నేనవె యెరుకతో గూడుకొని యెనుబది నాలుగులక్షలు జీవరాసులు, అరువది నాలుగు విద్యలు, అనేక బాషలు, అనేక మతములు, అనేక సిద్ధాంతములు, అనేక కులములు సర్వప్రపంచమంతయు గలుగుచున్నది. నేను పోవడముమొదలైన యెడల నా వెంటనే సకల జీవులు, సకల విద్యలు, సకల మతములు, సకల బాషలు, సకల కులములు నేను బోయినటుల సర్వము కనబడక పోవుచున్నదని గట్టిగా తెలుయుచున్నది.

క॥ నే నాడుదాన నౌదును–నేనే మగవాడనౌదు–నేనే నన్నున్
నే నీవటంచుగూడుదు–నేనే నను జెరుప మనుప నీగుదు సుమ్మా॥ 225

తా॥ స్వామీ! స్త్రీ రూపముగ నుండునది నేనే, పురుష రూపముగ నుండునది నేనే, నేను నేను అనునది నేనే, నీవుగయున్నది నేనే, నావాడవని రక్షణ యిచ్చేది నేనే, నావాడువు కాదని శిక్షణ యిచ్చేది నేనే నీవు నేనను వేరుభావములుగలిగి నొకరితో నొకరు స్త్రీ, పురుష రూపములతో సంతోషపడేది నేనే. ఇటులన్నియు నేనేననితెలియక భ్రాంతిలోబడి నీవు వేరు నేను వేరని తలంచుచు, నిజమును మరచిపోయి యుంటిని. యిప్పుడు నీ దయవలన యున్నది యున్నట్లుగ తెలుసుకొంటిని.

క॥ నేనుల మేనుల కుప్పను-నేనుబయల్ నన్నెరుగదు నే చనుదొత్తున్
మేనై నిముషములోనిది-మానుగ నావృత్తి నేనె మాయనుసుమ్మా॥ 226

తా॥ తండ్రీ! ఈ ప్రపంచమంతయు ననేక దేహాదులుగ కనిపించుచు, నేనను యెరుకతోగూడి యొకకుప్పగ తెలియబడుచున్నది. ఈ తెలియబడు నేనుతోగూడిన దేహాదులకుప్పను ఈ బయలు యెన్నడు యెరుగదు. ఈ దేహాదులతో వచ్చుచు పోవుచున్న నేను ఒక క్షణమైనను నిలకడలేక రెప్పపాటులో రావడము, రెప్పపాటులో మాయగ పోవడము నాకు సహజమైన వృత్తియై యున్నది.

క॥ నేనుగాకొకటి శుద్ధ-జ్ఞానము గలదనుచు బల్కు జ్ఞానులమాటల్
పూని వినదగదు శుద్ధ-జ్ఞానంబన నేనె నేనులేనిదియౌనె॥ 227

తా॥ సద్గురుదేవా! నేను నేనను యెరుకకు వేరుగ నింకొక శుద్ధజ్ఞానము యుండి సర్వమునకు నాధారముగ నున్నదని కొంతమంది తెలుపుచుందురు. ఆ మాటలు నిజమైనమాటలుగ నుండజాలవు. ఉన్నది నేననె యొక్కయెరుకె శుద్ధజ్ఞానమనియు, మలిన జ్ఞానమనియు తెలుపబడుచున్నది. అట్లుకాక ఈ నేనను యెరుకకన్నను గొప్పది యింకొక జ్ఞానముందని తెలిపినయెడల నది సరియైన మాటకాదని తలంచుచున్నాను.

క॥ నేమాత్రముందుననియెను–నామాయల కూతలన్ని యరసిన సుప్తిన్
యేమాయ మరణమప్పుడు–యేమాయను గురునిమాట నేమాయనయా॥ 228

తా॥ స్వామి! ఈ దేహాదులు నశించి పోవుననియు, నేను అనబడే జ్ఞానము శాశ్వతముగ యుండుననియు తెలుపబడుచున్న మాయమాటలన్నియు అబద్ధమైపోయెను. యెందువల్లననగా ఈ శాశ్వతమనుచున్న జ్ఞానము సుషుప్తియందుగాని, మరుపుయందుగాని, మూర్ఛయందుగాని, మరణమునందుగాని యేమైపోయెనో తెలియకున్నది. అచల గురుమూర్తి జెప్పినమాటలె నిజమగుచున్నవి. యితరులు తెలిపే మాటలెల్లయు నిజముగాదని తెలియుచున్నది.

వి॥ నన్ను కొంతమంది అణువనియు. పరమాణువనియు, మహత్తనియు, కళ అనియు, సాక్షి అనియు పరమాత్మయనియు, జ్యోతి అనియు, దృక్కనియు ద్రష్ట అనియు నమ్ముకొని నా కొరకునై నానా శ్రమలుపడుచు కొండలలో గుహలలో కూర్చొని అనేక మహత్తులు సిద్ధులు సంపాదించుకొనినారు. శౌనకనారదాది మొదలైన వారందరు నన్నే నమ్మినారు. సద్గురు కటాక్షమువలన పూర్ణబోధ యెరుగగలిగిన యెడల నేను యెక్కడను నిలువకుండాపోదును.

క॥ నేనన్న నహమహంబన–నేనుసుమీ యహమటంచు నే నెపుడంటే
నేనపుడు బుట్టుటది జన–నేను గతించుట మటంచు నీ వెరుగయ్యా॥ 229

తా॥ గురుదేవా! నేనన్నను, నహంకారమన్నను ఈ రెండు నొక్కటియె కాని వేరు వేరుగ కనబడకున్నది. నేనను కదిలిక హృదయములో కలగడమే అహంకారము (యెరుక) పుట్టుటయగును. అట్టి నేనను అహంకారము హృదయములో పుట్టక సమసిపోవడమె నేనను యెరుక నశించినట్లగును, ఇట్టి యహంకారము లేకుండ నడుచుకొనుటె యెరుకలేక పోవుటని తెలియుచున్నది

క॥ నేనన నాలవ దేహము-మేనన నాలోని మూడు మేనులు సుమ్మా
నేను మేనన నదొక్కటె-కానిది తనమూలమరయ గనరాదుసుమీ॥ 230

తా॥ గురుదేవా! నేను నేనని యేది యనుచున్నదో, ఆ నేను మహాకారణ మైన నాల్గవ దేహమునై యున్నది. మేననగ స్థూల, సూక్ష్మ, కారణములను మూడు మేనులతో గూడుకొని నేననే దాన్ని నాశ్రయించుకొని యుండును. ఈ నేను మేనులు రెండు నొక్కటియేకాని ఇందులో నధిక మొకటి, నల్పమొకటిగ కనబడుటలేదు. ఇట్లు కనబడుచున్న నేను మేనులకు మూలము యెచ్చటనై నా నున్నదేమొ చూచెదమని విచారించిన యెచ్చటను కనుబడుటలేదు.

క॥ అంగము లింగము గలసుటె-లింగశరీరంబటంచు లెక్కకు వచ్చెన్
లింగం బంగము నెడసిన-లింగముశక్యోను నేనె లింగంబనినన్॥ 231

తా॥ అయ్యా! జడస్వరూపమైన దేహము చేతన స్వరూపమైన నేను ఈ రెండు కలసి యొకటిగ నున్నప్పుడు మాత్రమే అంగమనె శరీరము కనుపించు చుండును. ఈ నేననెడు లింగ శరీరము పోయిన యెడల అంగమనెడు స్థూల శరీరము లేకుండా పోవుచున్నది.

క॥ లింగము విక్షేపంబన-సంగం బావరణమనిన నగు నీ రెండే
లింగశరీరము దీనికి-భంగము తనమూల మరయబడి నప్పుడగున్॥ 232

తా॥ ప్రభువర్యా! విక్షేపశక్తితో గూడిన లింగశరీరము ఆవరణ రూప ముగనున్న (అంగము, స్థూలశరీరము) ఈ రెండు నేకముగ నున్నంతవరకు వీటికి జనన మరణాదులు కలుగుచునె యుండును. ఈ జననమరణాదులు తొలగవలయుననిన ఈ లింగమునకు, అంగమునకు ఆధారము యెచ్చట యున్నదో విచారించిన ఎడల ఈ రెండు భంగమైపోవును.

క॥ ఎరుకన మరుపనరానిది-పరిపూర్ణం బీశ్వరుడనబడు నెరుకెరుకన్
మరచిన జీవుండనబడు-నెరు కచలమునెరుగ నరుగు నెరుకమరుపులున్ 233

తా॥ మహాత్మా! కొందరు ఈ యెరుకను ఈశ్వర చైతన్యమనియు, మరుపును జీవచైతన్యమనియు తెలుపుచుందురు. ఈ యెరుక మరుపులతో గూడిన జీవేశ్వరులిద్దరు యెరుక మరుపులులేని అచల పరిపూర్ణమునుజూచిన యెడల యెరుక మరుపులు గలిగిన జీవేశ్వరులిద్దరు లేకుండాపోదురు.

క॥ ఎరుకన సత్వగుణంబని-మరుపన తామసమటంచు మరి యీ రెండున్
సరియైన రాజసంబని-నరులెన్నిరి మూటివిడువ నర్థమసుమ్మా॥ 234

తా॥ స్వామీ! జాగ్రతలో యెరుగుమండునదియె సత్వగుణమనియు, నిద్రలో మరచిపోవుటె తామసగుణమనియు, ఈ రెండు కలిసి సుఖ దుఃఖములతో వర్తించుటే రాజసగుణమనియు ఈ గుణధర్మములు యెరిగినవారు దెలుపుచుందురు. ఈ మూడుగుణములలో పరివర్తనములు సహజముగ వుండుటవలన ఈ గుణములకు అతీతులుగ యుండడమే గురుపుత్రులకు ధర్మమైయున్నది.

క॥ నన్నెరుగనట్టి బయిటన్-యెన్నడు లేనట్టి నేను యీ విశ్వమునై
వున్నట్టులుండి నే లేం-దున్నదిగని నేనుబోతె దుందణగుసుమీ॥ 235

తా॥ గురుదేవా! నేను పుట్టితినో గిట్టితినో నా సంగతినే పట్టించుకొనని బట్టబయలులో యెన్నడులేని నేను కనబడి యొకప్రపంచముగ రూపాదులు జేసుకొని యున్నన్నినాళ్ళుయుండి నొకనాడు సద్గురుదేవుని కరుణవలన యున్న పరిపూర్ణము తెలియబడగానే నా లేని సంగతి నాకే తెలియబడి నేను లేకుండ పోతినేని యిక యే ప్రసంగములు యే అల్లరులు యే ఒక్కటియు లేకపోవునని తెలియుచున్నది.

క॥ ఈ యచల మొకటి బ్రహ్మని-మాయామయమైన విశ్వమంతయు నేనన్
చాయమెరుంగక నను నరు-లీయడ బ్రహ్మంబటంచు లెక్కిడనగుదున్॥ 236

తా॥ సద్గురుదేవా! బ్రహ్మమనే శబ్దమునకు అచల పరిపూర్ణమొక్కటియె చెల్లునని తెలియక ఈ క్షణములో గనబడి మరుక్షణములో మాయమగు జగత్తును సృష్టించెడి నన్ను (యెరుకను) మాయయని ఆలోచించక నామీదయున్న ప్రేమవలన నన్నే బ్రహ్మమని ఈ తెలివిలేని మానవులు తెలుపుచుందురు. అంత మాత్రమున సకల కాలములయందును నిర్మలముగ నున్న ఆ పరిపూర్ణ పరబయలు నేను యగుదునా? యనియు, ఆ"బ్రహ్మమనే శబ్దమునకు" నేను సరిపోదునా? యని నాకు నేనే నవ్వుకొనుచుందును.

క॥ భూమను భద్రాచలమని రాములనుచు లేని నన్నర క్షణముననే
మీమాట నెరిగుశక్యని-నామాటను మరచి యునికి నయమనితోచెన్॥ 237

తా॥ గురువర్యా! భూమమను ఏ చలనాదులు లేక అంతట నిండియున్న పరబయులను భద్రాచలమనియు, చలనముతోగూడి వచ్చుచు పోవుచున్న ఎరుకను రాముడనియు తెలియబడుచున్నది. అది యెట్లనిన ఈ యెరుక దేహమను వనవాసమునందు జ్ఞానేంద్రియములయిదు, కర్మేంద్రియములయిదు, అంతఃకరణములు నాలుగు, పదునాలుగు ఇంద్రియములతో చేరి సుఖమును కోలుపోయి దుఃఖములతో గూడుకొని యున్నది ఈ యెరుకేననియు, ఇదే పదునాలుగు సంవత్సరముల శ్రీరాముని వనవాసమనియు మీరు బోధించిన బోధవలన ఒక అరక్షణములో తెలిసికొంటిని. ఇక ఈ యెరుక విషయము సంశయము లేకుండ తెలియబడినది. ఇది మొదలు నన్ను నేను మరచి అచల పరిపూర్ణమును లక్ష్యములో పెట్టుకొని యుండడమే మంచిదని తోచుచున్నది.

క॥ నా గురుడు నాకుదెల్పిన-యీ గురుబోధంత మీకు యిప్పుడు నేనున్
బాగుగ వినజెప్పితిసుమి-యోగురువర్య యని శిష్యుడూరకయున్నన్॥ 238

తా॥ తండ్రీ గురువర్యా! నా గురుదేవుడు నాకు తెల్పిన అచల పరిపూర్ణ బోధనుగాని, అందులోనున్న అంశములనుగాని నాకు తెలిసినంతవరకు నా బుద్ధి కందినంతవరకు మీ ముందు చక్కగ వివరించుకొంటిని. అట్టి నా అనుభవము మీకు సరిగాయున్నదో లేదో నా మీద అనుగ్రహించి తెల్పవలయునని శిష్యుడు కదలక యూరకుండెను.

క॥ విని శిష్యుని వచనోక్తులు-మనమున హర్షించి గురుడు మస్తకమున చె
య్యునిచి తొడమీదజేర్చుక-తనశిష్యుని మేను నివిరి తా నిట్లనియెన్॥ 239

తా॥ ఇట్లు తెలుపుచున్న శిష్యుని యొక్క భావపూరితమైన వాక్యములను గురుమూర్తివిని మనమందు ఆనందపడుచు కౌగలించుకొని హస్త మస్తక సంయోగము జేయుచు తన తొడమీద కూర్చొనబెట్టుకొని శిరస్సును తన చేతితో నిమురుచు ఇట్లు తెల్పుటకారంభించెను.

క॥ నీవంటి గట్టివాడిక-భూ వలయమునందు ముందు బుట్టడు వెనుకన్
నే వినలే దున్నాడం- వీ వేళ్ళకు నిన్నె చూస్తినిట భళి శిష్యా॥ 240

తా॥ శిష్యరత్నమా! ఈ అచల బోధను నీవలె నింతశ్రద్ధగ విచారించి బోధలో యున్న రహస్యా రహస్యములను ఆసాంతము గ్రహించి సంతోషపడు

శిష్యుడు ఈ భూమిపైన నిక పుట్టబోడు. పుట్టగలడనిగూడ నాకు నమ్మకము లేదు. ఈనాడు నీ పరిపూర్ణబోధను నింతయోపికతో పట్టుదలతో సాధించిన ఉత్తమమైన శిష్యుడవు నీవేనని మనసారాహర్షించుచు శభాషని మెచ్చుకొను చున్నాను.

క॥ చందురుని చీమ ముద్దా-డిందనినట్లిపుడు నీవు యీ సద్బోధన్
జెందితివి నీకు సరి జగ-మందెవ్వరులేరు నిన్ను మది మెచ్చితిరా॥ 241

శిష్యా! భూమికి యెన్నోయోజనముల దూరములో కనబడుచున్న చంద్రుని, భూమిని అంటుకొని తిరుగాడుచున్న చీమపోయి ముద్దుబెట్టుకొన్నదని తెలిపేమాటలు యెంత విచిత్రముగ నుండునో అటులనే పంచభూతములతో గూడిన అవరణము నంటిపెట్టుకొనియున్న నీవు పంచభూతముల కతీతమైన పరిపూర్ణమును పొందడముగూడ మిగుల విచిత్రముగానే యుండును. అట్టి దానిని నీవు పొందగలిగితివి. గనుక నీతో సమానమైనవారు ఈ ప్రపంచములో యుండబోరని నిన్నుజూచి సంతోషపడుచున్నాను.

క॥ అని మెచ్చి యేమి యిచ్చెద-వని గురుదక్షిణ నటంచు నతడడిగిన న
న్ననిపల్కె శిష్యరత్నము-విని ఇది ఇక ముట్టబోక విహరించుమనన్ 242

తా॥ ఇట్లు సంతోషపడుచున్న గురుమూర్తి శిష్యునిజూచి శిష్యా! సారాసార విలక్షణమైన సాటిలేని ఈ అచల పరిపూర్ణబోధను నా వలన నీవు తెలిసికొని సంతోషపడితివిగదా? ఇప్పుడు నాకు గురు దక్షణగ యేమి యిచ్చెదవో ఇవ్వమని గురువు కోరగనే నేననే యెరుకను గురుదక్షణగ నిచ్చుచున్నానని శిష్యుడు దెలిపెను. అటులైన నాకు యిచ్చిన యెరుకతో నీవు యే పని చేయక యుండుమని గురువాజ్ఞాపించెను.

క॥ విని శిష్యుడు గురుమూర్తిని-గనుగొని చిత్తరువు ప్రతిమగా నిలచున్నన్
తన శిష్యుని హస్తములన్-గొని దగ్గెరదీసుకొని కొడుకా యనుచున్॥ 243

తా॥ ఆ యాజ్ఞను శిష్యుడు వినిన వెంటనే తన యెరుకను గురువుకు సమర్పించుకొని యెరుక లేనివాడై యే చలనాదులులేని చిత్రించిన బొమ్మవలె కదలక నిలబడి యుండెను. అట్టి శిష్యుని గురుమూర్తిజూచి పట్టలేని సంతోష

ముతో కుమారా! యని పిలచి ఆలింగనము జేసుకొని కూర్చుండమని నియమింపజేసెను.

క॥ చెప్పదొడంగెను మును తా-జెప్పని ముచ్చట్లు కొన్ని సేమము కొరకై
యొప్పులకుప్పా వోమా-యప్పాయని దువ్వుకొనుచు నతి దయతోడన్॥244

తా॥ శ్రీ సద్గురుస్వాములవారు శిష్యునిపైగల ప్రేమను విడువలేక ఓ నాయనా! ఒప్పుల కుప్పాయని దేహమును దువ్వుచు నింతకుముందు తనకు బోధచేయని ధర్మములను మరికొన్ని చెప్పదలచుకొని దయాసాగరమైన హృదయముతో నిట్లు దెలుపుటకారంభించెను.

క॥ ఒప్పకుమీ పరబోధల-తప్పకుమీ బోధనెపుడు దలచుట మదిలో
దొప్పకుమీ సచ్ఛిష్యుల-చెప్పకుమీ దీన్ని దుష్ట చెనటుల కెపుడున్॥245

తా॥ శిష్యా! లోకములో ద్వైతమతము, అద్వైతమతము, విశిష్టాద్వైత మతము. క్రైస్తవమతము, మహమ్మదీయమతము, బౌద్ధమతము శాక్తేయ మతము మొదలైన మతములెన్నియో గలవు. ఆ మతములన్నియు భ్రాంతిని విస్తరింపజేయుచుండునుగాని శాంతిని గలుగజేయజాలవు. అట్టి మతబోధకుల బోధలనువిని ఈ పరిపూర్ణబోధను విడచి నీ బుద్ధిని చెడచుకొని బాధపడకుము. మరియు శ్రద్ధాభక్తులు గలిగిన మంచిశిష్యులు ఈ బోధనుకోరి నీ వద్దకు వచ్చిన యెడల వారిని చులకనగ భావించకుము. దుర్మార్గులుగ యున్నవారు యెంత ప్రాధేయపడినను ఈ పూర్ణబోధనుదెల్పకుము.

క॥ కూడకుమీ దుర్జనులను-వీడకుమీ సాధు మనుజ వితతి స్నేహం
బోడకుమీ గురుసేవకు- పాడకుమీ పరులనింద పాటలరీతిన్॥ 246

తా॥ శిష్యా! దుర్జనులతో స్నేహము యెన్నడు చేయబోకుము. సజ్జనుల సాంగత్యము యెప్పుడు విడువబోకుము. సద్గురువులుగనున్న వారికి సేవలు జేయుటకు సంశయ పడబోకుము. ఇతరులు చెడ్డవారనియు, నీవు మంచివాడవనియు, నీ గొప్పలు నీవు చెప్పుకొనక యుండుము.

క॥ మీరకుమీ గురువాజ్ఞను-చేరకుమీ దుష్టులంత చేరిన చోటన్
దూరకుమీ బోధనువిని-యారకుమీ సాధుజనుల యందున తప్పుల్॥247

తా॥ శిష్యా! గురువాజ్ఞను కాదని యే పని చేయబోకుము. దుర్మార్గులు గుమిగూడి ఆలోచనలుచేయు చోటు దగ్గరకు నీవుచేరక యుండుము. ఇతరులు తెలుపుచున్న బోధలను విని ఆ బోధలు సరిగలేదని వారిని దూషించకుము. పెద్దలనుజూచి వారి యాచరణయందు లోపాలను యేరుకొనెడి చెడ్డబుద్ధిని విడచి పెట్టి యుండుము.

క॥ జనులవలె జరుపు పనులను-నను నిను జనవితతి దిట్ట నడువకుమెపుడున్
నిను నీవు బొగడుకోకుము-నిను బోలరటంచు జనుల నిందించకుమీ॥248

తా॥ శిష్యా! జనులందరు సమ్మతపడి నేపని చేయుచుందురో ఆ పనినే నీవుగూడా చేయుచుండుము. నిన్ను నన్ను లోకులు దూషించునట్టి పనులు యెన్నడు చేయబోకుము. నేను గొప్పవాడనని ఇతరులతో చెప్పుకోకుము. నాతో సమానమైనవారు నీ ప్రపంచములో నెవ్వరు లేరనియు, అందరు మూర్ఖులే ననియు, ఇతరులను తూలనాడక యుండుము.

క॥ శ్రద్ధ బోధందునిలి ప-శ్రద్ధను నీనేర్పుచేత ఝాడించితివా
బద్ధత్వమంతబాయును బుద్ధికిసరిపడితె దీన్ని బూనగదోయీ॥ 249

తా॥ శిష్యా! ఈ అచలబోధయందు మాత్రమే నీవు తగువైన శ్రద్ధను జూపించుచు, నిన్నప్పుడప్పుడు సహజముగ నావరించు యశ్రద్ధను నీ నేర్పుచేత నీవద్దకు రానియ్యక దూరముగ పంపుచున్న యెడల నీలోనున్న బద్ధత్వమంతయు విడచిపోయి నిన్ను చీకాకు పరచుచున్న ప్రపంచ సంబంధమగు బంధములుగాని, మనో సంబంధమగు దుఃఖములుగాని నీ దగ్గరకు రాకుండ పోవును. నీకు నీ తనువుతో, నీ మనసుతో గూడిన వేదనలన్నియు విడచి పోవలయునని యుద్దేశ్యముండిన యెడల ఈ విమలమైన అచల పరిపూర్ణ బోధను సర్వకాలములందును విచారించుచునే యుండవలయును,

క॥ సంశయమె జన్మహేతువు-సంశయమే గురునిమాట చవిగొననియదీ
సంశయమె కీడు నొదవును-సంశయ మెడబా స్తివేని చాలునువత్సా॥ 250

తా॥ శిష్యా! సంశయమె అన్ని అనర్థాలకు కారణముగ నున్నదని "సంశయాత్మా వినశ్యతి" గీతా వాక్యమగుటవలన సంశయమె జన్మకు కారణమగుచున్నది. సంశయమె గురునిమాటయందు నమ్మకములేకుండ జేయుచున్నది.

సంశయమె సకల భ్రాంతులను కలుగజేయుచున్నది. సంశయమె యనుమానాలు పుట్టించుచున్నది. సంశయమె అన్ని ఆపదలకు బీజమగుచున్నది. ఇన్ని దోషములతో గూడిన సంశయమును నీ దగ్గరలేకుండ జేసుకొనవలయును.

క॥ నరులంతమెచ్చ నడువను-హరిహర విధిశతమఖామరాదులకైనన్
తరముగాదనగ మనకిక-తరమౌనన వశమె చూడు ధాత్రినిపుత్రా॥ 251

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో జనులందరు మెచ్చుకొనునట్లు నడుచుకొనవలయునని తలంచితివేని ఆ పని త్రిమూర్తులకు, సూర్యచంద్రాదులకు. ఇంద్రాది దేవతలకు సాధ్యముకానప్పుడు ఇక మనము పదుగురిలో మంచివారముగ నుండవలయునని యెంత ప్రయత్నము జేసినను నది ఈ లోకములో జరిగేపనిగాయుండదు. అందువలన నిందాస్తుతులను విడచిపెట్టి అన్నిటిని సహించియుండవలయును.

క॥ అందరిని చణుకుచుందురు-కొందరు దుర్మార్గవృత్తి కుటిలజనంబుల్
యెందరినౌ గివ్చి కరుచుచు-మందలవలె కోతులుండు మాడ్కినికుత్రా252

తా॥ శిష్యా! ఈ ప్రపంచములో దుష్టస్వభావముగలిగిన మానవులు పెద్దలైన సాధుపుంగవులను జూచి ఓర్వలేక క్రూరచూపులు జూచుచు వారిపైన యేమేమొ నేరములు మోపుచు నోటికొచ్చినట్లు దుర్భాషలాడుచుందురు. అది యెట్లుండుననిన జనులువచ్చుచు, పోవుచున్న మార్గమధ్యమున కోతులు గుంపులుగచేరుకొని వచ్చుచు పోవుచున్నవారిని జూచి పండ్లికిలించుచు, కుబ్బు కుబ్బుమని పైబడి కఱచుచు, గోళ్లతో గీకుచు యెటులుండునో అటులనె దుర్జనుల చేష్టలుగూడయుండును.

క॥ ఈ చెప్పిన గురుబోధను-తా చెవినిడి బయలుగాంచి తన లేమి నిజంబై చనియె శిష్యుడప్పుడు-లేచెను గురుడవల మాట లేదామీదన్॥ 253

తా॥ ఇట్లు శ్రీ సద్గురుస్వాములు బోధించిన అచల పరిపూర్ణ బోధనంతయు, నందులోయున్న ధర్మ మర్మముల నెల్లయు సాంగోపాంగముగ వినగలిగిన శిష్యుడు శ్రవణానంద భరితుడై ఈ పరిపూర్ణ బట్టబయలును గాంచుచు అందులో తన ఉనికి యెచ్చటను లేదని గుర్తించినవాడై నేను అనునది అసత్యమే కాని, సత్యముకాదని నిశ్చయించుకొని తనదారిని తాను వెళ్ళిపోయెను. శ్రీ గురు

స్వామియు ఏమి మాట్లాడక మౌనముదాల్చి పరిపూర్ణమును దర్శించుచు తనకు తానుగ యుండిపోయెను. ఇప్పటికి బోధ సమాప్తమైనదని తలంచవలయును.

క॥ శరధి కరి తురగ సితకర (1784) పరిమితమైనట్టి శాలివాహన శకమం
దు రవిస్తి మాఘ పౌర్ణిమ-వరకివిదుందుభియ నేటి వత్సరమపుడున్ 254

తా॥ శాలివాహన శకము 1784 సంవత్సరమునకు సరియగు దుంధుభి నామ సంవత్సర మాఘ శుద్ధ పౌర్ణమినాటికి ఈ కంద పద్యములు వ్రాయుట పూర్తియైనదని గ్రంధకర్త అభిప్రాయము తెలుపబడినది. క్రీ॥ శ॥ 1843వ సంవత్సరమని భావించవలయును.

వి॥ శరధి, కరి, తురగ, సితకర అనగా! ఒక చంద్రుడు, యేడు సూర్యుని రధమునకున్న గుర్రములు, యెనిమిది అష్టదిగ్గజములు, నాలుగు సముద్రములు, ఈ అంకెలు నాలుగు వరుసగా బెట్టిన యెడల 1784 జూపించును. సముద్రము ఒక్కటైనను. భూమికి నాల్గువైపుల సముద్రముండుట వలన పద్యము "చతురంబోధిపరీతమైన ధరణీచక్రంబు శాసించు" అని భారతమునందు కవులు వర్ణించుటవలన ఇచ్చట నాల్గు సముద్రములని తెల్పియున్నది.

క॥ పది యిరవై యైదులు యీ-సదమల కందములు వీట్ని (250) సదయా
మతులై ముదమున మీరు వినెదరని-మదిలోపల దలచి చేస్తి
మానవులారా॥ 255

తా॥ మంచిమనసు గలిగిన సుజనులారా! ఈ సాటిలేని అచల పరిపూర్ణ బోధను మీరు చక్కగ తెలుసుకొని జనన మరణ ప్రవాహమును దాటి సంతోషించెదరని నాకొక సంకల్పము గలిగి ఈ రెండు వందల యాబై కందములు వ్రాసి సదుద్దేశముతో మీకు అందించుచున్నాను. యోగ్యులైన మీరు ఈ కందములను శ్రద్ధగ పరిశీలించి, ఇందులోనున్న సారాంశమును తెలుసుకొని తరింతురని భావించుచున్నాను.

క॥ ఎవరీపద్యములన్నియు-వివరింతురో వారికెల్ల విద్యావిద్యల్
దవిలి బాధింప వెన్నడు-భవనాశస్థితులులేక ప్రబలుదు రెపుడున్॥ 256

తా॥ ఓ జనులారా! ఈ పద్యములన్నియు యెవరు శ్రద్ధగా మనసుపెట్టి చదువుచుందురో అట్టివారికి సుఖదుఃఖములతో గూడిన ప్రపంచ బాధలెల్లయు తొలగిపోయి చావు పుట్టుకలచేత బాధింపబడక బ్రహ్మ విద్యావంతులై సంతోష మైన జీవితము గడుపు కొందురని విశ్వసించుచున్నాను.

క॥ అర్థము దెలియక గ్రంథము-వ్యర్థంబని నిందసేయు వ్యర్థులమాటల్
వ్యర్థములని యీ గ్రంథం-బర్థము సద్గురునివలన బాగుగవినుడీ॥ 257

తా॥ ఓ సుజనులారా! ఈ గ్రంథములో తెలిపియున్న నిగూఢమైన రహస్యములను తెలుసుకొనలేక అట్టి ప్రయాణముచేయు బుద్ధిసూక్ష్మతయులేక ఈ గ్రంథములో నే మాధుర్య మగుపడుట లేదని నిందలు చేయుదానికంటె ఇందులో భావార్థములు యెరిగిన సద్గురువు నోటనుండి వినగలిగిన యెడల వారి దౌర్భాగ్యము తొలగిపోయి ఉత్తమ జన్మలై యుండగలరని తలంచు చున్నాను.

క॥ పాటసుమీ భక్తులకిది-బాటసుమీ బోధ జెంద భ్రమ రాకుండన్
కోటసుమీ కందములను-తోటసుమీ దీన్ని తొలగత్రోయక వినుడీ॥ 258

తా॥ ఓజనులార! భక్తులుగనున్న అచల గురుపుత్రులందరు తీరికసమ యములలో ఈ బోధను శ్రద్ధగవినుచుండిన యెడల ఏ సంశయములు గలుగక నిస్సంశయులుగ జేయుటకు ఒక బాటగ ఈ గ్రంథము తగియున్నది. ఈ పద్యములు వినుచున్నకొలది పరిపూర్ణబోధ స్థిరపడుచు, ప్రక్కబోధలవైపుకు పోనివ్వక భద్రతనిచ్చు బందోబస్తయినకోటగ ఈ గ్రంథము తగియున్నది. ధర్మాధర్మములలో మర్మములు తెలుపు ననేక అంశములుగల తోటగ ఈ గ్రంథము తగియున్నది. ఇట్టి ప్రసిద్ధమైన గ్రంథమును ఇష్టముతో జదువుచున్న వారికి భవబంధములు తొలగి నిశ్చలస్థితిలో నుందురని తలంచుచున్నాను.

క॥ పరమహంసాశ్రమధరుని-పరిపూర్ణపుబోధ వానిపనులు సమమె
వార్నెరిగెరుగక నుతినిందలు-గరపిన తత్ఫలము ప్రజలకగు నిజముజుమీ
259

తా॥ ఓజనులారా! పరమహంసలనగ జీవబ్రహ్మైక్య సంధానములో నున్నవారు, సన్యాసముతీసుకొనినవారు, యున్మనీ స్థితితోయున్నవారు వీరందరు ఒక పద్ధతిలో నడుచుకొనుచుందురు. అచల బోధను పొందినవారు ఒకపద్ధతిలో నడుచుకొనుచుందురు. ఈ పద్ధతులలో నున్నవిశేషతను ప్రజలు తెలుసుకొన లేక వారికున్న ఆడంబరములు ఆచరణలు వీరికిలేవని నిందాస్తుతులు జేయు చుందురు. అట్టి వారికి తత్ఫలితంబులు తప్పక గలుగునని తెలియపరచు చున్నాను.

క॥ ప్రతిదినము జదివి యెవరీ–ప్రతి నర్చనచేతు రట్టి ప్రజలకు బోధ
స్థితి కుదురగలదు గురుకృప-కతి పాత్రులువారు వారి కడ్డముగలదే॥260

తా॥ ఓ జనులారా! ఈ గ్రంథమును ప్రతిదినము చదువుచు, దేవునివలె పూజించుచు, దీనిలోనున్న భావములను గుర్తించుచు యే మనుజు డుండునో ఆ మనుజునకు నీ పరిపూర్ణబోధ బాగుగ పట్టుబడి గురుకృపకు పాత్రుడై బాహ్యాంతర సంసార బంధములనంటక జననమరణముల కతీతుడై యుండును

క॥ ఇతర మెరుంగని సతమం–దతి మృషయై కానుపించునట్టి మనము యీ
కృతి గురుశిష్యులు వారల-యితరేతరవాగ్విలాస మివి మృషలుసుమీ॥261

తా॥ ఓ జనులారా! యే పరిపూర్ణము తన విషయము తనకు తెలియక తనకు అన్యముగనున్న యెరుక జగత్తులను యెరుగక, తనకు తానుగా యే రాక – పోకలు లేక సర్వత్రా వ్యాపించియున్నదో, అట్టి బట్టబయలునందు మూలము లేకనె కనబడుచున్న నీవు–నేను–అను గురుశిష్యులిద్దరు వారు జేసిన గ్రంథరూపమైన ప్రశ్నోత్తర సంభాషణలన్నియు కలలో ముచ్చట్ల వంటివని భావించుకొనవలయును.

ఇతి

శ్రీ మద్రాజాధిరాజ మహారాజ – రాజ యోగీంద్ర చంద్రులగు
శ్రీమద్భాగవతుల కృష్ణదేశిక ప్రభు విరచిత క్షరాక్షరోపాధి
ద్వయ దోషరహిత ప ర మ త త్వ కందపద్యములకు
శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయకులును, శ్రీ పీల్కాన
శంకర్రావు శి ష్య ప్ర శి ష్యు లై న శ్రీ ఉడుతా
వెంకటదాసార్య సద్గురు స్వాములవారి చరణ
దాసుండగు అచల ఋషి దువ్వూరు
రమణయ్య స్వాములవారిచే వ్రాయ
బడిన తాత్పర్య భావార్థ గురు
శిష్య సంవాదంబను పరిపూర్ణ
మ ధా ప్ర బో ధ ము
స మా ప్త ము.



శ్రీ సద్గురుభ్యో నమః

# సద్గురు పూజా విధానము.

మత్తకోకిల :

1. శ్రీ గురో మీ పూజజేయను సిద్ధమై మేమందరమ్
బాగుగా పుష్పములుగై కొని పరగనొ స్తిమి ఈదినమ్॥

జంట కందార్థము ;

శ్రీదేవదేవ సద్గురు! బాధ్యతగను మీదు పాదపూజలుజేయన్,
సోదరులగూడి వస్తిమి ఆదరమున మాదుమనవి ఆలించుమయ్యా,
భక్తుల మాపై ప్రేమనిడుమయ్యా వేదాములకు మూలవేత్తావు నీవనుచు
గాదాలుపడి మార్చు కరుణామయుడవనుచు

— ముదముతో మేమందరము మీ పాదదాసులమగుచు వస్తిమి
మోదమున మా పూజలందియు మమ్ము కడతేర్చుటకు మీరు
ఆలించుమయ్యా భక్తుల మాపై ప్రేమనిడుమయ్యా॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో. పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ________________________ స్వాముల వారికి

॥ " ధ్యానం సమర్పయామి " ॥

2. మత్త॥ హరిహరాదులు మిమ్ము గొలుచుచు అన్నివేళల నుందురు
పరమపావన మాకు మీరే ముక్తిత్రోవగ నుందురు॥

కం॥ సరసిజ గర్భాదులు మిము స్మరియించగ వారికున్న సంశయమెల్లన్
మరి తీర్చి బోధించినాడవు కరుణాకర భక్తవరదా ఘన దేవదేవా
మము నేలాను మా మనవిబ్రోవా పరిపరి విధముల ప్రార్థనలుజేస్తిమి
అరచి మా కోర్కెలను ఆలకించెదరనుచు

— మరిమరి వేడుచు మిము మే మానసంబున నిలుపు కొంటిమి
దరికిజేర్చెడి ధాతవనుచు దోసిలొగ్గితి శరణు శరణని
ఘన దేవదేవా! మమునేలాను మా మనవిబ్రోవా!

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ........................................................ స్వాముల వారికి

॥ " ఆవాహనం సమర్పయామి " ॥

3. మత్త॥ సదమల దేశిక సద్గురుస్వామి మాపై కరుణచే
హృదయమను సింహాసనముపై వచ్చికూర్చొను ప్రేమచే॥

కం॥ ప్రవిమలదేశిక స్వామిరో।విమలంబగు మాదుహృదయ పీఠమునందున్
గమనంబు నిలుపుమిప్పుడు। సవినయముగాను ఇదుగో సింహాసనంబు
మా ప్రార్థనలు నేలుమనిశంబు। అవిరాళమైనట్టి అంతఃకరణముతోను
భువి నాల్గుకోళ్ళుగ పొందుపరచినాము.

— భవములెల్లను రూపుమాన్పెడి భువిని నీవే దేవుడావని
స్తవముజేయుచు నన్నివేళల విహితులముగా నుందుమెప్పుడు
సింహాసనంబు–మా ప్రార్థనలు నేలుమనిశంబు॥

పరమగురో, పరమేష్ఠిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,

సద్గురు శ్రీ ____________________ స్వాముల వారికి.

॥ " కనకమణిమయ రత్నసింహాసనం సమర్పయామి " ॥

4. మత్త॥ గంగయమునాజలము దెస్తిమి కడుగనూ మీపాదముల్
సంగరహితా నీదుసేవచె సమసిపోవును కర్మముల్॥

కం॥ గంగాయమునల జలమును।పొంగుచు మేతెచ్చినాము పాదముకడుగన్
పుంగవ గైకొనుమామది। అంగములో గుణములెల్లా అవి జలముగాను
కడుగను మేము కడుభక్తితోను।అంగానమణులెల్ల ఆనంద పరవశులై
బంగారు చెంబులతొ పూని ఉదకముదెచ్చి

— నింగితముతో మేము మిమ్ముల నెపుడు శ్రీ గురుదేవదేవని
భంగపడకా ఇంద్రియాదుల సంగమిడచి స్తుతిని జేతుము
అవిజలముగాను కడుగను మేము కడు భక్తితోను॥

పరమగురో, పరమేష్ఠిగురో, సద్గురో, శ్రీ జగద్గురో. నిజగురో. పరిపూర్ణగురో.

సద్గురు శ్రీ ____________________ స్వాముల వారికి,

॥ " పాదయో పాద్యం సమర్పయామి " ॥

5. మ త్ర॥ ఇష్టముతో గోదావరి జలమి స్తిమి అర్ఘ్యంబుగా
దృష్టిమాపై నిలిపి అందుము తోయము బహుప్రీతిగా॥

కం॥ చింతలను దీర్చువాడని । యెంతో మీమీద భ క్తివిశ్వాసంబుల్
సంతతము నుండువారము । సుంతైనను లేదుమాకు జగతిపైభ్రాంతి
అది మీదయతో గలిగినశాంతి । అతులితమగు గోదావరి జలము
గొనివచ్చి హితవుతో । అర్ఘ్యముగ హ స్తములందిడుదూము॥

— మంతనంబున మీ పదంబుల మలినమును పోద్రోలుచుంటిమి
యెంతదో మాజన్మయనుచు యెల్లవేళల సుద్ధిజేతుము
జగముపై భ్రాంతి అది మీదయతో గలిగినశాంతి॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో.

సద్గురు శ్రీ ________________________ స్వాముల వారికి.

॥ " హ స్తయో అర్ఘ్యం సమర్పయామి " ॥

6. మ త్ర॥ సమ్మతితో యమునా జలంబును చేర్చితిమి మేమందరం
సొమ్మసిల్లక మీ ముఖంబును చేద ఆచమనీయమూ॥

కం॥ సురమునులు తపసులెల్లరు । పరమగు నీదివ్యపదము పరలోకించి
గురుతెరిగి నీదుమహిమను । ధరలో జన్మంబులేక దరిజేరినారు
కర్మబీజం కాల్చేసినారు । తరమౌనె నీ దివ్యతత్వంబు యెరుగాను
హరిహరాదులు గొలువ అభిలాషపడుచుండు

— నరయ మే మెంతాటివారము సరిగ మీ వదనంబుజూడను
స్థిరముగా మీ ముఖమునంతయు జలముచేతను శుద్ధిజేతుము
దరిజేరినారు కర్మాబీజము కాల్చేసినారు॥

పరమగురో, పరిమేష్టిగురో, సద్గురో, శ్రీజగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,

సద్గురు శ్రీ ........................................ స్వాముల వారికి,

॥ " ముఖే ఆచమనీయం సమర్పయామి " ॥

7. మ॥ ఘృతమును క్షీరంబుదధియు కండచెక్కర తేనెయున్
ప్రీతితో పంచామృతంబుగ పొందుపరచితిమిచ్చటన్॥

కం॥ పెరుగును పాలును నేతిని మరి చెక్కెర తేనె కలపి మధనముచేయన్
స్థిరపంచామృతమాయెను పరపురుషా చేతదీసి భోంచేయుడయ్యా
జగతిలోమాకు దిక్కెనీవయ్యా ధరలోన మీకన్నా ధాతలెవ్వరులేరు
అరసితీసుకవస్తి మారగించుడి యికను॥

— విరివిగా ఈ మేను నుండెడు అష్టమదములాను దీసియు
గురుతుగా మీపాదములనిడ కేవలాపర[ప్రా ప్తిగలుగును
భోంచేయుడయ్యా జగతిలోమాకు దిక్కెనీవయ్యా॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
మద్గురు శ్రీ ________________ స్వాముల వారికి.
॥ "పంచామృతం సమర్పయామి" ॥

8. మత్త॥ తనువనే ఘటమందు మనసును తోయముగ మరగించియున్
కనులలో ఆనందభాష్పము గొనియు స్నానము కిచ్చెదమ్॥

కం॥ మలములనై దునుదీసియు కులమును జిమ్మేసి కామ[క్రోధములణచి
తెలివను శుద్ధజ్ఞానము జలముగ శుద్ధోదకంబు చరణములనిడుదు
పలు[భ్రాంతూల బాధలేకుండు మలినమౌ ఈ మేను మమకారమెల్లను
పొలిమేరు దాటించి పరిశుద్ధులై తిమి॥

— తలపునను యే కొరతలేకను ధా[త్రిలో మేమున్నవరకు
పలుకులేని మీపదంబున పరమతృప్తిగ నుండగలము
చరణములనిడుదు పలు[భ్రాంతూల బాధలేకుండు॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ________________ స్వాముల వారికి,
॥ "శుద్ధోదకం సమర్పయామి" ॥

9. మత్త॥ పసిడిపోగులతోను నేసిన పంచదోవతులి స్తిమి
దిశలు యశముచె నవి ధరించియు తృప్తిగా మము బ్రోవుమి

కం॥ మలినంబులేని మేనికి నిల బంగరు నూలుతోను వస్త్రములల్లీ
వలువుగ మీకర్పిస్తిమి నిలువెల్లా దాచుకొనుము నీ మేనునంతా
పలుదృష్టులకు పోక సొగసంతా అలలూగ దోచెడి హరిషడ్వర్గము
లాను వేలాముగజేసి సలిరాకని స్తిమి॥

— బాలుబాలును ఇహముపైన వాలకను మామనసుజే స్తిరి
తోలుబొమ్మలాటలనియు తేలెను మీ కరుణవలన
నీ మేనునంత పలుదృష్టులకుపోక సొగసంతా॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,

సద్గురు శ్రీ ____________________ స్వాముల వారికి.

॥ " అలంకారణార్థం వస్త్రయుగ్మం సమర్పయామి " ॥

10. మత్త॥ కూడి కుడియెడమలకు తిరిగే ఘనమునగు గాయత్రినిన్
యేడు పోగులతోను పెనచి యిస్తి యజ్ఞోపవీతమున్॥

కం॥ కుడియెడములకును మారుచు ఇడపింగళలందు హంస ఇటునటు
తిరుగున్ సడిలేక నొప్పుచుండెడు నడినాళమునందుయున్న నదియె
తారకము అజపసూత్రమదియె పాలనము ముడిలేని ఆ జంద్యెం
మొల మెడకు ధరియించి అడియాసలేకుండ ఆనందమునజేరు॥

— యేడుపోగులతోను నలరెడి యజ్ఞోపవీతం నీకుదె స్తిమి
నాడు నేడనకుండ దీనిని నయముతో నీ మేనుదాల్చుము
నదియె తారకము నజపసూత్రమదియె పాలనము॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో. నిజగురో. పరిపూర్ణగురో.

సద్గురు శ్రీ .................................................... స్వాముల వారికి.

॥ " యజ్ఞోపవీతం సమర్పయామి " ॥

9. మ త్త॥ పసిడిపోగులతోను నేసిన పంచదోవతులి_స్తిమి
దిశలు యశముచె నవి ధరించియు తృప్తిగా మము బ్రోవుమి

కం॥ మలినంబులేని మేనికి నిల బంగరు నూలుతోను వస్త్రములల్లీ
వలువుగ మీకర్పి_స్తిమి నిలువెల్లా దాచుకొనుము నీ మేనునంతా
పలుదృష్టులకు పోక సొగసంతా అలలూగ దోచెడి హరిషడ్వర్గము
లాను వేలాముగజేసి సలిరాకని_స్తిమి॥

— చాలుచాలును ఇహము పైన వాలకను మామనసుజే_స్తిరి
తోలుబొమ్మలాటలనియు తేలెను మీ కరుణవలన
నీ మేనునంత పలుదృష్టులకుపోక సొగసంతా॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,

సద్గురు శ్రీ ______________________ స్వాముల వారికి.

॥ " అలంకారణార్థం వస్త్రయుగ్మం సమర్పయామి " ॥

10. మ త్త॥ కూడి కుడియెడమలకు తిరిగే ఘనమునగు గాయత్రినిన్
యేడు పోగులతోను పెనచి యి స్తి యజ్ఞోపవీతమున్॥

కం॥ కుడియెడములకును మారుచు ఇడపింగళలందు హంస ఇటునటు
తిరుగున్ నడిలేక నొప్పుచుండెడు నడినాళమునందుయున్న నదియె
తారకము అజపసూత్రమదియె పాలనము ముడిలేని ఆ జంద్యెం
మొల మెడకు ధరియించి అడియాసలేకుండ ఆనందమునజేరు॥

— యేడుపోగులతోను నలరెడి యజ్ఞోపవీతం నీకుదె_స్తిమి
నాడు నేడనకుండ దీనిని నయముతో నీ మేనుదాల్చుము
నదియె తారకము నజపసూత్రమదియె పాలనము॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో. నిజగురో. పరిపూర్ణగురో.

సద్గురు శ్రీ ...................................................... స్వాముల వారికి.

॥ " యజ్ఞోపవీతం సమర్పయామి " ॥

13. మత్త॥ గోటితో ఒలచీన బియ్యము కలసి కుంకుమ పసుపుతో
మూటి నక్షింతలుగ జేసియు మేనుజల్లను ప్రీతితో॥

కం॥ ప్రజ్ఞనెడు వడ్లుదంచియు అజ్ఞానంబనెడు పొట్టు ఆవలవేసి
విజ్ఞానమనెడు బియ్యము సుజ్ఞానంబనెడు దృష్టిచేత వేరితిమి
అరలేకుండా బాగాజూచితిమి విఘ్నములనుజేయు ఇంద్రియ
గుణములను భగ్నముజేసిన ఫలమక్షింతలుగ॥

— సౌజ్ఞచేగొనగొన్న మేనికి సురులు మునులు సన్నుతించగ
దగ్ధపరచిన దండులములు తనివితీరగ జల్లుచుండుము
చేతవేరితిమి అరలేకుండా బాగాజూచితిమి॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ______________ స్వాముల వారికి.
॥ " అక్షతాన్ సమర్పయామి " ॥

14. మత్త॥ మల్లెలు సంపంగి చంపకమాదిగా చామంతులు
నల్లకలువ గులాబి కాగడ నెల్లపూవులు పూజకు॥

కం॥ చంపకపూవులు తామర సంపంగె గులాబి మల్లె సన్నజాజులున్
వింపగు రోజాపువ్వులు సొంపైనవి కాగడాలు చామంతిపూలు
కనకాంబరము కస్తూర్బిల్వములు నింపార పూజింప వేడుకతో
మేమంత గుంపులుగాగూడితిమి కోరి శోభనుజూడ॥

— తెంపులేకను వురకలెత్తెడి దోషములు పుష్పములుగా గొని
నింపుదుము మీ మేనినంతయు నీకన్న దైవం మాకులేదని
చామంతిపూలు కనకాంబరము కస్తూర్బిల్వములు॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ______________ స్వాముల వారికి,
॥ " నానావిధ పరిమళ పుష్పములు సమర్పయామి " ॥

15. మత్త॥ వాసనత్రయ ఈషణత్రయ వప్పుగా త్రితాపముల్
దీసి దీపముగాను జేస్తిమి త్రిపుటులను మీ ముందుయున్॥

కం॥ మూడగు ఈషణత్రయములు మూడగు తాపత్రయములు
మూడవస్తలున్ మూడగువాసనత్రయములు మూడగుదేహంబులాను
మూడుగుణములనూ మూడశాంత ఘోరవృత్తులునూ మూడగు
భక్తులు మూడుకర్మములాను మూడు ఆనందములు మూడులోకంబులు

— మూడుత్రిపుటలు నేకముగనే మలచి దీపముగాను జేస్తిమి
చూడమిము ఆ వెలుగు కాంతిలో చేరితిమి మీ మోముచూడను
మూడుగుణములను మూడుశాంత ఘోరవృత్తులును॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో, పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ........................................................ స్వాముల వారికి
॥ " దీపం సమర్పయామి " ॥

16. మత్త॥ కామక్రోధము లోభమోహము ఘోరమైన శత్రులున్
ప్రేమతో వత్తుగ జేసియు ప్రమిదనేస్తిమి ఈదినమ్॥

కం॥ ఈ మహిని నాలోయుండిన కామము క్రోధంబు లోభ ఘనశత్రువులున్
ప్రేమగ వత్తులుజేసియు నీమముతో నీకుముందు నెలిగించినాము
రాగాద్వేషం చమురేసినాము పామరమనియెడు ప్రమిదాను జేసియు
విమలమౌ మీమంత్ర వెలుగు నంటించితిమి॥

— వేమరక మాదృష్టినంతయు యందున పోనీక నిల్పియు
సమయమిక రాదనుచు మదిలో చూపుచెదరక మిమ్ము జూతుము
వెలిగించినాము రాగద్వేషం చమురేసినాము॥

పరమగురో, పరమేష్టిగురో, సద్గురో, శ్రీ జగద్గురో, నిజగురో. పరిపూర్ణగురో,
సద్గురు శ్రీ ________________________________ స్వాముల వారికి
॥ " దీపం దర్శయామి " ॥